## ఈ గ్రంథంలో

ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం, వహాబీ ఉద్యమం, వందేమాతరం, హోంరూల్, అసహాయోద్యమం, ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘనోద్యమాలు, వ్యక్తి సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమం, స్వరాజ్య సమరంలో ఆంధ్రులు ప్రదర్శించిన త్యాగం వీరోచిత పాత్రను: హైదరాబాదు సంస్థాన ప్రజల విమోచనోద్యమాన్ని గూర్చి 13 అధ్యాయాలుగా శ్రీ మాదల వీరభద్రరావు రచించారు.

తెలుగునాట స్వాతంత్ర్య రథసారథుల సంక్షిప్త జీవిత విశేషాలు కూడా పేర్కొన్నారు.

స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి దేశభక్తిగేయాలు, పద్యాలు, ఆయా ఉద్యమాలకు సంబంధించిన చిత్ర పటాలు, పోరాటఘట్టాల ముఖ్య తేదీలు ఇందు ప్రచురించారు.

ఆంధ్ర మహాజనులు అధ్యయనం చేయవలసిన మంచి పుస్తకం.

# జాతీయ స్వాతంత్ర్య సమరంలో
# ఆంధ్రుల ఉజ్జ్వల పాత్ర


రచన :

మాదల వీరభద్రరావు



ప్రచురణ :

కల్చరల్ రినైజాన్స్ సొసైటీ ఆఫ్ ఇండియా

హైదరాబాదు-500038

## 'వందేమాతరం'

వందేమాతరం

సుజలాం సుఫలాం మలయజశీతలాం

సస్యశ్యామలాం మాతరం ॥ వందే ॥

శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం

ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం

సుహాసినీం సుమధుర భాషిణీం

సుఖదాం వరదాం మాతరం ॥ వందే ॥

ప్రథమ ముద్రణ:
1986 మే 19

ప్రతులు: రెండు వేలు

రచయిత:
మాదల వీరభద్రరావు

ప్రకాశకులు:
కల్చరల్ రినైజాన్స్ సొసైటీ ఆఫ్ ఇండియా

ప్రతులకు:
263, 3 ఆర్. టి, ఎస్. ఆర్. నగర్,
హైదరాబాదు-38
ఫోన్ నెం. 260263.

వెల : 50 రూపాయలు

ముద్రణ:
'నాట్యకళా ప్రెస్'
హైదరాబాదు.

# ఉపోద్ఘాతం

'స్వరాజ్యం నాజన్మహక్కు' అని తిలక్ మహాశయులు ఎలుగెత్తిచాటారు.
స్వరాజ్యసమరంసాగి దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది ఆ వీరగాథ యిది.

'విప్లవానికి బీజం నిరంకుశత్వం' అని అమెరికా అధ్యక్షుడైన విల్సన్ అన్నాడు. ప్రపంచ చరిత్రలో యిందుకు అనేక ఉదాహరణలు వున్నాయి.

1789లో జరిగిన ఫ్రెంచి విప్లవాన్ని గురించి చెపుతూ, 'అదిపై చూపులకు అవక తవకగా అగుపించినా, అంతర్యంలో సజీవ పరిణామం కలది' అని 'చరిత్ర తాత్పర్యం' అను గ్రంథంలో ఫ్రెడరిక్ హారిసన్ వ్రాశారు.

గ్రీక్ మేధావి అరిస్టాటిల్ వ్రాస్తూ 'విప్లవాలనేవి మానవ సమాజంలో అణచబడిన బానిస ప్రజలు, పీడిత వర్గాలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ఏదో రూపంలో చేసే అలజడులే, ఆందోళనలే అని పేర్కొన్నారు. అందుచేతనే ఏ తిరుగుబాటుకైనా, ఏ విప్లవానికైనా బలవత్తర కారణాలు వుంటవనేది సత్యం. ఒక్క వ్యక్తి ఏదైనా చేస్తే అది అతని స్వార్థ మనవచ్చు, కాని జనబాహుళ్యం జరిపే చర్యను స్వార్థమనడం అవివేకం తప్ప వేరుకాదు. అయితే, స్వాతంత్ర్య సంగ్రామాలను గూర్చి చరిత్రకు వక్ర భాష్యాలు వ్రాసిన ప్రబుద్ధులు కొందరు లేక పోలేదు.

మూడవ జార్జి చక్రవర్తి నిరంకుశపాలన ప్రారంభించాడు. అందుకు ప్రతిగా అమెరికాలో స్వాతంత్ర్య యుద్ధం (American war of Independence) బయలు దేరింది. ఆంగ్లేయులు ఓడిపోయారు.

ఐర్లాండులో కూడా ఆంగ్లేయ ప్రభువులు అట్టి రాజనీతినే అనుసరించారు. దాని ఫలితం, డివెలరా నాయకత్వాన ఐర్లాండు ప్రజల జాతీయ పోరాటం ప్రజ్జ్వరిల్లింది.

ఆస్ట్రియాదేశం, ఇటలీని అణచి వేయాలని ఎంతో ప్రయత్నించింది. కాని గారిబాల్డీ, మాజినీ మున్నగు నాయకులు ఉద్భవించి, జాతీయ పోరాటాలు సాగించి, సమైక్య ఇటలీని సాధించగలిగారు.

రష్యా జారు చక్రవర్తి క్రూరంగా ప్రజోద్యమాలను అణచివేయ జూచాడు. కాని ప్రజా విప్లవం చెలరేగి, జారు దుష్టపరిపాలనను సమూలంగా అంతంచేసింది. నూతన వ్యవస్థను నిర్మించింది. ఈ విధంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం జరిగే ప్రతి విప్లవానికి తిరుగుబాటుకు, ప్రజా పోరాటానికి వెనుక బలవత్తరమైన కారణాలు వుండి తీరుతాయని పై నుదహరించిన జాతీయ విముక్తి పోరాటాలను పరిశీలిస్తే స్పష్టంగా తెలుస్తుంది. మనదేశంలో కూడా యిందుకు భిన్నంగా ఏమీ జరుగలేదు. భారతదేశంలో

జాతీయ స్వాతంత్ర్య సమరం కాంగ్రెస్ సంస్థ, గాంధీజీ నాయకత్వాన ఒక ప్రత్యేక విలక్షణ మార్గాన నడిచి, ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించింది. ప్రపంచ ప్రజల జాతీయ విమోచనోద్యమాలలో, భారత ప్రజల స్వతంత్ర సమరం అంతర్భాగం.

## భారత రాజ్యాంగ సంస్కరణలు :

ప్రభుత్వ దుష్పరిపాలన పట్ల ప్రజల్లో అసంతృప్తి జనించి, దేశంలో ఆందోళనలు, ఉద్యమాలు జరిగినప్పుడల్లా ఆంగ్ల పరిపాలకులు ఏవో స్వల్ప రాజ్యాంగ సంస్కరణలంటూ ప్రవేశ పెడుతూ వచ్చారు. భారత సిపాయీల విప్లవం వచ్చిన అనంతరం, ఈస్టిండియా కంపెనీ అధికారం అంతమై పాలనాధికారం, బ్రిటిష్ పార్లమెంటుకు, బ్రిటిష్ రాణికి సంక్రమింపజేశారు. 'ఇండియన్ కౌన్సిళ్ళ చట్టాన్ని' బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించింది. 1861 శాసనంలో భారతీయులను ఉన్నతాధికార పదవుల్లో నియమించేందుకు కొంత అధికార మీయబడింది. వీరు ఎన్నికద్వారా వచ్చిన వారు కాదు, నామినేటెడ్ సభ్యులు. ప్రభుత్వ పరిపాలనాతీరును ప్రశ్నించడానికి, బడ్జెట్‌పైన చర్చలు జరపడానికి మాత్రమే వీరికి అధికారం వుండేది. మేధావులైన కొలది మంది మితవాద ప్రముఖులకు యిట్టి అవకాశం లభించింది.

1906 వందేమాతరం ఉద్యమం తర్వాత, 1909వ సంవత్సరంలో మింటో-మార్లే సంస్కరణలు అమలుకువచ్చాయి. రాష్ట్ర శాసనసభలలో అనధికారసభ్యులకు మరికొంత ప్రాతినిధ్యం ప్రసాదించబడింది. ఈ అనధికారసభ్యుల నియామకంలో మాత్రం కొంత మార్పు చేశారు. విశ్వవిద్యాలయాలు, భూస్వాములు, స్థానిక సంస్థలు తమ ప్రతినిధులను పంపుకునే అవకాశం కల్పించారు. అయితే, ముస్లిం ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పరచి, రాజకీయ క్షేత్రంలో హిందూ-మహమ్మదీయుల మధ్య ఆరని వైషమ్యాలు రగుల్కొల్పారు.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో 'హోం రూల్' ఆందోళన తర్వాత, 1919 సంవత్సరంలో 'మాంటేగ్యూ-చెమ్స్‌ఫర్డు శాసనాన్ని' బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించింది. ఈ చట్టం ప్రకారం, స్థానిక సంస్థలలో సాధ్యమైనంతవరకు ఎన్నుకోబడిన వారికే అధికారం వుంటుంది. రాష్ట్రాధికారం పరిధిలోని కొన్ని శాఖలలో మాత్రం ప్రజా ప్రతినిధులకు-ముఖ్యశాఖలపైన బ్రిటిష్ అధికారులకు అధికారం వుంటుంది. దీనినే (డయార్కీ) ద్వంద ప్రభుత్వం అనేవారు. ప్రజలలో ఆస్తిగల ధనవంతులకే అప్పట్లో ఓటింగ్ హక్కు లభించింది.

గాంధీమహాత్ముని నాయకత్వాన జాతీయ కాంగ్రెస్ సాగించిన 1920 సహాయ నిరాకరణ, 1930 ఉప్పు సత్యాగ్రహం ఉద్యమాలు జరిగిన తర్వాత, ప్రభుత్వం 1935 నూతన రాజ్యాంగ చట్టం తెచ్చింది. దీనిని బట్టి, రాష్ట్రాధికారాలు ఎన్నుకో

బడిన ప్రజా ప్రతినిధులకు సంక్రమించాయి. అయితే, రాష్ట్ర గవర్నర్లకు శాసనసభల తీర్మానాలను 'వీటో' చేసేందుకు ప్రత్యేకాధికారాలు యిచ్చారు. నూటికి 15 మందికే ఓటు హక్కు వుండేది. ఆ పరిమిత ఓటింగ్‌తోనే, కాంగ్రెస్ ఎన్నికల్లో పాల్గొని 1937లో రాష్ట్రాధికారాలను స్వీకరించింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామం-క్విట్ ఇండియా ఉద్యమం జరిగిన తర్వాత, బ్రిటిష్ ప్రభుత్వ పాలనకు స్వస్తి చెప్పి, 'ఇండియన్ ఇండిపెండెంటు' శాసనం ఆమోదించి, 1947 ఆగస్టు 15వ తేదీన భరతఖండంలో ఇండియన్ యూనియన్, పాకిస్తాన్‌లు ఏర్పరచడం జరిగింది.

ఈ విధంగా, దేశంలో ప్రజా ఉద్యమాలు, స్వాతంత్ర్య పోరాటాలు చెలరేగినప్పుడల్లా ఏదో విధమైన స్వల్పరాజ్యాంగ సంస్కరణలతో పాలకులు ప్రజల కళ్ళనీళ్ళు తుడువ ప్రయత్నించారుగాని, అవి భారత ప్రజల తీవ్ర అసంతృప్తిని ఎంత మాత్రం చల్లార్చ లేకపోయినాయి. చివరకు రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వం అంతరించింది. యూనియన్ జాక్ దిగి పోయింది. ఢిల్లీ ఎర్రకోటపైన, పార్లమెంటు భవనంపైన జాతీయ త్రివర్ణ పతాకాలు ఆవిష్కరించబడ్డాయి. స్వతంత్ర భారత్ అవతరించింది. 1947 ఆగస్టు 15 దరిమిలా భారత చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభమైంది. ప్రజల చిరకాల వాంఛ ఈడేరింది.

భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రులు నిర్వహించిన ఉజ్జ్వల పాత్రను యిందు తెలుసుకుందాం. ఉత్తేజితులమవుదాం!

—రచయిత

# మనవి

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధంతో ప్రారంభమై, 1947 లో దేశానికి స్వరాజ్యం సిద్ధించే వరకు - భారత జాతీయ స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రులు నిర్వహించిన ఉజ్జ్వల పాత్రను వివరించే గ్రంథమిది. స్వాతంత్ర్యోద్య మంలోని ప్రధాన ఘట్టాలను పేర్కొని, అందు ఆంధ్ర ప్రదేశ్ ప్రదర్శించిన ప్రముఖ భూమికను ఉల్లేఖించడం జరిగింది.

హైదరాబాదు సంస్థాన ప్రజలు - నిజామాంధ్రులు పరిపాలకులకు వ్యతిరేకంగా సాగించిన వీరోచిత పోరాటఘట్టాలను కూడా, జాతీయ పరిణామాల దృష్ట్యా సంగ్ర హంగా యిందు పేర్కొన్నాను. స్వరాజ్య ఉద్యమ చరిత్రలో మరుగుపడిన ఆంధ్ర దేశ సంఘటనలను తెలుసుకునేందుకే ఈ ప్రయత్నం.

ఢిల్లీ తీన్‌మూర్తి భవన్ లైబ్రరీ, వేటపాలెం సారస్వతనికేతన్, విజయవాడ రవీంద్ర పరిశోధకసంస్థ, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక రచనలు, పలుగ్రంథాలు, వ్యాసాలు యిందుకు తోడ్పడినవి. నేను లోగడ రచించిన కృష్ణా గుంటూరు జిల్లాల స్వాతంత్ర్యోద్యమాలు, గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు, 'దేశభక్త' కొండ వెంకటప్పయ్యగార్లజీవిత చరిత్రలు, 'ఆంధ్రోద్యమం' వ్రాసేటప్పుడు సేకరించిన పత్రాలు మొదలగునవి, ఈ గ్రంథరచనకు సహాయపడినవి. స్వరాజ్య ఉద్యమాలలో పాల్గొన్న గొట్టిపాటి బ్రహ్మయ్య, కోదాటి నారాయణ రావు, డాక్టర్ పి. తిరుమల రావు, ఎం. ఎస్. రాజలింగం, టి. హయగ్రీ వాచారి, శ్రీవావిలాల, గురుజాడ రాఘవశర్మ ప్రభృతులతో జరిపిన చర్చలు, వారి అనుభవాలు యిందుకు ఎంత గానో దోహదమిచ్చినవి. వారందరికి నా కృతజ్ఞతాభి వందనములు.

జాతీయ కాంగ్రెస్ శతజయంత్యుత్సవ సందర్భంలో, యిట్టి గ్రంథ ఆవశ్య కతను గుర్తించి, నాకీ సదవకాశాన్ని కల్గించి ప్రోత్సహించిన శ్రీకోన ప్రభాకర రావు గారికి, డాక్టర్ పి. తిరుమలరావు, కె. రోశయ్యగార్లకు, ఈ గ్రంథాన్ని వెలువరిస్తున్న ప్రకాశకులకు హృదయపూర్వక ధన్యవాదాలు. నా జన్మదిన సందర్భాన, ఉడుతాభక్తి తో ఈ గ్రంథాన్ని ఆంధ్ర పాఠక లోకానికి వినమ్రుడనై సమర్పిస్తున్నా. ఇందు, లోపాలే మైనా ఉన్నట్లయితే, సహృదయంతో తెలియజేస్తే, మలిముద్రణలో సవరించుకో గలమని వనవి చేస్తున్నాను.

మాదల వీరభద్రరావు

హైదరాబాదు
1986 మే 19

# ఆశీస్సులు

భారత జాతీయ స్వాతంత్ర్య సమరం, అందు ముఖ్యంగా ఆంధ్రదేశ పాత్రను గురించి శ్రీ మాదల వీరభద్రరావు వ్రాసిన పుస్తకం, ఇప్పుడు నాచేతనున్నది. స్వాతంత్ర్యోద్యమనగానే, నామనస్సు ఉద్రూతలూగుతోంది. ఎంచేత? స్వరాజ్య ఉద్యమ కాలాల్లో తోటి సత్యాగ్రహులతో కలిసి నేనూ ఆంధ్ర దేశమంతా ప్రచారం చేశాను కాబట్టి, దేశభక్తులతో కలిసి నేనూజైలు శిక్షలనుభవించాను కాబట్టి. ఇది చదువుతుంటే, ఆనాటి ఘటనలెన్నో నేడు జ్ఞాపకానికి వస్తున్నాయి.

ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో ప్రభుత్వ నిర్బంధాలకు అంతులేదు. క్విట్ ఇండియా ఉద్యమం గాంధీకోసమే రిజర్వుచేయబడ్డది. ఆ అద్భుత తీర్మానం మనగాంధీ మహాత్ముడు తప్ప మరొక మానవుడు చేయలేడు. అట్టి ధీమా మరొక రెవరికుంది ? ఇకవ్యష్టి సత్యాగ్రహ విషయం అతడు ఎన్నికచేసిన సత్యాగ్రహులెవ్వరో చూడండి. వారిలో మొదటి సత్యాగ్రహి ఎవరు? ఆచార్య వినోబా. ఆయన నా దృష్టిలో కొన్ని విషయాల్లో గాంధీని కూడా మించిన వాడేమోననిపిస్తుంది. ఆ చివరి సత్యాగ్రహంలో ఉత్తముడు, దేశభక్తియుతుడు, ధైర్యశాలి అయిన జయప్రకాష్ నారాయణ చేసినకృషి చిరస్మరణీయమైనట్టిది.

గాంధీగారి సత్యాగ్రహంలో చేరకున్నా, చెప్పుకోదగిన అసలైన సత్యాగ్రహి, మన తెలుగువాడు, వీరుడు అల్లూరిసీతారామరాజు, అతని అనుచరులు.

ఆ సత్యాగ్రహ ఉద్యమాలలో ఆంధ్ర ప్రముఖులు అఖండత్యాగాలు చేశారు. అకుంఠిత త్యాగదీక్షను ప్రదర్శించారు. లోకమాన్యతిలక్, మహాత్మాగాంధీజీ వల్ల ప్రభావితులై, వారు త్యాగశీలురైనారు, మన ఆంధ్ర దేశంలో త్యాగులను తయారు చేశారు.

ప్రియమిత్రుడు వీరభద్రుడు ఆ పోరాట ఘట్టాలను వ్రాయడం మూలంగా, ఆయన చేసినది చాలగొప్ప పని. అభినందనీయమైంది. వీరభద్రునకు శుభాశీస్సులు. ఘన స్వాతంత్రోద్యమానికి సంబంధించిన ఈ గ్రంథం, ఆంధ్ర ప్రజలను, ముఖ్యంగా యువతరాన్ని ఉత్తేజితులను చేయగలదని విశ్వసిస్తున్నాను.

తల్లాప్రగడ ప్రకాశ రాయుడు

(1986 జులై 6)

# పరిచయం

భారతదేశ స్వాతంత్ర్యసమర చరిత్ర, ఒక ప్రత్యేక అమర వీరులగాథ. ప్రపంచ స్వాతంత్ర్య సమర చరిత్రలతో పోల్చిన దీనికి ఒకప్రత్యేకత ఉంది. మొద టిది ఇది దాదాపు అప్పుడు 40కోట్ల జనాభా విమోచన ఉద్యమ చరిత్ర. ఉద్యమమునకు మహాత్మాగాంధీ సహాయ నిరాకరణ ద్వారా సత్యాగ్రహమనే అయుధంతో ఇరవైయ్యవ శతాబ్దిలో బహుబలవంతులైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులను ఎదుర్కొని విజయంసాధిం చిన గాథ. ప్రపంచ చరిత్రలో సామ్రాజ్యాధి నేతలకబంధ హస్తములనుండి విడిపించు కుని స్వేచ్ఛా వాయువులు పీల్చుటకు, స్వతంత్ర్య జీవసమునకు తమ దేశములలో పునాదులు వేయుటకు ఎంతో మందినేతలు ప్రజా ఉద్యమములు నడిపియుండిరి. కానీ ఇంత పెద్ద జనాభాను ఒక త్రాటిమీద తన సిద్ధాంతములను అంగీకరింపచేసి, నిరా ధులైన స్వతంత్ర సమర యోధులుగా తయారుచేసి, శాంతి సైన్యమును నడిపిన సేనాని ఒక్క మహాత్మాగాంధీయే.

మనదేశమును బ్రిటిష్‌వారు అధికారముతో పాలించినది 19వ శతాబ్దిలో. 1858 మొదలు మనకు స్వాతంత్ర్యము సిద్ధించిన సంవత్సరము అయిన 1947వ సంవత్స రము వరకే అనగా వారు మనలని పాలించినది ఒక శతాబ్దము లోపలే.

1600 సంవత్సరము నుండి యూరోపియన్ దేశీయులు అనేక మార్గముల ద్వారా సముద్రములు, నేలదారులు దాటి తమ వ్యాపారమునకు మాత్రము మన దేశ మునకు పరిసర దేశములకు మరికొన్ని ప్రాచ్యదేశములు తమ లాభదాయకమైన వ్యాపారమునకై వచ్చిపోవుచుండిరి వీరిలో బ్రిటిష్, ఫ్రెంచ్, పోర్చుగీసు, డచ్చి మొద లైన దేశీయులు ఉన్నా, మన దేశమును రాజకీయముగా వశపరచుకొని, తమ సామ్రా జ్యములో ముఖ్యమైన భాగముగా చేసుకొన్నది, అధికార పరముగా వశములో నుంచు కొన్నది బ్రిటిష్ సామ్రాజ్యనేతలు మాత్రమే.

1857వ సంవత్సరములో బ్రిటిష్ వారి కుటిల రాజనీతిని గ్రహించిన భారత స్వాతంత్ర్యరాజ్యాధి పతులు తమలో విరోధములను కొంత వరకు మరచి, బ్రిటిష్‌వారి అధికారమును కూకటివ్రేళ్లతో పెరికి పారవేయుటకు ప్రయత్నించిరి. అప్పటికే దేశములో అక్కడక్కడ తమ అధికారమును పెంచుకొని చాలామంది సమర్థులైన భారతీయులను తమ సిపాయి దళములలో చేర్చుకొని పాలన చేయుచుండిరి. అందుచేత 1857లో జరిగిన దేశవ్యాప్త యుద్ధమును బ్రిటిష్ వారు "సిపాయిపితూరి" అనిరి. తరువాత దేశ భక్తి గల పరిశోధకులు దీనిని 'ప్రథమభారత స్వతంత్ర్య యుద్ధము'గా ప్రకటించిరి. ఆయుద్ధములో తమ ప్రాణములొడ్డిన ఝాన్సీలక్ష్మి, తాంతియతోపే, నానాసాహిబ్, బీగం ఔధ్ మొదలైన వారందరిని భారత స్వతంత్ర్య సమరయోధులుగా వర్ణించి, వారి త్యాగములను కొనియాడిరి.

1885వ సంవత్సరములో విద్యావంతులు, స్వాతంత్ర్య సమర పిపాసులు మన దేశదారిద్ర్య పరిస్థితులు గమనించి, ఒక ఉద్యమముగా మన బీదరికమును పోగొట్టుటకు అఖిలభారత కాంగ్రెస్‌ను స్థాపించిరి. ప్రథమముగా దీనికి పునాదులు వేసిన వారిలో ముఖ్యులు బ్రిటీష్ వాడైన ఓ.యమ్. హ్యూమ్ మరిఇతరులు. ఆసందర్భముగా బొంబాయిలో 1885లో జరిగిన ప్రథమ సమావేశమునకు కొంతమంది ఆంధ్రులు కూడా హాజరై పాల్గొనిరి. అప్పటికి ఆంధ్రరాష్ట్రములేదు. అందుచేత ఆమహాసభలలో పాల్గొన్న తెలుగువారందరు కూడా దక్షిణాది వారుగానే గణింపబడిరి. క్రమముగా భారత జాతీయ కాంగ్రెస్, విన్నపములను వినతి పత్రములను విడచి, ప్రజాఉద్యమముగా స్వాతంత్ర్య పోరాటమును ఆరంభించుటకు యోచన చేయసాగిరి. ఇదే 1905లో జరిగిన వందేమాతరం ఉద్యమానికి పునాది. 1915నాటికి పూర్వమే బాలగంగాధర్‌తిలక్ తీవ్రవాదులకు నాయకత్వం వహించెను. 1915వ సంవత్సరములో మహాత్మాగాంధీ దక్షిణ ఆఫ్రికా నిరంకుశ పాలకుల మీద తన సత్యాగ్రహ ఉద్యమములో కొంత విజయము సాధించి, స్వదేశమునకు తిరిగి వచ్చెను. 1919-20 నాటికి జాతీయకాంగ్రెస్ లోని నాయకులందరు మహాత్మాగాంధీ అనుచరులుగా అయన నాయకత్వము నంగీకరించిరి. గాంధీజీ తన సత్యాగ్రహోద్యమమును ఆరంభించుటకు తొలిమెట్టుగా స్వరాజ్య తిలక్‌ఫండు వసూలు చేయుటకు దేశ వ్యాప్తముగా పర్యటించు సందర్భములో, ఆంధ్ర దేశములో ఆయనకు బహుగొప్ప స్వాగతము లభించెను. ఆయన నిర్మాణకార్యక్రమములలో ఆంధ్రులందరు అత్యుత్సాహముతో పాల్గొని ఆయనకు అత్యంత ప్రియులైరి. తదుపరి నడచిన 1920, 1930, 1940-42ఉద్యమములలో ఆంధ్రులు ఎన్నో త్యాగములుచేసి, మనదేశ స్వాతంత్ర్యసిద్ధికి తోడ్పడిరి. ఈ మన భారత స్వాతంత్ర్య సమరములో ఆంధ్రులు ప్రదర్శించిన వీరోచిత పాత్రను ప్రాముఖ్యముగా వర్ణించుట ఈ గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము. ఆంధ్ర ప్రాంతములో జరిగిన స్వాతంత్ర్యోద్యమంతోపాటు, హైదరాబాదు సంస్థాన ప్రజా విమోచనోద్యమమును కూడా యిందు సంగ్రహంగా పేర్కొనుట జరిగినది.

భారతదేశము బహు విశాలమైన ఉపఖండము. దేశ చరిత్రను ఎవరునూ సమగ్రముగా వ్రాసితిమని గర్వముతో చెప్పుటకు వీలులేదు. అందుచేత ఆంధ్రప్రాంతములలో జరిగిన అనేక ఘట్టములను అందులో పాల్గొనిన ముఖ్య పాత్రధారులు, నాయకులు చేసిన త్యాగములను మన్నన చేసుకొని ఈతరము యువజనులు మనదేశ పురోభివృద్ధి కార్యక్రమములోను, దేశ ఐక్యతను సమగ్రతను కాపాడుటకు కావలసిన త్యాగములను ఎందుకు చేయవలెనో గతస్వాతంత్ర్య చరిత్ర మనకు వేనోళ్ల బోధించును.

ఇది, జాతీయ కాంగ్రెస్ నూరు సంవత్సరముల చరిత్రను మనన చేసుకొని, తిరిగి దేశప్రగతికి తోడ్పడవలసిన కార్యక్రమములో నడుముబిగించి యువతరము, మేధావులు, పెద్దలు, చిన్నలు అంతా ప్రతిజ్ఞ చేయవలసిన సమయము. ఏమియు కోరికలేని నిష్కామకర్ములైన, నాటిస్వతంత్ర్య సమర యోధుల ఆశయములు సిద్ధించు వరకును జాతి నిద్రించకూడదు. నేడుదేశములో అనేక విచ్ఛిన్నకర శక్తులు మన ప్రగతిని

చూడలేక దేశము చుట్టునూ అసూయతో, అధికార వాంఛతో, మన ఐక్యతను ప్రగతిని నిరోధించుటకు, విచ్ఛిన్నము చేయుటకు ప్రయత్నములు జరుపుతున్న సమయమిది. దీనికి మనమందరము జాగరూకులమై ఉండవలెను.

ఈగ్రంథమును వ్రాయుటకు ఎంతయో పరిశోధనదృష్టి, చరిత్ర ఘట్టముల సంకలనము, వ్రాయుటకు కావలసిన భాషా కౌశలము, ఘట్టములను వర్ణించుటలో పులకింప చేయు విధముగా రచింపగల సమర్థత, కలవారికోసం వెతికిఉంటిమి.

ఈగ్రంథరచనకు బాధ్యత వహించి పూనుకొన్న శ్రీ మాదల వీరభద్రరావు గారిలో ఈగుణములన్నీ యిమిడి యుండెను. వారు స్వయముగా స్వాతంత్ర్య సమర యోధులు, విప్లవ వాదులు, ప్రసిద్ధి కెక్కిన పత్రికా సంపాదకులు, చరిత్రను అనేక కోణములనుండి పరిశోధన చేసిన పరిశోధకులు, ఈకార్యభారము వహించి ఇంత త్వరలో ఈరచన పూర్తిచేసినందుకు మనమందరము కృతజ్ఞులము. ఇందులో ఆనాటి కవులు స్వాతంత్ర్యోద్యమములో స్వేచ్ఛగా రచించి గానముచేసిన అనేక పద్యములు గీతములు కూడా చేర్చియుండిరి. ఇవిచదివినప్పుడు ఆనాటి కర్మవీరుల త్యాగములు ఈతరమును పులకింప చేయక మానవు.

మనసులో ఉన్న భావములను మిత్రులకు వెలిబుచ్చి దానికి కావలసిన అన్ని హంగులు సమకూర్చుటకు ఇందుకు సమర్థవంతుడైన ఆలోచనాపరుడు ఉండుట అవసరము. అట్టికార్యమునకు కంకణము కట్టుకొని, కార్యసాధనకు కావలసిన అన్ని హంగులు మిత్రుల సహాయముద్వారా ఏర్పరిచిన శ్రీ కోన ప్రభాకరరావు (మాజీ మహారాష్ట్ర గవర్నరు) గారికి మాకృతజ్ఞతలు. ప్రభాకరరావుగారు స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత, కాంగ్రెస్ రాజకీయరంగములో అనేకపదవుల నలంకరించి, దేశ సేవ చేసినవ్యక్తి.

ఈగ్రంథమును ప్రచురించుటకు వేలరూపాయలు కావలసి ఉండెను. గ్రంథము ఉద్గ్రంథమైన కొలదీ, నేడుదానికి తగిన ప్రచురణ కర్తలు దొరుకుట దుర్లభమగు చున్నది. అట్టి సందర్భములో, అడిగినంతనే కావలసిన ధనము నంతను ఉదారముగా ఇచ్చిన శ్రీ సాదినేని చౌదరయ్య గారికి మాధన్యవాదములు. వీరు గుంటూరు జిల్లా, చిలకలూరుపేట వాస్తవ్యులు.

కార్యసాధనకు సమగ్రముగా పరిశీలించి సహాయము చేయుటకు కూడా సమర్థవంతులైన కార్యదీక్షా పరులుండుట ముఖ్యము. దీనికి వెన్నుముకగా నిలిచి కార్యక్రమము నడిపించిన శ్రీ కె. రోశయ్య గారికి మాధన్యవాదములు.

మేముపెట్టిన తొందర లన్నింటికి సహించి, సకాలములో చక్కగా పుస్తకము ముద్రించి యిచ్చిన నాట్యకళా ప్రెస్ వారికి అభినందనలు. ఈకార్యక్రమమును సఫలీకృతము చేయుటకు తోడ్పడినటి ఎందరో మహానుభావులు వారందరికీ మావందనములు.

ఈతరము వారు మనస్వాతంత్ర్య సమర చరిత్రను సమగ్రముగా చదివి మా కృషిని సద్వినియోగము చేసుకొందురు గాక!

ఇట్లు
ప్రకాశకులు

# INTRODUCTION

India's freedom struggle is an epic and unique story amongst the various liberation movements that were lead in the world. Humanity's desire to be free in spirit, besides other freedoms is universal To be free politically with individual freedom is the basis of a democratic set up We have been very fortunate to have Mahatma Gandhi as our leader of our liberation movement and evolved us as the biggest democracy in the world.

Many have written the history of our freedom struggle in various languages by the historians, research scholars, random writers, Every book has its own new approach It is in that light to bring out in detail and highlight the role played by Andhras with the backdrop of the national canvas, this story is told again with a new approach to inspire our youngmen, specially in Andhra Pradesh. This in addition brings out the part played by many Andhra leaders who are not known outside the State. Even if known earlier, who must have been forgotten in the afflux of time Hence a special effort is made in this book to highlight the names of our heroes who played a noble role in our liberation movement who sacrificed their everything including themselves, with no expectation of reward or praise. In other words, did 'Nishkama Karma' under the commands of Mahatma Gandhi who lead the Indian National Congress till his death.

We have won the freedom and established as the biggest democratic republic of India Then why again this effort or recounting of this story. India has yet to go a long way to realise the visions of our freedom fighters, that is, to rebuild India as a Heaven on Earth - economically, politically and morally.

To realise the same, similar spirit is needed in the younger generation. This onerous task has fallen on their shoulders to work till every single person in the country enjoyed the fruits of freedom.

The story is told in an inspiring way by Shri Madala Veerabhadra Rao who is himself a veteran freedom fighter. He is also a veteran journalist. A prolific writer and an acknowledged biographer of many of our Andhra leaders who shone on the fermament of our freedom struggle, inspiring the masses of Andhra and India. With his rich experience, Mr. Madala has written this volume which is a unique contribution both as a piece of history and a literary work with a language and quotations which can inspire us for generations to come

On behalf of the publishers we thank him for making our efforts a success. This depends again how much the generation will put this book to use, by their deep study of the same. We

thank Mr. Veerabhadra Rao for the strenuous work he has undertaken and completed this in record time

At a time when the generation is accustomed to read light literature, it is difficult to find a publisher for books of this nature. We are happy to state that Mr. Sadineni Chowdarayya of Chilakalurpet, Guntur District has come forward to finance the project completely with a cheer. We express our gratitude for his financial assistance to complete this publication.

The main inspiration for this book is Shri Kona Prabhakara Rao, the former Governor of Maharashtra. He has occupied various posts, legislative and organisational, in the Congress Party He has been very enthusiastic about bringing out a volume on the freedom struggle which could be really useful for conducting political study classes for the youngmen, that want to do the party work, and also to fill the need, to know our own history, in its proper perspective This effort is the main inspiration of him. We are very grateful to him for initiating this project and for taking all the necessary steps to make this project a success.

For any organised effort there must be a person like a backbone both for organisation and supervision and to give a helping hand at every stage, encouraging the effort. Shri. K. Rosaiah, the veteran Congressman has played that unique role giving us all the necessary help to complete this publication.

We thank the Natya Kala Press for completing this project in a record time, bearing all our pressures, to complete it at an early date.

We thank many others whose names could not be mentioned but for whose guidance and help this project could not have been completed at this speed We only wish the younger generation make use of this book and make our project a real success.

**Prof. Dr. P. Tirumala Rao**
Publisher.

Hyderabad-38
15-7-86

# విషయ సూచిక

**అధ్యాయం-1** **ఆంధ్రుల ఉజ్జ్వల పాత్ర**

ఆంధ్ర దేశభక్తుల విశిష్టత 4, రైతాంగ సమస్యలపై ఆందోళన 6, నిజాం సంస్థాన ప్రజల విమోచనోద్యమం 9, తెలంగాణా ప్రజల అపూర్వ త్యాగాలు 11,

**అధ్యాయం-2** **ప్రథమభారత స్వాతంత్ర్య యుద్ధం**

ఈస్టిండియా కంపెనీ దుష్పరిపాలన 14, ఝాన్సీలక్ష్మీబాయి 20, హైదరాబాదులో తిరుగుబాట్లు 22, ఆంధ్రలో సిపాయి విప్లవ ప్రభావం 24,

**అధ్యాయం-3** **వందే మాతరం ఉద్యమం**

కాంగ్రెస్ పుట్టుక 27, వందే మాతరంఉద్యమం 29, ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనం 30, రాజమండ్రి విద్యార్థుల ముందంజ 32, కాకినాడ పౌరుల కార్యదీక్ష 33, చిన్నపరెడ్డికి ఉరిశిక్ష 34, స్వరాజ్య పత్రికకేసు 35, మండల మహాసభలు- 36, ఆంధ్ర మహాసభలు 40,

**అధ్యాయం-4** **హోంరూల్ ఉద్యమం**

ఆంధ్రలో హోంరూల్ ప్రచారం 44,
విప్లవోద్యమం 46, విప్లవ వీరులకు జోహార్లు 53,

**అధ్యాయం-5**

తెలంగాణా పరిస్థితులు-ప్రజా చైతన్యం 55, నిజామాంధ్ర మహాసభలు 59-62,
స్వదేశీ ఉద్యమం 63, స్టేట్‌లో రాజకీయ మహాసభలు 64,

**అధ్యాయం-6** **సహాయ నిరాకరణోద్యమం-1**

గాంధీజీ నూతన పంథా 66, గాంధీ యుగారంభం 70, బెజవాడ ఎ. ఐ. సి. సి. మహాసభ 71, పెదనంది పాడు పన్నుల నిరాకరణ 73,

**అధ్యాయం-7** **సహాయ నిరాకరణోద్యమం-2**

చీరాల-పేరాల పురనిర్గమన ప్రస్థానం 78, పల్నాటి సీమలో పుల్లరి సత్యాగ్రహం 82, హనుమంతు వీరమరణం 88, రాయచోటిలో పుల్లరి సత్యాగ్రహం 91, రాయలసీమకు ఉద్యమ వ్యాప్తి 94, అరెస్టు అయిన ప్రముఖులు 96, నాన్‌కోఆపరేషన్ ఉద్యమ వైఖరి 99,

**అధ్యాయం-8** కాకినాడ కాంగ్రెస్ మహాసభ **101**

నాగపూర్ జెండా సత్యాగ్రహం 104, 'ఆంధ్రవీర' శ్రీ రామరాజు-మన్య విప్లవం 105, నీలు విగ్రహ సమస్యపై సత్యాగ్రహం 110,

**అధ్యాయం-9** ఉప్పు సత్యాగ్రహం-1

సంపూర్ణ స్వాతంత్ర్య దీక్ష 114, గాంధీజీ దండియాత్ర 116, ఆంధ్రలో సత్యాగ్రహ శిబిరాలు 118, సీతానగరం ఆశ్రమ వాసుల త్యాగం 119, ధృవతార కాంగ్రెస్ పత్రిక 120, వాడపల్లి రథోత్సవంపై కాల్పులు 121, కాంగ్రెస్ రాజకీయ సభలు—అరెస్టులు 123,

**అధ్యాయం-10** ఉప్పు సత్యాగ్రహం-2

గుంటూరు జిల్లాలో 126, కృష్ణాజిల్లాలో 137, బందరు జెండా సత్యాగ్రహ యుద్ధం 145,

**అధ్యాయం-11** ఉప్పు సత్యాగ్రహం-3

పశ్చిమగోదావరి జిల్లాలో 149, తూర్పుగోదావరి జిల్లాలో 154, రాయల సీమలో ఉప్పు సత్యాగ్రహం 159, ఆంధ్రదేశంలో అరెస్టులు 163, స్వతంత్ర సమ రంలో మరో అధ్యాయం 165, స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం 168,

**అధ్యాయం-12**

వ్యష్టి సత్యాగ్రహం 172, బొంబాయి ఎ.ఐ సి.సి.సభ 177,

క్విట్ ఇండియా ఉద్యమం

గుంటూరు జిల్లాలో 179, కృష్ణాజిల్లాలో 186, పశ్చిమగోదావరిలో 190, యితరచోట్ల, మదరాసులో అరెస్టులు 191,

**అధ్యాయం-13** హైదరాబాదు స్టేట్‌లో క్విట్ ఇండియా ఉద్యమం **192**,

అరెస్టు అయిన ప్రముఖులు 194, స్టేట్ నుండి జయప్రకాష్ బహిష్కరణ 195, ఇండియన్ యూనియన్‌లో విలీనోద్యమం 196, స్టేట్‌లో ప్రజా పోరాటాలు 198, అమరవీరుడు కొమరయ్య 200, మొగిలయ్య, షోయబుల్లాఖాన్ హత్యలు 202, ప్రధాని నెహ్రూ వివరణ 204, మహిళల త్యాగం 205,

**అధ్యాయం-14**

స్టేట్‌లో తుది పోరాట వ్యూహం 209, స్టేట్ కాంగ్రెస్ రాజకీయ వైఖరి 211, స్టేట్ కాంగ్రెస్ మహాసభ 214, సరిహద్దు శిబిరాలు 216,

**అధ్యాయం-15** స్టేట్ కాంగ్రెస్ వలంటీర్ల పోరాటాలు **219**

పరిటాల రిపబ్లిక్ 220, గానుగపాడు రిపబ్లిక్, పర్కాలలో ఘోర దురంతం 222, చాందాకాంపు 223, కర్నూలు కాంపు 225, భాగ్యనగర్ రేడియో ప్రసారాలు 226,

**అధ్యాయం-16** భారత స్వరాజ్య సిద్ధి 227

ఆజాద్ హింద్‌ఫౌజ్ 228,
హైదరాబాదు సంస్థానంతో యూతనళకం 230, యధాతధపు ఒడంబడిక 231, భారత ప్రభుత్వ పోలీస్ చర్య 233,

**అధ్యాయం-17** జాతీయ గీతాలు-పద్యాలు **235**,

అమరవీరులు 246, త్యాగధనుల కుటుంబాలు 251

**అధ్యాయం-18** స్వాతంత్ర్యోద్యమ సందేశం 253.

జాతీయ స్వాతంత్ర్యోద్యమం- కొన్ని ముఖ్య తేదీలు 262
తెలుగునాట ప్రధాన పోరాట ఘట్టాలు 274
అ. భా. కాంగ్రెస్ మహాసభల అధ్యక్షులు 280
తెలుగునాట స్వరాజ్య రథసారధులు 284
రిఫరెన్సు గ్రంధాలు 317





ద్రవ్యదాత

స్వాతంత్ర్యోద్యమంపట్ల

అత్యంత అభిమానంతో

ఈ గ్రంథ ప్రచురణకు

భూరి విరాళమిచ్చిన

శ్రీ సాదినేని చౌదరయ్యగారికి

ధన్యవాదాలు

ఈ గ్రంథావిష్కరణ సభ. హైదరాబాదు
**1986 ఆగస్టు 15, ప్రెస్‌క్లబ్ హాలులో**



(ఎడమ వైపు నుంచి) సాదినేని చౌదరయ్య, జలగం వెంగళరావు (సభాధ్యక్షుడు), కాసు బ్రహ్మానందరెడ్డి (ఆవిష్కర్త), మాదల వీరభద్రరావు (గ్రంథకర్త) డాక్టర్ పి. తిరుమలరావు, కోన ప్రభాకరరావు,



'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు



ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య



'భారతరత్న' వి. వి. గిరి



'దేశభక్త' కొండా వెంకటప్పయ్య

# అఖిల భారత కాంగ్రెస్ మహాసభల అధ్యక్షులు



पी आनदाचारलू
P ANANDACHARLU
1891-92
పి. ఆనందాచార్యులు



सरोजिनी नायडू
SAROJINI NAIDU
1925-26
సరోజినీనాయుడు



पट्टाभि सीतारम्मैया
PATTABHI SITARAMMAYYA
1948-50
భోగరాజు పట్టాభి సీతారామయ్య



सजीवा रेड्डी
SANJIVA REDDY
·961-62
నీలం సంజీవరెడ్డి



के ब्रह्मानद रेड्डी
K BRAHMANAND REDDY
1977-78
కాసు బ్రహ్మానందరెడ్డి

## అఖిల భారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శులు

బారు రాజారావు

గా వెంకటరావు

అల్లూరి సత్యనారాయణరాజు









దుర్గాబాయి

# జాతీయ స్వాతంత్ర్య సమరంలో
# ఆంధ్రుల ఉజ్జ్వల పాత్ర

*చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర*
*హృదయములు చీల్చి చదువుడో సదయులార!*

— రాయప్రోలు

భారత జాతీయ స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రులు మహోజ్జ్వల పాత్ర నిర్వ హించారు. 1857 సంవత్సరంలో ప్రథమ భారత యుద్ధం జరిగిన తర్వాత, 1885లో జాతీయ కాంగ్రెసు సంస్థ ఏర్పడిన నాటి నుండి 1905 వరకు ప్రభుత్వా నికి విజ్ఞాపనలు, వినతి పత్రాలు సమర్పించడం జరిగింది. 1905 నుంచి 1911 వరకు దేశంలో వందేమాతరం ఉద్యమం సాగింది. 1916-18 మధ్యకాలంలో 'హోంరూలు' ఆందోళన నడిచింది. 1920-22 సంవత్సరాలలో అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం జరిగింది. 1930-34 సంవత్సరాలలో ఉప్పు సత్యా గ్రహోద్యమం, 1940-42 సంవత్సరాలలో క్విట్ ఇండియా ఉద్యమం నిర్వహింప బడినవి. ఈ అన్ని పోరాట ఘట్టాల్లో కూడా ఆంధ్రులు ముందునిలచి, దేశ దాస్య విముక్తి కోసం అగ్రశ్రేణిలో వుండి పోరాడారు.

'దేశభక్త' కొండ వెంకటప్పయ్య, 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, 'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశం, 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు, డాక్టర్ పట్టాభి, మహర్షి బులుసు సాంబమూర్తి, తెన్నేటి విశ్వనాథం, అయ్యదేవర కాళేశ్వర రావు, డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, కల్లూరి సుబ్బారావు, ఆచార్య ఎన్. జి. రంగా మున్నగు దేశారాధకుల నేతృత్వాన, ఆంధ్ర ప్రజలు అఖండత్యాగాలు చేశారు. స్వరాజ్య ఉద్యమాలన్నింటిలోను ఆంధ్ర మహిళలు సైతం వీరోచిత పాత్ర నిర్వహించారు. పలువురు నాయకులు, స్వచ్ఛంద సేవకులు ఉద్భవించి, ఈ అహింసా ధర్మసంగ్రామంలో అతిరథ మహారథులుగా వుండి, నిరుపమాన దేశభక్తిని, అకుంఠిత త్యాగదీక్షను ప్రదర్శించారు. వేలాది

వలంటీర్లు దేశసేవకై తమ సర్వస్వాన్ని అర్పణజేసి, ఎన్ని కష్టాలకైనా ఓర్చి, స్వరాజ్య యజ్ఞాన్ని నిర్విఘ్నంగా కొనసాగించారు తుదకు 1947 లో విజయాన్ని సాధించారు.

"ఆంధ్ర దేశమందు అత్యధికమైన భావోద్రేకం, శ్రద్ధా భక్తులు గలవు. ఆంధ్రులు పౌరుషవంతులు, ఉత్తమ సంప్రదాయాలు గలవారు. మంచిమీద నమ్మకం గలవారు. ఎంతటి త్యాగానికైనా వెనుదీయని వారు. వారికి పవిత్రాత్మవుంది, త్యాగశీలం వుంది ఆంధ్రులు నన్ను మంత్రముగ్ధుణ్ణి చేశారు." అని గాంధీ మహాత్మునిచే ప్రశంసలందుకొన్నారు.

## అఖిల భారత కాంగ్రెస్ సభలు

బెజవాడలో ఎ ఐ సి సి. సభలు, కాకినాడలో అ భా. కాంగ్రెస్ మహా సభలు, ఆంధ్రలో జరిగినవి (స్వాతంత్ర్యానంతరం, హైదరాబాదు నానల్‌నగర్‌లో అ. భా. కాంగ్రెస్ మహాసభలు, గుంటూరు హైదరాబాదులలో ఎ.ఐ సి.సి. సభలు జరిగినవి.)

జాతీయోద్యమ కాలాల్లో గాంధీమహాత్ముడు యావదాంధ్ర దేశం పర్యటించారు. ఆనీబిసెంటు, సరోజినీదేవి, జవహర్‌లాల్, సుభాస్‌చంద్రబోస్, రాజేంద్రప్రసాద్ మున్నగు అగ్రనాయకులంతా యిక్కడి సభా సమావేశాల్లో ప్రసంగించినవారే. వీరి పర్యటనలు, ప్రసంగాలు, దేశాభిమానులకు ప్రోత్సాహాన్నిచ్చాయి. స్వచ్ఛంద సేవకులకు స్ఫూర్తిని కలిగించాయి. ప్రజలలో గొప్ప రాజకీయ చైతన్యాన్ని స్వాతంత్ర్యేచ్ఛను రేకెత్తించాయి.

## ప్రసిద్ధ ఆంధ్రనాయకులు

ఆంధ్ర దేశంలో ఉద్భవించిన ఆనాటి రాజకీయ నాయకులు దాదాపు అందరూ మధ్య తరగతి కుటుంబాల నుంచి వచ్చిన మేధావులే ఎవరూ అగర్భ శ్రీమంతులు కారు, స్కాలర్ షిప్పులతో కష్టపడి చదువుకొని, స్వయం కృషివల్ల . అబ్బిన తెలివి తేటలతో ఉన్నత విద్యావంతులైనవారే.

పున్నవ లక్ష్మీనారాయణ (డబ్లిన్ యూనివర్సిటి) బారిస్టర్, దుగ్గిరాల గోపాల కృష్ణయ్య (ఎడింబరో యూనివర్సిటీ), టంగుటూరి ప్రకాశం (లండన్ యూనివర్సిటి బారిస్టర్), ప్రొఫెసర్ ఎన్.జి. రంగా (ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ), వి.వి.గిరి (ఐర్లండ్

యూనివర్సిటీ) కడప కోటిరెడ్డి (లండన్ యూనివర్సిటీ బారిస్టర్), పోలిశెట్టి హనుమయ్యగుప్తా (బారిస్టర్) కొండ వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి అయ్యదేవర కాళేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, తెన్నేటి విశ్వనాథం, వెన్నెలకంటి రాఘవయ్య, మున్నగు వారందరూ న్యాయశాస్త్ర కోవిదులు.

డాక్టర్ పట్టాభి, డాక్టర్ ఎ.వి.ఎస్ చలపతిరావు, డాక్టర్ ఎ.బి.నాగేశ్వరరావు, డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, డాక్టర్ [illegible]పురి రంగయ్య, డాక్టర్ ముదునూరు సుబ్రరాజు, డాక్టర్ ఘంటసాల సీతారామశర్మ, డాక్టర్ [illegible] హనుమంతరావు మొదలగు వారంతా పేరుగాంచిన వైద్యశాస్త్ర నిపుణులు

వీరు లోకమాన్య తిలక్, గాంధీజీ వంటి ప్రజానాయకులై త్యాగశీలురై, ఆంధ్ర దేశంలో త్యాగులను తయారుచేశారు ఆంధ్ర నాయకుల్లో మరో ముఖ్య లక్షణం - వీరే రాజకీయ ఆందోళనాపరులు — వీరే సంఘ సంస్కర్తలు సాహితీవేత్తలు - ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరులు. అందుచేతనే అన్ని రంగాలలో వీరి ముద్ర కనిపిస్తుంటుంది.

కడప జిల్లాలో కోటిరెడ్డి ; నెల్లూరు జిల్లాలో బెజవాడ గోపాలరెడ్డి, గుంటూరు జిల్లాలో కల్లూరి చంద్రమౌళి, మంతెన వెంకటరాజు గౌసుబేగ్ కాసు బ్రహ్మానందరెడ్డి కృష్ణాలో గొట్టిపాటి బ్రహ్మయ్య, [illegible], పేట బాపయ్య, కోగంటి వెంకటకృష్ణారావు; పశ్చిమ గోదావరిలో దండు నారాయణరాజు, సుబ్బరామరాజు, అల్లూరి సత్యనారాయణరాజు, వీరమాచనేని వెంకటనారాయణ; తూర్పు గోదావరిజిల్లాలో బారిస్టర్ కందుల వీరాస్వామినాయుడు, మల్లిపూడి పళ్ళంరాజు ప్రభృతులు, అనంతపురం జిల్లాలో నీలం సంజీవరెడ్డి, ఐ సదాశివన్, శ్రీకాకుళంలో గౌతులచ్చన్న, మద్రాసులో గద్దెరంగయ్య నాయుడు, బి ఎస్ మూర్తి, వేముల కూర్మయ్య, ఎస్. నాగప్పమొదలగు వారు తరువాత కాలంలో కాంగ్రెస్ నాయకత్వం చేపట్టి, కార్యక్రమాలు కొనసాగించారు.

స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం కోసం పోరాటం సాగించిన ఆంధ్ర నాయకులు 'భాషా ప్రయుక్త రాష్ట్ర' నిర్మాణానికి కూడా ప్రాతిపదికలు వేశారు. స్వరాజ్యంతో పాటు, 'స్వరాష్ట్రం' ఏర్పడాలనీ, అది భాషాధారకంగా వుండాలనీ, మొదటి నుంచీ వీరు ఆందోళన సాగించారు ఆంధ్ర మహాసభకు అండగా వున్నారు. సామ్రాజ్య-వ్యతిరేక-జాతీయ-స్వాతంత్ర్యోద్యమంలో భాషాప్రయుక్త రాష్ట్రోద్యమాన్ని అంతర్భాగంగా పరిగణించారు. ఇతర భాషా రాష్ట్ర వాదులకు ఆంధ్రులు మార్గదర్శకులైనారు.

రాజకీయాలతో పాటు సంఘ సంస్కరణాభిలాష, ఆధ్యాత్మిక ధర్మానుసరణ వీరిలో క్రమేణా పెరుగుతూ వచ్చాయి. వీరిలో కొందరు పుట్టుకతో సనాతనాచార పరులైన కుటుంబాలలో జన్మించినా, హరిజనోద్ధరణ, అస్పృశ్యతానివారణ, సహపంక్తి భోజనాలు, హిందూ—ముస్లిం ఐక్యత స్త్రీ పునర్వివాహాలు మున్నగు వాటిని ప్రోత్సహించి, ఆచరించడంలో ముందున్నవారే. కులమత వర్ణవివక్షతలను పాటించని సంఘసంస్కరణ దృక్పథం వీరిలో ద్యోతకమవుతుంది.

## సత్యాగ్రహ ఆశ్రమాలు

గాంధీగారి సబర్మతీ, వార్ధా ఆశ్రమాలకు వలెనే, సీతానగరం గౌతమీ ఆశ్రమం, కావూరు వినయాశ్రమం, హిందూపురం సేవాశ్రమం, మండవల్లి గాంధీ సేవాశ్రమం, పెదపాలెం శ్రీ కృష్ణాశ్రమం, గుణదల గ్రామస్వరాజ్య పీఠం, చాగల్లు ఆనందనికేతనం, గుంటూరు శారదానికేతన్, నెల్లూరి జిల్లా పినాకినీ నదీతీరాన పల్లిపాడు ఆశ్రమం మున్నగు సత్యాగ్రహ ఆశ్రమాలు దేశారాధకులకు నిలయమై, పూర్వపు ఋష్యాశ్రమాలను తలపునకు తెచ్చి, ప్రజలలో దేశభక్తిని, స్వాతంత్ర్యతృష్ణను రేకెత్తించాయి. జాతీయ మహానాయకుల పట్ల, వారు నడుపుతున్న ఉద్యమాలు, నిర్మాణ కార్యక్రమాల యెడల అమిత భక్తి విశ్వాసాలను కలిగించాయి.

## ఆంధ్ర దేశభక్తుల విశిష్టత

వందేమాతరం ఉద్యమ కాలంలో మహాత్యాగశీలిగా గణుతికెక్కి దేశారాధకులకు ఆదర్శప్రాయుడైనది గాడిచెర్ల హరిసర్వోత్తమరావు. కాంగ్రెస్ సంస్థకు జాతీయ పతాకాన్ని రూపకల్పన చేసి గాంధీమహాత్ముని చేతి కందించినది పింగళి వెంకయ్యగారు. రాజామహేంద్రప్రతాప్, శ్యాంజీ కృష్ణవర్మ మున్నగు విప్లవ నాయకులతో కలిసి, గదర్ పార్టీ కార్యకలాపాల్లో పాలుపంచుకున్నది దర్శి చెంచయ్యగారు. విప్లవ కారునిగా అండమాన్ దీవులలో కఠిన కారాగార శిక్షననుభవించినది ప్రతివాద భయంకరాచారిగారు. సుభాస్ చంద్రబోస్ నాయకత్వాన ఏర్పడిన ఆజాద్‌హింద్‌ఫౌజ్ (జాతీయసేన) లో తన కర్తవ్యాన్ని నిర్వర్తించినది కల్నల్ డాక్టర్ డి. ఎస్. రాజు గారు.

స్వాతంత్ర్య ఉద్యమాలలో అల్లూరి సీతారామరాజు, కన్నెగంటి హనుమంతు వంటి అమరవీరులను బలిదానమిచ్చినది ఆంధ్రదేశం. స్వాతంత్ర్య సమరవీరులైన వేలాది స్త్రీ పురుషులను, పిన్న పెద్దలను దేశానికర్పించినది ఆంధ్రదేశం.

గాంధీజీ అడిగినదే తడవుగా తన మెడలోని బంగారు ఆభరణాలనన్నిటినీ వలిచి, సర్వసమర్పణ గావించి, స్త్రీజాతికే వన్నెదెచ్చిన త్యాగి మాగంటి అన్నపూర్ణా దేవిగారు. ఇట్లా ఎందరెందరో త్యాగశీలురు ఆంధ్రదేశానికి, ఆంధ్రులకు కీర్తి ప్రతిష్ఠల నార్జించి పెట్టారు.

ఆంధ్ర రాజకీయ నాయకులలో పేరెన్నికగన్న మరికొందరి ప్రముఖుల జీవిత విశేషాలను గమనించండి:

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అద్వితీయ ప్రతిభా విశేషాలుగల సాహసి. చీరాల-పేరాల ప్రజల నందరినీ ఒక్క త్రాటిపై నడిపించి ప్రభుత్వాధిష్ఠులను ధిక్కరింప చేసిన దిట్ట.

'దేశభక్త' కొండ వెంకటప్పయ్య దేశారాధకులైన అగ్రగణ్యులలో సౌజన్య మూర్తి. గాంధీజీకి ఆంధ్రలో అత్యంత గౌరవనీయ వ్యక్తి.

విశ్వదాతగా పేరొందినవారు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు. 'ఆంధ్ర పత్రిక' ద్వారా ఆంధ్ర ప్రజలలో గొప్ప రాజకీయ ప్రబోధం కలిగించినవారు.

అతి ధైర్య సాహసాలతో, సంపూర్ణ త్యాగమయ జీవితం గడిపి, దేశంకోసం ప్రజల కోసం తన సర్వం త్యాగం చేసినది ఆంధ్ర కేసరి ప్రకాశం.

అసమాన మేధా సంపన్నుడై కాంగ్రెస్ చరిత్ర కారుడుగా, గాంధీ సిద్ధాంత భాష్యకారుడుగా ప్రశస్తి నార్జించిన డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య.

అకుంఠిత దీక్షతో ఆమరణ నిరాహారదీక్ష బూని, ఆంధ్రరాష్ట్ర నిర్మాణంకోసం గాంధేయ మార్గాన అసువులర్పించి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి తోడ్పడిన అమరజీవి పొట్టి శ్రీరాములు. ఇలానే, బులుసు సాంబమూర్తి, తెన్నేటి విశ్వనాథం, నడింపల్లి నరసింహారావు, వున్నవ లక్ష్మీనారాయణ, వరహాగిరి వెంకటగిరి, చెరుకువాడ నరసింహ్మం, కల్లూరి సుబ్బారావు, ముట్నూరి కృష్ణారావు, క్రొవ్విడి లింగరాజు, మద్దూరి అన్నపూర్ణయ్య, గుమ్మడిదల దుర్గాబాయి, వావిలాల ప్రభృతులు ఆంధ్ర రాజకీయరంగంలో విశిష్ట స్థానాన్ని అధిష్ఠించారు.

ఈ ఆంధ్ర నాయకులు తిలక్, గాంధీ, బోధనలతో ప్రభావితులైన జాతీయ వాదులు.

వీరి మనః ప్రవృత్తులు వేరుగానున్ననూ, ముఖ్యంగా వీరంతా గాంధీ మార్గావలంబకులు. జాతీయ స్వరాజ్య సంగ్రామంలో పాల్గొని వీరు పలుమార్లు జైలుశిక్షలు అనుభవించిన స్వాతంత్ర్య సమర యోధులు. వీరి నిస్వార్థత, త్యాగమయ గుణాలే, అఖిలాంధ్ర ప్రజల విశ్వాసాన్ని అంతగా చూరగొనేటట్లు చేయగలిగినవి.

యావదాంధ్రులు ఆంధ్రనాయకులను సముచితరీతి గౌరవాంజలులు అర్పించారు విగ్రహాలు ప్రతిష్ఠించారు. వీరి జీవిత విశేషాలను గూర్చి అనేక పుస్తకాలు రచించి ప్రచురించారు. ప్రజలు అభిమానంతో సమర్పించిన బిరుదులె వీరికి సార్థక నామాలైనవి. ఆంధ్ర నాయకుల దేశభక్తి, త్యాగ దీక్ష ధర్మనిరతి, ప్రశంసనీయమైనవి.

## జాతీయ కవిపుంగవులు

గరిమెళ్ళ సత్యనారాయణ, బసిజేపల్లి లక్ష్మీకాంతకవి, చిలకమర్తి లక్ష్మీనరసింహం, దామరాజు పుండరీకాక్షుడు, సీతారామాంజనేయులు, బసవరాజు అప్పారావు, త్రిపురనేని రామస్వామి చౌదరి, మంగిపూడి వేంకట శర్మ, గరికెపాటి మల్లావధాని, సురవరపు రాఘవశర్మ, తుమ్మల, కాటూరి, కాళోజి, దాశరథి

మొదలగు జాతీయ కవి పుంగవులు స్వాతంత్ర్యోద్యమాల సందర్భంలో అనేక పాటలు, పద్యాలు, నాటకాలు రచించి ఆంధ్రదేశంలో గొప్ప స్వరాజ్య ప్రబోధం గావించారు. నిద్రాణమైయున్న ఆంధ్ర జాతిని మేల్కొలిపారు పలువురు, జాతీయోద్యమంలో స్వయంగా పాల్గొని, జైలు శిక్షననుభవించారు. ఇలాగే కవులు, గాయకులు, చిత్రకారులు, మేధావులు, ఎందరెందరో స్వరాజ్య సంగ్రామంలో తమ కర్తవ్యాన్ని నిర్వహించి చరితార్థులైనారు.

## రైతాంగ సమస్యలపై ఆందోళన

మరో ముఖ్యవిషయం- స్వాతంత్ర్యోద్యమానికి గ్రామీణ రైతాంగ సమస్యలను కూడా మేళవిస్తూ స్వరాజ్య సమరాన్ని సాగించినట్లు గత చరిత్రను పరిశీలిస్తే తేటతెల్లమవుతుంది.

1920 నాన్ కో ఆపరేషన్ ఉద్యమకాలంలో పెదనందిపాడు ఫిర్కా పన్నుల నిరాకరణ; పల్నాటిసీమలో, రాయచోటి ప్రాంతంలో పుల్లరి సత్యాగ్రహం, అటవీ శాసనాల ఉల్లంఘన; చీరాల, గుంటూరు, రేపల్లె, భీమవరం రేటు పేయర్ల సంఘాల

ఆందోళనమూ; రీసెటిల్మెంటుకు వ్యతిరేకంగా రైతుల ఆందోళనలు యీయుగపు పోరాట-ఘట్టాలుగా పేర్కొనవచ్చును.

సహాయ నిరాకరణోద్యమ ప్రభావంతో, 1922-24 సంవత్సరాలలో రెండేళ్లు మన్యం ప్రజలు సాగించిన పోరాటం— బ్రిటిష్ ప్రభుత్వ బలాన్ని సవాలు చేసిన మహత్తర విప్లవఘట్టం అది. పోడు వ్యవసాయాన్ని నిషేధించడం, గిరిజన కోయ ప్రజల దుర్భర కష్టాలు, ప్రభుత్వాధికారుల దురహంకారం, అవినీతి మున్నగునవన్నీ ఆ ప్రజావిప్లవానికి మన్యం ప్రజలను పురిగొల్పినవి. తపస్సంపన్నుడు, సర్వసంగ పరిత్యాగి-అయిన అల్లూరి సీతారామరాజు వంటి నాయకత్వం లభించడం ప్రజల అదృష్టం. రాజకీయ స్వరాజ్య లక్ష్య సాధనకు ప్రజాసమస్యలను కూడా జోడించి పోరాటాన్ని నడిపినట్లు స్పష్టపడుతుంది.

1930 ఉప్పు సత్యాగ్రహ సమయంలో కృష్ణా గోదావరి డెల్టా ప్రాంతాల్లో ఎకరానికి నీటితీర్వ ఐదు రూపాయల నుండి ఆరు రూపాయలకు పైగా పెంచడానికి ప్రభుత్వం నిర్ణయించడం కూడా అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. ఆచార్య రంగా, గొట్టిపాటి బ్రహ్మయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మాగంటి బాపినీడు, దండు నారాయణరాజు మొదలైన రైతు నాయకులు రీ సెటిల్మెంటుకు వ్యతిరేకంగా తీవ్ర ఆందోళన సాగించడమే గాక, కొందరు రైతుపెద్దలు ఈ సమస్యపైన అరెస్టులకు కూడా గురి అయినారు.

## జమీన్ రైతుల పోరాటం

ఈ సందర్భంలో, వెంకటగిరి మున్నగు జమీందారీ ప్రాంతాలలో జమీందారీ విధానానికి వ్యతిరేకంగా రైతుల ఆందోళన తీవ్రతరమైంది. జమీందారు అడవి పుల్లరి రేటు పెంచాలని చూడగా, గోవిందరెడ్డి నాయకత్వాన ఫారెస్టురైతులు పోరాటం సాగించారు. నెల్లూరి వెంకట్రామానాయుడు 'మా కొద్దీ జమీందార్ల పొత్తు' అనే నినాదాన్ని లేవదీశారు. బద్దెపూడి వెంకటనారాయణ తన మునసబుగిరికి రాజీనామా చేసి, అసహాయోద్యమంలోకి దూకారు. గద్దె రంగయ్యనాయుడు, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ, కటికినేని కళ్యాణరావు, ఆచార్య రంగా జమీన్ రైతులకు అండగా నిలిచారు. కాశీనాథుని నాగేశ్వరరావు, సత్యమూర్తి, విశ్వనాథదాస్ మొదలగు కాంగ్రెస్ నాయకులు ఆయా సభల్లో పాల్గొని, జమీందారీ విధానం రద్దుగావలసిందేనన్నారు.

జాతీయ ఉద్యమంలో రైతాంగ సమస్యలకు గల ప్రాముఖ్యానికి యివి నిదర్శనాలు. కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడిన తర్వాత, ఆంధ్రదేశమంతటా జరిగిన బ్రహ్మాండమైన 'రైతు యాత్రలు' స్వాతంత్ర్యోద్యమానికి జవసత్వాలు సమకూర్చినవి. తదనంతర కాలంలో, కాంగ్రెస్ ప్రభుత్వం జమీందారీ విధానాన్ని రద్దు చేయడానికి మార్గాన్ని సుగమం చేసినవి.

## నిర్మాణ కార్యక్రమాల్లో ముందంజ

హరిజనోద్ధరణ, అస్పృశ్యతా నివారణ, హిందూ - ముస్లిం ఐక్యత, ఖద్దరు-చేతి పరిశ్రమలు - స్వదేశీ, హిందీ ప్రచారం, మద్యనిషేధం, జాతీయ విద్యాలయాల స్థాపన, స్త్రీ జనోద్ధరణ, సర్వమత సామరస్యం మొదలగు గాంధేయ నిర్మాణ కార్యక్రమాలన్నింటిలోను ముందున్నదీ ఆంధ్రదేశం.

మన స్వాతంత్ర్య సమరం ఒక విలక్షణమార్గంలో అంచెలంచెలుగా సాగింది. ప్రతి పదేండ్లకు ఉద్యమం తీవ్రతరమై అహింసాయుత పోరాటఘట్టానికి చేరుకొనేది. ఉద్యమం తదుపరి మధ్యకాలంలో నిర్మాణ కార్యక్రమాలకు పూనుకునేవారు. దేశభక్తులెందరో ఈ సమరాగ్నిలోకి దూకి, ఆహుతి అయినారు. స్వరాజ్య సిద్ధికి ఆత్మార్పణ గావించారు.

## నాటి త్యాగఫలమే నేటి స్వరాజ్యం

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు రెండువంద లేండ్లకు పైగా పైపై పంజరాల్లో మనలను పట్టి బంధించారు. ఆశ్వేత జాతి చెప్పుచేతల్లో మెలగడమే మనవాళ్లకు గతి అయింది. క్రమేణా మనకు జ్ఞానోదయమయింది. మన నేత్రాల మీద పొరలు విడిపోయి, కర్తవ్యోన్ముఖుల మైనాము. మేధావులు మనకు వెలుగు బాట చూపారు. మన వ్యక్తిత్వాన్ని వికసింపచేశారు. ప్రజలు చైతన్యవంతులైనారు. విజ్ఞాపనలు విఫలంకాగా, ఆందోళనలు సాగించారు, ఉద్యమాలు నడిపారు. సత్య అహింసలతో కూడిన పోరాట కార్యక్రమాలకు పూనుకున్నారు. పరప్రభుత్వం తీవ్ర నిర్బంధాలతో ఉద్యమాలను అణచివేయ జూచింది. 'విభజించి పాలించే' పద్ధతి ననుసరించింది. ఉద్యమాలు ఉధృతమైన కొలదీ ఏవో స్వల్ప సంస్కరణలతో ప్రజలను బుజ్జగించ తలపెట్టింది. కాని ఆ పాచికలేమీ పారలేదు. ప్రపంచంలో ప్రజా శత్రువు లెవరూ విజయం పొందలేరు. నిర్బంధ విధానం, పరిష్కార మార్గం కాదని రుజువైంది. ఎట్టకేలకు దేశానికి స్వరాజ్యం సిద్ధించింది. బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వం మన దేశాన్ని వదలి వెళ్ళిపోకతప్పలేదు.

ఆ స్వాతంత్ర్య సంగ్రామ ఘట్టాలను తెలుసుకుందాము. దేశ స్వాతంత్ర్యం కోసం తమ సర్వస్వాన్ని త్యజించి జైళ్లకేగిన ఆ జాతీయోద్యమ ప్రధాన యోధులందరికీ పుష్పాంజలులు సమర్పిద్దాం!

అండమానుదీవుల్లో, చెరసాలల్లో ఆత్మార్పణ గావించిన ఆ స్వాతంత్ర్య వీరులకు, సంతోషంతో ఉరికంబాలెక్కిన అమరజీవులకు, జోహారు లర్పిద్దాం!!

నలుగురిలో ఊరూ పేరూ లేక అజ్ఞాతంగానే వుండి స్వరాజ్య ఉద్యమాలకు సర్వవిధ సహాయ సహకారాలు అందించిన దేశబాంధవులకు, దేశాభిమానులకు నమో వాకాలు అర్పిద్దాం!!!

ఆనాటి వారందరి త్యాగఫలమే నేటి స్వరాజ్యం.

## నిజాం సంస్థాన ప్రజల విమోచనోద్యమం

హైదరాబాదు సంస్థాన ప్రజల విమోచనోద్యమంలో నాలుగు పోరాట ఘట్టాలు ముఖ్యమైనవి.

1) 1938 – స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం
,, – విద్యార్థుల 'వందేమాతరం' ఉద్యమం
2) 1940 – వ్యక్తి సత్యాగ్రహం
1942 – క్విట్ ఇండియా ఉద్యమం
3) 1947 – భారత యూనియన్‌లో హైదరాబాదు విలీనోద్యమం
4) 1947 – 48 సరిహద్దు శిబిరాల ద్వారా జరిగిన విముక్తి పోరాటం
1948 – భారత ప్రభుత్వంచే "పోలీస్ యాక్షన్"
– హైదరాబాదు స్టేట్‌లో ప్రజా ప్రభుత్వ స్థాపన

హైదరాబాదు సంస్థాన ప్రజలు, ముఖ్యంగా సోదర నిజాం ఆంధ్రులు ఈ పోరాట ఘట్టాలలో నిర్వహించిన వీరోచిత పాత్రను యించు తెలుసుకుందాము :

బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వానికి తాబేదార్లు అయిన నిజాం సంస్థానాధీశులు, తమ పెత్తనాన్ని రాచరికాన్ని శాశ్వతంగా కొనసాగించుకొందామని కలలుగన్నారు. ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర ప్రజలను అణచివుంచి బానిసలుగా చేశారు. సంస్థానంలో జాతీయ భావాలు పొడచూపకుండా అనేక కట్టుదిట్టాలు చేసుకొన్నారు.

బయటి వారిని స్టేట్‌లోనికి రాకుండా నిర్బంధాలు, నిషేధాలు విధించారు. ఏ మాత్రం స్వతంత్ర భావాలు వ్యక్తం చేసినా వారిని స్టేట్ నుండి వెలుపలకు వెడలగొట్టారు స్టేట్‌లో ఎట్టి రాజకీయ సాంస్కృతిక సంస్థలను ఏర్పడనివ్వలేదు. మత దురహంకార పూరితులైన నిజాం సంస్థానాధీశులు, స్టేట్‌లో నిరంకుశపాలన సాగించారు.

సైనిక దాడులనైనా అరికట్టవచ్చునేమోగాని, ప్రజల హృదయాంతరాళాల నుండి వెల్లుబికివచ్చే స్వతంత్ర భావతరంగాలను ఆపజాలరనేది చరిత్రలో రుజువైన సత్యం.

గ్రంధాలయాల నిర్మాణంతో, సాహిత్య విద్యాసభలతో ప్రారంభమైన ఉద్యమం క్రమక్రమంగా బలపడసాగింది. నిజాం, ఆంధ్రమహాసభ, కర్నాటక మహారాష్ట్ర పరిషత్తులు ఏర్పడి, సంస్థాన ప్రజలలో జాగృతిని కలిగించాయి.సంస్థానాధీశుడు,జాగీర్దార్లు, దేశ్‌ముఖ్‌లు పెట్టే నిర్బంధాలకు నిరంకుశ ధోరణులకు జంకక ప్రజలు ఎదురొడ్డి నిలిచారు. సంఘటితమైనారు.

స్వామీరామానందతీర్థ నాయకత్వాన, గోవిందరావునానల్, జనార్ధనరావు దేశాయ్, రావినారాయణరెడ్డి ప్రభృతులు స్టేట్‌లో రాజకీయ పోరాటానికి అంకురార్పణ చేశారు. మాడపాటి హనుమంతరావు ఆంధ్ర భాషావికాసానికి, ఆంధ్ర జాతీయాభ్యుదయానికి తొలిరోజుల్లో బలమైన పునాదులువేసి, 'ఆంధ్రపితామహుడు' అనే యశస్సునార్జించుకున్నారు.

పొంగిపొరలివచ్చే ప్రజావాహినిని, ప్రజల స్వాతంత్రేచ్ఛను అరికట్టడానికి నిజాం సంస్థానాధీశుడు మతమౌఢ్యంతో వున్న రజాకారమూకలను ప్రోగుచేసి, వారిని పెంచి పోషించి, ప్రజలపైన చేయరాని అకృత్యాలను చేయించాడు. ప్రజా ఉద్యమాలను రక్తపు టేర్లతో ముంచెత్తాడు.

వరంగల్లు కోటపై త్రివర్ణపతాకను ఎగురవేసిన మొగిలయ్యను హత్య చేయించారు. 'ఇమ్రోజ్' పత్రికాసంపాదకుడైన జాతీయవాది షోయబుల్లాఖాన్‌ను హైదరాబాదు నగరంలో పట్టపగలు దుర్మార్గులు నరికివేశారు. వందలాది రైతు-కూలీ కార్యకర్తలను పొట్టన పెట్టుకున్నారు. గ్రామాలను దగ్ధంచేశారు. స్త్రీలను చెరబట్టారు. వారు జరిపే ఘోర దురంతాలకు అంతులేకుండాపోయింది.

అత్యంత క్లిష్ట పరిస్థితులలో, హైదరాబాదు సంస్థానంలో విముక్తి ఉద్యమం సాగించవలసివచ్చింది. అనేకమంది వీరులు ఈ స్వాతంత్ర్య సమరంలో అసువులర్పిం

పాటు ధనమాన ప్రాణాలు కోల్పోయారు. నిరపరాధులైన స్త్రీలు సైతం అవమానాలకు, మానభంగాలకు గురిఅయినారు శాంతియుతంగా ఉద్యమం సాగించే సత్యాగ్రహులు జైళ్లలో నిర్బంధింపబడి, అష్టకష్టాలు అనుభవించారు.

స్టేట్ కాంగ్రెస్ మహోద్యమానికి సమర్థవంతమైన స్వామి రామానంద తీర్థ నాయకత్వం లభించింది. సర్వసంగ పరిత్యాగియై ప్రజాసేవ కోసం సన్యాసాశ్రమం స్వీకరించిన స్వామీజీ, దిగంబర్ రావు బిందూ, గోవిందరావు షరాఫ్, హైదం పాయన్, ప్రాణేశాచార్య, జగన్నాథరావు చంద్రికీ, డాక్టర్ మేల్కోటే, సర్దార్ జమలాపురం కేశవరావు, ఎం రామచంద్రరావు మున్నగు సుప్రసిద్ధ దేశ సేవకులను కూడవేశారు. వివిధ ప్రాంతాల కార్యకర్తలను ఆయన సమైక్యపరచి, ఉద్యమాన్ని సాగించారు

## తెలంగాణా ప్రజల అపూర్వ త్యాగాలు

బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి, కె వి రంగారెడ్డి, మందుముల నరసింగరావు, పండిత నరేంద్రజీ, హరిశ్చంద్ర హెడా ప్రభృతులు నాయక శ్రేణిలో నిలిచి స్వాతంత్ర్యోద్యమ పురోగతికి ఎంతగానో తోడ్పడ్డారు.

పి వి నరసింహారావు, ఉమ్మెత్తల కేశవరావు, కోదాటి నారాయణరావు, బొమ్మకంటి సత్యనారాయణరావు, టి. హయగ్రీవాచారి, వల్లూరి బసవ రాజు, ఎం ఎస్. రాజలింగం, కాంచనపల్లి వెంకట రామారావు, పాగా పుల్లారెడ్డి, ఎన్.కె. రావు, కె.వి నరసింగరావు, పింగళి తిరుమలరావు, జలగం వెంగళరావు, డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, వి.హెచ్. దేశాయ్, కొమరగిరి, కాళోజీ, దాశరధి, వి ఎస్ మహాదేవ సింగ్, వి: రామచంద్రరావు

మున్నగు స్వాతంత్ర్య సమరయోధులు, ఎందరెందరో కార్యకర్తలు, స్టేట్ కాంగ్రెస్ సాగించిన సత్యాగ్రహాలలో, వందేమాతరం ఉద్యమంలో, విలీనోద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. విధిలేక బానిసతనానికి అలవాటు పడిన ప్రజానీకాన్ని వీరు ఉత్తేజపరచి, అన్యాయాలను అక్రమాలను ఎదిరించే పోరాట రంగంలోకి దించారు

కొందరు సత్యాగ్రహాలు చేసి జైళ్లకు వెళ్ళితే, మరికొందరు అజ్ఞాత వాసంలో వుండి స్వతంత్ర సమరం కొనసాగించారు కొందరు దేశభక్తులు స్టేట్‌లోనే వుండి ప్రభుత్వాజ్ఞలను ధిక్కరిస్తూ, జాతీయ పతాక ప్రతిష్ఠాపనలు గావిస్తూ అరెస్టులకు గురి అవుతుంటే, మరికొందరు సరిహద్దు ప్రాంతాల్లో శిబిరాలు నెలకొల్పి, ఆత్మరక్షణకు ఆయుధాలు చేపట్టి పోరాట కార్యక్రమాలు కొనసాగించారు. ఈ విధంగా హైదరా

బాదు స్వాతంత్ర్య సమరం బహుముఖంగా నడిచింది. స్వచ్ఛంద సేవకులు నిరుపమాన మైన త్యాగాలు చేయవలసి వచ్చింది.

హైదరాబాదు స్వాతంత్ర్య సమరాన్ని దిగ్విజయంగా సాగించడానికి గాంధీజీ, జవహర్‌లాల్, వల్లభాయ్ పటేల్ డాక్టర్ పట్టాభి, ప్రకాశం వంటి కాంగ్రెస్ అగ్రనాయకుల సలహాలు, జయ ప్రకాశ్ నారాయణ వంటి కాంగ్రెస్ సోషలిస్టు నాయకుల సహాయం లభించడంతోపాటు, పరిసర రాష్ట్రాల దేశాభిమానుల, ప్రజల అండదండలు కూడా తోడ్పడ్డాయి. దేశంలోని ప్రజాస్వామ్యవాదులందరి సహాయ సహకారాలు బాగా లభించాయి.

ఎట్టకేలకు ప్రజా సేవకులు చేసిన అద్వితీయ త్యాగాలతో, 1948 కేంద్రప్రభుత్వ 'పోలీస్‌చర్య'పర్యవసానంగా, సంస్థాన ప్రజాపోరాటాన్ని విజయలక్ష్మి వరించింది. హైదరాబాదు సంస్థాన నిరంకుశ రాజరిక ప్రభుత్వ పరిపాలన అంతరించి, జాతీయ జీవన స్రవంతిలో యిదొక అంత ర్భాగమైంది. తుదకు భాషాప్రయుక్త ప్రాతిపదికను ఆంధ్ర మహారాష్ట్ర కర్నాటక భూభాగాలతో సంలీనమైంది. అశేష ఆంధ్ర ప్రజల చిరకాలవాంఛ ఈడేరింది. యావదాంధ్రులు మరల ఒక్కటైనారు.

హైదరాబాదు ప్రజల విముక్తి ఉద్యమం భారత స్వాతంత్ర్య పోరాట చరిత్రలో చిరస్థాయిగా నిలిచి వుంటుంది. ఆ నాటి మహోద్యమ చరిత్రను మననం చేసుకొందాము ఆ ఉద్యమాలలో పాల్గొన్న, సహాయపడిన అజ్ఞాత వీరులందరికీ అంజలి ఘటిద్దాము! ఆ అమరవీరులకు జోహారులర్పిద్దాము!?

జాతీయ స్వాతంత్ర్యోద్యమాల్లో పాల్గొని, పలుమార్లు కారాగార శిక్షలనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రసిద్ధ పాత్రికేయుడు క్రొవ్విడి లింగరాజు ఇలా వ్రాశారు :

> "స్వాతంత్ర్యోద్యమాలను సమర స్థాయిలో కెక్కించిన ఘనత గాంధీమహాత్మునికే చెల్లింది. లజపతిరాయ్, తిలక్ ప్రభృతులైన మహనీయులు ఎందరో నేలను దున్నారు. హింసకు ప్రతిహింస దేశ విషయంలో నిషేధం కాదనే విప్లవవీరులు తమ రక్తంతో నేలను తడిపారు. ఈ విధంగా ఆయత్త పరచిన భూమిమీద మహాత్మా గాంధీ దేశభక్తి బీజాలు వెదజల్లి, శాంతియుతమైన సహాయ నిరాకరణమనే పంటను పండించారు. ఈ ఉద్యమం ఆంధ్రుల ప్రకృతికి బహుదా సరిపడిన

ఉద్యమం. ఈ ఉద్యమాల్లో ఎందరో ఆంధ్ర యువకులు, స్త్రీలు, పురుషులు స్వార్థత్యాగులై ముందు నిలిచారు.''......

"1921-22 సంవత్సరాంలో ఆంధ్రులు వివిధ ప్రాంతాలల్లో అపారమైన త్యాగాలుచేసి, మహాసేనానియైన గాంధీజీకి ఆప్తులైనారు. స్వాతంత్ర్యసమరంలో భాగంగా గాంధీజీ రూపొందించిన నిర్మాణకార్య క్రమాల నిర్వహణలో నాయకులను మెప్పించారు. 1930-32 సంవత్సరాలలో గాంధీజీ నడిపిన స్వాతంత్ర్య సమరాలలో (ఉప్పు సత్యాగ్రహం వగైరా) ఆంధ్రులు చాల గొప్పగా స్వరాజ్య ఉద్యమంలో పాల్గొంటారని వ్యక్తపరిచిన ఆ ఆశాభావాన్ని అపునవిపించారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలోను, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను, ఆంధ్రులు విశిష్టమైన పాత్రను నిర్వహించి, నాయకత్వ మెప్పును పొందారు. సవినయంగా చెప్పుకోవాలంటే, ఏ రాష్ట్రప్రజలకు, ఎందులోనూ ఓసిపోలేదు ఆంధ్రులు.''

శ్రీ ద్వివేది లింగరాజు వ్యాసం నుండి
ఆంధ్రప్రభ——1975 ఏప్రిల్ 12

ధన్యమైనది వారి చరితము
ధన్యమైనది వారి నామము
ధన్యమగు నీ జీవితంబా
మాన్యచరితుల దలపరా?

మల్లంపల్లి సోమశేఖరశర్మ
(1919లో వ్రాసినగీతం)

# ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం

'మాతృమందిరం'

మాతృదేవి బలిమందిరమందు
యజ్ఞపశువుగ నిల్చినంతటి భాగ్య
మెవరికి సిద్ధించు? ధరిలోన
నా మహాపురుషుని చరితాలు దుస్స్థ
ప్రజల చిరంజీవిత ధన్యంబు సేయు.

—'కవికోకిల' దువ్వూరి రామిరెడ్డి

భారత దేశంలో మన స్వాతంత్ర్య పోరాటం దీర్ఘకాలం సాగింది. సంఘటిత ఉద్యమరూపంలో యిది 19వ శతాబ్దంలో ప్రారంభమైనా, అంతకు పూర్వమే అక్కడక్కడా బ్రిటిష్ పాలనకు ప్రతికూలంగా అనేక చెదురుమదురు పోరాట ప్రయత్నాలు జరిగాయి. స్వాతంత్ర్యోద్యమం బాగా పుంజుకోడానికి ఒక శతాబ్దకాలం పట్టింది.

1757 నుంచి 1857 మధ్యకాలంలో ఆయా ప్రాంత ప్రజలు, రాజులు స్వేచ్ఛకోసం పోరాడుతూ, బ్రిటిష్ ఆధిపత్యాన్ని ప్రతిఘటిస్తూ వచ్చారు. 1799లో చువాన్స్ గావించిన తిరుగుబాట్లు, 1824లో కిట్టూరు రాణి చెన్నమ్మ సాగించిన పోరాటం, 1855లో సంథాలులు చేసిన తిరుగుబాట్లు, పంజాబ్‌లో కూకాస్ గావించిన ప్రతిఘటనలు వహాబీల తిరుగుబాట్లు, స్వదేశ రాజులు సలిపిన పోరాటాలు మొదలగునవన్నీ బ్రిటిష్ పాలకులను మనదేశాన్నుంచి తరిమివేయడానికి జరిగిన ప్రయత్నాలే.

ఈ పోరాటాల తర్వాత, 1857 సంవత్సరంలో జరిగిన 'ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం' పోరాట చరిత్రలో ఒక ముఖ్య మజిలీగా పేర్కొనవచ్చును. నాయకత్వం స్వదేశీ సంస్థానాధీశులదైనా, అది బ్రిటిష్ పాలకులపైన భారత ప్రజానీకంలో పెల్లుబుకుతున్న తీవ్ర అసంతృప్తికి ప్రబల నిదర్శనం.

## ఈస్టిండియా కంపెనీ దుష్పరిపాలన

1757 సంవత్సరం ప్లాసీ యుద్ధం జరిగిన తర్వాత, యావద్భారతదేశం బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వారి హస్తగతమైంది. వంద సంవత్సరాలకు 1857లో, తాము సాగించిన దుష్పరిపాలనకు వారు ఫలితం అనుభవించారు. కంపెనీ పరిపాలకులు,

తాము భారతదేశంలో జరిపిన అత్యాచారాలకు, చేసిన అక్రమాలకు, దుశ్చర్యలకు గురి అయిన జానెడ భారత ప్రజలు స్వేచ్ఛకోసం సాగించిన తిరుగుబాటు జ్వాలలను ఎదుర్కోవలసి వచ్చింది. స్వధర్మ రక్షణకోసం, స్వారాజ్యసాధన కోసం, విదేశీ పాలకులకు వ్యతిరేకంగా 1857లో భారతీయులు సాగించిన 'ప్రథమ స్వాతంత్ర్య సమరం' అది. హిందువులు, మహమ్మదీయులు, రైతులు, చేతివృత్తులవారు, సైనికులు అశేష ప్రజలు ఆ స్వరాజ్య పోరాటాల్లో పాలు పంచుకున్నారు.

ఇంగ్లండ్‌లో 18 వ శతాబ్దంలో పారిశ్రామిక విప్లవం వచ్చిన తర్వాత, తమ పరిశ్రమలకు అవసరమైన ముడిపదార్థాలు, తాము ఉత్పత్తి చేసిన పారిశ్రామిక వస్తువులకు మార్కెట్లు అవసరమై, ఈస్టిండియా కంపెనీ వ్యాపారస్తులు భారతదేశాన్ని కొల్లగొట్టుకొని తిన నారంభించారు. తత్ఫలితంగా, వివిధవర్గాల ప్రజలలో తీవ్ర అసంతృప్తి పెచ్చుపెరిగింది.

మన దేశంనుండి ముడి పదార్థాలను కొల్లగొట్టుకొని పోయి,ఇంగ్లండ్ పరిశ్రమలలో వాటిని వినియోగించుకుంటూ, అచ్చటి మిల్లులలో తయారైన వస్తువులను కంపెనీ వర్తకులు మరల మనదేశానికి దిగుమతి చేసి, విపరీత లాభాలు గడించేవారు.

మన రాష్ట్రంనుండి 1825-26 లో నూలు వస్త్రాలు మొత్తం ఎగుమతులలో 43 శాతం వుండగా, 1850-51 నాటికి అట్టి ఎగుమతులు పదకొండు శాతానికి పడిపోయినవి. మచిలీపట్నం నుండి మన చేనేతవస్త్రాలు, కలంకారీగుడ్డలు పది లక్షల రూపాయల కిమ్మతు గలవి ప్రతి ఏటా పర్షియా, ఇంగ్లండ్ మున్నగు దేశాలకు ఎగుమతులు అయ్యేవి. కాని 1843-44 నాటికి రూ 2750 లు వెలగల నూలు వస్త్రాలు మాత్రమే ఎగుమతి చేయబడేవి. దానితో చేనేతవృత్తి పనివారు నిరుద్యోగులైనారు.

ఇక ప్రధానమైన వ్యవసాయ రంగాన్ని పరిశీలిస్తే, ఉత్తర సర్కార్లలో, యితర ప్రాంతాలలో ప్రవేశపెట్టిన 'పర్మినెంటు సెటిల్మెంట్' పద్ధతి ఫలితంగా కౌలు నిర్ణయం సరిలేక, భూమిదార్ల-రైతుల హక్కులేమో నిర్దుష్టంగా పేర్కొనకపోవడం వల్ల, లోపభూయిష్టమైన పరిపాలనా విధానం వల్ల, రైతాంగ పరిస్థితి బాగా దెబ్బతిని పోయింది. పేదరికం హెచ్చింది. తరచు దుర్భిక్షం, కరువుకాటకాలు సంభవించినవి. మైనర్ ఇరిగేషన్; చెరువు మరమ్మత్తు పనులను కంపెనీ పాలకులు నిర్లక్ష్యం చేసి నందువల్ల వ్యవసాయ ఉత్పత్తులు బాగా పడిపోయినవి.

రైతులు తమ వద్దనే గత్యంతరంలేక కూలిపనులు చేసేందుకు వారిపై విప రీతంగా పన్నులు విధించారు. నీలిమందుకు తోటలలో కూలిలు రాకపోతే, వారిపైన తల పన్ను వేశారు దొరలు. 1825-54 సంవత్సరాల మధ్యకాలంలో, భారత దేశంలో వ్యవసాయోత్పత్తుల ధరలు విపరీతంగా పడిపోయి, వ్యాపారమాంద్యం ఏర్పడింది. రైతుల మీద అధికపన్నుల భారం పడింది.

కంపెనీ పరిపాలకులు స్వదేశీసంస్థానాధీశులకు దత్తతాధికారం లేకుండాచేశారు. ఈ పద్ధతిని చిన్న జమిందారుల పట్ల కూడా అనుసరించారు. రాజ్య విస్తరణకాంక్షతో, దక్షిణాసీ అనేక స్వదేశీ సంస్థానాలను కబళించారు. సైన్య సహకార పద్ధతి క్రింద, స్వదేశీ రాజులపైన ఫలించజాలని ఖర్చులను మోపారు.

కంపెనీ ఉద్యోగస్తులైన దొరలు, ప్రజా జీవితంలో తరచు జోక్యం కలుగజేసు కుంటూ, ప్రజలను అనేక యిబ్బందులకు గురిచేశారు. కంపెనీ పరిపాలనకు పూర్వం, మనపై అనేక దండయాత్రలు జరిగినా, గ్రామాల్లోని పంచాయతీరాజ్య వ్యవస్థమాత్రం చెదరలేదు. బ్రిటిష్ పాలకులు మన గ్రామ పంచాయతీ వ్యవస్థను నాశనం చేశారు. ప్రజలకు విద్యాబుద్ధులు గరిపినట్లయితే, వారు వివేకవంతులవుతారని, విద్యాభివృద్ధి విషయంలో ఆంగ్లేయులు నిర్లక్ష్యం వహించారు. బానిసలను తయారుచేసే విద్యా విధానాన్ని తర్వాత ప్రవేశపెట్టారు పౌరులకు వాక్స్వాతంత్ర్య పత్రికా స్వాతంత్ర్యాలు లేకుండా అణచివుంచారు అంతేగాదు- భారతీయుల మత సంబంధ విషయాలలో కూడా జోక్యం కలుగచేసుకుంటూ, క్రైస్తవులుగా మార్చడానికి ప్రయత్నించారు. తెల్లవారికి ఒకన్యాయం, భారతీయులకు మరొకన్యాయం అన్నట్లు న్యాయపరిపాలన విషయంలో ఉభయుల మధ్య విపరీత వ్యత్యాసం, అసమానతలు చూపసాగారు. కంపెనీ పాలనలో భారతదేశం ఆర్థికంగా, నైతికంగా, మత విషయకంగా అధ్వాన్న పరిస్థితికి దిగజారింది.

ఇవి యిట్లుండగా, భారతీయ సైనికులపట్ల ఆంగ్లేయాధికార్లు చూపిన నిరాదరణ, అపనమ్మకం, అవమానపు వెప్పతరంకాదు. ఆంగ్లేయ సైనికులకు భారత సైనికులకుమధ్య జీతభత్యాల విషయంలో ఎంతోతేడాలు వుండేవి. మత విరుద్ధపనులు చేయండని, కొవ్వుపూసిన తూటాలను నోటితోకొరికి ఉపయోగించండని శాసించడంతో, సిపాయిలకు కడుపు రగిలింది. వారి క్రోధాగ్ని మిన్నుముట్టింది.

సంస్థానాల పట్ల ఆంగ్లేయ పరిపాలకులు అనుసరించిన దురాక్రమణ, చేసిన అన్యాయాల వల్ల నానాసాహెబ్, ఝాన్సీలక్ష్మీబాయి, అయోధ్యబేగం మొదలగు స్వదేశీ రాజులు, రాణులు కోపోద్రిక్తులైనారు. దేశంలో అంతకుపూర్వం నుండే విప్లవ జ్వాలలు రాజుకుంటున్నాయి. వీటన్నిటి పర్యవసానమే, 1857 ప్రథమ స్వాతంత్ర్య యుద్ధానికి దారితీసింది.

పైస్థాయి సంస్థానాధీశులకు దత్తతాధికారం లేకుండాచేసి, వారి రాజ్యాలను కాజేయడంతో కంపెనీ పాలనకు వారు ఎదురు తిరిగారు. తెల్ల నల్ల సైనికులమధ్య విచక్షణను పాటించడంతో భారతీయ సైనికులలో తిరుగుబాటు ధోరణి ప్రబలింది. ప్రజల్లో బీదరికం పెరగడంతో, వారు సిపాయీల తిరుగుబాటుకు ఎంతో సహాయం చేశారు. ఆంగ్లేయుల పారిపాలన పట్ల పరమ అసహ్యం జనించడమే, పెద్ద పెట్టున చెలరేగిన ఆ పోరాటానికి ప్రధాన కారణం. ఆ స్వాతంత్ర్య యుద్ధానికి క్రొవ్వుతోటాల సమస్య ఒక చిహ్నం మాత్రమే. 'దేశంలో రెండు లక్షల భారతీయ సిపాయీలు వున్నారు. 40 వేలమంది తెల్ల సైనికులు మాత్రం పెత్తనం సాగిస్తున్నారు. ఒక్కుమ్మడిగ తిరుగుబాటు చేసినట్లయితే, దేశం మనదౌతుందని' భావించారు.

దేశ స్వాతంత్ర్యానికి స్వధర్మ రక్షణకు భారతీయులు రెండు సంవత్సరాలు బ్రిటిష్‌వాళ్ళతో సంకుల సమరంసాగించారు. హిందూ ముస్లిములనే విభేదాన్ని పాటించ లేదు. యుద్ధరంగంలో కలసి మెలసి పోరాడారు. స్వేచ్ఛ కోసం జరిగిన ఆ పోరాటంలో రెండు లక్షల మంది భారతీయులు తమ ప్రాణాలను అర్పించారు.

ఈ స్వాతంత్ర్య యుద్ధంలో ప్రముఖపాత్ర వహించింది నానాసాహెబ్, తాతియా తోపే, అజముల్లాఖాన్, బీగమ్‌బౌథ్, మహమ్మద్‌షా, కుమార్‌సింగ్, ఝాన్సీరాణి, ప్రభృతులు. తాతియాతోపే గొప్ప సైనిక వ్యూహ దురంధరుడు, ఝాన్సీరాణి శౌర్య పరాక్రమాలు నిరుపమానమైనవి. ఆంగ్ల సైన్యంతో తలపడి, వారిని ముప్పతిప్పలు పెట్టారు. కడకు యుద్ధరంగంలో వీరస్వర్గమలంకరించారు.

మీరట్‌లో 1857 మే 10వ తేదీన, సైనిక తిరుగుబాటు ప్రారంభమైంది. సమీపంలోగల జవుషడ్‌నాథ్ శివమందిరంలో ఒకపూజారి దేవదర్శనానికివచ్చే భారత సైనికులలో దేశభక్తిని రగుల్కొల్పేవాడు. కుంభినీ వాళ్ళు మన మతాన్ని, సంస్కృతిని నాశనంచేయ దలపడ్డారని ఆయన ఉద్బోధించాడు. ఆంగ్లేయులకువేల పన్నాగాలను సన్యాసులు, సాధువులు విమర్శించేవారు. 3వ అశ్వికదళం కొవ్వుతోటాలను ఉపయో

గించబోమని ఎదురు తిరిగారు. విద్రోహులంటూ తెల్లసైనికులు వారిని బంధించారు. భారత సిపాయిలు ఆ జైలుపైన దాడిచేసి తోటిసిపాయిలను విడిపించుకొన్నారు. మీరట్ బ్రిటిష్ ఆఫీసర్లను హతమార్చారు. తరువాత పటాలం డిల్లీవైపు సాగింది. డిల్లీపైతిరుగు బాటు చేసి, డిల్లీ కోటను వశపరుచుకున్నారు. పంజాబ్, నర్మదా, బీహర్, అయోధ్య, రోహిల్‌ఖండ్, బుందేల్‌ఖండ్, రాజపుటానా మున్నగు ప్రాంతాలకు ఈ విప్లవ జ్వాల వ్యాపించింది. పాట్నా, ఆగ్రా, మీరట్, కాన్పూర్ మొ॥ దళాల సిపాయిలు తిరుగు బాటు చేశారు. ఢిల్లీలో వృద్ధుడైన బహదూర్‌షాను భారతదేశ చక్రవర్తిగా ప్రకటించు కున్నారు. బహదూర్‌షా గావించిన ఈ క్రింది స్వరాజ్య ప్రకటన గమనార్హమైనది:

> "ఓ భారతమాత పుత్రులారా! మనం కృతనిశ్చయులమై పోరాడితే, శత్రువులను దునుమాడడానికి ఎంతోకాలం పట్టదు. ఇంగ్లీష్ వాళ్ళు మనపై ఎన్నో దురాగతాలు చేశారు. మనం పవిత్రంగా భావించే మతాన్ని, నాశనం చేయ తలపెట్టారు. ఈ పరిస్థితిలో మీరు స్తబ్దతగా ఉండగలరా? అలా స్తబ్దతగా ఉండడానికి భగవంతుడు అనుమతించడు. మనలోని చిన్నా పెద్ద తేడాలను, భేదాలను విస్మరించాలి. సమానత్వాన్ని పాటించాలి. మానవత రక్షణకై కత్తి దూసేవారంతా గొప్ప వారే ఈ కర్తవ్య నిర్వహణకు భగవన్నిర్ణయమైన యుద్ధరంగంలోకి దుమికి పోరాడండి."

## తాంతియాతోపే :

తాంతియాతోపే పేరు రామచంద్ర పాండురంగ్. మహారాష్ట్రంలోని 'గోలా' గ్రామంలో 1814లో జన్మించారు. రెండవ పీష్వాబాజీరావు వద్ద ఆయన తండ్రి ముఖ్య ఉద్యోగిగా వుండేవారు. పీష్వాతో పాటు తన కుటుంబాన్ని కూడా 'చిత్తూరు'కు తరలించాడు. పీష్వాదత్త కుమారుడైన నానాసాహెబ్‌కు సన్నిహిత మిత్రుడైనాడు. 1851 లో లార్డ్‌డల్హౌసీ నానాసాహెబ్ తండ్రికి యిచ్చే పెన్షన్‌ను నిలిపివేశాడు. నానా సాహెబ్, తాంతియాతోపె బ్రిటిష్ వాళ్ళకు బద్ధవిరోధులైనారు. సమయం కోసం వేచి వున్నారు.

తాంతియాతోపే, కాన్పూరులోని భారతీయ సిపాయిలను తనవైపు తిప్పుకున్నాడు. ఈ విప్లవ దళాలకు నానాసాహెబ్‌ను రాజుగా ప్రకటించారు. తాంతియాతోపే సైనిక కమాండర్ అయినాడు. తీవ్రయుద్ధం తరువాత, బ్రిటిష్ దళాలు కాన్పూర్ కేంద్రాన్ని

'కల్పి' కి మార్చి, రాణి లక్ష్మీబాయి సైన్యాలతో కలిసి, బుందేల్ఖండ్ ప్రాంతంలో తిరుగుబాటు కొనసాగించాడు. అక్కడ నానాసాహెబ్‌ను పీష్వాగా ప్రకటించాడు. గ్వాలియర్ బ్రిటిష్ సేనల వశమైనతర్వాత, తాతియాతోపే కొలదిమంది సైనికులతో సాగర్, నర్మదా, ఖాండేష్ రాజస్థాన్ ప్రాంతాలలో సంవత్సర కాలం గెరిల్లా పోరాటం సాగించాడు. పెరున్ అడవిలో ఉండగా, మాన్‌సింగ్ విద్రోహం మూలంగా, బ్రిటిష్‌వాళ్ళకు పట్టుబడి, 1859 ఏప్రిల్ 19 వ తేదీన, సిప్రివద్ద ఉరితీయబడ్డాడు.

## బేగం హజరత్ మహల్:

లక్నో నవాబ్ వజీద్ అలీషా భార్య బేగం హజరత్ మహల్. ఈమెను 'బేగమ్ జాథ్' అని పిలుస్తుండేవారు బేగం మంచి సౌందర్యవతియేగాక, గొప్పనిర్మాణకౌశలం, ధైర్యసాహసాలు గల వీరవనిత. భర్తను కలకత్తాలో నిర్బంధించగానే, సర్ఫదుల్లా, మహారాజ బాలకృష్ణ, రాజాజయలాల్, మామాన్ ఖాన్ మున్నగువారి మద్దతుతో ఈమె బ్రిటిష్ వ్యతిరేక పోరాటం సాగించింది. మరల లక్నోను వశపరుచుకొని, తన కుమారుడైన బిర్జిస్ ఖాదర్‌ను అవుధ్ రాజుగా ప్రకటించింది. బ్రిటిష్‌సైనికులతో తీవ్ర పోరాటం తర్వాత, లక్నోనుంచి తప్పించుకొని పోయింది. ఫైజాబాద్ మౌల్వీ సైన్యాలతో చేరి, షహజాన్‌పూర్ దాడిలో పాల్గొంది. బ్రిటిష్‌వారి రాజీ రాయబారాలను తిరస్కరించి నేపాల్ వెళ్ళి తలదాచుకొంది.

## నానాసాహెబ్ :

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలోని విప్లవ నాయకుల్లో ఒకరైన నానాసాహెబ్ 1824లో జన్మించాడు. చివరి పీష్వాబాజీరావు నానాసాహెబ్‌ను పెంచుకొని తనరాజ్యానికి వారసుణ్ణిచేశాడు. నానాసాహెబ్ మంచివిద్యావేత్త, ఆయన సంస్కృతం అభ్యసించాడు. మత ధార్మిక దృష్టిగలవాడు. 1851లో పీష్వాబాజీరావు చనిపోగానే ఈస్టిండియా కంపెనీవారు యిచ్చే పెన్షన్‌ను రద్దుచేశారు. సిపాయిల తిరుగుబాటు ప్రారంభం కాగానే, ఈయన కాన్పూర్ సైనికులకు నాయకత్వం వహించి, కాన్పూర్‌ను వశపరచుకొని, తనను పీష్వాగా ప్రకటించుకున్నాడు. బ్రిటిష్ రాజ్యాధిపత్యాన్ని పూర్తిగా అంతం చేయండని ఆయన సిపాయిలను ఆదేశించాడు. జనరల్ హావలక్ ఎక్కువ మంది బ్రిటిష్ సైనికులతోవచ్చి, తిరిగి కాన్పూర్‌ను ఆక్రమించాడు. 1857 జూలై 16 వ తేదీన అక్కడ జరిగిన యుద్ధంలో సిపాయీలు దెబ్బ తినిపోగా, నానాసాహేబ్ నేపాల్ అడవులకు వెళ్ళి అక్కడే స్వర్గస్తుడైనాడు.

## ఝాన్సీ లక్ష్మిబాయి :

రెండవ పీష్వాబాజీరావు ఆంగ్లేయుల నుండి భరణం తీసుకునేందుకు సమ్మతించి, బ్రహ్మావర్తానికి వెళ్లాడు. ఆయన ఆశ్రితుడైన మోరోపంతు తాంబే, సతీమణిభాగీరధీబాయి కూడా వారివెంట వెళ్లారు. వీరికి మనూబాయి అనుకుమార్తె కలిగింది. బాజీరావు దత్తపుత్రుడైన నానాసాహెబ్‌తో పాటు ఈమనూబాయికూడా అస్త్రశస్త్ర విద్య, గుర్రపుస్వారీ చిన్ననాటనే నేర్చుకుంది. ఝాన్సీరాజైన గంగధరరావును వివాహ మాడింది. అత్తగారింట ఈమెను 'లక్ష్మిబాయి' అంటూ పిలిచేవారు. దామోదరరావు అనే పిల్లవానిని దత్తత చేసుకొని, గంగాధరరావు స్వర్గస్తుడైనాడు. ఆ దత్తును డల్హౌసీ ప్రభువు అంగీకరింపక, పీష్వాకు యిస్తున్న భరణాన్నికూడా రద్దుచేసినాడు. ఝాన్సీరాణిని కోటనుండి వెడలగొట్టాడు. ఇంతలో సైనిక తిరుగుబాటువార్త ఝాన్సీరాణి చెవినపడింది. 1857 జూన్ 4వ తేదీన రాణి సైన్యాన్ని ప్రోగుచేసి, అప్పటికే కుంఫినీవారి కిందనున్న ఝాన్సీ కోటను ముట్టడించి, రాజ్యాధికారాన్ని చేబట్టింది. కాని, ఆంగ్లేయ మూకలు ఘోరయుద్ధంచేసి, ఝాన్సీకోటను తిరిగి వశపరుచుకోగానే, ఝాన్సీరాణి పురుషవేషంధరించి, దత్తకుమారుని వీపునకట్టుకొని, ఆ కోటనుండి రహస్యంగా తప్పుకొని, బయటపడింది. శత్రుమూకలను దునుమాడటంలో ఝాన్సీరాణి అప్రతిమాన ధైర్యసాహసాలు ప్రదర్శించింది. ఆమె కొలదిమంది సైనికబలంతోనే పోరాడి గ్వాలియర్‌ను వశపరుచుకొంది. పీష్వానానాసాహెబ్‌కు పట్టం గట్టింది. సర్‌హ్యూ సేనాని ఎక్కువ సైన్యంతో వచ్చిపడి, గ్వాలియర్‌ను మరల వశపరుచుకొగల్గాడు. ఝాన్సీలక్ష్మిబాయి అశ్వారూఢియై, బ్రిటిష్ సైనికులతో పోరాడుతూ, ఒక కొండ వాగువద్ద తెల్ల సైనికుల కాల్పులకు గురిఅయింది. రక్తసిక్తమైన ఝాన్సీరాణి, శత్రుమూకల చేతిలో పడకుండా, సమీపంలోని కుటీరంలో వీర మరణం చెందింది. సహచరులు ఆమె భౌతిక కాయానికి దహన సంస్కారాలు యధావిధి జరిపారు.

ఈ విధంగా పలువురు వీరులు ఆ యుద్ధ కాలంలో నేల కొరిగారు. రాణాపట్టికి టాగోరైన గులాబ్‌సింహుడు, మకీమ్‌పూర్ వద్ద ఒక కోటగట్టాడు. కోట చుట్టూ కందకాలు త్రవ్వి అగడ్తలు నిర్మించాడు. పరిసరాల్లోని రాజపుత్రులను చేరదీసి, తెల్లవారిపై తిరుగుబాటుకు ప్రోత్సహించాడు. అక్కడికి సమీపంలో పొలాల్లో వున్న రైతులపైన ఆంగ్లేయులు అనేక అత్యాచారాలు సాగించారు. ఇరువురిని తుపాకీ గుండ్లకు ఎరచేశారు ఈ వార్తదావానలంగావ్యాపించింది. వేలాదిజనం విరుచుక పడ్డారు చేజిక్కిన ఐదుగురు తెల్లసైనికులను మట్టుపెట్టారు. పరారైన సైనికులు అధికసంఖ్యలో తిరిగివచ్చి

వీరి ఇండ్లను దగ్ధంచేశారు. ప్రజలను బందీలుగా పట్టుకున్నారు. చెట్లకు వ్రేలాడదీసి, ఉరితీశారు. భారతసిపాయీలకు సహాయపడిన వారిని. నానాహింసలు పెట్టిచంపించారు. జగదీశ్‌పురం సంస్థానాధీశుడైన కుమారు సింహుడు, కంపెనీవారు తన సంస్థానాన్ని వశపరుచుకోవడంతో, ఆయన కోపోద్రిక్తుడైనారు. తన సాయుధ సైన్యాలతో ఆరాలో వున్న ఇంగ్లిష్ వారి ఖజానాపైన దాడిచేసి, ఖజానాను వశపరుచుకున్నారు. ఆంగ్ల సైనికులతో యుద్ధంచేసి, అజాంఘడ్‌ను ఆక్రమించుకున్నాడు. అననుకూల పరిస్థితిలో కుమారసింహుడు, శివపురి ఘాట్‌లో గంగానదిని దాటుతుండగా ఆకస్మికంగా ఆంగ్లేయ సైనికులు వచ్చికాల్పులు చేశారు. కుమారసింహుని మణికట్టుకు తుపాకీ గుండుదెబ్బ తగిలింది. దానినంత వరకు కత్తితో నరికివేసి, ఆయన నదిని దాటి పోయినాడు. తీవ్ర గాయంవల్ల ఆ వీరుడు తర్వాత అమరత్వంచెందాడు.

ఈ విధంగా ఎందరెందరో ఆ మహా సంగ్రామంలో అసువులర్పించి భారత మాత పాదాలకు రక్తతర్పణం చేశారు.

కొందరు స్వదేశీ సంస్థానాధీశులు ఆంగ్లేయ ప్రభువులకు విధేయులుగా వుండటం వల్ల, దేశమంతటా తిరుగుబాట్లు ఒకేసారి ప్రారంభించక పోవడంవల్ల, ఆధునిక సైనిక బలం, మర తుపాకులుగల బ్రిటిష్ సైనికులు సిపాయీలతిరుగుబాటు అని చెప్పుకో బడుతున్న భారత స్వాతంత్ర్య యుద్ధాన్ని రెండేండ్లలో అణచివేయగలిగారు.

ఈ పోరాటాలు వింధ్యకు దక్షిణానకూడా వ్యాపించినట్లయితే, యుద్ధ పరిస్థితి మరోక విధంగా వుండేది. ఇంగ్లిష్ విద్యాలయాలలో చదువుకొన్న మేధావివర్గం ఈ స్వాతంత్ర్య పోరాట విషయంలో పట్టీపట్టనట్లుగా వ్యవహరించారు.

మంగళపాండే, నానా సాహెబ్, తాతియాతోపే, ఝాన్సీలక్ష్మీబాయ్, మున్నగు వీరులెందరో ఈ భారత మహా సంగ్రామంలో తమ అసువులర్పించారు. బీహార్‌కు చెందిన కన్వార్‌సింగ్, బఖల్‌ఖాన్, బెరెల్లికి చెందిన ఖాన్‌బహదూర్‌ఖాన్, ఫైజాబాదుకు చెందిన మౌల్వీ అహమదుల్లా 1859 సంవత్సరానికల్లా ఈ ధర్మయుద్ధంలో స్వర్గస్థులైనారు. బేగంబౌఫ్‌నేపాలుకు తప్పించుకొనిపోయింది. 1859 సంవత్సరాంతానికల్లా సిపాయీల తిరుగుబాట్లను బ్రిటిష్ దొరలు అతి క్రూరంగా అణచివేసి, మరికొంత కాలం నిలద్రొక్కుకోగలిగారు. బ్రిటిష్ కంపెనీ పరిపాలనకు వ్యతిరేకంగా జరిగిన ఈ ప్రథమ

స్వాతంత్ర్య యుద్ధం, ఆ యుద్ధంలో నేలకొరిగిన యోధాగ్రేసరులు ఆధునిక భారత చరిత్రలో స్మరణీయులైనారు.

ఢిల్లీ పాదుషా బహదూర్‌షాను బర్మాలో నిర్బంధించి, ఆయన కుమారులను నిర్దాక్షిణ్యంగా కాల్చిచంపివేశారు. వేలాది ప్రజలను తెల్లసైనికులు తమ తుపాకీ గుండ్లకు ఎరజేశారు. విప్లవకేంద్రాలుగా వున్న గ్రామాలను ధ్వంసంచేసి కసి తీర్చుకున్నారు. అప్పట్లో ఆంగ్లేయ సైనికులు సాగించిన దుర్మార్గాలు ఇంగ్లాండు ప్రజలను కూడా ఆశ్చర్యచకితులను చేశాయి. ఇక ఈస్టిండియాకంపెనీ పాలన సాగించ రాదని బ్రిటిష్ ప్రభుత్వమే నేరుగా అధికారాన్ని చేపట్టింది. బ్రిటిష్ ప్రభుత్వం తరపున విక్టోరియా రాణి భారతదేశ రాజ్యాధికారాన్ని స్వీకరిస్తున్నట్లు ప్రకటించింది.

ఆ సమయంలో, హైదరాబాదు సంస్థానంలో జరిగిన తిరుగుబాటు ప్రయత్నాలను తెలుసుకుందాం.

## హైదరాబాదులో తిరుగుబాట్లు :

1857-59 సంవత్సరాలలో ఉత్తర భారతంలో జరిగిన సిపాయీల తిరుగుబాటు ప్రభావం, దక్షిణాదిన ఆంధ్ర ప్రాంతాలలో, హైదరాబాదు సంస్థానంలో కొంత లేక పోలేదు. 'వహబీలు' కొందరు హైదరాబాదు వచ్చి బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగా 'జీహద్' (ధర్మయుద్ధం) చేయాలని రహస్య ప్రచారం సాగించారు. వారు నిజాం సోదరుడైన ముబారస్ ఉద్దౌలాను, నజీర్ ఉద్దౌలాను యిందుకు ప్రోత్సహించారు. ఈ విధమైన రహస్య ప్రచారం సాగుతున్నదనే అనుమానంతో, ముబారస్‌ను అరెస్టు చేసి, అతను చనిపోయే వరకు గోల్కొండ కోటలో నిర్బంధించారు.

హైదరాబాదు మక్కా మసీదులో అల్లా ఉద్దీన్‌మౌల్వీ ప్రసంగిస్తూ, 'ఇస్లాముకు బ్రిటిష్ వారు బద్ధ శత్రువులనీ, వారిని మనదేశం నుండి తరిమివేయాలని ఉద్బోధించాడు. మసీదులలో (జీహద్) పవిత్ర యుద్ధం సాగించండని ఉద్రేక పూరిత ఉపన్యాసాలు జరిగాయి.

1857 జూన్ 23వ తేదీన ఔరంగాబాదులో 90 మంది భారతీయ సిపాయీలను అరెస్టుచేసి, వారి వద్ద నుండి బ్రిటిష్ వారు ఆయుధాలను లాక్కొన్నారు. డఫేదార్‌గా వున్న మీర్‌ఫిదాలీ అనునతను, కెప్టెన్ అబ్బాట్‌ను కాల్చిచేయడానికి ప్రయత్నించాడు. ఆ అశ్విక సిపాయి దళాన్ని రద్దు చేయడం జరిగింది. మీర్‌ఫిదాలీని పట్టుకొని ఉరితీశారు.

## రెసిడెన్సీమీద దాడికి ప్రయత్నం :

1857 జూలై 17వ తేదీన తురవజ్ ఖాన్ అను ఒక రోహిల్లా జమేదార్ ఐదు వేలమంది సైనికులతో హైదరాబాదులోని బ్రిటిష్ రెసిడెన్సీపైన దాడి చేయడానికి బయలు దేరాడు. ఈ వార్తను ముందుగా పసిగట్టి, కల్నల్ డేవిడ్సన్, తెల్ల సైనికులు రెసిడెన్సీ రక్షణకు తగు జాగ్రత్తలు తీసుకున్నారు. తురవజ్ ఖాన్‌ను బ్రిటిష్ సైనికులు పట్టుకొని, కాల్చి చంపివేశారు. అతని మృతకళేబరాన్ని హైదరాబాదు నగరంలో వ్రేలాడగట్టారు సిపాయి తిరుగుబాటుకు సహాయపడ జూచిన మౌల్వి అల్లా ఉద్దీన్‌కు యావజ్జీవ శిక్ష విధించి, అండమాన్ దీవులకు పంపారు. 1884లో అల్లా ఉద్దీన్ అండమాను దీవుల్లోనే చనిపోయాడు.

బ్రిటిష్ రెసిడెన్సీ పైన జరిగిన దాడికి సన్నాహం, షోలాపూర్ సంస్థానాధీశుని తిరుగుబాటు, మల్ఖేడ్, కొప్పల్ జమీందార్ల పోరాటం, భిల్లులు, గోండుల తిరుగుబాట్లు, నానాసాహెబ్ ప్రతినిధినంటూ రంగారావు రాక, రావుసాహెబ్‌పీష్వా హైదరాబాదు ఆగమనం, మున్నగు సంఘటనలన్నీ ఆనాటి సిపాయీల యుద్ధంలో భాగాలుగా భావించబడుతున్నవి.

నిజాం సంస్థానాధీశుడు, అప్పట్లో ఈ తిరుగుబాటులో చేరినట్లయితే, దక్షిణ భారతం, బొంబాయి ప్రాంతం కూడా కంపెనీ పాలనకు ఎదురు తిరుగుతుందేమోనని ఆంగ్లేయులు భయపడసాగారు. ఆ విధంగా బ్రిటిష్ వాళ్ళపైన తిరుగుబాటు చేయండని, కొందరు నిజాం నవాబుకు సలహాలు యిచ్చారు కూడా. కాని ఆయన మంత్రి సాలార్ జంగ్ సలహాను పాటించి, ఆ యుద్ధ సమయంలో బ్రిటిష్ వారి పట్లనే నిజాం నవాబు తన విధేయతను చాటుకున్నాడు. భారత సిపాయీల తిరుగుబాటుకు తీరని ద్రోహం చేశాడు.

నిజాం నవాబు చూపిన విధేయతకుగాను, 1860 లో బ్రిటిష్ వారు ఒక ఒడంబడిక చేసుకొంటూ, ఆయనకు బహూకరించారు. తిరుగుబాటు చేసిన షోలాపూర్ రాజును తొలగించి, ఆ ప్రాంతాన్ని నిజాం ప్రభువుకు ధారాదత్తం చేశారు. నిజాం సంస్థానం తమకు యివ్వ తేలిన 50 లక్షల రూపాయల ఋణాన్ని కూడా ఆంగ్లేయ ప్రభువులు రద్దుచేశారు. 1819లోనే నిజాం నవాబుకు 'బ్రిటిష్ పాలకులకు విశ్వాస పాత్రుడైన అనుచరుడు' అను బిరుదునివ్వడం జరిగింది.

## ఆంధ్రలో సిపాయి విప్లవ ప్రభావం :

1857 సిపాయి యుద్ధప్రభావం వల్ల ఆంధ్ర ప్రాంతంలోని కడప, విశాఖ పట్నం, మచిలీపట్నం మున్నగు కేంద్రాలలో కూడా కొన్ని సంఘటనలు జరిగినవి.

కడప సమీపాన షేక్‌పీర్‌సాహెబ్, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ధర్మయుద్ధం చేయాలని ప్రచారంగావించారు. 1857 ఆగస్టు 28వ తేదీన, మొగలు సామ్రాజ్య చక్రవర్తి విజయం కోరుతూ, మహమ్మదీయులు మసీదులలో ప్రార్థనలు చేశారు. పీర్ షాను, అతని అనుచరులను పట్టుకొని పదేండ్ల చొప్పున శిక్షలు విధించడం జరిగింది.

గంజాం జిల్లాలోగల పర్లాకిమిడి ప్రాంత సవరులు తిరుగుబాటు లేవదీశారు. ఈ ఆదివాసీల నాయకుడైన దండసేనుడుని పట్టుకొని, తరువాత ఉరితీయడం జరిగింది.

గోదావరి జిల్లాలోని గిరిజనులు ఈ విధంగానే మరో తిరుగుబాటుచేశారు. కొరం టూరు గ్రామోద్యోగి కోరుకొండ సుబ్బారెడ్డి తిరుగుబాటు దార్లకు నాయకత్వం వహిం చారు. నానాసాహెబ్ సైన్యంతో దక్షిణాదికి రానున్నాడని, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడేవారికి ఆయన బహుమతులు యిస్తాడని' సుబ్బారెడ్డి ప్రచారంచేశారు. ఈసంగతి అధికార్లకు తెలిసింది. తెల్లదొరలు సుబ్బారెడ్డిని పట్టుకొని కాల్చిచంపారు. ఆ ప్రాంత గిరిజనులను అనేక విధాల బాధించి, వారిపై ప్రతీకారం తీర్చుకొన్నారు.

## పాళెగార్ల తిరుగుబాట్లు :

చిత్తూరు జిల్లాలోని పాళెగార్లు కల్లూరు ప్రాంతాన్ని పరిపాలిస్తున్న బంగారు పాళ్యెం జమీందారు కుమారుని నాయకత్వం క్రింద తిరుగుబాటు చేశారు. నాలుగు దిక్కుల వున్న కొండకనుమలను కాపాడుకుంటూ, పాళెగార్లు బ్రిటిష్ వారిని ఎదిరించి పోరాటం సల్పారు. గుడిపాటి జమీందారు మోసంవల్ల పాళెగార్లు సాగించిన పోరాటం కొంత దెబ్బతిన్నది. అయినప్పటికీ కల్లూరు, పులిచెర్ల పుల్లూరు, మొగరాల పాకాల జమీందార్లు ఆంగ్లేయులను బాగా ప్రతిఘటించారు. కాని తరువాత ఓడిపోయినారు. మొగ రాల జమీందారు యుద్ధంలో మరణించారు. బంగారు పాళ్యెం జమీందారుని పట్టుకొని ఉరితీశారు. ఎట్టకేలకు ఆంగ్లేయులు అక్కడి పాళెగార్ల ప్రతిఘటనను అణచి వేయ గలిగారు.

## నరసింహారెడ్డి వీరోచిత పోరాటం :

బ్రిటిష్ వాళ్ళ ఆధిపత్యానికి వ్యతిరేకంగా 1846 సంవత్సరంలో కర్నూలు ప్రాతంలోని పాళెగారు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి గావించిన తిరుగుబాటు హెచ్చు

రాజకీయ ప్రాధాన్యత గలది. అప్పట్లో పాళెగార్ల సాయుధ పోరాటాన్ని ఎదుర్కొనడం ఆంగ్లేయులకు జటిల సమస్యగా పరిణమించింది.

నరసింహారెడ్డిని పాళెగారుపదవి నుంచి తొలగించగానే పౌరుషవంతుడైన ఆయన, తన అనుచరులతో కలిసి 18 మాసాల పర్యంతం ప్రభుత్వాధికార్లను ముప్పు తిప్పలు పెట్టి, మూడు చెరువుల నీరు త్రాగించాడు. ఆ ప్రాంతంలోగల కొండలు, అడవులు, చెలుములు పాళెగార్లకు మంచి రక్షణనిచ్చాయి. నరసింహారెడ్డి అనుచరులు 400 మందినుంచి 5 వేల మందివరకు వుండవచ్చునని వివిధ అంచనాలు వేయడం జరిగింది. పోలీస్ దళాలకు వ్యతిరేకంగా వారు తీవ్రంగా పోరాడారు. కోవెలకుంట్ల ప్రభుత్వ ఖజానానువారు దోచుకున్నారు. ప్రభుత్వం తన సైనిక దళాలను కేంద్రీకరించి చివరకు ఉయ్యాలవాడ నరసింహారెడ్డిని పట్టుకొని ఉరితీయడం జరిగింది. నరసింహారెడ్డి ధైర్య సాహసాలను ప్రశంసిస్తూ అనేక జానపదగేయాలు వెలువడ్డాయి.

ప్రథమ స్వాతంత్ర్య యుద్ధ కాలంలో కడప సబ్‌కలెక్టర్‌గా మాగ్డొనాల్డువుండే వారు. ఒక పందికొక్కును చంపడంపై జనంలో ఉద్రిక్తత ఏర్పడింది. ప్రాణభయం ఏర్పడిందని క్రిష్టియన్ మిషనరీల నుంచి దరఖాస్తులను తీసునేందుకు వెళ్ళిన సబ్ కలెక్టర్‌ను జనం చుట్టుముట్టి చంపివేశారు. ఆ ఉదంతం జరిగిన 21రోజుల తర్వాతఅతని భార్యకూడా గుండెపోటుతో మరణించింది. జిల్లా కలెక్టర్, మిలటరీతోవచ్చిపడి ప్రజల ప్రతిఘటనను క్రూరంగా అణచి వేశారు.

మదరాసు జిల్లా గెజిటీర్స్‌లో ఈ ఉదంతం యిలా వ్రాయబడివుంది:

"No event of any political significance has since Occured within its limits if we exclude The rising of Narasimha Reddy, a descedant of a dispossed Poligar in 1846, The story of which Would more properly find a place in the history of Karnool district, on the frontiers of which his former Jagir lay.

After 2, 3 months lawless maroding with a band of followers numbering according to various estimates from 400, to 5,000, he was captured and hanged at Koilkunta in the district."

—Madras District Gazetteers by

C. F. Brakenbury - Page 51

తదుపరి, పాళెగార్లు బ్రిటిష్ ప్రభుత్వ దాసులుగానే వ్యవహరించారు.

ఈ విధంగా 1857 సిపాయిల తిరుగుబాటు చెదురుమదురుగానైనా ఆంధ్ర ప్రాంతంలోను, హైదరాబాదు సంస్థానంలోను కొంత సంచలనం కలిగించిందనడానికి సందేహంలేదు.

సీ. సాహసమున స్వరాజ్య స్థాపనకు పాటు
పడ్డ 'ఝాన్సి లక్ష్మిబాయి' యొకతె
కడదాక దేశ రక్షణకు పోరాడె
'నానాసాహెబు' ప్రజానాయకుండు
పరరాజ్యమున్ ద్రోయ పన్నితంత్రమ్ముల
సాధించె 'తాంతియా' యోధుడొకడు
గడగడ వడకించె నడవి భిల్లుల గూర్చి
రాజ్యమున్ గొన 'రామరాజొ' కండు

గీ. భారత స్వతంత్ర సంరంభ కారణమున
ప్రాణముల్ ధారవోసిరి భరత భూమి
త్యాగులైనట్టి వీరినందఱిని భక్తి
సంస్మరింపుడీ! పుణ్యావసరమునందు

—గురుజాడ రాఘవశర్మ

# వందేమాతరం ఉద్యమం

*కొండవీటికి కోటలమరిచి*
*దండివీరుల తాండవింపగ*
*చండ వీర్యము నిండియుండిన*
*తెలుగు భూమిది తమ్ముడా!*
*తేటమాటల తేనెలొలుకుచు*
*పాటవంబున పరుషమొప్పుచు*
*సాటిభాషల నీటుమీరగ*
*ఆంధ్రభాషను బొగుడుమా!!*

—*సురవరపు ప్రతాపరెడ్డి*

## కాంగ్రెస్ పుట్టుక :

ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం జరిగిన తర్వాత, భారత ప్రజాభిమానాన్ని ఏదో విధంగా చూరగొనకుండా యింత సువిశాల దేశాన్ని తాము పరిపాలించడం కష్ట మని, బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించింది. ఉన్నత విద్యాలయాల స్థాపనద్వారా. బాని సలను గుమాస్తాలను తయారుచేసే తమ పాలన కనువైన విద్యను వ్యాప్తి చేయాలని పూనుకున్నారు. సిపాయిల విప్లవం తరువాతనే, కలకత్తా, బొంబాయి, మదరాసు విశ్వవిద్యాలయాల స్థాపన జరిగింది. 1861 తర్వాత హైకోర్టులు, లెజస్లెటివ్ కౌన్సిళ్లు ఏర్పడ్డాయి.

పాశ్చాత్య విద్యాసంస్థలలో చదివినవారే, క్రమేణా చైతన్యవంతులైనారు. బెంగాలులో బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌ను స్థాపించుకొన్నారు. దాదాబాయి నౌరోజీ ప్రభృతులు 'బొంబాయి అసోసియేషన్'ను ఏర్పరుచు కున్నారు. మదరాసులో ఆనందాచార్యులు, సుబ్రహ్మణ్యయ్యర్ 'మదరాసు మహాజన సభ'ను నెలకొల్పుకున్నారు. సురేంద్రనాథ్ బెనర్జీ, ఆనందబోస్‌ల అధ్వర్యాన 'బెంగాలు ఇండియన్ అసోసియేషన్ ఏర్పడింది. రామమోహన్‌రాయ్, కేశవచంద్రసేన్ వంటి సంఘ సంస్కర్తలు 'బ్రహ్మ సమాజాన్ని' స్థాపించారు. బొంబాయిలో జస్టిస్ రానడే 'ప్రార్థనా సమాజాన్ని' ఏర్పరిచారు. భారతీయ సంస్కృతిని విచ్ఛిన్నం చేయ తలపెట్టే పాశ్చాత్య భావాలను

ఎదుర్కొనేందుకు, దయానంద సరస్వతి 'ఆర్య సమాజాన్ని' స్థాపించారు. వివిధ కేంద్రాలలో 'థియసాఫికల్ సొసైటీ' శాఖలు ఏర్పడ్డాయి. ఈ విధంగా విద్యావంతులు, మేధావులు, సంఘ సంస్కర్తలు, ఆధ్యాత్మిక వేత్తలు సంఘాలు ఏర్పరచుకొని, దేశాభ్యున్నతికి కొంత కృషిచేయనారంభించారు.

బ్రిటిష్ ప్రభుత్వ పరిపాలన పట్ల మధ్యతరగతి వర్గాలలో అసంతృప్తి పెరుగుతూ వచ్చింది. సాహసోపేతులైన యువతీ యువకులు హింసా పద్ధతులకు కూడా ఉద్యమించారు. రాజకీయంగా పెరుగుతున్న అసంతృప్తియే రహస్యోద్యమాలకు కారణమని సర్ ఓ ఏ. హ్యూమ్ వంటివారు గ్రహించారు. కొందరు బ్రిటిష్ సివిలియనులు కూడా కళ్లు తెరిచారు. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొని ప్రభుత్వానికి విన్నవించేందుకు అఖిల భారత సంస్థ ఒకటి వుండవలసిన ఆవశ్యకతను భారత జాతీయాభిమానులు గుర్తించారు.

ఓ.ప. హ్యూమ్ ప్రభృతుల కృషి మూలంగా 1885 సంవత్సరంలోబొంబాయి నగరంలో భారతజాతీయ కాంగ్రెస్ ఏర్పడటంతో, దానికొక రూపకల్పన జరిగింది

1885 సంవత్సరంనుండి 1905 వరకు ఇరవై ఎండ్ల పర్యంతం, పరిపాలనా సంస్కరణలు ప్రసాదించాలని, భారతీయులకు గల అసౌకర్యాలు తొలగించాలని, ప్రజలకు ప్రాతినిధ్యం కల్గించే కౌన్సిళ్లు ఏర్పరచాలని పన్నుల భారం తగ్గించాలని, బ్రిటిష్ ప్రభుత్వాన్ని ప్రార్థిస్తూ కాంగ్రెస్ సభలలో తీర్మానిస్తుండేవారు. కాంగ్రెస్ సభలకు హాజరయ్యే విద్యాధికులకు బ్రిటిష ప్రభుత్వం యెడల ఎంతో సద్భావం వుండేది. బ్రిటిష్ రాజు, రాణిగార్ల జన్మదినోత్సవాలకు అభినందలు పంపేవారు. బ్రిటిష్ వారి న్యాయ పరిపాలనా పద్ధతులను ప్రస్తుతించేవారు. బ్రిటిష్ పాలనాధికారులు, యిట్టివారిలో కొందరు శక్తివంతులను దగ్గరకు చేరదీసి, వారికి కొన్ని ఉన్నత పదవులు కట్టబెట్టడం ద్వారా బుజ్జగించడం జరుగుతుండేది. కాని కాంగ్రెస్ సంస్థ క్రమేపీ రాజద్రోహ పూరితంగా మారిపోతున్నదని పరప్రభుత్వం గ్రహించడానికి ఎంతో కాలం పట్టలేదుకూడా.

## ప్రారంభదశ:

దాదాబాయినౌరోజీ, పండిత మదన మోహన మాళవ్యా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధరతిలక్ మున్నగు పెద్దలు ప్రారంభదశలో జాతీయ కాంగ్రెస్ సంస్థకు పునాదులువేశారు. దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యవ్యవస్థను

నెలకొల్పడానికి, కుల మత భాషాతీత భారతజాతీయ తను పాదు కొల్పడానికి, ఆమహనీయులు అవిరళ కృషిచేశారు. తొలిరోజులలో వారుదేశీయులను ప్రభావితం చేయడమే గాక, భావితరాలవారిని కూడా ఉత్తేజితులను చేయగలిగారు. అందుచేతనే, జాతీయ కాంగ్రెస్ చరిత్ర భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర వేర్వేరుగా విడదీయరాని అవినాభావ సంబంధం గలిగివుంది.

కాంగ్రెస్ సత్వరాభివృద్ధికి దోహద మిచ్చిన విషయాల్లో మనదేశప్రజలలోని వివిధ వర్గాల, మతాల, భాషల ప్రతినిధులతో కూడి వుండటం గమనార్హమైనది. పలువురు మైనారిటీ వర్గాలకు చెందిన నాయకులు కాంగ్రెస్ సంస్థకు మూలపురుషులుగా, మహాసభలకు అధ్యక్షులుగా వుండటం జరిగింది. ప్రథమ కాంగ్రెస్ సభాధ్యక్షుడైన డబ్ల్యు. సి. బెనర్జీ క్రిస్టియన్. ద్వితీయ కాంగ్రెస్ అధ్యక్షుడు పార్సీ మతానికి చెందిన దాదాబాయి నౌరోజీ. తృతీయ కాంగ్రెస్ అధ్యక్షుడు మహమ్మదీయ సోదరుడైన బద్రుద్దీన్ తయాబ్జీ ఇలా ప్రారంభదశనుంచి కాంగ్రెస్ ఒక మతాతీత లౌకిక సంస్థగా పరిఢవిల్లింది. స్వాతంత్రభారతంలోను భాషా అల్పసంఖ్యాకవర్గాలవారు గణనీయమైనపాత్రను నిర్వహించడం మూలంగా, భారత రిపబ్లిక్ నిర్దేశించిన నూతన రాజ్యాంగ సూత్రాలలో సెక్యూలరిజం ప్రధానంగా చోటుచేసుకొంది. భారతీయుల మనోభావాలు ప్రతిఫలించే ఓట్లు జాతీయకాంగ్రెస్ గొప్ప ప్రజాస్వామ్యసంస్థగా అభివృద్ధిచెందుతూ వచ్చింది.

## వందేమాతరం ఉద్యమం

మనదేశ స్వాతంత్ర్య చరిత్రలో 'వందేమాతరం ఉద్యమం' ఒక మైలురాయి. ఈ ఉద్యమాన్ని గురించి తెలుసుకుందాము. అప్పట్లో బెంగాలు రాష్ట్రం ఇంగ్లాండుదేశం కంటే పెద్దదిగా వుండేది. 1,90,000 చదరపు మైళ్ళ విస్తీర్ణంతో, 7 కోట్ల 80 లక్షల జనాభా గలిగిన ప్రదేశం. వైస్రాయి లార్డుకర్జన్ బెంగాలును, అస్సామును హిందూ ముస్లిం విభాగాలుగా విడగొట్టతల పెట్టాడు. జాతీయోద్యమం నుండి మహమ్మదీయ సోదరులను వేరు చేసేందుకు బ్రిటిష్ పాలకులు పన్నిన కుతంత్రంఅది. కర్జన్‌కు భారత స్వపరిపాలన యెడల ఏమాత్రం నమ్మకంలేదు. ఆయన వెళ్ళిపోయిన అనంతరం, లార్డుమింటో యిచటికి వైస్రాయిగా వచ్చాడు. ఇంగ్లాండులో లార్డుమార్లే సెక్రటరీఆఫ్‌స్టేట్ గా వుండేవారు.

బెంగాలు విభజనకు వ్యతిరేకంగా దేశంలో తీవ్రాందోళన బయలు దేరింది. అదే 'వందేమాతరం ఉద్యమం.' నిరసనప్రదర్శనలు, విదేశవస్త్ర బహిష్కరణలు జరిగినవి,

లోకమాన్య బాలగంగధర తిలక్ 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని ప్రథమంగా చాటి ప్రజల్లో గొప్ప ప్రబోధంగావించారు. తిలక్ మహాశయుని ప్రభుత్వం మాండలే జైలులో నిర్బంధించింది. 'పంజాబ్ కేసరి' లాలాలజపతిరాయ్‌కి ద్వీపాంతర వాసశిక్ష విధించింది. అనేకమంది బెంగాలు విప్లవ యువకులను నానా హింసలకు గురి చేసింది. బెంగాలు విభజన తీవ్రవాద యువకులను ప్రతీకార చర్యలకు పురిగొల్పింది. టెర్రరిస్టులను అణచివేసేందుకు ప్రభుత్వం తీవ్ర నిర్బంధాలకు పూనుకొంది. బంకిం చంద్రచటర్జీ ఆనందమఠంలో వ్రాసిన "వందేమాతరం" గీతాన్ని సైతం నిషేధించింది. పత్రికలను అణచివేసింది.

వందేమాతరం ఉద్యమం బాలగంగాధరతిలక్, లాలాలజపతిరాయ్, బిపిన్‌చంద్ర పాల్ (బాల్, లాల్, పాల్) నాయకత్వాన దేశవ్యాప్తమయింది. అరవింద ఘోష్, సతీష్‌చంద్రముఖర్జీ ప్రభృతులు మార్గ చోదకులైనారు. ఈ తీవ్ర ఆందోళన ఫలితంగా 1911 లో ఇంగ్లాండు రాజు బెంగాలు విభజనను రద్దుగావిస్తూ ఉత్తర్వు చేయక తప్పలేదు. రాజధానిని కలకత్తా నుంచి ఢిల్లీకి మార్చడం జరిగింది.

ఈ సందర్భంలో, ఆంధ్రదేశంలో ప్రారంభమైన ప్రజా చైతన్యాన్ని గురించి తెలుసుకుందాం :

## ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనం :

పరప్రభుత్వ దుష్పరిపాలనా ఫలితంగా మన స్వాతంత్ర్యం, సాహిత్యం, సంస్కృతి, అభ్యుదయం, మున్నగునవన్నీ కుంటుపడినవి. నిద్రాణమై వున్న ఆంధ్రులను మేల్కొల్పిన నవయుగ వైతాళికులు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు ప్రభృతులు. బెంగాలులో రాజారామ మోహనరాయ్‌వలె, ఆంధ్రదేశంలో వీరేశలింగం తమ అసంఖ్యాక రచనలు, ప్రసంగాల ద్వారా సంఘసంస్కరణకు, స్త్రీ జనోద్ధరణకు పూనుకున్నారు అంధ విశ్వాసాలను అణగదుగునా ప్రతిఘటించిన వజ్రసంకల్పుడాయన.

'దేశమును ప్రేమించుమన్నా— మంచియన్నది పెంచుమన్నా!' అను ఆంధ్ర జాతీయగీతాన్ని గురజాడ అప్పారావు ఆంధ్రులకు అందించారు. 'స్వంత లాభము కొంత మానుక పొరుగువానికి తోడుపడవోయ్' అని, అన్ని మతాలవారు ఐక్యతతో కలిసి వుండమని, ఆయన ప్రబోధం గావించారు. గిడుగు రామమూర్తి వ్యవహారిక

భాషావాదాన్ని ప్రచారంచేసి, భాషా విప్లవానికి పునాదివేశారు. మత సాంఘిక విప్ల వాన్ని తెచ్చినవారు రఘుపతి వెంకటరత్నం నాయుడు.

ఇదే కాలంలో, హైదరాబాదులో కొమర్రాజు లక్ష్మణరావు 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి'ని స్థాపించి, తద్వారా విజ్ఞాన దీపాన్ని వెలిగించారు. అనేక చారిత్రక, వైజ్ఞానిక గ్రంథాలను, మహనీయుల జీవిత చరిత్రలను ప్రకటించారు. దీక్షతో 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని' మొట్టమొదటగా వెలువరించిన ఘనత, లక్ష్మణరాయనికి దక్కింది.

వీరంతా ఆనాటి జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన కున్నప్పటికీ, తెలుగు వారిని ఉత్తేజపరచి, చైతన్యవంతులను గావించారు. వీరందరి బహుముఖ సాహితీ కృషి వేనోళ్లకొనియాడదగినది.

## వందేమాతరం ఉద్యమ ప్రభావం :

వందేమాతరం ఉద్యమ కాలంలో తెలుగు భాషలో అనేక ప్రాంతీయ పత్రికలు వెలిసినవి. గుంటూరులో 'దేశాభిమాని', రాజమండ్రిలో 'ఆంధ్రకేసరి', బెజవాడలో 'స్వరాజ్య' మొదలైన పత్రికలు, బందరులో 'కృష్ణాపత్రిక' స్థాపించబడినవి. చిలుకూరి వీరభద్రరావు 'ఆంధ్రుల చరిత్ర', 'జీర్ణ కర్నాటక సామ్రాజ్యం' మొదలగు గ్రంథాలు వ్రాశారు. కొమర్రాజు లక్ష్మణరావు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు రచించిన అమెరికా స్వాతంత్ర్య వీరుడైన 'అబ్రహాం లింకన్ చరిత్ర'ను ప్రచురించారు.

అనేక గ్రంథాలయాలు, పఠన మందిరాలు వెలిశాయి. పత్రికా, గ్రంథ పఠనల మీద పాఠకులకు అభిరుచి పెరిగింది. యువకులకు సాముగరిడీలు నేర్పడానికి ఏలూరు, బందరు, బెజవాడ, గుంటూరు, రాజమండ్రి, కాకినాడ మొదలగు పట్టణాలలో వ్యాయామ సంఘాలు, తాలింఖానాలు ఏర్పడ్డాయి. పలువురు యువకులు వీటిల్లోచేరి శిక్షణ పొందసాగారు.

కాంగ్రెస్ సంస్థ యిచ్చిన 'స్వదేశీ' సందేశంతో, ఆంధ్రదేశంలో జనపనార, బట్టల మిల్లులు, సబ్బు, గాజుల పరిశ్రమలు నెలకొల్పడానికి కొన్ని ప్రయత్నాలు జరిగినవి. ఆంధ్రులలో స్వభాషాభిమానం పెరిగింది. కళాశాలల్లో విద్యాబోధన, కోర్టు లలో న్యాయ విచారణ, శాసనసభలలో కార్యకలాపాలు మాతృభాషలలో జరగాలని కోరడం ప్రారంభించారు.

ఈ దశలోనే, సూరినరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్య ప్రభృతుల ప్రోత్సాహంతో గ్రంధాలయోద్యమం ప్రారంభమైంది. పట్టణాలలో, గ్రామసీమల్లో విజ్ఞానవ్యాప్తికి గ్రంధాలయాలు ఎంతగానో తోడ్పడినవి. ఆంధ్రదేశంలో ఉద్భవించిన గ్రంధాలయోద్యమానికి ఒక విశిష్టస్థానంవుంది. జాతీయ భావాలతో, విద్యాధికుల కృషి, ప్రజల చొరవ వల్ల పలుకేంద్రాలలో గ్రంధాలయాలు, పఠనమందిరాలు ఏర్పాటు చేయడం జరిగింది ఇవి ప్రజలలో గొప్ప రాజకీయ సాంఘిక చైతన్యం గలిగించేందుకు తోడ్పడ్డాయి తదనంతర కాలంలో జరిగిన వివిధ ఉద్యమాలకు యివి పునాదిరాళ్లు అయినవి

## తెలంగాణాలో గ్రంధాలయాలు :

నిజాం ఆంధ్రులలో ఐక్యతనుగొని రావడానికి, విద్యా విజ్ఞాన వ్యాప్తికి కృషి ఆరంభమైంది. గ్రంధాలయాలు నెలకొల్పడం జరిగింది. కొమర్రాజు లక్ష్మణరావు, రాజానాయని వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావు, సోమనాధరావు, మైలవరపు నరసింహశాస్త్రి మున్నగువారి ఆలోచనా ఫలితంగా, 1901 వ సంవత్సరంలో హైదరాబాదులో శ్రీ కష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం' ఏర్పడింది. వరంగల్లులో తర్వాత 'రాజరాజ నరేంద్ర గ్రంధాలయం' వెలసింది. అప్పటి నైజాం నవాబుల పరిపాలనా కాలంలో, ఎక్కడైనా ఒక చిన్న గ్రంధాలయం ఏర్పరచుకోవాలన్నా ఒక చిన్న విద్యాసంస్థను నెలకొల్పుకోవాలన్నా, వాటిని కూడా రాజద్రోహ నేరాలు చేసినట్లు పాలకులు పరిగణించి చర్య తీసుకొనేవారు. కావుననే, తెలంగాణాలో స్థాపింపబడిన ప్రతిఒక్క గ్రంధాలయం వెనుక ఎంతో రాజకీయ చరిత్ర యిమిడి వుంది. గ్రంధాలయాలు ప్రజల్లో గొప్ప చైతన్యం కలిగించేవి.

## రాజమండ్రి విద్యార్థుల ముందంజ :

ఇక వందేమాతరం ఉద్యమం రోజుల్లో ఆంధ్ర దేశంలో గలిగిన సంచలనాన్ని గమనించండి .

'వందేమాతరం' నినాదం చేయడం పాలకుల దృష్టిలో గొప్ప తప్పిదం 'స్వరాజ్యం-నాజన్మహక్కు' అని భావించడం మహారాజద్రోహం. స్వదేశ పరిశ్రమలు స్థాపించడం, గ్రంధాలయాలు నెలకొల్పడం సైతం పెద్దవిప్లవచర్య. ఇదీ ఆనాటి పరిస్థితి.

1907 ఏప్రిల్ 19వ తేదీనుండి 24వ తేదీ వరకు బిపిన్ చంద్రపాల్ రాజమండ్రి వచ్చి, సభలలో ప్రసంగించారు. ఆయన దేశభక్తిని, స్వదేశీ ఉద్యమ ప్రాముఖ్యతను వివరించారు. రాజమండ్రి యువకులు 'బాలభారతి' సంఘాన్ని స్థాపించుకున్నారు. గంటిలక్ష్మన్న, టంగుటూరి శ్రీరాములు, కంచుమర్తి రామచంద్రరావు, చిలుకూరి వీరభద్రరావు ఈ 'బాలభారతి'లో పని చేస్తుండేవారు. స్థానిక జాతీయ విద్యాలయానికి కరణం గున్నేశ్వరరావు వెయ్యి రూపాయలు విరాళంగా యిచ్చారు.

రాజమండ్రి సభలో బిపిన్ చంద్రపాల్‌కు బోధనాభ్యసన కళాశాల విద్యార్థి గాడిచెర్ల హరిసర్వోత్తమరావు స్వాగతపత్రం సమర్పించారు. విద్యార్థులంతా గోదావరి నదిలో స్నానంచేసి, వందేమాతరం బాడ్జీలు ధరించి ఊరేగింపు చేశారు. ఈ నేరానికి 222 మంది ట్రైనింగ్ కాలేజి విద్యార్థులలో 138 మందిని ప్రిన్సిపాల్ హంటర్ డిబార్ చేశాడు. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, తెలుగువారిలో తెలుగు ఎం.ఎ పాసైన రెండవవారు. ఆయనకు ఎక్కడా ప్రభుత్వోద్యోగం యివ్వరాదని ప్రిన్సిపాల్ ఉత్తర్వు జారీ చేశారు. కళాశాల నుండి బహిష్కరింపబడిన విద్యార్థులలో చాలా మంది తర్వాత జరిగిన స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొన్నారు.

## కాకినాడ పౌరుల కార్యదీక్ష:

1907 మే 31వ తేదీన జిల్లా వైద్యాధికారిగా వున్న కెంప్‌దొర బజారున వెళ్ళుతుండగా, ముగ్గురు బాలురు 'వందేమాతరం' అని నినాదాలుచేశారు. ఆవైద్యాధికారి కోపంగా కోపెల్ల కృష్ణారావు అనే విద్యార్థిని తీవ్రంగా కొట్టాడు. అతని ప్రవర్తన పురజనులలో సంచలనం కలిగించింది. విద్యార్థులు, ప్రజలు ఆ వైద్యాధికారివెంట పడ్డారు. అతనుదాగిన క్లబ్‌మీద దాడి చేశారు. అక్కడేవున్న కలెక్టర్‌కు కూడా దెబ్బలు తగిలాయి. దౌర్జన్యం చేశారని పోలీసులు 50 మందిని అరెస్టుచేశారు. ఆవిధంగా అరెస్టుఅయిన వారిలో ఐదుగురు కార్మికులుకూడా వున్నారు. అరెస్టులకు నిరసన తెల్పుతూ కాకినాడ పట్టణ కార్మికులు సమ్మెచేశారు. ప్రభుత్వం కేసుపెట్టి, విచారణానంతరం 13 మందికి శిక్షలు విధించింది.

జిల్లా వైద్యాధికారి కెంప్ దురుసుతనమే ఈ గొడవకంతా కారణమని, కాకినాడ పౌరులు సభజరిపి, నిరసనతెల్పారు. దెబ్బలుతిన్న విదార్థికి ఆ అధికారిచేత వందరూపాయలు నష్టపరిహారం యిచ్చేదాకా కాకినాడపౌరులు అతనిని వదలలేదు.

## బందరు జాతీయ కళాశాల:

ఆ రోజుల్లో రాజమండ్రి, బందరు పట్టణాలు కూడా స్వదేశీ ఉద్యమానికి ఆయువు పట్టుగా నిలచినవి. బందరులో యువకులు సమావేశమై 'యువజన స్వరాజ్య సమితిని' ఏర్పాటు చేసుకొన్నారు.

వందేమాతరం ఉద్యమంతో ప్రభావితుడైన కోపల్లె హనుమంతరావు, డాక్టర్ పట్టాభితో కలసి బందరులో 1908 సంవత్సరంలో 'నేషనల్ కాలేజి' స్థాపనకు పూను కొన్నారు. జాతీయదృక్పథంతో వృత్తివిద్యలకు, లలితకళలకు కూడా ఈ జాతీయ కళాశాలలో ప్రాధాన్యతయిచ్చారు. ఈ కాలేజీలో చదివిన పలువురు విద్యార్థులు, అధ్యాపకులు దేశభక్తులై స్వతంత్ర సమరంలో ప్రముఖ పాత్ర వహించారు.

## కోటప్పకొండ తిరునాల-చిన్నపరెడ్డికి ఉరిశిక్ష :

ఆ ఉద్యమ రోజుల్లో మహాశివరాత్రి నాడు, కోటప్పకొండ తిరునాలలో ఒక ముఖ్య సంఘటన జరిగింది. చేబ్రోలు సమీపానగల రెడ్డిపాలెంగ్రామరైతు చిన్నపరెడ్డి ప్రభను కట్టుకొని ఆ తిరునాలకు, వెళ్లాడు. ఆయన కోడెలు బెదరి జనం మీదపడినవని పోలీసులు తుపాకీతో ఒక కోడెను కాల్చారు. వ్యవసాయదార్లు ఎడ్లను తమ ప్రాణం కంటే ఎక్కువగా చూసుకుంటారనే విషయం తెలిసిందే. కోడెను కాల్చారనే ఆవేశంతో జనంతిరగబడి, పోలీసులకు తగిన శాస్తి చేశారు. రైతులు వందేమాతరం నినాదాలుచేశారు. ప్రభుత్వం చిన్నపరెడ్డి మొదలగువారిపై కేసుపెట్టి ఉరిశిక్ష విధించింది. మరో 11 మంది ముద్దాయిలకు ఏడు సంవత్సరాల చొప్పున కఠినశిక్షలు విధించింది. శివరాత్రి తిరునాల సందర్భంలో పోలీసులు దురుసుగా వ్యవహరించిన కారణంగా ఆదుస్సంఘటన సంభవించింది. అప్పట్లో నరసరావుపేట సబ్ కలెక్టర్‌గావున్న కెర్షాస్పు బర్లాండు దేశస్థుడు. ఈ కేసు తర్వాత అతను తన ఉద్యోగాన్ని వదలుకొని తన స్వదేశం వెళ్లి పోయినాడు.

చిన్నపరెడ్డిపై పాటలు యిప్పటికీ గుంటూరు జిల్లా గ్రామీణులు జానపద గీతా లుగా పాడుకొంటుంటారు.

'సైరా! చిన్నపారెడ్డీ
నీ పేరే బంగార్పా కడ్డీ' అని పాటలు వినిపిస్తుంటాయి,

## కరెవరం బాంబు కేసు :

1909వ సంవత్సరంలో తెనాలి పట్టణ సమీపానగల కంచెర్ల పాలెంవద్ద ఒక బాంబు ప్రేలింది. ఇది కరెవరం బాంబుకేసుగా ప్రసిద్ధి చెందింది. ఈ కేసులో ఏప్రిల్ 6వ తేదీన చుక్కపల్లి రామయ్య, కోటంరాజు వెంకట్రామయ్య, లక్కరాజు బసవయ్య ముగ్గురిని పోలీసులు అరెస్టుచేసి బాంబుకేసు పెట్టారు. చుక్కపల్లి రామయ్యకు పదేండ్లు శిక్షవిధించబడింది. మిగతాయిర్వురికి 3 ఏండ్లవంతున శిక్షవేశారు. ఆ సందర్భంలో ముద్దాయిల ఇండ్లు సోదాలు చేయగా, 'సత్వరస్వరాజ్య సాధన' అను కరపత్రం బయట పడింది బాంబులు తయారు చేసే మందు సామాగ్రి, పరికరాలను వశపరచుకున్నారు. వందేమాతరం ఉద్యమ కాలంలో, బెంగాలు నుండి విప్లవ యువకులు ఆంధ్రదేశం వచ్చి పర్యటించారు. తెనాలి పట్టణంలో కూడా బాంబులు తయారు చేయడం నేర్పారు కంచెర్లపాలెం యువకులు కూడా శిక్షణ పొందారు. బాంబు తయారుచేసి, పరీక్షించ బూనుకున్నారు. ఆ సందర్భంలో గుంటూరు, బెజవాడ, తెనాలి మున్నగుచోట్ల కూడా దేశాభిమానుల ఇండ్లు సోదా చేయడం జరిగింది. ఈ కరెవరం బాంబు కేసులో ముద్దాయిల తరపున టంగుటూరి ప్రకాశం వకీలుగా వుండి, వాదించారు.

## 'స్వరాజ్య' పత్రిక కేసు :

1905లో అయ్యదేవర కాళేశ్వరరావు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి మొదలగు ఆంధ్ర యువకులు మదరాసు యూనివర్సిటీ విద్యార్థులుగా వుండేవారు. నగరంలో ఉద్యమాన్ని బలపరుస్తూ జరిగిన సభలకు వీరు హాజరౌతూ, స్వదేశీ వ్రతం బూనారు. తర్వాత హరిసర్వోత్తమరావు రాజమండ్రి ట్రైనింగ్ కాలేజీకి వెళ్లారు. అనంతరం వీరు బెజవాడ వచ్చి, తెలుగులో 'స్వరాజ్య' పత్రికను నడుపుతుండేవారు. పింగళి లక్ష్మీనారాయణ, ప్రింటింగ్ ప్రెస్ అధిపతిగాను, బోడి నారాయణరావు ప్రింటర్‌గాను, హరిసర్వోత్తమరావు ఎడిటర్‌గాను ఈ స్వరాజ్య పత్రికను నిర్వహిస్తుండేవారు. 'అరెరేఫిరంగీ!' అనురచనకు, రాజద్రోహనేరం మోపి, హరిసర్వోత్తమరావుకు మూడేండ్లు కఠిన శిక్ష విధించడంజరిగింది. బోడి నారాయణరావుకు ఆరు మాసాలు శిక్ష వేశారు. పింగళి లక్ష్మీనారాయణ అరెస్టుగాకుండా తప్పించుకొని రహస్యంగా పాండిచేరికి వెళ్లారు. ఆయన తర్వాత సన్యసించి, 'నారాయణానంద'గా, స్వరాజ్య ఉద్యమాలలో పాల్గొని జైలు శిక్షలు అనుభవించారు. ఈ స్వరాజ్య కేసు, దేశారాధకుల అరెస్టులు ఆంధ్రలో గొప్ప సంచలనాన్ని కలిగించాయి,

# మండల మహాసభలు- ఆంధ్రోద్యమం

## భాషా రాష్ట్ర వాంఛ :

వందేమాతరం ఉద్యమ ప్రభావంవల్ల ఆంధ్రదేశ విద్యావంతులలో భాషా ప్రయుక్త రాష్ట్ర వాంఛ జనించింది. ఉమ్మడిమదరాసు రాష్ట్రంలో ప్రాజెక్టుల, పరిశ్రమల నిర్మాణంలో, ప్రభుత్వోద్యోగ నియామకాలలో ఆంధ్రులకు అన్యాయం జరుగుతున్నదని ఆంధ్రులు భావించారు. ఆంగ్ల విద్యాలయాలలో ఉన్నత విద్యనభ్యసించి వచ్చిన విద్యాధికులైన ఆంధ్రప్రముఖులు చేసిన సమాలోచనల పర్యవసానంగా, 'ఆంధ్ర మహాసభ' యేర్పాటుకు ప్రయత్నం జరిగింది. 1913లో బాపట్లలో ప్రథమ సభజరిగి, ఆంధ్ర మహాసభకు ఒక నిర్మాణ రూపం ఏర్పడింది. తదాది ఏటేటా ఆంధ్ర మహాసభలు జరుపుతూ, భాషా రాష్ట్ర వాంఛను ఎలుగెత్తి చాటారు. తర్వాత కాలంలో జాతీయోద్యమం కూడా దీనినే బలపరిచింది.

జాతీయోద్యమ తొలిరోజులలో ఆంధ్రదేశంలో కాంగ్రెస్ సంస్థను స్థాపించిన మూలపురుషులలో ఒకరైన 'దేశభక్త' కొండ వెంకటప్పయ్య, "ఆంధ్రులు-జాతీయోద్యమము" అను వ్యాసంలో ఇలా వివరించారు :

## ప్రథమ జిల్లా కాంగ్రెస్ మహాసభ

"1885వ సంవత్సరమున స్థాపింపబడి, 1887వ సంవత్సరములో మూడవ కాంగ్రెస్ మహాసభ సమావేశమైనప్పటి నుండి, దక్షిణ దేశముతోపాటు ఆంధ్రయందును కొలదిగా ప్రారంభమయ్యెను. ఆ కాలములో గుంటూరు జిల్లా ప్రాంతములో చాలభాగము 'కృష్ణా మండలము'లో కలిసి ఒకే జిల్లాగా వ్యవహరింపబడు చుండెను. అందువలన 'కృష్ణా జిల్లా కాంగ్రెస్ సంఘము' అనుపేర ఒక సంఘము స్థాపింపబడి కాంగ్రెస్ వ్యవహారములు నడుపబడుచుండెను. అదివరకు ఏ ప్రాంతమునందున జరుపబడని మొట్టమొదటి జిల్లా కాంగ్రెస్ మహాసభ 1892 జూన్‌లో గుంటూరులో జరిగెను. అప్పుడు కృష్ణాజిల్లా కోర్టులో న్యాయవాదిగా వుండిన వావిలాల శివావధాని గారు అధ్యక్షత వహించిరి. ఆ సమావేశమునకు ప్రోత్సాహకులుగా వుండి కార్యభారము వహించిన వారు శనగపల్లి రామస్వామిగుప్తా అనునొక ఉత్సాహ పూరితుడగు వైశ్య యువకుడు, గుంటూరు వాస్తవ్యుడు.

ఇట్లు కొంతకాలము గడచినపిదప కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాల మూడింటిలోను రాజకీయ ప్రబోధము ముందంజ వేయసాగినది. యువకులు గ్రంథాలయములు స్థాపించుకొని, అందు పత్రికా పఠనము ముఖ్యముగా చేయుచు, భరతదేశమునందు జరుగుచుండెడి రాజకీయముల యందు అభిరుచి కలిగి, చర్చలుగావించుచుండిరి. నానాటికి యితర జిల్లాలలో సహితము కాంగ్రెస్ సంఘములు ఏర్పడి, కాంగ్రెస్ వ్యవహారముల యందు విద్యా పరిచితులు ఎక్కువగా, పాల్గొనదొడగిరి. ఆంధ్రదేశమునందు 'జిల్లా మహాసభలు' ఏటేటా జరుగుచుండెను.

బంగాళా ప్రాంత విభజన వలన భారతదేశమంతను వ్యాపించిన ఉద్రేక పూరితమైన ఆందోళన అప్పటికి ఎన్నడూ కనీవినీ యెరుగుని మహాసంచలనము మన దేశమునందలి రాజకీయ ఘట్టములలో ఒక ప్రధాన ఘట్టముగా పరిణమించినది."

—('ఆంధ్రులు-జాతీయోద్యమము' వ్యాసభాగాలు)

## ఆంధ్రలో మండల మహాసభలు :

వందేమాతరం ఉద్యమం నాటికి ఆంధ్రావనిలో జరిగిన మండల మహాసభలు ప్రాముఖ్యతను సంతరించుకొన్నవి. వీటిని గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

సప్తమ కాంగ్రెస్ మహాసభ 1891 డిసెంబరులో నాగపూర్‌లో జరిగింది. ఆ మహాసభకు గుంటూరు వాస్తవ్యుడైన శనగపల్లి రామస్వామి గుప్తా ప్రభృతులు హాజరైనారు. ఆయన సురేంద్రనాథ్ బెనర్జీతో మాట్లాడి, ఆంధ్రలో మండల మహాసభను జరిపే విషయం అప్పటికి ఆంధ్ర ప్రముఖులైన న్యాయపతి వారు, భావనా చార్యులు. కెడింబి హనుమంతరావు, కొలిచిన అప్పయ్య దీక్షితులు మొదలగువారితో సంప్రదించి వచ్చారు. ఫలితంగా ప్రథమ మండలసభ 1892 జూన్ మాసంలో వావిలాల వెంకట శివావధానులు అధ్యక్షతన జరిగింది. కృష్ణా జిల్లా మండలసభ కార్యస్థానం బందరులో నెలకొల్పారు. ఈ కృష్ణా మండల సభయే భారతదేశంలో జరిగిన ప్రథమ మండల సభగా పరిగణింప బడుతున్నది.

తదనంతరం, గోదావరి మండల సభ, తర్వాత చిత్తూరు మండల సభ, క్రమేణా యితర జిల్లాల మండల సభలు జరిగినవి. ఈ విధంగా 29 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా మండల మహాసభలు జరుగుతూ వచ్చినవి.

ఈ మండల సభల ద్వారా, కాంగ్రెస్ సంస్థ తీర్మానించే అభిప్రాయాలు, విధానాలు, ఆయా మండల వాసులలో ప్రచార మయ్యేవి. ఈ సభలకు ముఖ్యంగా న్యాయవాదులే ప్రతినిధులుగా వచ్చి, సభాకార్యక్రమాల్లో, తీర్మానాలు రూపొందించ డంలో ప్రముఖ పాత్ర వహించేవారు. 9 వ సభ పల్లెటూరైన అంగలూరు గ్రామంలో జరగడంమూలంగా, రైతులు కొంత ముందంజవేశారు. 1916 ఏప్రిల్‌లో గూడూరు రామచంద్రరావు మున్నగువారి కృషి మూలంగా గుడివాడలోను, 29వ మండల సభ పెదకళ్లేపల్లిలోను మండల సభలు జయప్రదంగాజరిగినవి.

కృష్ణా మండల సభకు వేమూరి వెంకట సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా వుండి, సభా తీర్మానాల ముసాయిదాలు తయారు చేసేవారు. సభానంతరం, ప్రభుత్వాధి కార్ల వద్దకు రాయబారాలు నిర్వహించే వారు. ఆయన కృషి ప్రశంసనీయమైంది. కోంబి హనుమంతరావు, కొండ వెంకటప్పయ్య, వేమవరపు రామదాసు, కొలిచిన అప్పయ్య దీక్షితులు, పురాణం సోదరులు, చిట్టా సుందరరామయ్య మున్నగు ప్రము ఖులు, కృష్ణామండల ప్రజలలో రాజకీయ జ్ఞానం వ్యాప్తి గావించారు.

ఈ మండల సభలు సమర్పించిన విజ్ఞాపనలు, చేసిన తీర్మానాలు కొంతవరకు సత్ఫలితాలను చేకూర్చినవి. పులిగడ్డ ప్రాజక్టు, బెజవాడ గుంటూరు-రేపల్లె రైలు మార్గాలు, ఏలూరులో జూట్ మిల్లు, గుంటూరులో ప్రత్తిమిల్లు స్థాపన, బందరులో జాతీయ కళాశాల ఏర్పాటు, కృష్ణాపత్రిక స్థాపన మొదలగువన్నీ ఈ మండల మహా సభల ఆందోళనా ఫలితాలే. కష్ణా మండలసభ పక్షానే 'కృష్ణాపత్రిక' ప్రారంభించ బడింది. 'కృష్ణాజిల్లాలో జాతీయోద్యమం' అను వ్యాసంలో కె. శివరామ కృష్ణారావు మండల మహాసభల వివరాలు రచించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ డాక్టర్ వై. వైకుంఠం, చరిత్ర పరిశోధన జర్నల్‌లో "district Associations and political development in Andhra" (ఆంధ్రలో మండల సంఘాలు-రాజకీయ పరిణామం 1892-1920) అను వ్యాసంలో సమీక్షించారు.

## స్వరాష్ట్రం కోసం ఆంధ్రోద్యమం

స్వరాజ్యం కోసం జాతీయ కాంగ్రెస్ సంస్థ ఎట్లా ఎర్పడిందో, ఆ విధంగానే స్వరాష్ట్రం సంపాదించడానికి, ఆంధ్రోద్యమం ప్రారంభమైంది.

1903లో 'గుంటూరు యువజన సాహితీ సమితి' సమావేశాల చర్చల సంద ర్భంగా, ఆంధ్రరాష్ట్ర వాంఛకు బీజాంకురాలు ఏర్పడ్డాయి. ఈసమస్యపై జొన్నవిత్తుల

గురునాథం, వున్నవ లక్ష్మీనారాయణ, చట్టి నరసింహారావు ప్రభృతులు చర్చలు సాగించారు. ఈ యువకులకు కొండవెంకటప్పయ్య వంటి పెద్దల అండ కూడ లభించింది. ఈ విషయాలపై వార్తాపత్రికలకు అనేక వ్యాసాలు వ్రాసి, 1911లో అఖిలాంధ్ర దేశ చిత్ర పటంతో సహా 'ఆంధ్ర రాష్ట్రం' అనుగ్రంథాన్ని వీరు ప్రచురించారు. అందులో వారు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలోను, హైదరాబాదు సంస్థానంలోని ఆంధ్రభూభాగాలకు మాత్రమే పరిమితంగాక, మైసూరు, బేరారు, మధ్యపరగణాలు, ఒరిస్సా, బొంబాయి సరిహద్దున గల తెలుగు ప్రాంతాలనన్నిటిని కూడా పేర్కొనడం, పటంలో చిత్రించడం, భాషా ప్రయుక్త సిద్ధాంతంపట్ల, వారికిగల విశాల దృక్పధానికి తార్కాణం.

1913 బాపట్ల ప్రథమాంధ్ర మహాసభలో, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని గూర్చి ప్రభుత్వాన్ని కోరదగునా? అని ప్రారంభించి, ద్వితీయ మహాసభలో 'మదరాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలను వేరుచేసి, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం గావించడం యుక్తము, అవశ్యకము' అని స్పష్టంగా పేర్కొనడం జరిగింది. తర్వాతజరిగిన అన్ని ఆంధ్ర మహాసభలలో స్వరాష్ట్ర వాంఛను పునరుద్ఘాటిస్తూవచ్చారు.

1917 సంవత్సరంలో కలకత్తాలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్‌సభ 'భాషా ప్రయుక్తంగా రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలు ఏర్పడవలెననే తీర్మానాన్ని ఆమోదించి, తదనుగుణంగా కాంగ్రెస్ సంఘాల నిర్మాణాన్ని పునర్వ్యవస్థీకరించడం జరిగింది. బెజవాడలో జరిగిన సమావేశంలో 20-1-1918 వ తేదీన ప్రత్యేకంగా ఆంధ్ర కాంగ్రెస్ సంఘం ఏర్పడింది.

'స్వరాజ్యంలోనే స్వరాష్ట్రం' అనే భావన ఆంధ్ర కాంగ్రెస్ వాదులలో ప్రబలంగా వుండేది. గాంధీజీ నాయకత్వాన జరిగిన సహాయ నిరాకరణ, సత్యాగ్రహోద్యమాలలో ఆంధ్రులు ప్రముఖ పాత్రవహించి జైళ్ళలో నిర్బంధితులయ్యే సందర్భాలలో వారు స్వరాష్ట్రం కావాలని పరప్రభుత్వాన్ని యాచించదలచలేదు. అయితే, స్వరాష్ట్ర ఆందోళననుకూడా వారు మానలేదు. ఏటేటా సభాసమావేశాలు జరుపుతూ, ఆంధ్రరాష్ట్ర సమస్యపై ఆందోళన సాగిస్తూవచ్చారు. విభిన్న రాజకీయ దృక్పధాలు కలిగినవివిధ వర్గాల వారిని యిందుకు సమీకరిస్తూవచ్చారు.

# ఆంధ్ర మహాసభలు

| సంవత్సరం | | ప్రదేశం | | సభాధ్యక్షుని పేరు |
|---|---|---|---|---|
| 1. | 1913 | బాపట్ల | — | బి. ఎన్. శర్మ |
| 2. | 1914 | బెజవాడ | — | న్యాపతి సుబ్బారావు |
| 3. | 1915 | విశాఖపట్నం | — | పానుగల్లు రాజా |
| 4. | 1916 | కాకినాడ | — | మోచర్ల రామచంద్రరావు |
| 5. | 1917 | నెల్లూరు | — | కొండ వెంకటప్పయ్య |
| 6. | ,, | (ప్రత్యేకసభ) గుంటూరు | - | కాశీనాథుని నాగేశ్వరరావు |
| 7. | 1918 | కడప | — | నెమలి పట్టాభిరామారావు |
| 8. | 1919 | అనంతపురం | — | గాడిచెర్ల హరిసర్వోత్తమరావు |
| 9. | 1920 | మహానంది | — | ఎం. రంగనాథమొదలియార్ |
| 10. | 1921 | బరంపురం | — | (గంపలగూడెం రాజా) కోటగిరి వెంకట కృష్ణారావు |
| 11. | 1922 | చిత్తూరు | — | వేదం వెంకటరాయశాస్త్రి |
| 12. | 1923 | మద్రాసు | — | కట్టమంచి రామలింగారెడ్డి |
| 13. | 1925 | మచిలీపట్నం | — | సామి వెంకటాచలం శెట్టి |
| 14. | 1926 | ఏలూరు | — | (ఉయ్యూరు జమీందారు) మేకా వెంకట రంగయ్యాప్పారావు |
| 15. | 1927 | అనంతపురం | — | ఓ. లక్ష్మణస్వామి |
| 16. | 1928 | నంద్యాల | — | డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ |
| 17. | 1929 | బెజవాడ | — | వి. వి. ఎస్. నరసింహరాజు |
| 18. | 1930 | గుంటూరు | — | వి. వి. జోగయ్య |
| 19. | 1931 | మద్రాసు | — | కడప కోటిరెడ్డి |
| 20. | 1932 | బెజవాడ | — | కె. వి. రెడ్డి నాయుడు |
| 21. | 1934 | విశాఖపట్నం | — | దేశపాండే సుబ్బారావు |

| | | | | |
|---|---|---|---|---|
| 22. | 1936 | కాకినాడ | — | వేమవరపు రామదాసు |
| 23. | 1937 | బెజవాడ (రజతోత్సవం) | — | కడప కోటిరెడ్డి<br>టి. ఎన్. రామకృష్ణారెడ్డి |
| 24. | 1938 | మద్రాసు | — | డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ |
| 25. | 1939 | గుంటూరు | — | అనంతశయనం అయ్యంగార్ |
| 26. | 1941 | విశాఖపట్నం | — | విజయనగరం కుమారరాజా సర్ విజయ |
| 27 | 1943 | బళ్ళారి | — | ,, |
| 28. | 1951 | మద్రాసు (ప్రత్యేకమహాసభ) | — | ఉయ్యూరు కుమారరాజా ఎం. ఆర్. అప్పారావు |
| 29. | 1951 | గుంటూరు | — | గాడిచెర్ల హరిసర్వోత్తమరావు |

(తదనంతరం ఆంధ్రమహాసభలు జరుగలేదు. 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది.)

## 'దీక్ష'

అదిగో మ్రోగె స్వతంత్రభేరి, మన రాష్ట్రార్థమ్ముకై మింటిపై
గదలన్ నేర్చిన నాంధ్రవీరుల పతాకశ్రేణి యుప్పొంగుచున్
పదరా ముందుకు పుష్పవృష్టి కురిపింపన్ వచ్చె నీపైన నీ
రదముల్, వేగమె ఆంధ్ర రాష్ట్ర రథ సారథ్యంబు గావింపరా?

—ఓగిరాల సోదరకవులు.

జారిన దేశగౌరవము చక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి, సమాన రాష్ట్రముల్
కూరిమి నాసజేయ తెనుగుం బుడమిన్ గై సేయరయ్య దీ
క్షారతి నాంధ్ర పుత్రులు జగజ్జన ధర్మమె దృష్టి నిల్పుచున్

—రాయప్రోలు.

# హోం రూల్ ఉద్యమం

*ఏ దేశమేగినా ఎందుకాలిడిన*
*ఏ పీఠమెక్కినా యెవ్వారెదురైనా*
*పొగడరా నీతల్లి భూమిభారతిని*
*నిలుపరా నీజాతి నిండుగర్వమ్ము'*

—రాయప్రోలు సుబ్బారావు.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో, 1914 నుండి ఆనీబిసెంట్ 'హోంరూల్' ఆందోళన సాగించింది. ఆమె ఐరిష్ యువతి. భారతీయ సంస్కృతిపట్ల అత్యంత అభిమానం కలిగిన వ్యక్తి థియసాఫికల్ సొసైటీకి అధ్యక్షురాలు. 'భారతీయులకు స్వపరిపాలన' యివ్వాలని ఆమె పట్టుబట్టారు. 'న్యూఇండియా', 'కామన్‌వీల్' పత్రికల ద్వారా, అనేక సభాసమావేశాలద్వారా ఆమె తీవ్రాందోళన గావించింది. 'న్యూఇండియాలో ఆనీబీసెంట్ ఇలా వ్రాశారు :

"భారతదేశం తన జన్మహక్కుగా స్వపరిపాలన కావాలని కోరుతూవుంది. యుద్ధానికి పూర్వం, మధ్యన, తర్వాత కూడా వారు ఈ హక్కును అడుగుతారు. ఈ విషయంలో బ్రిటిష్ వారితో రాజీఅంటూలేదు."

ప్రభుత్వం ఆనీబీసెంట్‌ను మదరాసులో నిర్బంధించింది. ఆమెను నిర్బంధించినప్పుడు, విడుదలకోసం దేశంలో తీవ్రాందోళ చెలరేగింది. విడులైన తర్వాత, 1917 లో జరిగిన భారత కాంగ్రెస్ మహాసభకు ఆనీబీసెంట్ అధ్యక్షురాలుగా ఎన్నికో బడింది.

ఆనీబీసెంట్ 'హోంరూల్' ఉద్యమం సాగిస్తున్న సమయంలోనే బాలగంగాధర తిలక్ స్వరాజ్యం కావాలని మహారాష్ట్ర ప్రాంతంలో తీవ్ర ఆందోళన సాగించారు. హోంరూల్ ఉద్యమానికి ఆయన అండగా నిలిచారు. వీరిరువురూ సాగించిన హోంరూల్ ఉద్యమం భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ఒక ప్రముఖ స్థానం ఆక్రమిస్తుంది.

## తిలక్ స్వపరిపాలనా ఉద్యమం :

కాంగ్రెస్ చరిత్రలో యిది స్వపరిపాలన నాయుగం. అంతవరకు అతివాదులకు ప్రాతినిధ్యంవహించే బాలగంగాధర తిలక్,మితవాద ప్రముఖులైన గోపాలకృష్ణగోఖలే, ఫిరోజిషా మెహతా మున్నగు వారికి మధ్య కాంగ్రెస్ సంస్థ అనుసరించవలసిన కార్య విధానాలపై తీవ్ర చర్చలు, వాగ్వివాదాలు జరుగుతుండేవి సూరత్ కాంగ్రెస్ మహా సభలో అతివాద మితవాదుల మధ్య ఉత్పన్నమైన తీవ్ర అభిప్రాయభేదాల వల్ల బాల గంగాధరతిలక్ అప్పట్లో కాంగ్రెస్ నుండి వైదొలగినప్పటికీ, 1916 లక్నో కాంగ్రెస్ సభ జరిగేనాటికి, తిలక్ తమ అనుచరులతో సహా మరల కాంగ్రెస్‌లో చేరి సంస్థకు బలం చేకూర్చారు.

దివ్యజ్ఞాన సమాజ శాఖల ద్వారా ఆనీబ్‌సెంట్ హోంరూల్ ఉద్యమం సాగిస్తున్న సమయంలోనే తిలక్ మహాశయుడు ఈ స్వరిపాలనా ఉద్యమాన్ని ఉద్భృతం చేశారు. 1916 మే మాసంలో బెల్గాం, అహమ్మద్‌నగర్‌లలో ఆయన గావించిన ప్రసంగాలలో రాజద్రోహం నేరంచేసినట్లు జిల్లా మేజస్ట్రేట్ ఆయనకు శిక్ష విధించాడు. కాని బొంబాయి హైకోర్టు తిలక్ నిర్దోషియని శిక్షను రద్దుచేసింది.

రాజకీయ రంగంలో తిలక్ అతివాదపక్ష నాయకుడుగా వున్న ప్రథమదశ అంతా, మహారాష్ట్రంలో జాతీయ భావోద్రేక భావాలను ప్రజల్లో ప్రజ్వలింపచేయడంలో గడిచిపోయింది. తర్వాత ఆయన 'స్వదేశీ' ఆందోళనను దేశవ్యాప్తంగా ప్రచారం గావించారు. ఆ ఉద్యమకాలంలో తిలక్ ప్రబోధించిన కార్యక్రమాలు నాలుగు. 1) స్వరాజ్యం 2) స్వదేశీ వస్తు అభిమానం 3) జాతీయ విద్య 4) విదేశీ వస్త్ర బహిష్కారం. ఈ నాల్గింటినీ తిలక్ గట్టిగా చేబట్టారు. స్వరాజ్యం అనడంలో జాతికి స్వపరిపాలన చేకూర్చడం— అందుకే (Swaraj is my birthright - We will have it) "స్వరాజ్యం నా జన్మహక్కు - దానిని సాధించుతాం" అని ఆయన ప్రబోధించారు. 'జాతీయ విద్య' అంటే యువజనులను జాతీయభావ ప్రపూరితులుగా తయారుచేయడం— త్వరలో అది సిద్ధించినట్లయితే, దానిని నిర్వహించుకొనే స్వతంత్ర పౌరులుగా వారిని తీర్చిదిద్దడం. విదేశ వస్త్ర, వస్తు బహిష్కారం అనడంలో ప్రభుత్వాధికారానికి మధ్య వున్న సంఘర్షణకు ఒక రూపం ఏర్పడి, ప్రజలను కార్యోన్ముఖులను చేయడం. తదేక దీక్షతో ఈ చతుర్విధ కార్యక్రమాలను నెరవేర్చేందుకు కాంగ్రెస్ మహాసభలలో తిలక్ పట్టుబడుతూవచ్చారు. తిలక్ ఉపన్యాసాలలో వీటి ప్రాముఖ్యతను సమగ్రంగా వివరించారు.

వంగవిభజన కాలంనుండి 'స్వదేశీ- స్వరాజ్య' నినాదాలు ప్రజల్లో బాగావ్యాపించాయి. 1906 కలకత్తా కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించిన దాదాబాయ్‌నౌరోజి 'స్వరాజ్యం' అనుపదాన్ని ప్రధమంగా అధికార పూర్వకంగా ఉల్లేఖించారు. తిలక్ 'పైసాఫండు' వసూలుచేసి మహారాష్ట్రంలో గాజుసామానులు తయారుచేసే ఫ్యాక్టరీని నెలకొల్పారు. కేసరి మరాఠీ పత్రికలలోని రచనలకు ప్రభుత్వం ఆయనపై రాజద్రోహం నేరంమోపి 6 ఏండ్లు ఏకాంతవాస శిక్షవిధించింది. మాండెలే జైలులో వున్నప్పుడే ఆయన Arctic Home of vedas,' 'గీతారహస్యం' అను బృహద్గ్రంధాలు రచించారు. గీతారహస్యం కర్మయోగశాస్త్రం, తెలుగు భాషతోసహా, వివిధ భాషల్లోకి అనువదింప బడిన గ్రంధంఅది. తిలక్ మహాశయుడు గొప్ప పండితుడు. భారత జాతీయోద్యమానికి ఆయన గావించిన సేవ అనన్య సామాన్యమైనది. తిలక్ త్యాగశక్తి అపారం. అచంచలమైన ధైర్యం ఆ త్యాగశక్తికిమూలం. జాతీయనాయకులలో ఆయనతో సమానంగా బాధలకు ఓర్చినవారు, అంత నిర్లిప్తంగా కష్టాలు సహించినవారులేరు. తిలక్‌లో సుప్రసన్నత, దృఢమైన సంకల్పం, అకుంఠితకార్యదీక్ష, అపూర్వమైన అంతశ్శక్తి మేళవించాయి.

గోపాలకృష్ణగోఖలే 1915 ఫిబ్రవరి 19న పరమపదించడం ఆ నవంబరులో ఫిరోజిషా మెహతా స్వర్గస్థుడవడం, ఆసమయంలోనే లోకమ్యానతిలక్ మాండలే జైలు నుంచి విడుదలై రావడంజరిగింది. తదనతరంతిలక్ భారత జాతీయోద్యమానికి కర్ణధారి అయినారు. కాంగ్రెస్ చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభమైంది.

## ఆంధ్రలో హోంరూల్ ప్రచారం

హోంరూల్ ఉద్యమం సందర్భంగా, ఆంధ్రలో జరిగిన ఆందోళన, ప్రచార కార్యక్రమాలను గురించి తెలుసుకుందాం :

హోంరూల్ లీగ్‌కు ఆంధ్రలో గాడిచెర్ల హరిసర్వోత్తమరావు కార్యదర్శిగా వుండేవారు. గుంటూరు, విజయవాడ, కాకినాడ, మచిలీపట్నం, మదనపల్లి, బళ్లారి, కడప, చంద్రగిరి, ఏలూరు, తెనాలి మున్నగు పట్టణాలలో అనీబీసెంట్ నిర్బంధానికి నిరసన తెల్పుతూ, పౌరులు సభలు జరిపారు. కొండ వెంకటప్పయ్య, డాక్టర్ పట్టాభి, కాశీనాధుని నాగేశ్వరరావు, కె.వి. రెడ్డి నాయుడు, గుత్తి కేశవ పిళ్లై, హత్తి శంకరరావు, రంగనాధ మొదలియార్ మొదలగు వారు హోంరూల్ లీగ్‌లోచేరి, ప్రచారం చేశారు. 1917 వ సంవత్సరానికి ఆంధ్రలో 52 శాఖలు ఏర్పడ్డాయి. హోంరూల్ యిస్తేనే

యుద్ధంలో ప్రభుత్వంతో సహకరించగలమని, తిలక్ అనుసరించిన వైఖరిని ఆంధ్ర నాయకులు బలపరిచారు.

## మదనపల్లి థియసాఫికల్ కళాశాల

అనీబీసెంట్ మదనపల్లిలో థియసాఫికల్ కళాశాలను స్థాపించారు. ఈ కాలేజికి జి. హెచ్. కజిన్స్ ప్రిన్సిపాల్‌గా వుండేవారు. అధ్యాపకులు, విద్యార్థులు జాతీయాభిమానులుగా పేరు పొందారు. విద్యార్థులు బాడ్జీలు ధరించి, 'దేశం కోసం త్యాగం చేస్తాం' అని ప్రతిజ్ఞ చేశారు. రాయలసీమలో జాతీయోద్యమ వ్యాప్తికి, మదనపల్లి కళాశాల ముఖ్య కేంద్ర స్థానమయింది.

పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, కె విజయ భాస్కరరెడ్డి, సి దాస్ మున్నగువారు ఈ కళాశాల విద్యార్థులుగా వుండి, తదనంతరం జరిగిన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు.

## కడప జిల్లాలో సభలు :

హోంరూల్ ఆందోళన సందర్భంలో, కడప జిల్లా సభ కడపలో జరిగింది. దివాన్ బహదూర్ ఎ.సి. కృష్ణారావు, వి. సుబ్రహ్మణ్యం, ఆనరబుల్ ఆసద్ ఆలీఖాన్ మొదలగు ప్రముఖులు ఆ సభలో ప్రసంగించారు.

1918 సంవత్సరం కడపలో జరిగిన రాష్ట్ర దివ్యజ్ఞాన మహాసభకు ఆనరబుల్ వెంకటపతిరాజు అధ్యక్షత వహించారు. 'సమంజసమైన కాలవ్యవధిలో భారతదేశానికి స్వపరిపాలనను ప్రసాదించాలని' బ్రిటిష్‌వారిని కోరుతూ, ఆ సభలో తీర్మానం చేశారు.

అంతకుపూర్వమే 1900 సంవత్సరంలో, 'కడప మండల అసోసియేషన్' ఏర్పడింది. వై. నాగయ్య అధ్యక్షుడుగా వుండేవారు. 1905 బెంగాలు విభజనకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళన ప్రభావంవలన, కడప, ప్రొద్దుటూరు మొదలగు పట్టణాలలో ప్రజలు బిపిన్ చంద్రపాల్, బాలగంగాధర తిలక్ చిత్రపటాలకు పూలమాలలు వేసి, ఊరేగింపులు చేశారు. జిల్లాలో అప్పట్లో ప్రముఖపాత్ర వహించింది ఎం సి. రామారావు ఆయన ప్రొద్దుటూరు, జమ్మలమడుగు గ్రామాదులలో విదేశవస్త్రాలను బహిష్కరించాలని తీవ్ర ప్రచారం గావించారు. 30 మంది పంచములనుచేర్చి, వారికి ఉచిత రాత్రి పాఠశాలలు ఏర్పాటుచేశారు.

హోంరూల్ ఉద్యమం ముఖ్యంగా ఆంధ్ర విద్యావంతులలో సంచలనం కల్గించింది,

# విప్లవోద్యమం

'మాతృ నివేదన'

ఆత్మత్యాగమే యశమునకు ప్రథమ సోపానము
ఆత్మత్యాగమే సర్వసౌఖ్యములకు మూలాధారము
ఆత్మత్యాగమే మోక్షదాయకము

'స్వరాజ్య నామోచ్చరణమే స్వరాజ్యమును లభింపజేయనేరదు. మనలోని ప్రతి జీవియొక్క స్వరాజ్య ధర్మావలంబనమే స్వరాజ్యమును సిద్ధింపజేయును.'

> లోకమాతకు ఛత్రపతి శివాజీ తన శిరస్సును సమర్పించ సంసిద్ధుడైన పిదపనే భవానీదేవత దర్శనమొసగి భారతీయులను దాస్య విముక్తులుగ జేయ నాజ్ఞనిచ్చెను. భారతమాత నేడు మన హృదయములను, మన ద్రవ్యమును, మన ప్రాణమును గోరుచున్నది. ఎందరు తన కొరకు జీవించెదరు? ఎందరు తనకొరకు ప్రాణములర్పించెదరు? అని ప్రశ్నించి మన ప్రత్యుత్తరమునకై నిరీక్షించుచున్నది.

'భారతీయ సోదరులారా! మీరు మన మాతృవాక్య పరిపాలనముచే స్వాతంత్ర్యము గాంచి గరుడినివలె యశోవంతులగుదురా? లేక నశించెదరా?'

'కృష్ణాపత్రిక' సంపాదకీయం
(1908 ఏప్రిల్ 19)

వందేమాతరం, స్వాతంత్ర్య ఉద్యమాల సందర్భాలలో బ్రిటిష్ ప్రభుత్వం తీవ్ర నిర్బంధాలకు పూనుకొంది. దేశభక్తులపైన దుర్మార్గాలుచేసిన తెల్ల అధికార్లను హత మార్చడం యువకులు ప్రధానలక్ష్యంగా పెట్టుకున్నారు. తెల్లదొరలంటే, వాళ్ల పరిపాలన అంటే, అప్పట్లో ప్రజలకు భయంగావుండేది. యువకులలో, విద్యార్థులలో దేశభక్తియుత రోషాగ్నిని రగుల్కొల్పడం, వారిని బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడేటట్లు చేయడం, విప్లవకారులు తమ పవిత్ర కర్తవ్యంగా భావించారు.

గాంధీజీ భారత రాజకీయరంగంలో ప్రవేశించి, స్వతంత్ర సాధనంగా, అహింసా మార్గాన సహాయనిరాకరణ, సత్యాగ్రహ పద్ధతులలో నూతన ప్రయోగం చేసేవరకు,

యువకులకు రాజకీయనాయకులకు అమెరికా, ఇంగ్లండు, ఇటలీ, రష్యా, ఫ్రాంసులలో జరిగిన సైనిక పోరాటాలపంథాయే మార్గదర్శకంగా వుండేది. అందుచేతనే మన దేశంలో మొదట చెలరేగిన ఆందోళన బాంబువాదంతోనే (bomb cult) నడిచింది. స్వాతంత్ర్యం కోసం విప్లవ నాయకులు పోరాటంలో ప్రాణాలు బలియిచ్చారు. కొందరు దీర్ఘకాల ద్వీపాంతర శిక్షలు అనుభవించారు. హింసకు ప్రతి హింసతోనే సమాధానం చెప్పారు. వీరిని టెర్రరిస్టులనీ, అరాజకవాదులనీ పేరిడి, క్రిమినల్ నేరాలు మోపుతూ బ్రిటిష్ ప్రభుత్వం. క్రూరంగా హింసించింది. దేశభక్తితో కూడిన వారి సాహస చర్యలను అరికట్టడానికి, ఎంతో దారుణంగా ప్రవర్తించింది. దేశస్వరాజ్యంకోరే తిలక్, లజపతిరాయ్,గాంధీజి మున్నగు జాతీయ నాయకులందరూ విప్లవకారులపై బ్రిటిష్ పాలకులు సాగిస్తున్న నిరంకుశ విధానాన్ని తీవ్రంగా గర్హించారు.

దేశానికి స్వతంత్రంకావాలనే ప్రధాన లక్ష్యంలో జాతీయ వాదులకు-విప్లవకారులకు తేడాఏమీలేదు. లక్ష్యసాధనకు అనుసరించే మార్గాలలోనే వున్నలేడా. అందుచేత, వారిని టెర్రరిస్టులనీ, ఉగ్రవాదులనీ పేర్కొనడం కంటే వారిని స్వాతంత్ర్యమనే మహాయజ్ఞంలో తమ ప్రాణాలను సమిధలుగా వేసిన వీరులుగా ప్రజలు పరిగణించారు.

విప్లవవీరులు కేవలం తమ స్వార్థం కోసం ఏ దోపిడీ చేయలేదు. వ్యక్తిగత స్వార్థం కోసం తెల్లవారినెవరినీ హత్యచేయలేదు. ఒక మహోన్నత లక్ష్యం కోసమే వారు తమ ప్రాణాలను బలియిచ్చారు. వారి హృదయాలలో జ్వాజ్వల్యమానంగా ప్రకాశించే సామ్రాజ్యవ్యతిరేకత, దేశభక్తి, స్వాతంత్ర్య తృష్ణ ఆదర్శప్రాయమైనది. ఆ త్యాగమూర్తులపేర్లు దేశచరిత్రలో నేటికీ నిలచివున్నాయి.

## బెంగాలు విప్లవకారులు :

1905 బెంగాలు విభజనాందోళన సందర్భంలో అరవింద ఘోష్, బరీంద్ర ఘోష్‌ల నాయకత్వాన, విప్లవయువకులు 'అనుశీలన సమితి'ని ఏర్పరచి, దురహంకారులైన ప్రభుత్వోద్యోగుల పైన ప్రతీకారం తీర్చుకోసాగారు. ఆలీపూర్ కుట్రకేసులో 34 మంది విప్లవకారులనుయురికించి, వారికి ప్రభుత్వం ద్వీపాంతర వాసశిక్షలు, ఉరిశిక్షలు, విధించింది. యు.పి, పంజాబులలో కూడా అనుశీలన సమితి శాఖలేర్పడి విప్లవకార్యక్రమాలు సాగించారు. అపూర్వ త్యాగాలు చేశారు.

## సావర్కార్ సోదరులు:

లండన్‌లో వినాయక సావర్కార్ 'భారతభవన్' అనే విప్లవ సంఘాన్ని ఏర్పరచి రహస్య కరపత్రాలను, తుపాకులను భారత దేశానికి పంపిస్తుండేవారు.

పాశ్చాత్య చరిత్రకారులచే, సిపాయీల తిరుగుబాటుగా చిత్రించబడిన 1857 విప్లవ తిరుగుబాటును గూర్చి వీరసావర్కార్ పరిశోధన జరిపి, దానిని ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధంగా' అభివర్ణించారు. ఆయన రచించిన గ్రంథాన్ని ప్రభుత్వం నిషేధించింది. భారతీయ యువకులను విప్లవ వీరులుగా తయారు చేసేందుకు సావర్కార్ అహర్నిశలు కృషిచేశారు. ఆయన సోదరుడు గణేశ్ సావర్కార్‌కు కూడా ద్వీపాంతరవాస శిక్షలు విధించారు. సావర్కార్ సోదరులు మహారాష్ట్ర యువకుల్లో విప్లవ బీజాలు నాటారు. దేశానికి త్యాగమార్గం చూపారు.

## గదర్ పార్టీ యోధులు :

1914 మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులవి. విదేశాలకు వెళ్ళిన పంజాబ్ యువకులు కొందరు 'గదర్ పార్టీని' స్థాపించారు. పర ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవం తేవాలని వారు పథకం వేశారు. లాలాహరదయాళ్ నాయకత్వాన బాబాసోహన్‌సింగ్ బాక్నా, కర్తార్‌సింగ్, పృథ్వీసింగ్ ఆజాద్, రూర్‌సింగ్ ప్రభృతులు బ్రిటిష్ ప్రభుత్వంతో సైనిక పోరాటం సాగించడానికి సన్నాహాలు చేశారు. శ్యాంజీ కృష్ణవర్మ. సరోజినీ నాయుడు సోదరుడు వీరేంద్ర ఛటోపాధ్యాయ, స్వామి వివేకానంద సోదరుడు భూపేంద్రనాథ్‌దత్, రాజామహేంద్రప్రతాప్ మున్నగు వారు యిందుకు ఎంతగానో కృషిచేశారు.

1915-16 సంవత్సరంలో మహేంద్ర ప్రతాప్ నాయకత్వాన, ఆఫ్ఘనిస్థాన్‌లో స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఏర్పరిచారు. కమగటమార ఓడపై వచ్చి భారతదేశంలో విప్లవ పోరాటం సాగించ సన్నద్ధులైనారు. కాని ప్రభుత్వం ముందుగా పసిగట్టి, ఓడలోని గదర్ పార్టీ వీరులను అరెస్టుచేసి, వారిని దీర్ఘకాల శిక్షల పాలు జేసింది.

## హిందూస్థాన్ సోషలిస్టు ఆర్మీ :

భగత్సింగ్ మున్నగు వీరకిశోరాలు 'హిందూస్థాన్ సోషలిస్టు ఆర్మీ'ని స్థాపించి విప్లవ చర్యలకు పూనుకున్నారు. యువకులకు వీరు అనేక శిక్షణా తరగతులు నిర్వహించారు.

1929లో రాజ ప్రతినిధి ఇర్విన్ ప్రయాణం చేస్తున్న రైలు క్రింద వీరుబాంబు పెట్టారుగాని, ఆ ప్రయత్నం ఫలించలేదు. కేంద్రశాసనసభ సమావేశం జరుగుతుండగా భగత్సింగ్, భటుకేశ్వరదత్తులు ప్రేలనిబాంబువేసి, ఇచ్ఛికంగా పోలీసులకు పట్టుబడి పోయారు. షహరాన్‌పూర్ బాంబు ఫ్యాక్టరీలో శివవర్మ జయదేవులు అరెస్టుఅయినారు. భగత్సింగ్ దత్తులకు మొదట ద్వీపాంతరశిక్ష విధించారు. అందరూ పట్టుబడిన తర్వాత రెండవ లాహోరు కుట్రకేసులో కలిపి వీరినివిచారించారు. విచారణ తంతుఅంతా ముద్దాయిల పరోక్షంలోనే జరిగింది. విప్లవ వీరులైన భగత్సింగ్ రాజగురు, సుఖదేవ్‌లకు ఉరిశిక్షలు, ఏడుగురికి ద్వీపాంతరవాస శిక్షలు, మరి కొందరికి దీర్ఘకాలపు శిక్షలు విధించడం జరిగింది. సర్దార్ భగత్సింగ్‌ను 24 ఏండ్ల ప్రాయంలోనే 1931 సం॥ లో ఉరితీశారు. మహావీర్ సింగ్ అండమాన్స్ జైలులో మరణించారు. కిశోర్‌లాల్, జయదేవ్, శివవర్మ, గయాప్రసాద్ ప్రభృతులు దీర్ఘకాలం జైళ్ళలోమ్రగ్గారు. అజయ కుమార్ ఘోష్. విజయకుమార్ సిన్హామున్నగు విప్లవకారులు లాహోర్ కుట్రకేసులో ముద్దాయిలు.

## సర్దార్ భగత్సింగ్

భగత్సింగ్, సుఖదేవ్, రాజగురులను ఉరితీయబోతుండగా ఆ విప్లవ వీరులు (ఇంక్విలాబ్ జిందాబాద్) 'విప్లవం వర్ధిల్లాలి' అని జైలుగోడలు ప్రతిధ్వనిస్తూ పరవశంతో నినాదాలు చేస్తూ వీరమరణం చెందారు. భగత్సింగ్ ఉరితీయబడిన రోజు తన సోదరుడైన కుల్తార్‌సింగ్‌కు వ్రాసిన ఉత్తరం చదవండి:

> "సూర్యోదయపు వెలుగులో అదృష్టాన్ని ఎవరు ఆడ్డుకోగలరు? యావత్ప్రపంచం మనకు విరుద్ధంగా నిలుచున్నా, మనకొచ్చే నష్టం ఏమిటి?
>
> ప్రియమైన మిత్రులారా! నా జీవితపు రోజులు పూర్తికావచ్చినవి. దీపంజ్యోతి ఆరిపోనట్లు, నేనూ ఉదయకిరణాలు వెలిగేలోపల అదృశ్యమవుతాను. కాని మన భావాలు, విశ్వాసాలు విద్యుల్లతవలె యావత్ప్రపంచాన్ని ప్రకాశింపజేస్తాయి. ఈ పిడికెడు మన్ను నశించి పోతే అయ్యే నష్టం ఏముంది?"

ఆహా! భగవత్సింగ్‌ది ఎంత ఉదాత్త ఆశయం! ఎంతటి అచంచల విశ్వాసం!! సర్దార్ ఉరికంబం ఎక్కాడు. స్వర్గధామం చేరాడు. త్యాగపతాకాన్ని ఎగురవేసిన అమరుడు ఆయన.

## చంద్రశేఖర ఆజాద్

మరో విప్లవసింహం చంద్రశేఖర ఆజాద్. ప్రాణాలతో పోలీసులకు పట్టుబడకుండా, కట్టకడపటి వరకు పోరాడిన ధీరుడు. ఉత్తర హిందూస్థానంలో ఆయన ఆధ్వర్యం లేకుండా జరిగిన విప్లవ చర్యలంటూలేవు. ఆజాద్ అపరిమిత ధైర్యశాలి.

ఆజాద్ అసలు పేరు తివారి. బెనారస్‌లో చదువుతూ, చిన్నతనంలోనే చదువుకు స్వస్తిచెప్పి, స్వాతంత్రోద్యమంలో సైనికుడైనాడు. ఒకసారి పోలీసులు అరెస్టుచేసి, మేజస్ట్రేట్ ఎదుట హాజరుపెట్టారు.

'నీ పేరేమిటి?' అని అడిగాడు మేజస్ట్రేట్.

నా పేరు 'ఆజాద్' అన్నాడు తివారి. (ఆజాద్ అనగా 'స్వేచ్ఛ.')

మేజ: నీ తండ్రి పేరేమిటి?

తివారీ: నా తండ్రి పేరు 'స్వాధీన్' అన్నాడు. (స్వాధీన్ అనగా స్వాతంత్ర్యం)

మేజ : మీదేవూరు?

తివారీ - జైలు అని బదులు చెప్పాడు. మేజస్ట్రేట్ రెచ్చిపోయి ఆ బాలునికి 18 కొరడా దెబ్బలు బహూకరించాడు. కొరడా దెబ్బలకు వళ్లు వ్రయ్యలవుతుంటే 'వందేమాతరం' అనే మాటతప్ప మరోమాట అతని నోటినుండి రాలేదు. ఆనాటినుండి తివారీ పేరు 'చంద్రశేఖర ఆజాద్'గా చరిత్రలో ప్రసిద్ధికెక్కింది.

ఆజాద్ అజ్ఞాతంలో అలహాబాద్‌లోని ఆల్‌ఫ్రెడ్ పార్కులో వుండగా అతని ఆచూకీ కనుగొని పోలీసులు చుట్టుముట్టారు. సింహబలుడైన ఆజాద్ తన రివాల్వార్‌తో చివరి గుండు వరకు కాల్చి, వీరమరణం చెందాడు.

## విప్లవవీరుల సాహస చర్యలు :

కలకత్తా మేజస్ట్రేట్ కోర్టులో ఒక బాలుడు 'వందేమాతరం' నినాదాలు చేశాడని, మేజస్ట్రేట్ కింగ్స్‌ఫర్డ్ ఆ బాలుని 15 కొరడా దెబ్బలు కొట్టించాడు. అతని దుశ్చర్య ప్రజలలో కోపోద్రిక్తత కలిగించింది. అది గమనించి అధికార్లు ఆ మేజస్ట్రేట్‌ను ముజఫర్‌పూర్‌కు బదిలీచేశారు. ఖుదీరాంబోస్, ప్రపుల్లచాకీ అను విప్లవ యువకులు అతనివెంట పడ్డారు. అతనేనని భావించి, ఒక కోచ్‌పై బాంబులు విసిరారు.

మరెవరో మరణించగా ఆ యువకులపై హత్యానేరంమోపి వారిరువురికి ఉరిశిక్షలు విధించారు. ప్రఫుల్లచాకీ శత్రువు చేతిలో చావడమెందుకని తానే ఆత్మహత్య చేసు కున్నాడు. ఖుదీరాంబోస్‌ను ఉరితీశారు.

పూనాలో ప్లేగు వ్యాపించిన సందర్భంలో బ్రిటిష్ సైనికాధికారియైన ర్యాండ్‌ను ఎవరో హత్యచేశారు. యువకులకు విధించబడిన ఉరిశిక్షను ఖండిస్తూ, ఆ యువక వీరుల దేశభక్తిని ప్రశంసిస్తూ తిలక్ 'కేసరి' పత్రికలో వ్యాసం వ్రాశారు. అంతట తిలక్‌పై రాజద్రోహ నేరంమోపి 6 ఏండ్లు మాండలే జైలులో నిర్బంధించడం జరిగింది.

వందేమాతరం ఉద్యమం రోజుల్లో చిదంబరంపిళ్లై, సుబ్రహ్మణ్యం శివం అను వారలను రాజద్రోహం నేరంక్రింద పోలీసులు అరెస్టు చేశారు. అందుకు తీవ్రనిరసన తెల్పుతూ, తిరునల్వేలి, టుటికొరన్ ప్రజలు కోపోద్రిక్తులై ప్రభుత్వ కార్యాలయాలపైన దాడిచేశారు. ప్రజలపైన దొమ్మీ కేసుపెట్టి, 27 మందికి కఠిన శిక్షలు విధించడం జరిగింది. అప్పుడు ఆష్ అనునతడు జాయింటు మేజస్ట్రేట్‌గా వుండేవాడు. అతడు జనం మీద కాల్పులు చేయించాడు. కొందరు పోలీసు కాల్పులలో మరణించారు. ఆ కేసు విచారణచేసి చిదంబరంపిళ్లైకు, సుబ్రహ్మణ్యం శివంకు యావజ్జీవ శిక్షలు విధించారు. ఆ శిక్షలను ఖండిస్తూ, యిరువురిని కాల్పులకు బలిచేశారని గాడిచెర్ల హరి సర్వోత్తమరావు 'స్వరాజ్య' పత్రికలో వ్రాయగా, వారికి కూడా కఠిన శిక్షలువేశారు

వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ సరోజినీదేవి సోదరుడు. అతడు ఉన్నత విద్యాభ్యాసంకోసం లండన్ వెళ్లాడు. 'ఇండియాహౌస్'లో సావర్కార్ సోదరులతో కలిసి, భారత స్వాతంత్ర్యంకోసం దీక్షవహించాడు. సోదరివలె వీరేంద్రనాథ్ చక్కని కవి. పరాంకుశంవారు ఆయన గీతాన్ని ఇలా ఆంధ్రీకరించారు :

*స్వార్థ గర్భుయగు భారతమాతా*
*నీకీదుర్దశ వాటిల్లెనుగా*
*ఓ హిందూదేశమా! మా హిందూదేశమా!*
*అడుగనునిన్నే ఐహికభోగము*
*విడిపింపగ నీపైకబంధహస్తము*
*అడుగుదు ఆ పనిచేయగలబలము ॥ఓ హిందూదేశమా॥*
*వచలింపగ నీ హానిసతనము*
*వేయిసార్లు జన్మించెద నీ గర్భమున*
*వేయిసార్లు పాలించెద నార క్తంబును ॥ఓ హిందూదేశమా॥*

వీరేంద్రునిది ఎంతటి మహోత్కృష్ట ఆశయం, మహోన్నతభావం!!

సహాయ నిరాకరణోద్యమ కాలంలో 1922లో, శాంతియుత సత్యాగ్రహులపైన దౌర్జన్యంచేసిన ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్‌ను, 21 మంది పోలీసులను జనసమూహం తరిమికొట్టి, పోలీస్‌స్టేషన్‌కు నిప్పంటించారు. వారందరూ మరణించారు.

అనంతసింగ్ అను విప్లవకారుడు ఒక రైలునుఆపి, 17 వేలు దోచుకొని ఉద్యమంకోసం వినియోగించాడు.

1924లో గోపీనాథ్ సాహ అను యువకుడు ఎర్నెస్టుడే అను ఇంగ్లీష్‌వానిపై బాంబువేయగా, అతను మరణించాడు. ఈ చర్యతో బెంగాలులోనేగాక, మలయా, షాంఘైలలోకూడా ప్రభుత్వం అరెస్టులుచేసింది. అరెస్టుచేయబడిన వారిలో సుభాస్ చంద్రబోస్‌కూడా ఉన్నారు.

సూర్యసేన్, అంబికా చక్రవర్తి బాంబులు తయారు చేసే ఇంటిని పోలీసులు చుట్టుముట్టారు. వారు బాంబులు విసరుతూ తప్పించుకొని పోయారు. 1926లో చంద్ర శేఖర ఆజాద్, శ్యాంప్రసాద్ బిస్మిల్ నాయకత్వాన ఖజానాను దోచుకున్నారు. విప్లవ కారులపైన 'కాకోరి' కుట్రకేసు బనాయించారు. ఆజాద్ తప్పించుక పోయారు. మైన పూర్, కాకోరి కుట్రకేసులలో శ్యాంప్రసాద్ బిస్మిల్ మున్నగు నల్గురికి ఉరి శిక్షలు విధించారు. మరో నల్గురికి యావజ్జీవ శిక్షలు వేశారు. ఉరికంబం ఎక్కబోతూ కూడా రాంప్రసాద్ బిస్మిల్ "నేను బ్రిటిష్ ప్రభుత్వ పతనాన్ని కోరుతున్నాను." అన్నాడు. రోషన్‌లాల్ చేతిలో భగవద్గీత వుంచుకొని 'వందేమాతరం' అనినినాదం చేసుకుంటూ ఉరికంబాన్ని కౌగలించుకున్నాడు. అషామల్లా చేత ఖురాన్‌ను పట్టుకొని "నేను భారత స్వాతంత్ర్యం కోసం ప్రయత్నించాను. ఈ ప్రయత్నం నాఒక్కడి జీవితంతోనేఅంతం కాదు" అని నవ్వుతూ, ధీరుడై ఉరికంబం ఎక్కాడు.

## చిటగాంగ్‌పైదాడి :

సూర్యసేన్ నాయకత్వాన 1930 ఏప్రిల్ 19 వతేదీన విప్లవకారులు పథకం ప్రకారం తంతితపాలా ఆపీసులను ధ్వంసంచేసి పోలీసుల ఇండ్లపై దాడిచేశారు. ఆయు ధాగారాన్ని కొల్లగొట్టారు. వారు జలాలాబాద్ పర్వతంపై వుండగా, ప్రభుత్వ సైనికులు చుట్టుముట్టారు. 30 మంది విప్లవ కారులను అరెస్టుచేశారు. చంద్రనగర్‌లో జరిగిన సంఘర్షణలో జీవన్‌ఘోషాల్ మరణించాడు. గణేష్‌ఘోష్, ఆనందగుప్తా లోకనాథ్ పాల్ మున్నగు వారు పట్టుబడినారు,

డిసెంబర్ 30వ తేదీన చాంద్‌పూర్ స్టేషన్‌వద్ద ఇన్స్‌పెక్టర్ ప్రేగ్‌ను, మరొక అధికారిని విప్లవకారులు హత్య చేశారు. ఈ కేసులో రామకృష్ణకు ఉరిశిక్ష, కాళీపాద చక్రవర్తికి ద్వీపాంతరవాసంవిధించారు. కేసువిచారణ జరుగుతుండగా, కోర్టు ఆవరణలో ఎవరో డైనమిట్ పెట్టారు. 1931లో ఇన్‌స్పెక్టర్ అమనుల్లాను 14 ఏండ్లబాలుడు బాంబులేసి చంపాడు. ఆ బాలునికి యావజ్జీవ కారాగార శిక్ష విధించబడింది. ఆయుధాగారంపై దాడికేసులో 12 మందికి యావజ్జీవ శిక్షలు, మిగితావారికి దీర్ఘకాల శిక్షలు విధించారు.

1932లో దుల్‌ఘాట్‌లో జరిగిన సంఘర్షణలో పోలీసులలో కామెరాన్, విప్లవకారులలో నిర్మల్‌సేన్, అపూర్వసేన్‌లు మరణించారు. ప్రీతీవడావర్ నాయకత్వాన రైల్వేక్లబ్‌పైన దాడి జరిగింది. ఒకస్త్రీ మరణించింది. 13 మందికి గాయాలుతగిలినవి. పోలీసులు వెంటాడుతుండగా ప్రీతి తానే ఆత్మహత్య చేసుకొంది. 1933 ఫిబ్రవరిలో సూర్యసేన్, వజ్రసేన్‌లను పట్టుకున్నారు. మే 19వ తేదీన తారకేశ్వరి దస్తేదార్‌ను, కల్పనాదత్తును అరెస్టుచేసారు. 1934 జనవరి 2వ తేదీ అర్ధరాత్రివేళ సూర్యసేన్‌ను, తారకేశ్వరి దస్తేదార్‌ను ఉరితీసారు. సూర్యసేన్ జాడ తెలిపిన ద్రోహిని తర్వాత విప్లవకారులు చంపివేశారు. హిమాంసు చక్రవర్తి, నిత్యేసేన్‌లు మరణించగా, హరీన్ చక్రవర్తి, కృష్ణచౌదరి తర్వాత ఉరితీయబడ్డారు.

బారిసాల్ యోధుడు నళినీదాస్ పక్వాసాస్క్వేర్ బాంబుకేసులో పట్టుబడ్డాడు. కాని జైలు నుంచి తప్పించుకొనిపోయాడు. 1933లో చంద్రనగర్ పోలీస్ కమీషనర్‌ను హత్యచేశాడు. కారన్‌వాలిస్ వీధి సంఘర్షణలో పట్టుబడి దినేష్ ముఖర్జీ ఉరితీయబడ్డాడు. 1934లో జైలులోనే పోలీసులు కాల్పులు చేసినప్పుడు సంతోష్‌మిత్రా, తారకేశ్వరసేన్ మరణించారు. నళినీదాస్, జగన్నాథ్ నిర్బంధితులైనారు.

1930 సంవత్సరంలో పెషావర్‌లో సత్యాగ్రహం జరుగుతున్నప్పుడు, రెడ్‌షర్ట్ పఠానులపైన తుపాకులు పేల్చడానికి 'రాయల్ ఘర్వాల్' దళంవారు ఠాకూర్ చంద్రసింగ్ నాయకత్వాన నిరాకరించారు. చంద్రసింగ్‌కు, ఆయన దళంలోని వారికి దీర్ఘకాల శిక్షలు విధించారు.

## విప్లవవీరులకు జోహార్లు :

ఈవిధంగా దేశ స్వాతంత్ర్యంకోసం బ్రిటిష్ ప్రభుత్వ పాలనను అంతమొందించడానికి దృఢతరదీక్షతో, నిరుపమానత్యాగాలతో 'అనుశీలనసమితి', 'గదర్

పార్టీ', 'హిందూస్థాన్ సోషలిస్టు ఆర్మీ', 'ఇండియా హౌస్' మున్నగు విప్లవసంఘాలు దేశవిదేశాల్లో ఏర్పడి, మాతృదేశ దాస్యవిముక్తికి ఎనలేని కృషిచేశాయి.

పైనుదహరించినట్లు చాపేకర్ సోదరులు, వినాయక, గణేష్ సావర్కార్ సోదరులు, అరవిందఘోష్, వీరేంద్రఘోష్ సోదరులు, భగత్సింగ్, సుఖదేవ్, రాజగురు, భటుకేశ్వరగత్తులు, చంద్రశేఖర ఆజాద్, మాడం కామా, రసబిహారీఘోష్, మదన్‌లాల్‌దింగ్రా, పృధ్విసింగ్ ఆజాద్, అల్లూరి శ్రీరామరాజు మున్నగు ఎందరెందరో విప్లవకారులు, వీరాంగనలు తమ అమూల్య జీవితాలను ఆహుతిచేశారు. మృత్యువును కౌగలించుకపోయే ఆఖరిక్షణంలోకూడా, ఆ విప్లవకారులు ప్రదర్శించిన ధైర్య స్థైర్యాలు దేశభక్తి, నిరూపమానమైనవి.

గదర్‌పార్టీ విప్లవకార్యకలాపాల్లో పాలుపంచుకున్న దవిశి చెంచయ్య; భగత్సింగ్‌తో పాటు లాహోరు కుట్రకేసులో ప్రముఖ విప్లవకారుడైన విజయకుమార్ సిన్హా, ద్వీపాంతరవాస శిక్షననుభవించిన ప్రతివాద భయంకరాచారి, అన్నాప్రగడ కామేశ్వరరావు, కాకినాడ మదరాసు కుట్రకేసు ఖైదీలు మన వాళ్లుగావడం ఆంధ్రులకు గర్వకారణమైన విషయం.

విప్లవ కార్యక్రమాల్లో పాల్గొన్న వీరవనితలలో ప్రీతివడ్డాదర్, పట్టభద్రుల స్నాతకోత్సవ సమయంలో గవర్నర్‌పైన బాంబువిసిరినవీణా, కొమిల్లా హత్యకేసులో నిందితురాలు మొదలగు వీరనారీ మణులు యావజ్జీవకారాగార శిక్షల ననుభవించారు. విప్లవకారులకు ఆశ్రయం యిచ్చిన నేరాన్లో కూడా పలువురు స్త్రీలు తీవ్ర నిర్బంధాలకు గురియైనారు.

విప్లవకారులు జైలు వెలుపలేగాదు, జైళ్లలో కూడా విప్లవ సంప్రదాయాలు నెలకొల్పారు. రాజకీయ ఖైదీల హక్కులకోసం జతీన్‌దాస్ జైల్లో ఆ మరణ నిరాహార దీక్షబూని తన ప్రాణాన్నే బలియిచ్చారు. కాన్పూరు, మీరట్, లాహోరు పెషావర్ కుట్రకేసులలో శిక్షల ననుభవించిన వారంతా జైళ్లలో ఈ విధమైన పోరాటం సాగించిన వారే.

విప్లవ సంఘాలలో చేరి పనిచేసిన వారంతా పిన్న వయస్కులైన యువతీ యువకులు. ఆ త్యాగమూర్తుల ఆదర్శ ప్రవర్తన, త్యాగదీక్షలు భావితరాలవారిని ప్రభావితంగావించాయి. ఆ వీరుల నందరినీ పేర్కొనడం యిచ్చట సాధ్యం కాదు. ఆ అజ్ఞాత విప్లవ వీరులందరికీ జోహార్లు అర్పిద్దాం!

అధ్యాయం-5

# తెలంగాణాలో పరిస్థితులు-ప్రజా చైతన్యం

'తెలుగుబిడ్డా మేలుకోవోయ్'

తెల్గుబిడ్డా మేలుకోవోయ్ నైజాము
తెల్గుబిడ్డా లేచిరావోయీ !
దున్ని చెమటోడ్చి ఈ పుడ్మి బంగరుజేసి
సరిసరమ్ములగుంజ నవధాన్యములు రాల్చి
కడుపుతో చచ్చేటి గతి ఏమి పట్టింది ? ॥తెల్గుబిడ్డా॥

దుర్దమ్మ ప్రతాపరుద్రులకు వారసుడ !
కొమరయ్య మొగిలయ్య కొండ్రవేసిన గడ్డ !
మాడిపచ్చేవాడి మతములన్నొక్కటే !
కొంపలార్చేవారి పట్టులో పడబోకు ॥తెల్గుబిడ్డా॥

బ్రిటిష్ ఇండియాలో కాంగ్రెస్ అధ్వర్యాన, విప్లవ సమితుల నాయకత్వాన స్వాతంత్ర్య సముపార్జనకు ఉద్యమాలు ఆందోళనలు జరుగుతున్న కాలంలో, అటు హైదరాబాదు సంస్థానంలో ప్రధానంగా తెలంగాణా ప్రాంతంలో వున్న పరిస్థితులు, ప్రజ్వరిల్లుతున్న ప్రజా ఉద్యమం- తత్ఫలితంగా ప్రజల్లో వస్తున్న నూతన రాజకీయ సాంఘిక చైతన్యం ఎలావున్నదో గమనించుదాం!

బ్రిటిష్ ఇండియాలో కంటే హైదరాబాదు సంస్థాన ప్రజలు నిజాంనవాబుల పాలనలో దుర్భర దారిద్ర్యం అనుభవించారు. జనాభాలో అధిక సంఖ్యాకులు తెలుగు వారు. వీరిలో నూటికి ముగ్గురే చదువరులు. తెలంగాణాలోని పల్లెటూళ్ళలో ప్రజలు నిత్యజీవితంలో అనుభవిస్తున్న కష్టాలను యిందు పేర్కొంటాను.

నవాబు గారి అధికారులు-గ్రామాలకు వచ్చినప్పుడల్లా వర్తకులు వంతులవారీగా అవసరమైన సరుకులన్నీ వారికి ఉచితంగా సరఫరా చేయాలి. అధికార్లు గ్రామంలో మకాంచేస్తే, ఆ కాంపువద్దనే తమ దుకాణంపెట్టి, వారు కోరినట్లు తక్షణం సరుకులు అందించాలి. అట్లా చేయని వర్తకులు నానా చీవాట్లు తినవలసి వచ్చేది.

చేనేత పనివారు తమ మగ్గాలకు మగ్గాలపన్ను చెల్లించ వలసివచ్చేది. ఇది జాగీర్, ఇలాఖా గ్రామాలలో యింకా ఎక్కువగా వుండేది ఈ మగ్గాం పన్నును 'మోతర్ఫ్' అనేవారు.

గ్రామాలలోని మాలమాదిగలు, చాకలి, మంగలి, కమ్మరి కుమ్మరి మొదలైన వృత్తి పనివారంతా 'వెట్టిచాకిరీ' చేయవలసి వచ్చేది. ఒక వూరినుండి మరొకవూరికి అధికార్లు ప్రయాణం చేసినప్పుడల్లా వారి మూటలను, సంచులను మోయవలసివచ్చేది. వంతుపనివారు ఆ సమయానికి యింటలేకుంటే, అతని భార్యగాని, తల్లిగాని కుటుంబీకులు ఆ వెట్టి చేయవలసి వుండేది. చాకిరీ చేసినందుకు వారికి ఎట్టి ప్రతిఫలం ముట్టేది కాదు. ఈ పద్ధతి పనిని 'బేగారీ' అనేవారు.

తెలంగాణా రైతులపైన పన్నులభారం అధికంగా వుండేది. రైతులు తమ స్వంత బావుల నీటి ఆధారంతో సేద్యం చేసుకుంటున్నా వారికి 'నీటిపన్ను' మాత్రం తప్పేది కాదు. దీనిని 'జేరుబావులి' పన్ను అనేవారు. తెలంగాణారైతులకు యిది చాలా బాధగా పరిణమించింది.

## నైజాం నిరంకుశ పాలన :

హైదరాబాదు సంస్థాన పరిపాలన మధ్యయుగపు నిరంకుశ విధానంపై నడిచేది. పరిపాలనా వ్యవహారాలలో ప్రజలకు ఏ మాత్రం జోక్యం వుండేది కాదు. నిత్యజీవితంలో ప్రజానీకానికి కలిగే యిబ్బందులను విచారించే వారేలేరు. సరికదా మొత్తుకున్నా దానిని పెడచెవిని పెట్టేవారు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అనే మాటలు ఉచ్చరించడం కూడా మహాపరాధం చేసినట్లు ఎంచబడేది.

జమీందారీ జాగర్దారీ విధానంపైన, దేశ్‌ముఖుల, దేశపాండేల పైన ఆధారపడి, మత దురహంకారంతో సంస్థానాధీశులు ప్రజలపైన యిష్టం వచ్చినట్లు పెత్తనం చెలాయించే వారు. బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వానికి అడుగులకు మడుగులొత్తుతూ నైజాం సంస్థానాధీశులు వాక్సభా పత్రికా స్వాతంత్రాలను, కాలరాచి అణచి వేశారు. ప్రజలను అజ్ఞానాంధ కారంలో ముంచారు. ప్రాథమిక పౌరహక్కులను నాశనం గావించారు. ఉర్దూ భాషకు పట్టాభిషేకం కట్టి ప్రజల ప్రాంతీయ భాషను అణచివేశారు. కాంగ్రెస్ రాజకీయాలను గాని, స్వతంత్ర భావాలనుగాని సంస్థానంలోకి చొరనివ్వలేదు.

అట్టి దుర్భర పరిస్థితులు తెలుసుకొన్న వారికే, ఎన్ని అవరోధాలను ఎదుర్కొని, సంస్థాన ప్రజా ఉద్యమం పురోగమించవలసి వచ్చిందో అవగాహన అవ్వ

తుంది. మొమినాబాద్‌లో ఒక చిన్న హయ్యర్ సెకండరీ పాఠశాలకు ప్రభుత్వ గుర్తింపు కావాలంటే నాలుగేండ్లు ఎంతో తీవ్రంగా కృషిచేస్తేనేగాని, అది సాధ్య పడిందిగాదు. ఒక దేశభక్తుని మృతికి సంతాపసభ జరుపుకోడానికి సహితం అనుమతి లభించని రోజులవి. ఏదైనా సభా సమావేశాలు జరుపుకోవాలంటే, ముందుగా చేసే ప్రసంగాలు, చర్చించే తీర్మానాలు కలెక్టరుగారికి పంపి, ఆయన అనుమతి పుచ్చుకోవాలి. ఆలా అనుమతి లభించని వాటిని ఏ సభాసమావేశాల్లో చర్చించకూడదని సవాలక్ష షరతులు విధించేవారు.

హైదరాబాదు సంస్థానంలో అభివృద్ధి నిరోధక ఫ్యూడల్ రాజరికానికి ప్రతికూలంగా, జాతీయ స్వతంత్ర భావాలు ఏర్పడి పెంపొందడానికి చాలాకాలం పట్టింది. ఇచ్చట రాజకీయ వ్యవస్థతో పాటు, ఆర్థిక సాంఘిక సమస్యలు కూడా తోడైనవి. హైందవ సంప్రదాయం, సంస్కృతిని మరచి, కట్టుబొట్టు, వేషభాషల్లో అన్నింటా ముస్లిం ఆధిపత్యానికి తలొగ్గి, వారికి బానిసలు గావలసివచ్చింది. బానిసమనః ప్రవృత్తి అలవరుచుకునే హైన్యస్థితికి ప్రజలు వచ్చారు.

నిజాం నవాబులకు 'విశాల హైదరాబాదు' కావాలనే ధోరణి, ఆలోచన మొదటి నుండి వుంది. బీరార్, సీడెడ్ జిల్లాలను మరల కలుపుకునేందుకు 19వ శతాబ్దం ప్రారంభం నుండి వారు ప్రయత్నిస్తూ వచ్చారు. బందరు సముద్రరేవు వరకు తమ రాజ్యాన్ని విస్తరించుకోవాలని కలలుగంటూ వచ్చారు. హైదరాబాదును 'ఇస్లమిక్ స్టేట్'గా చేయాలనే దుష్ట తలంపు గూడా వారికి వుండేది.

> "ప్రజలంతా గ్రామంలోని నలుగురైదుగురు పెత్తందార్లకు బానిసలై బ్రతుకుతున్నారు. దారుణమైన వెట్టిచాకిరీ, అంతకన్నాదారుణమైన అధికార్ల జులుం, నిత్యం తన్నులు, తిట్లు కచ్చేరి చావిళ్ళ వద్ద వంగబెట్టి మూపున బండలు, బండలేకాదు, రైతుల మూపున గ్రామ వెట్టిని ఎక్కించి త్రొక్కించేవారు. పండిన పంటనంతా 'లెవీ'లని, 'తావాను'లని, 'నాగూ'లని, 'నజరానా'లని దోచుకునేవారు. అది మధ్య యుగాలనాటి భూస్వామ్య దోపిడి."
>
> —తిరునగరి సీతారామాంజనేయులు

అటువంటి దుర్భర పరిస్థితులకు ఎదురునిలచి, నిజాం ప్రజలు పోరాటం సాగించారు.

## నిజాం ఆంధ్రోద్యమ అవతరణ :

హైదరాబాదులో వివేక వర్ధనీ సభలో జరిగిన ఒక సంఘటన ఆంధ్రులను చైతన్యవంతులను చేయడానికి కారణమైంది. 1921లో హైదరాబాదులో 'రాష్ట్రీ సాంఘిక సంక్షేమ మండలి' సభ సమావేశమైనపుడు తెలుగు వారిని తెలుగు భాషలో ప్రసంగించడానికి అనుమతించక, కొందరు గేలిచేశారు. ఆంధ్ర ప్రముఖులు వెంటనే సభ నుండి వెళ్ళిపోయి, 'ఆంధ్రజన సంఘాన్ని' ఏర్పాటు చేసుకోవడం జరిగింది. నిజాం ఆంధ్రోద్యమానికి అది అంకురార్పణ అయింది.

ఆంధ్రజన సంఘం ఆంధ్ర భాషాభివృద్ధికి పూనుకుంది. ఆ సంఘం ప్రజల కష్టాలను చూస్తూ పూరకుండజాలక పోయింది. అనేక యిబ్బందులు పడుతున్న వర్తకులు, వెట్టి చాకిరీ చేస్తున్న పేద ప్రజలు, పన్నుల భారంతో సతమత మవుతున్న రైతులు, చేనేత పనివారు తమ కష్టాలను నివారించాలని ఆంధ్రజన సంఘానికి మొర పెట్టుకో సాగారు. వారి బాధల నివారణకు కూడా ఈ సంఘం శ్రద్ధ వహించింది. ఈ సంఘం వర్తక స్వాతంత్ర్యం, మగ్గంపై పన్ను, మోతర్పా, వెట్టిచాకిరి మున్నగు సమస్యలపై కరపత్రాలు చిన్నపుస్తకాలు ప్రకటించింది. గ్రామాల్లో సభలు, సమావేశాలు జరుపుతూ, సమస్యల పరిష్కారానికి ఆందోళనా కార్యక్రమం కూడా చేపట్టింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు పట్టభద్రులను ఆహ్వానించి, నిజాం ఆంధ్రజన సంఘ పక్షాన వారిని సన్మానించడం జరుగుతుండేది. వర్తక సంఘాలు ఏర్పడి ప్రభుత్వాధికారుల దుశ్చర్యలను నెమ్మదిగా ప్రతిఘటించడం ప్రారంభించాయి. సభా సమావేశాల్లో రైతులు, తదితర వర్గాలవారు తమ కష్ట నిష్ఠూరాలను గురించి, తన్ని వారణోపాయాలను గూర్చి చర్చించుకోసాగారు. వీటన్నిటి మూలంగా క్రమేణా తెలంగాణా ప్రజల్లో కొంత విజ్ఞానం, చైతన్యం కలుగుతూ వచ్చింది. తమ న్యాయ సమ్మతమైన హక్కుల కోసం వారు ఆందోళన చేయసాగారు. ప్రభుత్వం చేసే అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా ఉద్యమం సాగించాలనే పట్టుదల పెరుగుతూ వచ్చింది.

ఈ దశలోనే సురవరం ప్రతాపరెడ్డి హైదరాబాదు నుండి 'గోల్కొండ' పత్రికను స్థాపించారు. సంస్థాన ప్రజల కష్ట నివారణకు, నిజాం ఆంధ్రుల వికాసానికి ఈ ద్వైవారపత్రిక కృషి చేసింది. ప్రజలకు అండగా నిలిచింది. ఆంధ్ర జన సంఘం, కేంద్ర సంస్థ నిజామాంధ్ర మహాసభగా రూపొందింది.

## నిజామాంధ్ర మహాసభలు

1930 సంవత్సరంలో ప్రథమ నిజామాంధ్ర మహాసభ మెదక్ జిల్లా జోగి పేటలో సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆ సభలో రాజకీయ తీర్మానాల ప్రసక్తి లేదు. తెలంగాణాలోని ఆర్థిక, సాంఘిక విద్యావిషయిక సమస్యలు మాత్రమే చోటు చేసుకున్నవి. ఇందుకు సంబంధించిన కొన్ని తీర్మానాలు చేసి, తమ కోర్కెలు నెరవేర్చండని ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేశారు ద్వితీయ మహాసభ నల్గొండ జిల్లా దేవరకొండలో బూర్గుల రామకృష్ణారావు అధ్యక్షతన జరిగింది. ఆయన రాజకీయ ప్రసంగం చేశారు. 1934లో తృతీయ మహాసభను కొల్లాపురంలో జరుపనుద్దేశించారు కాని అందుకు ప్రభుత్వ అనుమతి లభించలేదు. తరువాత మధిరలో పులిజాల వెంకట రంగారావు అధ్యక్షతన సభ జరిగింది బాల్య వివాహాలు కూడదనీ, వితంతు వివాహాలు చేయాలనీ ఆ సభలో తీర్మానించారు. సనాతనాచార పరులు కొందరు ఈ సంఘ సంస్కరణలను వ్యతిరేకిస్తూ జిల్లా కలెక్టర్‌కు విన్నవించుకున్నారు.

నాల్గవ మహాసభ మాడపాటి హనుమంతరావు అధ్యక్షతన సిరిసిల్లాలో జరిగింది. నిజామాంధ్ర మహాసభకు ఒక నియమావళిని రూపొందించారు. జిల్లా, తాలూకా కమిటీలను ఏర్పాటు చేస్తూ, ప్రతినిధుల ఎన్నికల పద్ధతిని ప్రవేశపెట్టారు. అప్పటినుంచి ఆంధ్ర మహాసభకు ఒక ప్రజాస్వామ్య స్వరూపం ఏర్పడింది. ఐదవ మహాసభ షాద్ నగర్‌లో కొండా వెంకట రంగారెడ్డి అధ్యక్షతన జరిగింది. ఆ సభలో రైతుల సమస్యలకు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చారు.

1937లో నిజామాబాద్‌లో జరిగిన ఆరవ ఆంధ్ర మహాసభకు మందుముల నర్సింగరావు అధ్యక్షత వహించారు. జిల్లా కలెక్టర్ అనుమతి లేకుండానే ఆ సభను జరుపుకోవడం విశేషం. ప్రథమంలో జరిగిన ఐదు సభలు, రాజకీయ సమస్యలను చర్చించకుండా జరిగినవి. ఆరవ మహాసభలో 'సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని తీర్మానించడం గమనార్హమైన మార్పు.

1937 సంవత్సరంలో, బ్రిటిష్ ఇండియాలో ఎన్నికలు జరగడం, చుట్టూ వున్న మదరాసు, బొంబాయి, మధ్యపరగణాలు మొదలగు రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడడం, ఆంధ్ర మహాసభ ప్రవృత్తిలో కూడా మార్పు రావడానికి కారణం. ఇట్టి పరిస్థితులలో 1938లో మల్కాపురంలో ఎం. రామచంద్రరావు అధ్యక్షతన ఆంధ్ర మహాసభ జరిగింది ఇదే కాలంలో, నిజాం ప్రభుత్వానుమోదం పొందిన

'అయ్యంగార్ కమిటీ' కొన్ని రాజ్యాంగ సంస్కరణలను ప్రకటించింది. ఆ సంస్క రణలలో శాసన సభ అధికారాలు చాల సంకుచితంగా వున్నాయి. మంత్రులు శాసన సభకు బాధ్యులై వుండడానికి బదులు, నిజాం ప్రభువరేణ్యులకు బాధ్యత వహించవలసి ఉంటుంది. అత్యల్ప సంఖ్యాకులుగా వున్న మైనారిటీలకు మెజారిటీ కలిగించే అవకాశాలు యిందు సృష్టించారు. అందుచేతసప్తమాంధ్ర మహాసభ, అయ్యంగార్ కమిటీ ప్రతి పాదించిన రాజ్యాంగ సంస్కరణలను వ్యతిరేకిస్తూ తీర్మానించింది.

1938లో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఏర్పడి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం సాగించడం,అందులో ఆంధ్ర మహాసభలో పనిచేసిన నాయకులు, కార్య కర్తలు పాల్గొనడం తటస్థించింది. ఎనిమిదవ ఆంధ్రమహాసభ 1941లో చిలుకూరులో రావి నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగింది. అధ్యక్షుని రాజకీయోపన్యాసమంతా తెలం గాణాలోని రాజకీయార్థిక సమస్యలపై ప్రధానంగా కేంద్రీకరించబడింది. రాజకీయ విషయాలపై బేధాభిప్రాయాలు ఉత్పన్నమైనా, అంతవరకు నిజామాంధ్ర సభలోనే వుండి అందరూ కలిసి పనిచేస్తూ వచ్చారు.

ఆంధ్ర మహాసభలో కొందరు మితవాదులుగా, మరి కొందరు కమ్యూనిస్టులుగా కార్యకర్తలు చీలిపోయారు. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో కమ్యూనిస్టుల ప్రజా యుద్ధ నినాదఫలితంగా 1942లో కమ్యూనిష్టు పార్టీపై గల నిషేధాన్ని నిజాం ప్రభుత్వం తొలగించింది. రావి నారాయణరెడ్డి అధ్వర్యాన 1944లో ఖమ్మంమెట్టులో వేరుగా ఆంధ్రమహాభ జరిగింది.

## జాతీయ పక్షం ఆవిర్భావం

నిజాం ఆంధ్ర మహాసభలో అప్పటి వరకు ఒకవైపు మితవాద నాయకులు, మరోవైపు కమ్యూనిష్టువర్గం ఉండేవి. సభాసమావేశాల్లో సంస్థాన రాజకీయ సమస్యలు చర్చించడం మితవాదవర్గ నాయకులకు సుముఖత వుండేదికాదు. ఆపరిస్థితిలో 'యువక జాతీయ పక్షం' ఒకటి ఏర్పడి, జాతీయ కాంగ్రెస్ విధానాలవైపు మొగ్గు చూపింది.

ఈ జాతీయపక్షంవారు సంస్థాన వెలుపలి కాంగ్రెస్ నాయకులతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకొని, వారి సలహా సంప్రదింపులకు ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చి, తదనుగుణంగా ఆంధ్రమహాసభలో పనిచేయసాగారు. తెలంగాణాలో కాంగ్రెస్ పతాకాలు ప్రతిష్ఠించే కార్యక్రమాన్ని వీరు చేపట్టారు. ఆంధ్ర జాతీయపక్షం వారికృషి ఫలితంగా, కాంగ్రెస్ పేరు, దాని ఆశయాలు బాగా ప్రచారంలోకి వచ్చినవి.

డాక్టర్ పట్టాభితో సంప్రదించి, ఆయన సలహాతో తయారుచేసిన రాజకీయ తీర్మానాన్ని "నైజాం ప్రభుత్వం సంపూర్ణంగా పైదొలగిపోవాలనీ, నైజాంరాజ్యాన్ని మూడు ముక్కలు గావించి వాటితోసహా మూడు భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయాలనీ" వీరు నిజాం ఆంధ్ర మహాసభలో తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. తత్ఫలితంగా, ఎం. ఎస్. రాజలింగం, బండారు చంద్రమౌళీశ్వరరావు, స్టేట్ కాంగ్రెస్ ప్రారంభించనున్న సత్యాగ్రహోద్యమానికి ముందే జైలుశిక్షలకు గురి కావలసివచ్చింది. జాతీయ పక్షం వారు భారత జాతీయ కాంగ్రెస్‌కు నేరుగా స్టేట్‌లో కాంగ్రెస్ సభ్యత్వం చేర్పించసాగారు.

జాతీయపక్ష కృషిని గురించి కోదాటి నారాయణరావు వ్యాసభాగాలు గమనించండి :

> "జాతీయ పక్షం గ్రంథాలయోద్యమం పేరుతో సర్కారు, రాయలసీమ, తెలంగాణాలలోని వివిధ రంగాలలోని నాయకులను ఒకే వేదికపైకి తీసుకవచ్చి, విశాలాంధ్ర మహాసభను వరంగల్లులో జరిపి, విశాలాంధ్రావతరణకు మార్గాన్ని సుగమం చేసింది. అఖిల భారత సంస్థాన ప్రజామండలి మహాసభలకు బహుళ సంఖ్యలో ఆంధ్రయువకులను తీసుకొని వెళ్ళి జవహర్‌లాల్ నెహ్రూ ప్రశంసలను పొందగలిగింది. ఫ్యూడల్ వ్యతిరేక విధానంలో ఎవరికీ తీసిపోని విధంగా కార్యకర్తలు ప్రవర్తించి, రామానందతీర్థ ప్రశంసలను పొందగలిగారు. తెలంగాణాలో నాయకుల పర్యటనలు ఏర్పాటుచేసి, యువకులలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. కార్యకర్తలను సేవాగ్రాం, వినయాశ్రమం, రైతాంగ విద్యాలయం, శిక్షణాలయాలకుపంపి, యిక్కడి యువకులలో రాజకీయ చైతన్యాన్ని కలిగించింది. ఈ విధంగా అవిరళ కృషిచేసి, జాతీయోద్యమంలో తెలంగాణా తగిన పాత్రను నిర్వహించేటట్లు భూమికను సిద్ధపరచింది."

**కోదాటి నారాయణరావు వ్యాసం 'ఆంధ్ర పత్రిక'**
**1972 ఆగస్టు, 15**

# నిజామాంధ్ర మహాసభలు

| | సంవత్సరం | ప్రదేశం | | సభాధ్యక్షుని పేరు |
|---|---|---|---|---|
| 1. | 1930 మార్చి 3,4,5 తేదీలు | జోగిపేట | — | సురవరం ప్రతాపరెడ్డి |
| 2. | 1931 — ,, ,, | దేవరకొండ | — | బూర్గుల రామకృష్ణారావు |
| 3. | 1934 ,, | ఖమ్మం | — | పులిజాల రంగారావు |
| 4. | 1935 డిశంబర్ 30,31, జనవరి 1 | సిరిసిళ్ళ | — | మాడపాటి హనుమంతరావు |
| 5 | 1936 డిసెంబర్ 15,16,17 | షాద్‌నగర్ | — | కొండా వెంకటరంగారెడ్డి |
| 6. | 1937 డిశంబర్ 6,7,8 | నిజామాబాద్ | — | మందుముల నరసింగరావు |
| 7. | 1940 ఏప్రిల్ | బాగాత్, నేటి మల్కాపురం | — | ,, |
| 8. | 1941 జూన్ 3,4,5 | చిలుకూరు | — | రావి నారాయణరెడ్డి |
| 9. | 1942 మే 22,23,24 | ధర్మవరం | — | మాదిరాజు రామకోటేశ్వరరావు |
| 10. | 1943 మే 23, 24, 25 | హైదరాబాదు | — | కొండా వెంకటరంగారెడ్డి |
| 11. | 1944 | భువనగిరి | — | రావి నారాయణరెడ్డి |
| 12. | 1945 మార్చి 21.22,23 | మడికొండ | — | మందుముల నరసింగరావు |
| 13. | 1946 మే 10,11,12 | కంది | — | జమలాపురం కేశవరావు |

గమనిక : 6వ నిజాం ఆంధ్ర మహాసభ 'బాధ్యతాయుత ప్రభుత్వమే తన ఆశయమని' ప్రకటించింది. 8వ మహాసభలో భిన్నాభిప్రాయాలు పొడమాపినవి. 10వ సభలో జాతీయవాదులకు - కమ్యూనిష్టులకు మధ్య విభేదాలు, పోటీలు ఏర్పడినవి 11వ సభ పూర్తిగా కమ్యూనిష్టుల ఆధీనంలోకి పోయింది.

చివరి మూడు సభలు కమ్యూనిష్టులు వేర్వేరుగా జరుపుకున్నారు. 1946 లో స్టేట్ కాంగ్రెస్‌పైన నిషేధం తొలగించబడిన తర్వాత, నిజాం ఆంధ్ర మహాసభ స్టేట్ కాంగ్రెస్‌లో విలీనమైంది.

నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ చరిత్ర - తీర్మానాలు సభల కార్యక్రమాలను 'ఆంధ్రపితామహ' మాడపాటి హనుమంతరావు రెండు భాగాలుగా గ్రంథరూపంలో ప్రకటించారు.

## స్వదేశీ ఉద్యమం :

1900-20 మధ్యకాలంలో క్రమక్రమేణా హైదరాబాదు ప్రజలలో కొంత చైతన్యం కలుగుతూ వచ్చింది. గ్రంథాలయాలు, పఠన మందిరాలు, పాఠశాలలు ఏర్పాటుగావడం యిందుకు దోహదం యిచ్చింది. బ్రిటిష్ ఇండియాలో జరుగుతున్న స్వదేశీ ఉద్యమం, కాంగ్రెస్ కార్యక్రమాల ప్రభావం సంస్థాన ప్రజలపై పడింది. ఇతర ప్రాంత విశ్వవిద్యాలయాల్లో చదువుకొంటున్న హైదరాబాదు విద్యార్థులు స్టేట్‌లో స్వదేశీ ఉద్యమానికి కొంత ప్రోత్సాహం ఇచ్చారు. రాట్నాలు తయారుచేసే కార్ఖానాలు వెలసినవి. స్వదేశీ పరిశ్రమలు నెలకొల్పనారంభించారు. ఖద్దరు ప్రచారం సాగించారు.

1918లో కేశవరావు కెరాట్కర్ మున్నగు వారితో రాజకీయ సంస్కరణల కమిటీ ఏర్పడింది. ఆనాటి సభకు వేలాది మంది ప్రజలు హాజరైనారు

ఆర్య సమాజం ప్రభావం వల్ల బాజీకృష్ణారావు అస్పృశ్యతా నివారణకు కొంత కృషి ప్రారంభించారు. భాగ్యరెడ్డివర్మ ఆది హిందూ సోషల్ సర్వీస్‌లీగ్‌ను ఏర్పరచి, హరిజనాభివృద్ధికి గొప్ప సేవచేశారు. బాలికల హైస్కూలు నొకదానిని స్థాపించి స్త్రీ విద్యాభివృద్ధికి పాటుపడ్డారు. కాంగ్రెస్ సంస్థ గాంధీజీ నాయకత్వాన హరిజనోద్ధరణ కార్యక్రమం చేపట్టిన తర్వాత, కాంగ్రెసు వాదులు ఈ సమస్యపై కేంద్రీకరించి పని చేయసాగారు అరిగె రామస్వామి ప్రభృతులు హరిజనులకు — అగ్రవర్ణాల వారికి మధ్య అంతర్వర్ణ వివాహాలు ప్రోత్సహించి, జరిపించారు

దేశంలో గాంధీజీ, అలీ సోదరుల నాయకత్వాన ఖిలాఫత్ ఉద్యమం సాగుతున్న తరుణంలో యిక్కడ కూడా పండిట్ కేశవరావు, వామన్‌నాయక్, మహమ్మద్ మౌల్వి, అస్గర్ హుస్సేన్, బారెట్లా రాఘవేంద్రశర్మ మొదలగు పెద్దలు ఈ ఖిలాఫత్ ఉద్యమంలో పాల్గొన్నారు ఆ ఉద్యమరోజుల్లో స్టేట్‌లో సభలు జరపకూడదని నిజాం నవాబు నిషేధించాడు. అనుమానాస్పదులైన కొందరు వ్యక్తులను సంస్థానం వెలుపలకు వెడలగొట్టించారు అధికార్లు. ఖద్దరు, హరిజనాభివృద్ధి మొదలగు నిర్మాణ కార్యక్రమాలను కూడా అనుమానంతో చూచి, అట్టి కార్యక్రమాలకు సైతం తీవ్ర అవరోధం కలిగిం

చారు. సాహిత్య, సాంస్కృతిక కార్యకలాపాలను సాగనివ్వలేదు. ఇందుకు అధిక్షే పణలు తెల్పుతూ స్టేట్‌లోని హిందూ, ముస్లిం సోదరులు, విజ్ఞులైనవారు పౌరసత్వ హక్కుల కోసం ఆందోళనచేస్తూ వచ్చారు.

ఖిలాఫత్ ఉద్యమం స్టేట్ ప్రజలలో కొంత రాజకీయ చైతన్యం కలిగించింది. ఆ సందర్భంలో 1920 మార్చి 16వ తేదీన వివేకవర్ధనీ హైస్కూలు ఆవరణలో జరిగిన గొప్ప బహిరంగ సభకు బారిష్టర్ మహమ్మద్ అస్గర్‌హుసేన్ అధ్యక్షత వహించారు. 'ఖిలాఫత్ కమిటీ' పంపిన రహస్య సర్క్యులర్ ఆదేశానుసారం మార్చి 19వ తేదీన హైదరాబాదులో తదితరచోట్ల 'హర్తాళ్'ను పాటించడం జరిగింది.

## స్టేట్‌లో రాజకీయ మహాసభలు :

1923లో అఖిల భారత కాంగ్రెస్ మహాసభ కాకినాడ పట్టణంలో జరిగింది. హైదరాబాదు స్టేట్‌లో రాజకీయ సభలు జరుపుకోడానికి ఏమాత్రం వీలులేనందున, సంస్థానం నుండి 25 మంది ప్రతినిధులుగాను, 500 మంది ప్రేక్షకులుగాను కాకినాడ సభలకు వెళ్ళి పాల్గొన్నారు.

వామన్‌నాయక్, రాఘవేంద్రరావుశర్మ, మాడపాటి హనుమంతరావు ప్రభృ తులు కాకినాడ సభ సందర్భంలోనే స్టేట్ రాజకీయ మహాసభను కూడా జరుపుకొందా మని ప్రోత్సహించారు. ఆ విధంగా మాధవరావు ఆనే అధ్యక్షతన ప్రథమ రాజకీయ మహాసభ అక్కడ జరిగింది.

అప్పట్లో బెంగాలు - నాగపూర్ రైల్వేలైనుకు గండిపడి రైళ్ళ రాకపోకలు ఆగిపోయినందున, కాంగ్రెస్ నాయకులు సికిందరాబాదు మీదుగా కాకినాడ వెళ్ళవలసి వచ్చింది. ఆ కారణాన్ని పురస్కరించుకొని సికిందరాబాదు రైల్వే స్టేషన్ వెలుపల పెద్ద పందిరి వేయించి, కాంగ్రెస్ నాయకులకు వలయు అతిథి మర్యాదలన్నీ స్థానిక ప్రముఖులు సలక్షణంగా జరిపించారు. మహమ్మదాలి, షౌకతాలి సోదరులు, సరోజినీ నాయుడు, 'దేశబంధు' చిత్తరంజన్‌దాస్ మున్నగు దేశనాయకులు ప్రజల అభ్యర్థనను మన్నించి కొన్ని రైల్వేస్టేషనుల వద్ద గుమిగూడిన ప్రజల నుద్దేశించి ప్రసంగించారు.

ద్వితీయ రాజకీయ మహాసభ 1926లో బొంబాయి నగరంలో జరిగింది. ఆహ్వానసంఘం అధ్యక్షునిగా దత్తా అప్పాజీ ఏర్పాట్లన్నీ గావించారు. బీరార్‌కు చెందిన వై. ఎం. కాలే సభకు అధ్యక్షత వహించారు.

1928 మే మాసంలో పూనా నగరంలో తృతీయ రాజకీయ మహాసభ జరి గింది. ఎన్. సి. కేల్కార్ సభకు అధ్యక్షత వహించారు. ఆహ్వానసంఘానికి

బొపాడ్కర్ అధ్యక్షుడుగా వుండి ఆ సభ ఏర్పాట్లు చేశారు. సుభాస్‌చంద్రబోస్ ఈ సభకు వచ్చి ఇలా ప్రసంగించడం జరిగింది:

"కాంగ్రెస్ లక్ష్యం ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపన. బ్రిటిష్ పాలిత భారతదేశంలో మాకు తెల్లవారి పరిపాలన ఉంది. మీ స్వదేశీ సంస్థానాలలో నల్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా మీరు పోరాడవలసి ఉంటుంది. పాలకుల స్వరూపస్వభావాలు ఒకటే కావున, మనఉభయుల లక్ష్యం కూడా ఒకటే" .. ... ..

"స్వదేశీ సంస్థానాలలో సైతం పరిపాలకుల యిష్టం వున్నా లేకున్ననూ కాంగ్రెస్ కమిటీలు ఎందుకు ఏర్పాటు చేయరాదో నాకు అర్థం గావడంలేదు. సంస్థాన ప్రజలుకూడా భారత జాతీయకాంగ్రెస్‌లో అంతర్భాగంగా కాంగ్రెస్ కమిటీలు ఏర్పాటు చేసుకునే హక్కు గలిగి వున్నారని నేను భావిస్తున్నాను."

-సుభాస్‌చంద్రబోస్ ప్రసంగభాగాలు

పండిత జవహర్‌లాల్‌నెహ్రూ మొదలగు దేశనాయకుల నుండి వచ్చిన సందేశాలను రాఘవేంద్రరావుశర్మ సభలో చదివి వినిపించారు.

సభాధ్యక్షత వహించిన ఎన్.సి. కేల్కార్ ప్రసంగిస్తూ ఇలా సలహా చెప్పారు:

"బ్రిటిష్ పాలిత భారత దేశంలో అండమాన్ దీవులున్నవి. సావర్కార్ అండమాను జైళ్ళకు వెళ్ళి తిరిగి రాలేదా? ఆయన తన స్వార్థం కోసం అలా చేశారా? సంస్థానం లోపలకూడా మీరు ఆందోళన ఎందుకు లేవదీయరు? మీ సంస్థానంలోపల బాధలు భరించి సత్యాగ్రహం చేయడానికైనా మీరు సంసిద్ధులు కావాలి."

## అకోలా మహాసభ :

1931లో అకోలాలో నాల్గవ హైదరాబాదు రాజకీయ మహాసభ జరిగింది. శిరాజుల్‌హసన్ తిర్మజీ ఆహ్వాన సంఘాధ్యక్షుడు. జస్టిస్ రామచంద్రనాయక్ సభకు అధ్యక్షత వహించారు. హైదరాబాదు నగరం నుంచి 150 మంది ప్రతినిధులు ఈ మహాసభకు హాజరైనారు. దేశంలో ఉప్పు సత్యాగ్రహ సమరం సాగుతున్న రోజులవి. "హైదరాబాదు సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పాలని, పౌరసత్వ హక్కులను పునరుద్ధరించాలని" కోరుతూ అకోలా సభలో రెండు ముఖ్య తీర్మానాలను ఆమోదించారు. కాశీనాథ్‌రావువైద్య వామన్‌నాయక్ ప్రభృతులు ప్రధానంగా కృషి చేశారు. బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని కొన్ని కరపత్రాలు ప్రచురించగా, వాటిని నిజాం ప్రభుత్వం నిషేధించింది,

# సహాయ నిరాకరణోద్యమం !

*తలి గాంధీయుగ మేగుదెంచె ఇక పేతత్ భారతీయ స్వారా*
*జ్యా రథంబాతని సారథిత్వమున నే సాగించుడంచున్ జగ*
*ద్గురుడే గెన్ దివిలోకమాన్యుడవె యుద్ఘోషించు తూర్యధ్వానుల్*
*ఉరుతద్దివ్యరథంబులాగుటకు రండో భారతీయ ప్రజల్ !*

**–బలిజేపల్లి లక్ష్మీకాంతకవి**

## గాంధీజీ నూతనపంథా :

బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన రాజ్యాంగ సంస్కరణలు భారత ప్రజలను ఎంతమాత్రం సంతృప్తి పరచజాలక పోయినవనీ, పైగా ఆగ్రహావేశలను చేసినవనీ గాంధీజీ గ్రహించారు.

పార్లమెంటులో ప్రతిపాదించిన నిర్బంధరౌలట్ బిల్లును నిరసిస్తూ గాంధీజీ దేశంలో ప్రచారంచేశారు. కాంగ్రెస్ ఆదేశాన్ని అనుసరించి 1919 ఏప్రిల్ 6వ తేదీన హర్తాళ్లు జరిగినవి. ఢిల్లీ, అమృతసర్ మొదలగు ప్రదేశాల్లో జరిగిన పోలీసు దురంతాల వల్ల అగ్నిలో ఆజ్యంపోసినట్లయింది.

అమృత్‌సర్ జలియన్‌వాలాబాగ్, వైశాఖ మేళా సందర్భాన 1919 ఏప్రిల్ 13వ తేదీన 25 వేల మందికిపైగా బహిరంగ సభకు హాజరైనారు. నిషేధాజ్ఞలను ఉల్లంఘించి, సభ జరుపుతున్నారనే నేరంపై, జనరల్ డయ్యర్ సేనాని సైనికులతో వెళ్ళి, నిరాయుధులైన సభికులపైన విచ్చలవిడిగా, తోటాలు అయిపోయ్యేంతవరకు కాల్పులు సాగించారు. ఆ కాల్పులలో, 380 మంది చనిపోయారు. 1200 మందికి పైగా గాయాలు తగిలాయి. మానవ చరిత్రలోనే, ఈ ఘోరదురంతంతో పోల్చదగిన సంఘటనలు బహుకొద్ది. ఆ మృతవీరులకు జోహారులర్పిస్తూ జలియన్ వాలాబాగ్‌లో తర్వాత వీరుల స్థూపం ప్రతిష్ఠించబడింది. తదాది, ఆ వీరుల జ్ఞాపకార్థం ఏటేటా జాతీయ వారోత్సవాలు జరుగుతున్నాయి.

అప్పటివరకు 'బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత స్వపరిపాలన' అనేది జాతీయ కాంగ్రెస్ లక్ష్యంగా వుండేది, 'శాంతియుత, ధర్మపద్ధతుల ద్వారా స్వరాజ్య సంపాదన

భారత ప్రజల లక్ష్యం' అని గాంధీజీ నిర్వచించి తదనుగుణంగా కాంగ్రెస్ లక్ష్య సూత్రంలో ప్రధానమార్పు తెచ్చారు. అప్పటివరకు, రాజ్యాంగపరిధిలోనే సాగుతున్న ఆందోళన, అది చట్ట విహితంగాని, లేక చట్టవ్యతిరేకంగాని, శాంతియుత న్యాయ ధర్మానుసరణంగా వుండే చాలునన్నారు

పరప్రభుత్వ అక్రమ శాసనాలకు వ్యతిరేకంగా, సత్య అహింసలతో కూడిన సత్యాగ్రహ, శాసనోల్లంఘన సూత్రాలను గాంధీజీ ప్రబోధం గావించారు. కాంగ్రెస్ త్రివిధ బహిష్కారాలను చేపట్టింది. ఖిలాఫత్ ఉద్యమ నాయకులైన మహమ్మదాలీ, షౌకతాలీ సోదరులతో కాంగ్రెస్ మిత్రత్వం నెరపి, కాంగ్రెస్ శాసనోల్లంఘనోద్యమానికి, ఖిలాఫత్ ఉద్యమాన్ని జోడించింది. జాతీయ స్వాతంత్ర్యోద్యమం అప్పటి నుంచి తీవ్ర కార్యాచరణతో కూడిన ఒక నూతన ఘట్టంలోకి ప్రవేశించింది.

## సాత్విక నిరోధ సూత్రం :

అమెరికన్ తత్వవేత్త హెన్రీడేవిడ్‌థోరే 'సివిల్ డిసోబీడియన్స్' అను పుస్తకాన్ని రచించారు. గాంధీజీ దక్షిణాఫ్రికాలో లాయర్‌గా వున్నప్పుడు 1907 సంవత్సరంలో ఆ పుస్తకాన్ని చదివారు. 'సత్యం మనవైపు వున్నప్పుడు మనం ఒంటరిగా వున్నాసరే చెడుగును నిరసించాలని' థోరే ప్రవచించిన ముఖ్య సాత్వికసూత్రం. ఈ సత్యాగ్రహతత్వాన్ని గాంధీజీ అనుసరించి, దక్షిణాఫ్రికాలో తెల్లజాతివారి జాత్యహంకారాన్ని శాంతియుతంగా ప్రతిఘటించడానికి పూనుకొన్నారు. అచ్చటి భారతీయులను సంఘటితపరచి, సత్యాగ్రహం చేయడం ద్వారా విజయాలు సాధించారు. ఈ సాత్విక నిరోధ, సహాయ నిరాకరణ, సత్యాగ్రహ సూత్రాలను గాంధీజీ భారతదేశం తిరిగి వచ్చిన తర్వాత, అమలుపరచ దీక్ష వహించారు.

ఒక్కొక్క సంఘటన వ్యక్తుల్లో మనఃపరివర్తన గొనివస్తుంది. అలానే ఉద్యమ గమనంలో సైతం ఎంతో మార్పుతెస్తుంది. అశోక చక్రవర్తి కళింగ యుద్ధంలో కండ్లారా రక్త ప్రవాహాలు చూచాడు. విజయం సాధించినా యుద్ధం పట్ల ఆయనకు ఎంతో విముఖత గలిగించి. యుద్ధంలో వేలాది స్త్రీ పురుషులు ప్రాణాలుకోల్పోయారని కలతచెందాడు. అశోకుడు సకల ప్రాణులపట్ల దయ చూపించాలనీ, ప్రతి ఒక్కరూ సత్యం పలకాలనీ, అహింసను పాటించాలనీ ధర్మాలను ప్రబోదించాడు ఈ ధర్మాలను శిలలపై చెక్కించాడు. స్తూపాలను నిర్మించాడు. కళింగయుద్ధం అశోకునిలో అంత మార్పు తెచ్చింది.

గాంధీజీ ప్రథమ ప్రపంచయుద్ధ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వ యుద్ధ ప్రయత్నాలకు సహాయం చేశారు. యుద్ధానంతరం భారతదేశానికి 'స్వపరిపాలన' లభించగలదని ఆశించారు. కాని స్వపరిపాలనను ఇవ్వలేదుసరికదా, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దుశ్చర్యలు మితిమీరాయి. అమృతసర్ జలియన్ వాలాబాగ్‌లో జరిపినదురంతాలు, రౌలట్ నిర్బంధ శాసనం గాంధీజీ ఆలోచనా సరళినే మార్చివేశాయి. పంజాబ్ హత్యలు జరిగిన తర్వాత, 'ఇది సైతాన్ ప్రభుత్వం-దీనికి వ్యతిరేకంగా అహింసాయుత సహాయ నిరాకరణ సాగించాలని' ఆయన ప్రబోధించారు. దేశీయులను ఆ విధమైన స్వతంత్ర సమరానికి సంసిద్ధపరిచారు. భారత స్వాతంత్ర్య ఉద్యమంలో నూతన పద్ధతిని ప్రవేశపెట్టారు. ప్రజాసమీకరణకు, నిరాహారదీక్షలు, నిరశన వ్రతాలు, హర్తాళ్లు మొదలగు క్రొత్త పద్ధతులను అనుసరించారు. గాంధీజీ జాతీయోద్యమానికి సర్వమత ధర్మ సూత్రాలను జోడించారు. ఉన్నత లక్ష్యంతోపాటు, ఆ లక్ష్యసాధనకు అనుసరించే విధానాలు కూడా పవిత్రంగా వుండాలని ఆయన త్రికరణ శుద్ధిగా విశ్వసించారు.

> "ప్రహ్లాదుడు, భక్త మీరాబాయి అనుసరించిన పవిత్రమార్గం యిది అహింస అనేది ఒక మనోధర్మం; అది, హింస కంటే ఎన్నో రెట్లు శ్రేష్ఠమైంది. అహింసాధర్మం ఋషులకు, సాధుజనులకు మాత్రమే ఉద్దేశించ బడిన తత్వంకాదు. అది సామాన్య ప్రజలకు కూడా వర్తించేది" అని గాంధీజీ ప్రవచించారు. ఆయన పశుబలానికంటే ఆత్మబలానికి నైతిక విలువలకు, అత్యంత ప్రాధాన్యంయిచ్చారు.

మన స్వాతంత్ర్య సమరంలో గాంధీజీ అనుసరించిన పంథా సరికొత్త నూతన ప్రయోగం.

## చంపారన్ సత్యాగ్రహం :

బీహారులోని చంపారన్ జిల్లాలో నీలిమందు ఆకును ఉత్పత్తిచేసే రైతుల కష్టాలు గాంధీజీ దృష్టికి వచ్చాయి. పాశ్చాత్యులైన తోటల యజమానులు, రైతులను అనేక బాధలకు గురిచేస్తుండేవారు. బ్రిటిష్ వ్యాపారస్తులు వేలాది ఎకరాలను గుత్తకు తీసుకొని, రైతులను బానిసలుగా చేసి, రైతులపైన యిష్టం వచ్చినట్లు పెత్తనం చెలాయించేవారు. రైతుల కష్టంతో ఉత్పత్తి చేయించిన నీలిమందు ఆకును ఇంగ్లండుకు ఎగుమతి చేస్తూ కోట్ల లాభాలు గడించేవారు. ఒక బ్రిటిష్ సెషన్స్ జడ్జి వ్రాసినట్లు "ఇంగ్లండుకు చేరిన ప్రతి నీలిమందు పెట్టె భారతీయుల మానవరక్తంతో తడవకుండా వెళ్ళలేదు."

ఆ బాధలు భరించలేక, రైతులు కూలీలు నీలిమందు గిడ్డంగులను, ఫ్యాక్టరీలను పూర్వం తగులపెట్టారు. తాము నీలి ఆకును నాటబోమని ప్రమాణం చేసుకున్నారు. ఆ రైతులపైన సాయుధ దళాల సహాయంతో దాడులుచేసి, అప్పట్లో దారుణంగా అణచి వేయడం జరిగింది.

గాంధీజీ వారి కష్టగాధలన్నింటినీ శాంతంగా విన్నారు. 1917లో ఆయన రైతుల సత్యాగ్రహాన్ని నడిపించారు. ఆ ఉద్యమ సందర్భంలోనే బాబు రాజేంద్ర ప్రసాద్, గాంధీ గారికి ముఖ్య అనుచరుడైనారు. చంపారన్ రైతాంగ పోరాటాన్ని గురించి ఆయన ఒక సమగ్ర గ్రంథాన్ని రచించారు. మన దేశంలో గాంధీజీ నడిపిన ప్రథమ అహింసాయుత పోరాటం అది. అచ్చటి రైతులను సమైక్యపరచి, వారి బాధా నివారణకు ఒక మార్గాన్ని చూపగల్గారు. చంపారన్ జిల్లాను వదలి వెళ్ళిపోవాలని గాంధీజీపై ఉత్తర్వులు జారీచేసినా, ఆయన ఆ నిషేధాజ్ఞను ఉల్లంఘించారు. చివరకు రైతుల కష్టాలను విచారించడానికి ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది. గాంధీజీ నాయకత్వాన చంపారన్ రైతు ఉద్యమం జయప్రదమైంది.

## కెయిరా సత్యాగ్రహం

చంపారన్ సత్యాగ్రహం తర్వాత, 1918లో గాంధీజీ గుజరాత్‌లోని కెయిరా సత్యాగ్రహం చేపట్టారు. ఆ ప్రాంతంలో వర్షాలు కురియలేదు. పంటలు దెబ్బతిని పోయినవి కాని రైతులు శిస్తులు కట్టాలని అధికార్లు వేధించ సాగారు.

కెయిరా రైతుల అభ్యర్థనపైన గాంధీజీ అక్కడికి వెళ్ళి రైతుల చేత మహజర్లు పెట్టించారు. పన్నుల వసూళ్లను ఆపు చేయుండని ప్రభుత్వానికి ఆయన విజ్ఞప్తి చేశారు. వల్లభాయ్ పటేల్ గాంధీజీకి అనుచరుడై, కెయిరా రైతు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించి, 'సర్దార్'గా చిరకీర్తి నార్జించారు.

మొదట్లో ప్రభుత్వం రైతులపైన కఠినచర్యలు తీసుకొంది. పన్నులు చెల్లించనందుకు రైతుల పశువులను, వ్యవసాయ పనిముట్లను అధికార్లు జప్తు చేయసాగారు కాని రైతులు లొంగలేదు రైతుల నాయకులను అరెస్టుచేసి జైలులో నిర్బంధించడం జరిగింది. కెయిరా సత్యాగ్రహవార్త దేశమంతటికి తెలిసింది. ఆ రైతులకు అండగా నిలిచారు. చివరకు, ధనవంతులైన రైతులు పన్నులు చెల్లించినట్లయితే, పేద రైతుల పన్నును మాఫీ చేస్తామని అధికారులు ప్రకటించక తప్పలేదు కెయిరా రైతు సత్యా

గ్రహం జయప్రదమైంది. ఒక అంగీకారం కుదిరింది. గుజరాత్ రైతులలో మంచి చైతన్యం కలిగింది.

ఇవ్విధంగానే, అహమ్మదాబాదు మిల్లు యజమానులకు ప్రతికూలంగా మిల్లు కార్మికులను గాంధీజీ సమైక్యపరిచి, సమంజసమైన ఒక పరిష్కారాన్ని సాధించ గలిగారు.

## బార్డోలీ సత్యాగ్రహం

గాంధీజీ నాయకత్వాన జరిగిన 'బార్డోలీ సత్యాగ్రహం' మరో ఉజ్జ్వలఘట్టం. విఠల్‌భాయ్ పటేల్, వల్లభాయ్ పటేల్ సోదరులు ఆ రైతు ఉద్యమానికి నాయకులు. పన్నుల నిరాకరణకు 40 వేల మంది పురుషులు, 500 మంది స్త్రీలు సత్యాగ్రహం చేయడానికి సిద్ధపడ్డారు.

బార్డోలి సత్యాగ్రహం సందర్భంలో గాంధీజీని అరెస్టుచేసి, కోర్టులో ఆయనకు శిక్ష విధించినపుడు, అక్కడే వున్న సరోజినీదేవి 'ఏసుక్రీస్తును విచారించి శిలువ నెక్కించిన ఘట్టంగా వున్నదని' ఆ దృశ్యాన్ని అభివర్ణించింది.

> "ఇది ఒక చరిత్రాత్మక సంఘటన. గాంధీజీని అరెస్టు చేసినా ఆయన లక్షలాదిమంది భారతీయుల హృదయాల్లో నివసిస్తూ ఉంటాడు" అన్నారు సరోజినీదేవి.

## గాంధీ యుగారంభం :

అప్పుడే లోకమాన్య తిలక్ మహాశయుడు పరమపదించడం, గాంధీజీ భారత రాజకీయరంగంలో ప్రవేశించడం జరిగింది. ఒకవైపు ప్రభుభక్తి పరాయణులైన కాంగ్రెస్ మితవాద నాయకులు చేసే విజ్ఞాపనలతో దేశం విసుగెత్తి పోయింది. మరొక వైపు విప్లవకారుల బాంబుతత్వం, వారి సాహస చర్యలు - అందుకు ప్రతిగా ప్రభుత్వ క్రూర నిర్బంధాలను దేశం అనుభవింపవలసి వచ్చింది. ఇట్టి పరిస్థితిలో భారత రాజకీయాలను ఒక విశిష్ట నూతన మార్గాన నడిపించడానికి గాంధీజీ పూనుకున్నారు.

## కలకత్తా స్పెషల్ కాంగ్రెస్ సభ :

1920 సెప్టెంబరులో జరిగిన కలకత్తా స్పెషల్ కాంగ్రెస్ మహాసభలో గాంధీజీ ప్రప్రథమంగా 'అహింసాయుత సహాయ నిరాకరణ' (Non violent Non Cooperation) తీర్మానాన్ని ప్రతిపాదించి ఇలా వివరించారు :

"దేశభక్తితో ప్రభుత్వం యిచ్చిన బిరుదులను పరిత్యజించాలి. విద్యార్థులు ప్రభుత్వ విద్యాలయాలను బహిష్కరించాలి. కోర్టులను బహిష్కరించాలి. శాసనసభలను బహిష్కరించాలి. విదేశీ వస్త్రాలను, వస్తువులను బహిష్కరించాలి" ... ..

'స్వదేశీ అంగళ్లు తెరవండి. ఖద్దరు వస్త్రాలను కట్టండి. జాతీయ పాఠశాలలు స్థాపించండి.'

గాంధీజీ దేశీయులను యిలా ఉద్బోధించారు.

"బ్రిటిష్ ప్రభుత్వం సైతాన్ పరిపాలనను కొనసాగిస్తున్నది. ఈ పరపరిపాలనను త్వరలో అంతమొందించండి. స్వేచ్ఛావాయువులను పీల్చండి. నేను తలపెట్టిన ఈ కార్యక్రమాన్ని చిత్తశుద్ధితో ఆచరణలో పెట్టినట్లయితే ఒక్క సంవత్సర కాలంలోనే దేశానికి స్వరాజ్యం సిద్ధిస్తుంది."

మొదట్లో ఆ తీర్మానంపైన కొందరికి అనేక సందేహాలు, విమర్శలు వచ్చినప్పటికీ, అధిక సంఖ్యాకులకు ఆ ప్రతిపాదనలు ఆమోదయోగ్యమైనవి

తర్వాత 1920లోనే నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ జాతీయ మహాసభ, గాంధీజీ సూచించిన సహాయ నిరాకరణ తీర్మానాన్ని ఆమోదించడమేగాక, దానిని అమలు జరపడానికి అవసరమైన చర్యలను కూడా తీసుకొంది.

అంతవరకు కొలది మంది మేధావులకు, ఉన్నతవర్గాల వారికి మాత్రమే పరిమితమైన భారత రాజకీయోద్యమంలో అశేష ప్రజానీకానికి జోక్యం కలిగించినట్లయింది. కాంగ్రెస్ నాయకులంతా గ్రామాలకు మరలి, ప్రజాసేవ చేయనారంభించారు ఇది దేశ రాజకీయరంగంలో వచ్చిన గణనీయమైన పరిణామం.

## బెజవాడ ఎ.ఐ.సి.సి. మహాసభ :

బెజవాడ అఖిల భారత కాంగ్రెస్ సంఘ సమావేశం పలు విధాల చరిత్రాత్మకమైంది. ఈ మహాసభ 1921 మార్చి 31, ఏప్రిల్ 1వ తేదీన మ్యూజియం హాలులో జరిగింది. యావదాంధ్రదేశం నుండి లక్షలాది ప్రజలు సభకు వచ్చారు. గాంధీజీ జాతీయ నాయకులందరు విచ్చేశారు. ఆంధ్ర నాయకులలో నూతనోత్సాహం వెల్లివిరిసింది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఆహ్వానం, కాషాయిరంగు చొక్కాలు ధరించిన

'రామదండు' సభాకార్యక్రమాలు సక్రమంగా జరిగేటట్లు తగిన ఏర్పాట్లు గావించింది. దేశనాయకుల ప్రసంగాలు వినే సదవకాశం ఆంధ్రులకు లభించింది. బెజవాడ పుర పాలక సంఘాధ్యక్షుడైన చినవహి హనుమంతరావు గాంధీజీకి సన్మాస పత్రం సమ ర్పించారు.

ఈ బెజవాడ సభలో, శాసనోల్లంఘన తీర్మానం అమలు జరిపే విషయంలో తీవ్ర చర్చలు జరిగినవి. కోటి మందిని కాంగ్రెస్ సభ్యులుగా చేర్పించాలని, తిలక్ స్వరాజ్య నిధికి కోటి రూపాయలు వసూలు చేయాలని, 20 లక్షం రాట్నాల ఏర్పాటు చేయాలని మొదలగు ముఖ్య తీర్మానాలు గావించారు. ప్రభుత్వ న్యాయస్థానాలను బహి ష్కరించి, గ్రామ పంచాయతీలను నెలకొల్పాలనీ కోరారు

ఈ మహోత్సవ సందర్భంగా పింగళి వెంకయ్య కాంగ్రెస్‌కు జాతీయ జెండాను రూపొందించి గాంధీజీకి సమర్పించారు. అవే కొలది మార్పుంతో తర్వాత కాంగ్రెస్ త్రివర్ణ పతాక మయింది.

మాగంటి బాపినీడుగారి సతీమణి అన్నపూర్ణాదేవి తమ విదేశీ చీరెలను తగుల బెట్టింది. తమవంటి మీదనున్న బంగారు ఆభరణాల నన్నిటినీ వలచి తిలక్ స్వరాజ్య నిధికి గాను విరాళంగా గాంధీగారికి సమర్పించింది. ఆ వీరవనిత చిన్న వయస్సు లోనే 1926లో పరమపదించింది. అన్నపూర్ణాదేవి చేసిన త్యాగం ఆంధ్రమహిళలకే గాదు, మహిళాలోకానికే ఆదర్శప్రాయమైంది.

బెజవాడ సభానంతరం, గాంధీ మహాత్ముడు గుంటూరు, చేబ్రోలు, పొన్నూరు, బాపట్ల, చీరాల, చినగంజాం మున్నగు ప్రదేశాలు పర్యటించి, ఆయా సభల్లో ప్రసం గించారు. సహాయ నిరాకరణ సందేశాన్ని వినిపించారు.

బెజవాడ సభలో సిద్ధపరచిన ప్రణాళిక కాంగ్రెస్ చరిత్రలో ఖ్యాతి గాంచింది. ఆరు మాసాల కాలంలోనే తిలక్ స్వరాజ్య నిధికి దేశంలో కోటి రూపాయలు వసూలై నవి. లక్షల కొలది రాట్నాలు నెలకొల్పబడినవి. వేల కొలది స్వచ్ఛంద సేవకులు దేశ సేవచేయడానికి దీక్షబూనారు. సత్యాగ్రహ శిబిరాలు వెలసినవి అసహాయోద్య మాన్ని ప్రారంభిస్తూ, అహింసాయుత సమర శంఖారావాన్ని గాంధీ మహాత్ముడు పూరించారు. విజయయాత్రకు బయలు దేరారు. లాలా లజపతిరాయ్, పండిత మోతీ లాల్ నెహ్రూ, దేశ బంధు చిత్తరంజన్‌దాస్, మహమ్మదాలి, షౌకతాలి, విఠల్‌బాయ్, వల్లభాయ్ పటేల్ సోదరులు మున్నగు దేశభక్తాగ్ర గణ్యులు గాంధీజీకి, తోడునీడై

నిలిచారు. కాంగ్రెస్ సంస్థ బలిష్టమై ఆసేతు హిమాచల పర్యంతం, స్వరాజ్య దుందుభిని మ్రోగింప మొదలు పెట్టింది ఆంధ్ర దేశ రాజకీయ వాతావరణంలోనే గొప్ప సంచలనం ప్రారంభమైంది. 1920-22 సహాయ నిరాకరణోద్యమ కాలంలో ఆంధ్ర దేశంలో జరిగిన మూడు ముఖ్య ఉద్యమాలు ప్రధానంగా పేర్కొనదగినవి.

ఒకటి పెదనందిపాడు ఫిర్కా పన్నుల నిరాకరణోద్యమం. రెండవది చీరాల-పేరాల ప్రజల శాసనోల్లంఘన, పట్టణ పరిత్యాగం. మూడవది పల్నాటి సీమలో పుల్లరి సత్యాగ్రహం-కన్నెగంటి హనుమంతు వీరమరణం.

ఈ మూడు మహోద్యమాలను గురించి తెలుసు కుందాం

## పెదనందిపాడు పన్నుల నిరాకరణ:

బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని ఒకటి ప్రేక్షతో కదిల్చి గడగడ లాడించిన మహోజ్జ్వల ఘట్టం పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం.

దేశభక్త కొండ వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, వున్నవ లక్ష్మీనారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి, నడింపల్లి నరసింహారావు, అంచా శివయ్య ప్రభృతులు జిల్లాలో కాంగ్రెస్ శాసనోల్లంఘన కార్యక్రమాన్ని తీవ్ర ప్రచారంగావించారు. ప్రజల ఐక్యతకు కృషి చేశారు.

గ్రామోద్యోగులు మాచిరాజు రామమూర్తి (చందవోలు కరణం) సంకాలింగరాజు కుమార్డు సీతారామయ్య (పెదనందిపాడు కరణం), గంధం నాగేశ్వరరావు (పొన్నూరు కరణం), మునసబు కొమ్మినేని కోటయ్య మున్నగువారు ఫిర్కాలో తమ గ్రామోద్యోగ పదవులకు రాజీనామా యిచ్చి, కాంగ్రెస్ కార్యకర్తలుగా చేరారు. స్థానిక రైతు పెద్దగా వున్న సంగీత విద్వాంసుడు పర్వతనేని వీరయ్య ఉద్యమానికి ప్రత్యక్ష నాయకత్వం వహించారు. పన్నుల నిరాకరణోద్యమానికి గ్రామోద్యోగులు బలం చేకూర్చారు. కరణం లెక్కలు వ్రాయడానికి, వెట్టి మోతాదులు తిరిగి పన్నులు వసూలు చేయడానికి,సర్కారు పనిలో మునసబులు సహకరించేందుకు తిరస్కరించడంతో గ్రామ స్థాయి పరిపాలనా యంత్రాంగం స్థంభించిపోయింది. పన్నులు చెల్లించకపోతే ప్రభుత్వ ఖజానాలో డబ్బెక్కడ వుంటుందని స్వాతంత్ర్యభావ ప్రేరితులైన ప్రజలు పన్నుల నిరాకరణకు పూనుకొన్నారు.

ఉద్యమాన్ని అహింసాయుతంగా, నైతిక బలంతో క్రమశిక్షణతో నిర్వహించేందుకు గ్రామగ్రామాన 'శాంతి సేన' పేరున వలంటీర్ల దళాల నిర్మాణం జరిగింది.

పన్నులు చెల్లించ నిరాకరించడం, అవసరాన్ని బట్టి ప్రభుత్వాధికార్ల పైన సాంఘిక బహిష్కరణను ప్రయోగించడం, ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించి శాంతియుతంగా సభా సమావేశాలు జరపడం 'శాంతి సేన' ముఖ్యకార్యక్రమం.

నిర్బంధ విధానంతో ఉద్యమాన్ని అణచివేయడానికి రూథర్‌ఫర్డును అడిషనల్ కలెక్టర్‌గా ప్రభుత్వం నియమించింది. ఆయన రిజర్వు పోలీస్ దళాలతో గ్రామాలపై బడి,అనేక దుశ్చర్యలకు పూనుకున్నాడు.ప్రజలను భయపెట్టడానికి సైనికులతో బలప్రదర్శనలు చేయించాడు. రాజీనామా చేసిన గ్రామోద్యోగులను బర్తరఫ్ చేశాడు. వారివంశ పారంపర్య హక్కులను రద్దుచేసి, తమకు తాబేదారులుగా వుండే కొందరు మహమ్మదీయులను, హరిజనులను గ్రామ మునసబులుగా నియమించబూనుకొన్నాడు. రైతుల్లో కులతత్వాన్ని ప్రేరేపించనుద్దేశించి, రెవిన్యూ ఇన్‌స్పెక్టర్‌గా వున్న ఒక కులస్తుడిని డిప్యూటీకలెక్టర్‌గా ప్రమోట్‌చేసి ఆ ప్రాంతానికి పంపించారు.

ప్రభుత్వం ఎన్ని దుష్టపద్ధతులను అవలంభించినా, ఫిబ్రవరినెల మధ్యభాగం వరకు జిల్లాలో 5 శాతం శిస్తులు కూడా వసూలు చేయలేక పోయినారు. శిస్తులు కట్టని రైతుల ఆస్తులను అధికార్లు జప్తుచేశారు. కాని వాటిని కొనే దిక్కులేకపోయింది. జిల్లా వెలుపలి ఉద్యోగుల పేరిట, పాటకొట్టి వేయించుకొనవలసి వచ్చింది. జప్తు ఆస్తుల చేరవేతకు స్థానిక కూలీలు రావడానికి సైతం తిరస్కరించారు. పోలీసులు పెట్టే బాధలను, అవమానాలను ప్రజలు అమిత సహనంతో భరించారు. ఉద్యమ కేంద్రాలు ప్రజలకు తీర్థయాత్రా స్థలాలుగామారాయి.

## 'యంగ్ ఇండియా'వ్యాసం :

పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం సాగుతున్న రోజులలో గాంధీగారి 'యంగ్ ఇండియా' పత్రికలో ఎం.కె. నరసింహారావు వ్రాసిన వ్యాసం గమనార్హమైనది. ఉద్యమ ప్రాంతాల పరిస్థితులను గురించి ఆయన ఇలా వివరించారు :

> "ప్రయోగాత్మకంగా శాసనోల్లంఘనోద్యమం అమలు జరుపడానికి నిర్ణయించే ప్రాంతాన్ని ఒక్క కాంగ్రెసే ఎన్నుకోలేదు. ఈ పరిణామానికి విశేషంగా కారణమైనవి 'గ్రామోద్యోగుల సంఘం' 1922 ప్రారంభం నుండి ఈ పన్నుల నిరాకరణోద్యమం ఆరంభమైంది. ఈ ప్రాంతంలో 90 నుంచి వంద గ్రామాలు వున్నాయి. 75 వేలనుంచి

85 వేల మంది ప్రజలు వున్నారు. ఈ గ్రామాల ఉద్యోగులందరూ, పంచములతో సహా తమ ఉద్యోగాలకు రాజీనామాలు యిచ్చారు. ప్రజల్లో కనీసం 75 శాతంమంది ఖద్దరు దుస్తులు ధరిస్తున్నారు. ఇక అస్పృశ్యతమాట. కొన్ని గ్రామాలలో ప్రజలందరూ అన్ని కులాల వారు. ఒకే బావినుండి నీరు తెచ్చుకొనేవారు. వేరువేరు సమయాల్లో అలా నీరు తెచ్చుకొనేవారు. సమావేశాలు జరిగితే అందరు కలిసే కూర్చొనే వారు. పంచముడైన వెట్టితనపనికి రాజీనామాచేస్తే, అతనికి పూలదండలు వేసి వూరేగించేవారు.

ఆ ప్రాంతంలోని రైతులు పన్నులు ఎగవేయాలనే అభిప్రాయంతోగాక, ప్రభుత్వంలో స్థంభన కలిగించడానికే తమచర్య ఉద్దేశింపబడిందన్న పూర్తి అవగాహనతోనే ఈ ఉద్యమాన్ని సాగించారు. తమచర్యకు రాగల పరిమాణాలను ఎదుర్కొనడానికివారు సిద్ధపడ్డారు. జనవరి 24వ తేదీన కొందరు సిపాయీలు, ఈ ప్రాంతానికి వచ్చినప్పుడు జరిగిన సంఘర్షణతోనే, ఈ ఆందోళన తీవ్రతరమైంది.

సిపాయిలు వస్తున్న సమయంలో, ఒక వలంటీరు జట్కాబండిలోవెళ్లుతుండగా రైఫిల్‌పిడితో ఆఖక్క గుర్రాన్ని సిపాయి పొడిచాడు. అది తూలి రోడ్డు ప్రక్కనున్న బురద గుంటలోపడింది. బండి బోల్తాకొట్టింది. వలంటీరు క్రిందపడిపోయాడు.అతడులేవగానే సిపాయిలు అతనిపై రాళ్ళురువ్వారు. వలంటీరు గాయపడ్డాడు. అతను ధరించిన ఉడుపులు చిరిగిపోయాయి. కాని అతను తిరగబడలేదు. ప్రజలను కాల్చివేస్తామని సైనికులు బెదరించారు. గ్రామస్థులను దౌర్జన్యానికి కవ్వించాలనే సిపాయిలు ప్రత్యేకంగా వచ్చినట్లు కనుపించింది. ఈ చర్యలతో తృప్తిపడక, వారు గ్రామస్థుల ఓర్పుని పరీక్షించడానికి పొలాల్లో ప్రవేశించి పంటలను ధ్వంసం చేయసాగినా గ్రామస్థులు ఏమీ అనలేదు. పెక్కు జప్తులు జరిగినవి. ప్రభుత్వోద్యోగులు తాము కట్టుబడవలసిన నియమాలను బాహాటంగా ఉల్లంఘించి, చరాస్తులను జప్తుచేయడంలో అక్రమాలకు ఒడిగట్టారు. రైతుల జీవనాధారమైన ఎడ్లను కూడా గొనిపోయే వారు. ఇట్లా ఉద్యోగులు ఎన్ని అక్రమాలకు పూనుకున్నా ప్రజలు సహించారు. ఇదంతా పెదనందిపాడు గ్రామంలో జరిగింది.

ఇక్కడకు 7 మైళ్ళ దూరంలో పరుచూరు గ్రామం వుంది. 50 మంది సైనికులతో ఒక సాయుధ శకటం ఆ గ్రామ ప్రజలను హడలెత్తించి లొంగుబాటుకు తీసుకొనిరావడానికి పంపబడింది. ఆ సైనికులు కోడిగ్రుడ్లు కావాలన్నారు. గ్రామస్థులు గ్రుడ్లు లేవన్నారు. దీనితో కొందరు సిపాయీలు ఇండ్లలో ప్రవేశించి కోడిపెట్టలను, పందులను తీసుకపోయారు. ఆ రాత్రి తప్పత్రాగి తిరిగివచ్చి ఆడపిల్లలు కావాలన్నారు. ఒక సైనికుడు ఒక ఇంట్లో దూరి మలవిసర్జన చేశాడు. పొలాల్లో ప్రవేశించి పైర్లను ధ్వంసం చేశారు. ప్రజలు ప్రతీకారం చేయలేదు.

ఈ ప్రాంతంలోని గ్రామాలలో కూడా ఏండ్ల తరబడి గ్రామ పార్టీలు వున్నాయి. ఆ పార్టీలు కోర్టుకెక్కడం నిత్య సంఘటన. వీరి కీచులాటలు, ఫిర్యాదులతో బాపట్ల మునిసిఫ్ కోర్టు నిండిపోయేది. అయితే, అతి స్వల్ప కాలంలోనే ఈ పార్టీలు మటుమాయమైనాయి. యిప్పుడు పంచాయతీలు ఏర్పడ్డాయి.

ప్రభుత్వ సహాయంతో నిర్వహింపబడుతున్న పాఠశాలల్లో చదువుకొంటున్న విద్యార్థులందరూ ఏకమై పాఠశాలలను జాతీయ దృక్పథంతో నడపకపోతే తాము బడులకు హాజరుకామని మేనేజర్‌కు 'అల్టిమేటం' యిచ్చారు. ఈ పిల్లలందరూ 18 ఏండ్ల లోపువారే. విద్యార్థులు కూడా ఒక వలంటీరు దళాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ప్రతి గ్రామంలో వందమందికి తక్కువ కాకుండా వలంటీర్లు వుండేవారు. ఈ కార్యక్రమాలకు పెదనందిపాడు ప్రధాన కేంద్రమైంది. ఇది ఒక పవిత్ర యాత్రాస్థలమైంది. వెయ్యిమంది వరకు రోజూ అక్కడకు వెళ్ళి స్థానిక ప్రజలను ప్రోత్సహిస్తూ వుండేవారు.

ఇక మద్యపానంమాట. మద్య విక్రయశాలల కంట్రాక్టర్లు తమ సారాదుకాణాలను మూసివేసి, వలంటీరు దళాలలో చేరారు."

('యంగ్ ఇండియా' వ్యాసభాగాలు)

## ఉద్యమ విరమణ:

సంపూర్ణ అహింసాయుత వాతావరణం లేనిది శాసనోల్లంఘనం కొనసాగించడం ప్రమాదకరమని రాష్ట్ర కాంగ్రెస్ నాయకులలో భిన్నాభిప్రాయాలు పొడసూపినవి.

ఢిల్లీ కాంగ్రెస్ తీర్మానం షరతులు పూర్తిగా ఈ ప్రాంతంలో అమలు జరుప బడినవా? అని విచారణ చేయడానికి ప్రకాశం, కాశీనాధుని నాగేశ్వరరావు, దండు నారాయణరాజు గార్లతో ఒక సంఘాన్ని నియమించారు. ఈ సంఘంవారు ఉద్యమ ప్రాంతాలు పర్యటించారు. వీరు ప్రజల శాంతి సహనాలను, ధైర్యసాహసాలను కొని యాడుతూనే, ప్రభుత్వం అమలు జరిపేసైనిక చర్యలకు, తీవ్రనిర్బంధాలకు ఉద్యమం తట్టుకోజాలదేమోనని భావించి, ఉద్యమ విరమణను సూచించారు.

బార్డోలి సత్యాగ్రహోద్యమంలో నిమగ్నమై వున్న గాంధీజీ, బార్డోలి ఉద్యమ ఫలితం తేలేంతవరకు యితరచోట్ల పన్నులనిరాకరణ సాగించకుండా వుండటం మంచిదని సూచిస్తూ పంపిన లేఖ అందడంతో, ఫిబ్రవరి మాసాంతానికి ఆంధ్రలో పన్నుల నిరాకరణ ఉద్యమం విరమించ బడింది.

మదరాసు గవర్నర్‌గా పనిచేసిన వెల్లింగ్డన్ ఈ పెదనందిపాడు ఉద్యమాన్ని గూర్చి ఇలా అన్నారు :

("It shook the British Empire in India to its very roots"). అది బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూకటివేళ్ళతో కదిలించిన ఉద్యమమంటూ వెల్లింగ్డన్ వాపోయాడు.

# సహాయ నిరాకరణోద్యమం-2

'స్వరాజ్యం'

అన్నలారరండీ! మన అమ్మనుడి వినండి ముం
దున్న పనికనండి - ఏమన్న ఒడియకండి ॥అన్న॥
ఆంగ్లబిరుదుమాని - అల ఆంగ్లకోర్టుమాని
ఆంగ్లసేవమాని - మరి ఆంగ్లకవితమాని
ఆంగ్లవిద్యమాని - అల ఆంగ్ల దుస్తుమాని
ఆంగ్లల్లుమాని - అల ఆంగ్లీయతమాని ॥అన్న॥
కత్తిభయముమాని - పశు-శక్తి నూతమాని
ఆత్మబలము బూని - గైకొనుడి మాతృముక్తి ॥అన్న॥
దండాలండోయ్, మేముండ లేమండోయిబాబు!
ఈ సైతాను ప్రభుతకింక, సాగనీమండోయి బాబు!

—గరిమెళ్ళ సత్యనారాయణ

## చీరాల-పేరాల పురనిర్గమన ప్రస్థానం

చీరాల-పేరాల గ్రామాలు భారతీయ నాగరికతకు కేంద్రాలు. మేలిరకముల చేనేత వస్త్రాలను, రంగురంగుల చీరెలను నేయడం అచ్చటి చేనేతవారికి బాగా అల వాటు. బ్రిటీష్ ప్రభుత్వ హయాములో మన చేనేత పరిశ్రమ దెబ్బతినిపోయింది.

వీరరాఘవపేట,జాండ్రపేట,చీరాల,పేరాల అంతాకలిసి ఒకేపంచాయతి యూని యన్‌గా వుండేది. అప్పట్లో వీరి జనాభా 15 వేలు. న్యాయశాఖ, కార్యనిర్వహణ శాఖ అధికారాలన్నీ బ్రిటిష్ అధికార్ల చెప్పుచేతుల్లోనే కేంద్రీకృతమైవుండేవి. 1920 జనవరి మాసంలో మదరాసు రాష్ట్ర ప్రభుత్వం ఈ పంచాయతీ యూనియన్‌ను పురపాలక సంఘంగా ప్రకటించింది. రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ 11 మంది సభ్యులను మునిసి పాలిటీకి నామినేట్ చేశాడు. పంచాయతి యూనియన్‌కు నాల్గువేల రూపాయలు మాత్రం పన్నులు చెల్లించేవారు. మునిసిపాలిటీని చేసినతర్వాత 33వేల రూపాయలు చెల్లించుకో వలసి వచ్చింది. మొదటి ఆరునెలలు ఆ విధంగానే పన్నులు కట్టారు. అధిక పన్ను లను తగ్గించండని అధికార్లకు మొరబెట్టుకొన్నా, వారి గోడును పెడచెవిన బెట్టారు.

అప్పటి బొబ్బిలి రాజా ముఖ్యమంత్రిత్వ కాలంలో మంత్రి రామారాయణం గారు స్థానిక స్వపరిపాలన శాఖను నిర్వహిస్తుండేవారు. ఆయన 1921 ఫిబ్రవరిలో చీరాల వచ్చారు. ప్రజలకోర్కెను మన్నించాలని నామినేటెడ్ సభ్యులు కూడా విజ్ఞప్తి చేశారు. కాని మంత్రి వినిపించుకోలేదు.

మునిసిపల్ కౌన్సిలును రద్దుచేసి, జీతభత్యం తీసుకొనే ఛైర్మన్‌ను ఎందుకు నియమించరాదో తెలియజేయండని మంత్రి ఒక నోటీస్ జారీచేశాడు. మునిసిపల్ కౌన్సిలు సమావేశమై "అధిక పన్నులను గ్రామస్థులు భరించగల స్థితిలో లేరని, తమకు మునిసిపాలిటీ అవసరంలేదని" తీర్మానించింది.

1921 ఏప్రిల్ ఒకటవ తేదీన మంత్రి కౌన్సిలును రద్దుచేస్తూ, నెలకు రూ. 390లు జీతం మీద ఒక ఛైర్మన్‌ను నియమించాడు. మంత్రి చర్య ప్రజలలో కోపోద్రిక్తతను కలిగించింది. ఎవరో టోల్‌గేట్‌ను దగ్ధంచేశారని, కలకత్తా మెయిలుకు అడ్డంకులుపెట్టారని తప్పుడు నేరంమోపి వందమంది రిజర్వుపోలీసులను చీరాలకు తరలించాడు క్రొత్త ఛైర్మన్ రిజర్వు సహాయంతో రేట్ పేయర్ల ఆస్తులను జప్తుచేయడం మొదలుపెట్టాడు అయితే, జప్తుచేసిన ఆస్థులను కొనేదిక్కు లేకపోయింది. ఆ ఆస్థులను గుంటూరు, బాపట్ల పట్టణాలకు చేరవేసి, అక్కడ వేలం వేయసాగారు.

## 'ఆంధ్రరత్న' నాయకత్వం :

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గాంధీజీని కలుసుకొని, చీరాల విషయంలో సలహా యివ్వమని కోరారు. ప్రజలు సాత్విక నిరోధంగాని, పట్టణ పరిత్యాగంగాని చేయవచ్చునని ఆయన సలహా చెప్పారు. గోపాలకృష్ణయ్య ఐర్లాండ్‌లో ఉన్నతవిద్య నభ్యసించి వచ్చిన మేధావి. సహాయ నిరాకరణోద్యమంతో ప్రభావితుడై, ఉద్యోగానికి స్వస్తిచెప్పి, దేశసేవలో నిమగ్నుడైన ఉన్నత త్యాగశీలి. చీరాలవచ్చి, 'పట్టణ పరిత్యాగం చేయండని' పౌరులను ఉద్బోధించారు. ఆయన మాటను ప్రజలంతా శిరసావహించారు.

15 వేల మంది చీరాల-పేరాల ప్రజలు ఇళ్ళువాకిళ్ళు వదలిపెట్టి, సమీపంలోని రామనగర్ బీడుల్లో పాకలువేసి, కాపురాలు పెట్టారు. ఇది ఎంతో సాహసోపేతమైన కార్యం. నాన్ కో ఆపరేషన్ ఉద్యమ కాలంలో గోపాలకృష్ణయ్య చేసిన గొప్ప ప్రయోగం. అప్పటి నుంచి ఆయన 'ఆంధ్ర రత్న'గా ప్రసిద్ధి చెందారు.

చీరాల కరణం చీరాల రంగయ్య తన గ్రామోద్యోగ పదవికి రాజీనామాచేసి ఉద్యమానికి చేయూతనిచ్చి మూడుమాసాల కఠిన శిక్షకు గురిఅయినారు.

మునిసిపాలిటీకి పన్ను చెల్లించలేదనే నేరంమోపి, దివ్వెల నాగభూషణం ముద్దాం శ్రీరాములు, దాసరి కృష్ణమ్మ, మద్ది వెంకటసుబ్బయ్య, చేబ్రోలు వెంకట సుబ్బయ్య, గొడవర్తి లక్ష్మయ్య, శిఖాకొల్లు వెంకటసుబ్బయ్య, వేలప్రోలు ఆంజనేయులు, రావూరి అలవేలు మంగతాయారమ్మ, కాలువ సుబ్బయ్య, గొడవర్తి వెంకటేశ్వర్లు 12 మందిపైన పోలీసులు కేసులు పెట్టరు. బాపట్ల మేజిస్ట్రేట్ కోర్టులో కేసు విచారణ జరిగింది.

## అరెస్టులు :

ముద్దాంయాలతోపాటు చీరాల- పేరాల జన సమూహమంతా కదిలింది. ఈపురి పాలెం, వేదుళ్ళపల్లి గ్రామస్థులు ఎదురేగి వారిని వూరేగించి గౌరవించారు. బాపట్ల పౌరులు వారికి ఘనస్వాగతం పలికారు. మేజస్ట్రేట్ 12 మందికి 7 రోజుల వంతున జైలుశిక్ష విధించారు.

చీరాల- పేరాల ప్రజలు 'ప్రజా పంచాయితి'ని ఏర్పరుచకొన్నారు. ఆ కమిటీకి చీరాల కరణం రంగయ్య కార్యదర్శి. బత్తిన రాఘవులు, గుడిపల్లి పేరయ్య, కరణం రంగయ్య గార్లపైన పోలీసులు కేసుపెట్టి ముగ్గురికీ జైలు శిక్షలు విధించి రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపారు.

యినునూరి సుదర్శనం, చీరాల శేషయ్య, సూనె నరసింహం, అప్పాజోశ్యుల వెంకటేశ్వర్లు పన్నులు కట్టలేదని వారం రోజుల చొప్పున శిక్షలు వేశారు.

జూలకంటి సుబ్బారావు, ఊటుకూరి కోటయ్య కుమార్డు వెంకటేశ్వర్లు, గంధి పెదరాజారావులకు 6 వారాల వంతున శిక్షలు విధించారు. యిద్దరు జరిమానాలు చెల్లించి వచ్చారు. కనమర్లపూడి సుబ్బారావు, రూ. 200 లు జరిమానా, శిక్ష రెండూ అనుభవించారు.

జైలుకు వెళ్ళేవారికి, జైలునుండి విడుదలై వచ్చేవారికి 'ఆంధ్రరత్న' మేళతాళాలతో వూరేగింపులు జరుపుతూ, ప్రజలలో ఉత్సాహం కలిగించారు. జైలంటే భయం పోగొట్టారు.

చీరాలను పాడుపెట్టి, క్రొత్తగా నిర్మించిన 'రామనగర్'లో ప్రజలు రామనామ సంకీర్తనలతో భజనలు చేయసాగారు. వారితో గోపాలకృష్ణుడు 'రామదండు'ను ఏర్పరిచారు. వూరూరా తిరిగి నిధులు వసూళ్ళు చేశారు. శ్రీరామచంద్రుడు 14 ఏండ్లు

అరణ్యా వాసం చేయలేదా? అట్లాగే ఎన్ని కష్టాలైనా భరించి విజయం సాధించాలని' ఆయన ప్రబోధించారు.

ఎండాకాలం అక్కడ 116 డిగ్రీల ఎండవేడిమి- జూన్, జూలై మాసాల్లో పది న్నర అంగుళాలవర్షం కురిసింది. ఈ ఎండలకూ, వానలకూ ప్రజలు రామనగర్‌లో నానాబాధలను భరించారు. సహాయ నిరాకరణను కొనసాగించారు.

సహాయ నిరాకరణ వాదులు, 'ఆంధ్రరత్న' ఈ ఆందోళనకంతా కారణమంటూ ప్రభుత్వ ప్రచురణశాఖ దుష్ప్రచారానికిపూనుకొంది. కొందరు దుండగులను పురిగొల్పి చీరాలలోని పాతఇండ్లను పడింపిని తగుల బెట్టించారు అధికార్లు.

నిషేధాజ్ఞను ఉల్లంఘించి బరంపురం ఆంధ్ర మహాసభకు హాజరు కాదలచిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను రూథర్‌ఫర్డ్ అరెస్టుచేసి ఏడాది జైలుశిక్ష విధించాడు. నాయకుని కోల్పోయిన ప్రజలు ఆర్థికచిక్కులతో, నానాబాధలు పడ్డారు. ప్రభుత్వ దమన నీతి పరాకాష్టనందుకొంది. ఒక మహాసాగరంలో చిన్న ద్వీపకల్పంగా వుంది, చీరాల స్థితి.

చౌరీచౌరా దురంతాలు జరిగినవని గాంధీ మహాత్ముడు సహాయ నిరాకరణోద్య మాన్ని ఉపసంహరించారు. రామనగర్‌ను ఖాళీ చేసి ప్రజలు మరల చీరాల యధా స్థానాలకు చేరుకొన్నారు.

చీరాల పురనిర్గమన, శాసనోల్లంఘన ఉదంతం, దేశ స్వాతంత్ర్య చరిత్రలో అసామాన్యమైనది. స్వరాజ్యం కోరే ప్రజల నెంతగానో ఉత్సాహపరిచింది. ఆంధ్రు లకు నేటికీ గర్వకారణంగా నిలిచివుంది. చీరాల కధనం మనోహరం, అత్యద్భుతం.

సీ *అందరికన్న ముందర చెఱసాలలో*
*గాలుపెట్టినది చీరాల వారు*
*అందరికన్న ముందాంధ్ర దేశమున సా*
*రాయి మానినది చీరాల వారు*
*అందరికన్న ముందాత్మ జీవన మవ*
*లీల బానినది చీరాలవారు*
*అందరికన్న ముందతి ధైర్యకాలులన్*
*ప్రతిభ గాంచినది చీరాల వారు*
*పన్ను గట్టంగవలదను భావమున బు*
*రంబు బాసినవారు చీరాల వారు*
*వారి బొగడంగ నేరరెవ్వారలైన*
*ధీరమతులార! యో భారతీయులార!!*

—'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

# పల్నాటిసీమంలో పుల్లరి సత్యాగ్రహం

పల్నాటిసీమ వీరులకు జన్మభూమి. కార్యమపూడి (నేటికారెంపూడి) కదన రంగంగా పల్నాటి చరిత్ర ప్రసిద్ధికెక్కినవి. ఇక్కడ అడవులు ఎక్కువగా వున్నవి. పుల్లరి బాధతో పాటు, అటవీ శాఖాధికారుల దౌర్జన్యాలు కూడా మితిమీరినవి. వారి జబర్దస్తీలను ప్రజలు భరించలేకపోయారు. గాంధీజీ ప్రబోధిస్తున్న శాసనధిక్కార మంత్రం వారి చెవినబడింది.

దురహంకారంతో ప్రవర్తిస్తున్న రెవిన్యూ, ఫారెస్టు ఉద్యోగులపైన ప్రజలు 'సాంఘిక బహిష్కరణ'ను విధించారు. మాచెర్ల 'స్వరాజ్య మందిరం'లో పుడ్ కంట్రోలు ఆఫీసును పెట్టరు. ఉద్యమ నాయకుల అనుమతి లేనిదే నిరంకుశాధికార్లకు, కలెక్టర్‌కు బియ్యం, పాలు, గ్రుడ్లు దొరకలేదు. హోటళ్ళవారు అధికార్లకు తిండిపెట్ట లేదు. దుకాణాదార్లు వెచ్చాలు అమ్మలేదు. చాకళ్లు, మంగళ్ళు ప్రభుత్వాధికార్లకు పనులు చేయలేదు. 'పన్నులు కట్టండని' చాటింపు చేసేవాడులేడు. అధికార్లపై ప్రయో గించిన సంఘ బహిష్కరణ విజయవంతమైంది. అన్ని వర్గాల ప్రజలలో ఐక్యత చేకూరింది.

పల్నాడులో ఫారెస్టుగార్డు, వాచర్ల సంఖ్యను పెంచి ప్రభుత్వం ప్రజలపైన తీవ్ర నిర్బంధ విధానానికి పూనుకొంది. ఇది ప్రజల నింకా ఉద్రిక్తపరిచింది.

'అటవీ శాసనాలను ఉల్లంఘించవలెనని, పుల్లరి చెల్లించవలదని ఇంకా కాంగ్రెస్ తీర్మానించలేదని, శాంతియుతంగా వుండి ఉద్యమానికి సంసిద్ధులు గావాలని' కాంగ్రెస్ నాయకులు విజ్ఞప్తులుచేస్తూ వచ్చారు. అయితే, శత్రువర్గంగా వున్న ప్రభుత్వాధికార్లను బహిష్కరణ చేయవచ్చునని ఆదేశించడం జరిగింది.

## పల్నాటి మహాజనసభ :

కారెంపూడిలో జరిగిన 'పల్నాటి మహాజనసభ'కు అధ్యక్షత వహించిన బారిస్టర్ పోలిశెట్టి హనుమయ్యగుప్తా ప్రసంగ భాగాలను ఈ సందర్భంలో గమనిం పండి :

"అటవీ శాఖాధికారులు, పోలీసు బందోబస్తుతో గ్రామాలపైబడి పశువులను బందెలకు తోలుకపోసాగారు. తల్లులను వాటి దూడలను

వేరుచేసినారు. తెలంగాణ హృదయం యిది చూడలేకపోయింది. వంద లాది రైతులు పశువుల వెంటబడి తమ పశువులను విడిపించుకోడానికి ప్రయత్నించారు. ఇది నిరంకుశాధికారులకు, పోలీసులకు కోపకారణ మైంది. తెల్లవారే సరికి నిర్బంధం మీద నే గ్రామాన్నంతా పోలీసు బలగాలతో, సైనికులతో చుట్టుముట్టి మూకుమ్మడిగా అరెస్టులు చేశారు. పన్నులు, పుల్లరి చెల్లించేవరకు వారి ఆస్తులను జప్తులుచేశారు. అరెస్టు చేసిన వారిని విడుదల చేయాలని కోరిన జనసమూహంపై కాల్పులు జరిపి, నానా భీభత్సం చేశారు. పల్నాటిసీమలో ఇలాంటి సంఘటనలు వెల్దుర్తి, జట్టిపాలెం, జంగమహేశ్వరపురం, మిటుకూరు, రామాపురం మున్నగు పలు గ్రామాలలో జరిగినవి.

ఇప్పుడు పుల్లరికట్టవలెనా? లేదా? అను ప్రశ్నకు మనం జవాబు చెప్ప వలసి వుంది. నేను మండల కమిటీ కార్యదర్శిని గనుక, కాంగ్రెస్ తీర్మాన భావమును నేను చెప్పవలసి వున్నది. పుల్లరి యివ్వకుండు విషయం శాసనోల్లంఘనం క్రిందకు చేరును. దేశమంతయూ శాస నోల్లంఘనం చేయుటకు కాంగ్రెస్ యింకనూ తీర్మానం చేయలేదు. ఏ జిల్లానందైనను లేక మరి యొక్క చిన్న నియోజకవర్గ ప్రదేశము నందైనను శాసనోల్లంఘనమును అమలులో పెట్టవచ్చును. దానికి ముందుగా రాష్ట్రీయ సంఘము వారిద్వారా అఖిలభారత కాంగ్రెస్ కార్య నిర్వాహక సంఘంవారి అనుమతిని పొందవలయును. అంతవరకు కాంగ్రెస్ తరఫున ఈ మండల సంఘము వారు పల్నాటి పుల్లరి విష యమై ఏమియు చెప్పజాలరు.

## బహిష్కార సమస్య :

ఒక సంగతి మట్టుకు మండల కార్యనిర్వాహక వర్గమువారు గట్టిగా చెప్పగలరు. మీ సౌఖ్యము కొరకును, మీ పశువుల సౌఖ్యము కొరకును శత్రువులుగా వున్న వారిని మీరు బహిష్కరించవచ్చును. అట్టి వారికి చోటు యివ్వనవసరము లేదు.

బహిష్కారమనగా కొందరు బూటకపు నీతులు చెప్పెదరు. ఆగస్టు 11వతేదీన 'జన్మభూమి' పత్రికలో 'పల్నాటిలో జరిగే సత్యా

బహిష్కారమునకు, మనుష్యులను ఖూనీ చేయుటకును భేదము లేదని' ఏవోనీతులు వ్రాసిరి. కొన్ని పట్టణములలో కొందరికి కలుగుసౌఖ్యము వల్ల పుట్టు చవుక నీతులను మీరు లక్ష్యపెట్ట నవసరం లేదు. బియ్యం, పాలు, గ్రుడ్లు మొదలగు వస్తువులేమీ ఉద్యోగులకు దొరకవని తెలిసి నప్పుడు వారుపల్నాడులో ఎందుకు వుండవలయును? ఇట్టి విషయములో బహిష్కారమును, ఖూనీ చేయుటతో పోల్చుట తెలివో మానుషమో తెలియకున్నది.

శ్రీయుత కొండవెంకటప్పయ్య పంతులుగారు ఇటీవల పల్నాడు చూచి వెళ్ళిన తర్వాత గాంధీగారికి బహిష్కారము విషయమై వ్రాసి యుండిరి. 'కొన్ని స్థలములలో ఉన్న ప్రత్యేక కష్టములనుబట్టి బహిష్కారమును తలపెట్ట వచ్చును' అనివారుసలహా యిచ్చిరి. అయితే, గాంధీగారు అట్టి బహిష్కారము 'దౌర్జన్య రహితముగా ఉండవలె ననిరి.'

ఈ సందర్భములో దౌర్జన్య రహితమనగా ఇంతకన్న వేరు అర్థముండదు. బహిష్కరింపబడిన వారికిబియ్యము అమ్మకపోవచ్చును. పూటకూలి పెట్టక పోవచ్చును. అయితే భోజనములేక అడిగిన అన్నదానము చేయవలెను. అట్టి వాని భార్య కడుపుతో నుండిన మంత్రసాని పోకుండా వుండకూడదు. బహిష్కారము చేయుటలో ఉద్దే శ్యము బహిష్కరింపబడిన వారు తన దుర్మార్గమును తెలిసికొని మళ్ళి చేయకుండుటకు గాని, వానిని హింసించుటకు కాదు-"

**పోలిశెట్టి హనుమయ్య గుప్తా**
(అధ్యక్షులు, ద్వితీయ పల్నాటి మహాజనసభ)
కారెంపూడి— ది 16-8-1921

బెజవాడ ఎ. ఐ. సి. సి మహాసభ పల్నాటి ప్రజల్లో కూడా గొప్ప ప్రభావాన్ని కలిగించింది. ఆ సభానంతరం కోలవెన్ను రామకోటేశ్వరరావు,బెల్లంకొండ రాఘవరావు మున్నగువారు పల్నాడుతాలూకాలో కాంగ్రెస్ ప్రచారం చేశారు. కొండవెంకటప్పయ్య, వున్నవ లక్ష్మినారాయణ గ్రామాలలో తిరిగి కాంగ్రెస్ సందేశాన్ని వినిపించారు.

గంగవరంలో సభజరిపి గ్రామోద్యోగులు రాజీనామాచేయాలని నిశ్చయించు కొన్నారు. 1921 జులైలో మహాజనసభ కారెంపూడిలోజరిగింది. దురహంకారులైన ప్రభుత్వోద్యోగులను సంఘబహిష్కరణ (Social Boycot) చేయాలని తీర్మానించారు.

పల్నాడులో శాంతియుతంగా ఉద్యమాన్ని నడపడానికి, అక్కడి పరిస్థితులను విచారించేందుకు గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం వున్నవ లక్ష్మీనారాయణ, మాడ భూషి వేదాంతం నరసింహాచారిగార్లను పంపించింది. ఆ నాయకుల సత్ప్రవర్తనకు హామీకావాలని జిల్లాఅధికారి నోటీస్ జారీచేశాడు. అందుకువారు తిరస్కరించారు. నాయ కులను ప్రజలు కనకతప్పెట్లతో బ్రహ్మాండమైన వూరేగింపుతో తీసుకొని వెళ్ళి, అధి కార దుర్నీతికి తగు సమాధానం చెప్పారు. మాచెర్లలో వున్నవలక్ష్మీనారాయణ, నర సింహాచారి గార్లను అరెస్టుచేసి గుంటూరుకు చేరుస్తున్నప్పుడు దారిపొడుగునా ప్రజలు నిరసన ప్రదర్శనలు జరిపారు.

కొండ వెంకటప్పయ్య, నడింపల్లి నరసింహారావు, శ్రీమతి వున్నవ లక్ష్మి బాయమ్మ నాయకత్వాన గుంటూరు పురజనులు అరెస్టులకు తీవ్ర అసమ్మతి ప్రకటిం చారు. నాయకులను జైలుకు పంపుతున్న రైలును కదలనివ్వలేదు. అంతకు పూర్వమే మాచెర్ల వాసులైన ముస్లిం దేశభక్తులు నబీసాహెబ్, చింతపల్లి హసన్ సాహెబ్, జాన హమ్మద్ గార్లను ప్రభుత్వం అరెస్టుచేసి, కఠిన శిక్షలు విధించి జైలుకు పంపింది. అధికార్లు నిర్బంధ విధానాన్ని తీవ్రతరం చేశారు.

1922 జనవరిలో దాచేపల్లిలో ప్రత్యేక మహాజనసభ పెరుమాళ్ళ శాయన్న శ్రేష్టి అధ్యక్షతన ఏర్పాటు చేశారు. 'కాంగ్రెస్ ఆజ్ఞ ప్రకారం, శిస్తులు, పుల్లరి చెల్లిం చండని' నాయకులు విజ్ఞప్తి చేశారు ఉద్యమం సన్నగిల్లుతున్నదని గ్రహించిప్రభుత్వం నాళంమట్టుపల్లి, పెరుమాళ్ల శాయన్న, తిరునగరి నరసనూరి, గోలి మల్లిఖార్జునశాస్త్రి, పుచ్చా లక్ష్మీనృశింహశాస్త్రి, నల్లగొండ జానికి రామయ్యశ్రేష్టిఆరుగురు నాయకులను అరెస్టు చేసి, 6 మాసాల చొప్పున కఠిన శిక్షలు విధించింది.

పల్నాడులో జరిగిన కొన్ని ముఖ్య సంఘటనలను ఈ సందర్భంలో తెలుసు కోవడం అవసరం.

## వెల్దుర్తి గ్రామం

వెల్దుర్తిలో పోలీసులు పశువులను బందెకు తోలుకొని పోతుండగా ప్రజలు అటకా యించారు. ప్రజల కోపాగ్నికి తాళలేక అధికార్లు వెల్దుర్తి బంగళాలో తలదాచుకోవలసి

వచ్చింది. కాల్పులు చేస్తామని పోలీసులు బెదిరించినప్పటికీ ప్రజలు వెనుకంజ వేయ లేదు. పోలీసులు తుపాకులు గాలిలోకి పేల్చారు. జనం జంకలేదు. చివరకు రైతులు తమ పశువులను విడిపించు కొన్నారు. విచ్చలవిడిగా కాల్పులు చేయకపోవడంచేత తాము యిట్టి అవమానానికి గురి అయినట్లు పై అధికార్లకు నివేదిక పంపుకొన్నారు ఆ కసి తీర్చుకోడానికి తర్వాత అధిక సంఖ్యలోవచ్చి గ్రామంపై బడి నానా దుష్కృ త్యాలు చేశారు

## జెట్టిపాలెం గ్రామం

జెట్టిపాలెంలో పర్మిట్లు లేకుండా మేపుతున్నారని వంద పశువులను అటవీ శాఖాధికార్లు నిర్బంధించారు. వాటికి మేత, నీరు లేకుండా చేశారు. ఇది చూచి ప్రజలు ఆటకాయించి, తమ పశువులను విడిపించుకొనిపోయారు. అక్కడ వున్న హెడ్ కానిస్టేబుల్‌కూడా ప్రజలతో షరీకైనాడని కాపలా పోలీసులు కూడా తగుచర్య తీసుకో లేదని, అధికార్లు భావించి, హెచ్చు రిజర్వు, సైనిక బలంతో వచ్చిపడ్డారు. జిల్లా కలెక్టర్, పోలీస్ సూపరింటెండెంటు వచ్చి మూకుమ్మడిగా అరెస్టులు చేశారు. కరణం సోదరుని సైతం బంధించారు. అతని ఇంటి నుండి రూ 200/లు పోలీసులు కాజేసినట్లు ఫిర్యాదు చేసినప్పటికీ, అధికార్లు విచారించుకోలేదు.

## జంగమహేశ్వరపురం

ఈ గ్రామం గురుజాలకు 2 మైళ్ళ సమీపాన వుంది. పోలీసులు ఒకరైతును 108వ సెక్షన్ క్రింద అరెస్టుచేసి, తీసుకొని పోతుండగా ప్రజలు వెంటబడి, అతనిని విడిపించుకున్నారు. ఇది విని, జిల్లా కలెక్టర్ ఆ వూళ్ళో మకాంచేసి తనను కలుసు కోమని గ్రామస్థులకు కబురు చేశారు. కాని ఆ మాటను ఎవరూ ఖాతరు చేయలేదు. ఆ క్రోధంతో రిజర్వు బలగంతో ఆ గ్రామాన్ని చుట్టుముట్టించాడు. జనాన్ని ప్రోగు చేసి పలువురిని అరెస్టు చేయించాడు రైతుల ఆస్తులను జప్తు చేయించాడు.

## రామాపురం గ్రామం

దాచేపల్లి నుండి పొందుగులకు పోయే రోడ్డుకు సమీపంలో ఈ గ్రామం వుంది. గ్రామస్థులు మొదటి కిస్తీ చెల్లించలేదు. సుమారు మూడు వేల రూపాయలు గ్రామంలో శిస్తులు వసూలు కావలసివుంది. రెవిన్యూ ఇన్‌స్పెక్టర్, తహసీల్దారు 20 మంది రిజర్వు దళాన్ని వెంటతీసుకొని శిస్తు వసూళ్ళకు గ్రామంలో బయలుదేరాడు. ఒక ధనవంతు

డైన కోమటి ఇంట్లో ప్రవేశించి, సామానులను చిందరవందరచేస్తూ అతని ఆస్తిని జప్తు చేయనారంభించారు. ఈ సంగతి గ్రామ ప్రజలకు తెలిసింది. అందరూ కలిసి అక్కడికి వెళ్ళారు. జనసమూహాన్ని చూచి అధికార్లు హడలిపోయారు. అంతట 'దగ్గరలో వున్న పొందుగలకు మమ్మి పోనివ్వండని' బతిమిలాడి ఎలాగో ఆ గ్రామం నుండి బయటపడ్డారు. జనం కూడా వారి వెంటబడ్డారు. 'ఉద్యోగులను బహిష్కరించండని' చుట్టూ గ్రామాల వారితో చెప్పారు. ఇట్లా గేలిచేయడం అధికార్లకు తలవంపులైంది. 'ఆ గ్రామ రైతులు మమ్మి ఇంట్లోపెట్టి తాళం వేశారని' తహసీల్దార్ తప్పుడు ఫిర్యాదు చేసుకొన్నాడు.

రామాపురం గ్రామ ప్రజలపైన కక్షదీర్చుకోడానికి జిల్లాకలెక్టర్, డి. ఎస్. పి, జిల్లా అధికార్లు బయలుదేరారు. కెప్టెన్ మాచోనోచీ నాయకత్వాన 20 మంది సైనికులు, 25 మంది రిజర్వు పోలీసులు వారికి తోడువచ్చారు తెల్లవారే సరికల్లా ఆ గ్రామాన్ని చుట్టుముట్టారు. వూళ్ళో నానా భీభత్సం చేశారు. 18 మంది గ్రామ ముఖ్యులను అరెస్టు చేసి, కేసుపెట్టి తర్వాత శిక్షలు విధించారు. ఆ మధ్యాహ్నానికల్లా వసూలు కావలసిన రూ॥3.000లులో 300/లు తప్ప మిగలా శిస్తుయావత్తు వసూలయ్యే పర్యంతం రైతులను నానాహింసలు పెట్టారు.

రామాపురం గ్రామంలో అరెస్టు చేసిన వాళ్ళందరినీ పొందుగల గ్రామందాకా నడిపిస్తూ, చుట్టూ గ్రామాలవారిని భయకంపితులను చేశారు.

ఈ విధంగానే, మాచెర్ల సమీప గ్రామాల్లో కూడా అటవీశాఖాధికార్లు, తమపైన ప్రజలు దౌర్జన్యం చేశారని నేరంమోపి, ఆ ప్రాంత గ్రామస్థులను అనేక బాధలకుగురి చేశారు.

పోలీసుల దాడులకు కారణం, ప్రజలపైన కక్ష తీర్చుకోడానికే. పల్నాటి సీమ ప్రజల్లో పెంపొందుతున్న చైతన్యాన్ని అణచి వేయడానికి, వారి ధైర్యోత్సాహాలను నీరసింపచేయడానికి పల్నాడుకు సైన్యాన్ని కూడా దించి, ఎట్టిదురంతాలు చేసేందుకైనా అధికార్లు వెనుకాడలేదు.

## మించాల పాడుగ్రామం :

దుర్గికి సమీపంలోని అడవి ప్రాంతంలో ఈ మించాలపాడు గ్రామంవుంది. [illegible] కోలగుట్ల [illegible]వారు. కన్నెగంటి హనుమంతు ఈ ప్రాంత పదిగ్రామాలలో మంచిపలుకుబడిగలరైతు పెద్ద. హనుమంతు, నాగయ్య, [illegible] పిచ్చయ్య అనే ముగ్గురు రైతులు

తమ పశువులకు పుల్లరి చెల్లించి రశీదులు తీసుకున్న ధాఖలాలు కూడా వున్నాయి. అసహాయోద్యమంలో పాల్గొన్న గోలి మల్లికార్జున శాస్త్రి ఒకటి రెండు సార్లు మించాల పాడు ప్రాంతం వెళ్ళి కాంగ్రెస్ ప్రచారం చేశారు. కాని ఆ గ్రామస్తులు కాంగ్రెస్‌లో సభ్యులుగా చేరినట్లుగాని, తిలక్ స్వరాజ్య నిధికి వారు విరాళాలు యిచ్చినట్లుగాని దృష్టాంతాలేమిలేవు. అసహాయోద్యమంతో వారికి పెద్దగా సంబంధం వున్నట్టు కనుపించదు.

1922 ఫిబ్రవరి 26వ తేదీన అసిస్టెంటు కన్‌సర్వేటర్ రేంజర్లు 14 మంది గార్డు వాచర్లు మించాలపాడు వచ్చి పడ్డారు. జనాన్ని వూరి వెలుపలికి పిలిపించారు. ఫారెస్టు పుల్లరి కట్టనందుకు వాళ్ళ పశువులను బందెలు దొడ్డికి తోలుక పోతామన్నారు అధికార్లు. హనుమంతు వచ్చి 'మా గ్రామంలో కట్టవలసిన పుల్లరి ఏమైనావుంటేనేనే కడతాను. అన్యాయంగా మా పశువులను బందెకు తోలవద్దు' అని చెప్పాడు కాని ఆయన మాట వినిపించుకోలేదు.

## హనుమంతు వీరమరణం :

ఆ మధ్యాహ్నానికల్లా దుర్గి పోలీస్ ఇన్స్‌పెక్టర్ రాఘవయ్య, కరణం యండ పల్లి సదాశివయ్య, రిజర్వు పోలీసులతోసహా ఫారెస్టు ఉద్యోగులకు సహాయం వచ్చారు. అందరూ కలిసి, వందగేదెలను, పశువులను దుర్గి బందెలుకు తోలుకొని పోసాగారు. పశువులేటి చెన్నయ్య (హనుమంతు మేనల్లుడు) 'మా పాడి గేదెనైనా వదలి పెట్టండి' అంటూ ఆ గేదెను అదిలించబోగా ఆ పిల్లవాడిని తుపాకీ మడిమలతో పొడిచారు. ఈ వార్తవిని హనుమంతు 'ఆ పసివాడిని ఎందుకు కొడతారయ్యా, వాడి పశువులను వద లండని' కేకవేశాడు. 'అతను దగ్గరకువస్తే మనలను బ్రతకనివ్వడని' కరణం సదా శివయ్య చెప్పగా, వెంటనే రిజర్వు పోలీసులు హనుమంతునిపై కాల్పులు సాగించారు. కొన్ని తుపాకీగుండ్లు అతని డొక్కలో తగిలి నేల కొరిగాడు. కుడిచేయి దండ విరి గింది. పడిపోయి కూడా అధికార్లతో ఒకటిన్నర గంటల సేపు ధైర్యంగా వాగ్వి వాదం చేశాడు. భార్య గంగమ్మ, గొల్ల అచ్చమ్మ హనుమంతుకు మంచి నీళ్ల యివ్వబోతే, వాళ్ళనుకొట్టి వెనుకకు పంపారు. రక్తం ప్రవహించిపోగా రాత్రి 12 గంటలకు హనుమంతు ప్రాణంవిడిచాడు. పోలీసులు 47 రౌండ్లు కాల్చారు. గుంపులో 20మందికి గాయాలు అయినవి. గాయపడిన వారిలో 9 మంది స్త్రీలు కూడా వున్నారు. హనుమంతు పాలేరు యల్లంపల్లిశేషు, సబ్‌ఇన్స్‌పెక్టర్ గుర్రపువాడు మర

జించారు. ఆ మూడు శవాలను 27వ తేదీన కోలగుట్లకుచేర్చి ఆవూరి వెలుపల పూడ్చి పెట్టారు. ఇది జరిగిన నాల్గురోజులకు హనుమంతు భార్య, క్రుళ్ళిపోతున్న హనుమంతు శవాన్నితెచ్చి,అపర క్రియలన్నీ యథావిధిగా జరిపి, మించాలపాడు సమీపాన భూస్థాపితం చేశారు. 20 రోజుల తర్వాత ఆయన సమాధిపైన స్మారక శిలాశాసనాన్ని ఏర్పాటు చేశారు. అందుయిట్లు లిఖించబడింది :

## స్మారక శిలాశాసనం:

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శతాబ్ది 1884 సంవత్సరానికి సరియైన హూణశతాబ్ది 1922 ఫిబ్రవరి26వ తేదీకి సరియగు దుర్మతినామ సంవత్సర మాఘ బహుళ అమావాస్య భానువాసరము పగలు 12 గంటలకు గుంటూరు జిల్లా కలెక్టర్ వర్నర్ దొరగారు, నాన్‌కోఆపరేషన్ ఉద్యమాన్ని అణచ కంకణంకట్టి పల్నాడుతాలూకాకువచ్చి కోలగుట్ల శివారు మించాలపాడు గ్రామమునకు ఫారెస్టు పుల్లరి కట్టనందుకు గాను, సదరు గ్రామ పశువులను నిర్బంధించుటకు కొంత సైన్యమును యిచ్చి దుర్గి సబ్‌ఇన్స్పెక్టర్ రాఘవయ్యా నాయుడును పంపగా, వారలు పశువుల నిర్బంధమునకు ప్రయత్నముచేసిరి. అంతలో సదరు గ్రామ కాపురస్తుడు కన్నెగంటి హనుమంతును తుపాకులతో కాల్చగా శాంతముగా వారిని ఎదిరించి నిలిచినంతలో తుపాకీ గుండ్లకు 26రవ్వలు శరీరములో నిలిచిన దరిమిలా ఒకటిన్నర గంటలు వాగ్వివాదము చేసి రాత్రి 12 గంటలకు వీరస్వర్గము చేరినాడు."

## తప్పుడు కేసు: 16 మందికి శిక్షలు

ఈ వార్త వినినంతనే 27వ తేదీ తెల్లవారేసరికి కలెక్టర్, సూపరింటెండెంట్ 20మంది ఆశ్విక దళంతో మించాలపాడు గ్రామాన్ని చుట్టుముట్టారు. రైతుల ఆస్తులను కొల్లగొట్టారు. 36మందిని అరెస్టు చేశారు. సర్కారు ఉద్యోగులపైన తిరుగుబాటుచేశారని, పుల్లరి కట్టలేదని అక్రమ నేరాలను ఆరోపించారు. నరసరావుపేట కోర్టులో డిప్యూటీ కలెక్టర్ జంబునాథయ్యర్ ఈ కేసును విచారించి 16మందికి సంవత్సరం చొప్పున కఠిన శిక్షలు విధించారు.

సారా త్రాగివున్న మైకంతో హనుమంతు, గ్రామ ప్రజలు పశువులను తోలుక పోతున్న పోలీసులపైన, ఉద్యోగులపైన రాళ్ళవర్షము కురిపించారని, ఆత్మరక్షణార్థం పోలీసులు కాల్పులు జరపగా హనుమంతు మరణించాడని, తమ దుశ్చర్యలను కప్పి పుచ్చుకొనేందుకు తదుపరి కట్టుకదలల్లి అధికారులు రాష్ట్రప్రభుత్వానికి రిపోర్టు పంపు కొన్నారు.

> అయితే, ప్రజల వైపునుంచి దౌర్జన్యమేమీ జరగలేదు. "దౌర్జన్య రహిత సహాయ నిరాకరణోద్యమముపై ప్రభుత్వాధికార్లకు కలిగిన క్రోధమే ఈ ఘోరకృత్యాలకు కారణం. ఈ దురంతాలు పంజాబులో 1919లో నిరంకుశాధికారవర్గంచే గావించబడిన దురంత వృత్తాంతమును స్మరణకు తెచ్చుతున్నవి"అని ఆంధ్ర కాంగ్రెస్ సంఘ పక్షాన విచారణసంఘ సభ్యులుగా పల్నాడు వెళ్ళిన గద్దెరంగయ్య నాయుడు నివేదికవల్ల స్పష్టంగా తెలుస్తున్నది.

గద్దె రంగయ్య నాయుడు సి ఐ. డీ పోలీసులు వెంటాడుతుండగా, వారిని తప్పు కుంటూ, అనేక వ్యయప్రయాసలకులోనై, తాలుకా స్వాతంత్ర్య సమర యోధులైన నాళంమట్టుపల్లి, తిరునగరి నరససూరి, గోలి మల్లికార్జున శాస్త్రి గార్ల తోడ్పాటుతో రెండురోజులు మించాలపాడు ప్రాంతంలో గడిపి, అచ్చటి వారినుండి వాఙ్మూలాలు సేకరించి, "పల్నాడు దురంత విచారణోప సంఘనివేదిక" పేర ఆంధ్ర కాంగ్రెస్ కమిటీకి నివేదికను సమర్పించారు. దానిని చిన్న పుస్తకంగా వెలువరించగానే, రాష్ట్ర ప్రభుత్వం నిషేధించింది. హనుమంతును పోలీసు కాల్పులకు బలిచేసి, మించాల పాడు పైన జరిపిన ఘోర దురంతాలకు సంబంధించిన యదార్థగాథను మొదటగా ఈ నివేదిక లోకానికి వెల్లడించింది. 'పల్నాటి గాంధీ' గా పేరొందిన నాళం మట్టుపల్లి తమ 'పల్నాటి స్వాతంత్ర్య సమరయోధుల సంగ్రహ చరిత్ర'లో కూడా ఆవివ రాలు పేర్కొన్నారు.

అసహాయోద్యమం చచ్చిపోయిందని విర్రవీగిన జస్టిస్ పార్టీ పాలకుల ప్రలాపా లకు జవాబుగా, పలువురు స్వచ్ఛంద సేవకులు పల్నాడులో ఉద్భవించారు. గురజాలలో కాశావఝ్ఝల శేషయ్య, కాపూరి వెంకయ్య గంగవరంలో వెంకటనరససూరి, ఉలి వెంకట్రామయ్య, పట్టెల నరసింహ్వం, ముటుకూరులో గోపవరపు రామయ్య, మాచెర్లలో గుర్రం మల్లయ్య, రెంటచింతలలో మోటుమర్రి నాగలక్ష్మమ్మ మున్నగు

స్వాతంత్ర్య సమరయోధులు తదనంతర కాలంలో జరిగిన ఉప్పుసత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలో ధైర్యంగా పాల్గొని కారాగార శిక్షలు అనుభవించారు. దేశ భక్తిని చాటారు.

జాతీయ స్వరాజ్య సమరంలో పల్నాటి పుల్లరి సత్యాగ్రహం ఒక మహోజ్జ్వల ఘట్టం. కన్నెగంటి హనుమంతు వీరగాథ చిరస్మరణీయమైనది.

*ఒక్క సుముహూర్తాన ఉప్పొంగి భరతోర్వి*
*స్వాతంత్ర్య శంఖము సింహనాదముచేయ*
*మేరువై నిలిచిందిరా - పల్నాడు*
*ముందుండి పోరిందిరా!*

*కన్నెగంటి హనుమంతు కోరమీసము ద్రిప్పి*
*పల్నాటి ప్రజలచే పన్నులెగబెట్టించె*
*బలియిచ్చె హనుమంతునూ - పల్నాడు*
*పరప్రభుత్వపు గుండెలకూ!*

—వి. వి. శివయ్య

## రాయచోటిలో పుల్లరి సత్యాగ్రహం

సహాయ నిరాకరణోద్యమం సందర్భంలో కడప జిల్లా రాయచోటి తాలూకా ఫారెస్టు ప్రాంతాల ప్రజలు శాసనోల్లంఘనానికి పూనుకొన్నారు. ప్రజలు అటవీ శాసనాలను ధిక్కరించారు. రిజర్వు అడవులలో సరిహద్దు గుర్తు రాళ్ళను తీసివేశారు. పర్మిట్లు లేకుండా పశువులను, గొర్రెలను, మేకలను అడవులలోకి తోలారు. గ్రామ మునసబు, కరణాలు కూడా ప్రజలతో కలిసిపోయినారు. అటవీశాఖోద్యోగులకు 'ఇండ్ల వసతి కల్పించరాదని, సరుకులు యివ్వకూడదని, ఏ విధమైన సహాయం చేయరాదని' రైతులు కట్టడి చేసుకొన్నారు.

రాయచోటి తాలూకా నాన్ కో-ఆపరేషన్ ఉద్యమ పరిస్థితులను గూర్చి కడప జిల్లా కలెక్టర్ 1922లో ప్రభుత్వానికి ఈ విధంగా రిపోర్టు పంపుకున్నారు:-

"The non-cooperation lecturers went about the villages of the Rayachoti taluq inciting the people to break the forest laws. The out come of this campaign was an extensive out break of lawlessness in the villages bordering on reserve forests Boundary stones were removed in many places and removing whatever they required.

The forest subordinates were helpless to do anything. Cattle, goats were driven into the forests to graze without permits Local village Muncifs also Joined with them."

Report of Cuddappah District Collector (1922)

పాలకొండ, గండికోట, శేషాచలం, వంగిమళ్ళ, వీరబలి పోరుమామిళ్ళ, కొండూరు మున్నగు గ్రామాలలో అటవీశాఖాధికారులకు ఏ సరుకు కొందామన్నా దొరకేదికాదు. సన్నిపాయ రేంజి ఆఫీసర్ ప్రజలపైన దురుసుగా ప్రవర్తిస్తే, అతని చేతి రివాల్వరును లాక్కోడం జరిగింది. ఆ సందర్భంలో పోలీసులు 17 మందిని అరెస్టుచేసి, జైలు శిక్షలు విధించారు.

గుంటూరు జిల్లాలో సహాయ నిరాకరణోద్యమాన్ని అణచి వేయడానికి రాయల సీమ నుండి పోలీసుల దళాలను పంపారు. ఇది గమనించిన కాంగ్రెస్ నాయకులు, వలంటీర్లను, ప్రచారకులను రాయలసీమ ప్రాంతానికి కూడా పంపించారు.

కాంగ్రెస్ సేవకుల ప్రబోధం మూలంగా, రాయచోటి ప్రాంతంలో 50మంది గ్రామోద్యోగులు రాజీనామాచేసి, కాంగ్రెస్ సంఘానికి సమర్పించారు. కొందరు కంట్రాక్టర్లు కల్లు సారా పాటలు పాడలేదు. సారా పాట పాడనని ప్రజల ఎదుట ప్రమాణంచేసిన ఒకవ్యక్తి, రహస్యంగా వెళ్ళి తన పేర పాట కొట్టేసుకున్నాడని తెలిసి, ఆ గ్రామస్థులు అతనిని తలగొరిగించి గాడిద మీద ఎక్కించి వూళ్లో వూరేగించి అవమాన పరిచారు. ఈవిధంగా ప్రజలు కాంగ్రెస్ ఆజ్ఞలను సిరసావహిస్తుండగా, ప్రభుత్వం నిర్బంధాలు సాగించింది.

గుంటూరుజిల్లానుండి ప్రచారార్థం వెళ్ళిన కన్నెగంటి సూర్యనారాయణమూర్తిని పిల్లుట్ల హనుమంతరావును పోలీసులు అరెస్టుచేశారు. 15 రోజులు రిమాండులో వుంచి, విచారణానంతరం ఒక సంవత్సరం కఠినశిక్ష విధించి రాయవెల్లూరు జైలుకుపంపారు. ప్రతాపగిరి రామమూర్తికి ఒక ఏడాదిజైలు శిక్ష విధించారు. జి.వి. పున్నయ్యశాస్త్రి బాలుడైనందున, మరల గుంటూరుకు పంపివేశారు. ఆయన శాసనోల్లంఘనం చేసి, తర్వాత అరెస్టు అయినాడు.

## ఒంగోలు తాలూకాలో ఉద్యమం :

ఒంగోలు తాలూకా ఈదుమూడి-దుద్దుకూరు గ్రామాల రైతులు పన్నులు చెల్లించలేదు. ప్రభుత్వం దుర్మార్గుడైన ఒక తహశీల్దారును అక్కడ నియమించింది. ఆయన రిజర్వు పోలీసుల సహాయంతో అక్కడకు వచ్చి శిస్తుకట్టనందుకు రైతుల పశువులను జప్తుచేయించ సాగాడు. పశువులకు మేత, నీరు లేకుండా చేశాడు, పశువులు అల్లాడి పోతున్నాయి. వాటస్థితిని చూచిన రైతులు ఉగ్రులైనారు. 500మందిపైగా రైతులు చేతి కందిన వాటిని తీసుకొని పోలీసులపై తిరగబడడానికి సిద్ధమైనారు. మరొక వైపు పోలీసులు తుపాకులు ధరించి కాల్చడానికి తయారైనారు. ఈ పరిస్థితిని గమనించిన కాంగ్రెస్ వలంటీర్లు 'శాంతి సేన' రైతుల దారికి అడ్డంగా పడుకొని, శాంతంగా వుండమని బ్రతిమాలారు. ఉద్రిక్తస్థితి ఏర్పడిన సమయంలో సబ్‌కలెక్టర్ అక్కడకు వచ్చారు. ఆయన సమయస్ఫూర్తితో రైతుల పశువులను వదలిపెట్టించి, పరిస్థితిని విషమించకుండా చేశాడు.

## కల్లుపాకల వద్ద పికెటింగులు :

సారా కల్లుపాకల వద్ద కాంగ్రెస్ వలంటీర్లు కల్లు. సారా పాటలు పాడవలదని పికెటింగులు చేశారు.

ఏలూరు తాలూకా ఆఫీస్ వద్ద కల్లు పాటలకు ప్రజలు నిరసన తెల్పారు. మోతే గంగరాజు అధ్వర్యాన 15 వేల మందితో గొప్ప బహిరంగసభ జరిగింది. పట్టణంలో హర్తాళ్ చేశారు. పూళ్ళ, కైకరం గ్రామాలలో పాటదార్లు కల్లుపాటలు మానుకొన్నారు.

నెల్లూరు జిల్లాలో కాంగ్రెస్ ప్రచార ఫలితంగా, ఆబ్కారీ ఆదాయం బాగా పడిపోయింది. 111 గ్రామాలలో ప్రజలు త్రాగుడును మానివేశారు. తాటిచెట్లను, ఈత గెలలను ప్రజలు నరికివేయడం జరిగింది.

కళ్యాణదుర్గం తాలూకా ములకనూరు తాలూకాబోర్డు మెంబరు, మునసబు తాళ్ల తిమ్మారెడ్డి కల్లంగళ్ళ వద్ద 'గాంధీమహాత్మాకు జై' అని నినాదం చేశాడనే నేరంపై డిపార్టుమెంటల్ విచారణ జరిపించి డిప్యూటీ కలెక్టర్ ఆయనను మునసబుగిరినుండి బర్తరఫ్ చేశాడు లక్కిరెడ్డిపల్లెలో ఒక సారాదుకాణాన్ని జనం తగలపెట్టారు. రాజీనామా యిచ్చిన గ్రామోద్యోగులను సస్పెండ్ చేయడం జరిగింది. అప్పట్లో 'గాంధీకి జై' అంటేనే ప్రభుత్వోద్యోగం నుండి పై అధికార్లు బర్తరఫ్ చేసేవారు.

తూర్పు కృష్ణాలో 20 మంది, గోదావరి జిల్లాలో 24 మంది, కడప జిల్లాలో 13 మంది, గుంటూరు జిల్లాలో పలువురు గ్రామాధికారులు రాజీనామాలు యిచ్చి, సహాయ నిరాకరణ వాదులకు సహాయంగా వున్నారు. ఈ ఉద్యమం పట్ల తమ సానుభూతిని తెల్పుతూ కడప, అనంతపురం తాలూకా బోర్డులు, నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాబోర్డు తీర్మానాలు ఆమోదించాయి. అందుకు ఆ బోర్డులపై ప్రభుత్వం తగు చర్యలు తీసుకొంది.

## ఎన్నికల బహిష్కరణ :

1921-22లో ప్రభుత్వం ఎన్నికలు జరిపించాలని పూనుకొంది. అసహాయోద్యమ తీర్మానం ప్రకారం కాంగ్రెస్ ఎన్నికలను బహిష్కరించాలని ఆదేశించింది.

ఎన్నికల బహిష్కరణ కార్యక్రమం ఆంధ్రదేశంలో జయప్రదంగా సాగింది. రాజమండ్రిలో 120 మంది ముస్లిం ఓటర్లలో ఒక్క ఉద్యోగి మాత్రమే ఓటుచేశాడు. రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో 1350 మంది ఓటర్లలో 270 మంది మాత్రమే ఓటు వేశారు.

గుంటూరు జిల్లాలో 15 శాతం మాత్రమే ఓట్లు పోలైనవి. చిత్తూరు జిల్లాలో 534 మందిలో 135 మంది మాత్రమే ఓటు వేశారు. చిత్తూరు గ్రామీణ నియోజక వర్గంలో 500 మందికి 60 మంది మాత్రమే ఓటింగులో పాల్గొన్నారు.

ఘంటసాల గ్రామంలో ఒక్కరు కూడా ఓటువేయకుండా, ఖాళీ బాలెట్ పెట్టెలు త్రిప్పి పంపించారు.

## రాయలసీమకు ఉద్యమవ్యాప్తి :

కడపజిల్లా కాంగ్రెస్ కార్యదర్శిపైన రాజకీయ హత్యానేరం మోపి 108 సెక్షన్ క్రింద కేసుపెట్టారు చిత్తూరు, శ్రీ కాళహస్తి, తిరుత్తని, కుప్పం మొదలగుచోట్ల వలం

టీర్లు పికెటింగులు చేశారు. నెల్లూరు, సూళ్ళూరుపేట, కావలి మున్నగు చోట్లకు ఈ ఉద్యమం వ్యాపించింది.

చిత్తూరు జిల్లాలో మామూలు కాంగ్రెస్ ప్రచార కార్యక్రమాలను కూడా ప్రభుత్వాధికార్లు సాగనివ్వలేదు. నిర్బంధ విధానాన్ని ఎక్కువ చేసింది. జిల్లాలో శాసనోల్లంఘనాన్ని చేసేందుకు అనుమతికోరుతూ, ఆంధ్రకాంగ్రెస్ సంఘం ఎ.ఐ.సి.సి.కి వ్రాయడం జరిగింది.

ఈ విధంగా కల్లుపాకల వద్ద పికెటింగులు, విదేశ వస్త్రాల దహనం, ఉద్యోగాలకు రాజీనామా చేయడం, ఎన్నికల బహిష్కరణ కార్యక్రమం ఆంధ్రదేశమంతటా అమలు జరిగినవి.

ఆంధ్ర కాంగ్రెస్ సంఘం వారి నివేదిక ప్రకారం 1921 జూన్ మాసం వరకు 103 మంది లాయర్లు న్యాయవాద వృత్తిని విసర్జించి ఉద్యమంలో పాల్గొన్నారు. 17 మంది ఉపాధ్యాయులు రాజీనామా చేశారు. ప్రభుత్వోద్యోగులు 44 మంది తమ ఉద్యోగాలు వదలివేశారు. వివిధ పట్టణాలలో 44 జాతీయ పాఠశాలలు ఏర్పడ్డాయి.

2204 గ్రామ కాంగ్రెస్ కమిటీలలో 77,938 మంది సభ్యులుగా చేరారు. 44,092 రాట్నాలు పనిచేస్తున్నవి. 'తిలక్ స్వరాజ్య నిధికి' రూ. 48,128లు వసూలైనవి. 176 మంది వేతన కార్యకర్తలు, 292 మంది గౌరవ కార్యకర్తలు అహర్నిశలు కాంగ్రెస్ ప్రచారం గావిస్తున్నారు.

37 చోట్ల పంచాయతీ కోర్టులు ఏర్పడి, ప్రజలు గవర్నమెంటు న్యాయస్థానాలకు వెళ్ళడం మానివేశారు. 111 గ్రామాలలో ప్రజలు పూర్తిగా మద్యపానం మానివేశారు.

## వివిధ ప్రాంతాల్లో అరెస్టులు :

తూర్పుగోదావరి జిల్లాలో బులుసు సాంబమూర్తి, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గార్లను అరెస్టు చేశారు.

శ్రీకాకుళం జిల్లాలో జయంతి వెంకటనారాయణ, ఆయన సోదరుడు వెంకట కృష్ణారావుకు నోటీసులు జారీచేశారు.

కర్నూలు జిల్లాలో ఊరె సుబ్బారావు, రామచంద్రయ్య గోపాలరావు గార్లను అరెస్టు చేసి జైలు శిక్షలు విధించారు.

విశాఖపట్నంలో సెక్యూరిటీ యివ్వడానికి నిరాకరించినందున' వసంతం బుచ్చి సుందరావుకు విడి ఖైదువిధించారు.

రాజమండ్రి తాలూకాలో మాలిని సుబ్బారావు, నీరుకొండ వెంకటరత్నం, వరాహస్వామి, కొత్త విశ్వనాథం, పాద వెంకట్రామయ్య, కాండ్రు వీరన్న, చాపరాల సుబ్బయ్య, కనకల్లు నరసింహం గార్లను అరెస్టుచేసి ఒక్కొక్కరికి ౬ మాసాల చొప్పున కఠిన శిక్షలు విధించారు.

## అరెస్టు అయిన ప్రముఖులు :

అయ్యదేవర కాళేశ్వరరావు
చెరుకువాడ నరసింహం
గరిమెళ్ళ సత్యనారాయణ
తిక్కవరపు రామిరెడ్డి
ఓరుగంటి వెంకటసుబ్బయ్య
వేమూరి లక్ష్మయ్య
అక్బర్ సాహెబ్
అద్దేపల్లి వెంకటగురునాధరామశేషయ్య
కందుల వీరాస్వామినాయుడు
చట్టి నరసింహారావు
భమిడిపాటి సత్యనారాయణ
డా॥ పాలకోడేటి గురుమూర్తి
మానికొండ సత్యనారాయణశాస్త్రి
కందాళ సర్వేశ్వరశాస్త్రి
వి. వి. గిరి
నడింపల్లి లక్ష్మీనరసింహారావు
గరిమెళ్ళ కుమారస్వామి
నిష్ఠల సోమయాజులు
కంభంపాటి సాంబయ్య
వల్లమూడి ముక్తేశ్వరప్రసాదరావు
బ్రహ్మాండం నరసింహం
వోగిరాల వెంకట్రామ దీక్షితులు
న్యాపతి నారాయణమూర్తి
మల్లాది కృష్ణమూర్తి
పోలాప్రగడ సుబ్బారాయుడు
నాభి రామకృష్ణరావు
పుల్లెల శ్యామసుందరరావు
గోపాలుని రామలింగయ్య
కె. నారాయణప్ప
వున్నవ రామలింగం
కొండ వెంకటప్పయ్య

## అసహాయోద్యమవ్యాప్తి

ఆంధ్రదేశంలో 'అసహాయోద్యమవ్యాప్తి' యను శీర్షికన, 1921 ఆగస్టు 17వ తేదీన, 'ఆంధ్రపత్రిక' వ్రాసిన వ్యాసంవల్ల ఆనాటి స్థితి తెలుసుకోగలం,

"పల్నాటి సీమయందు సామాన్య మహమ్మదీయులు సైతం నిర్భయముగా దండనము స్వీకరించిరి. చీరాల-పేరాల ప్రజలు స్వస్థలములు వదలి పరమానందముతో వనవాసము చేయుచున్నారు.

గుంటూరునందు వున్నవ సతీమణి లక్ష్మీనారాయణగారి బంధమును అభినందించినపుడు, దేశభక్త ధర్మపత్ని ఆంధ్ర సింహబంధమును అభినందించినపుడు, వందలకొలది స్త్రీలు వారి కోమలహస్తములతో స్వరాజ్య రథమును నడిపించినపుడు, న్యాయవాదులు న్యాయస్థానముల వ్యామోహమ్మును వదలినపుడు, వేలాది ప్రజలు స్వరాజ్యోత్సాహముతో దౌర్జన్య ద్వేషభావములను వదలినపుడు, ప్రజాశక్తి అనర్గళముగా ప్రవహించుచున్న విధమును కన్నులార చూడగలరు . ...

గుంటూరంతయు గత మాసాంతమునందు ఆయుధపాణులతో నిండినను ప్రజల నిగ్రహము, దైవానుగ్రహము దేశమును మహా సంక్షోభము నుండి రక్షించినవి .. ...

స్వరాజ్య దీక్షయందు ఆంధ్రదేశము ధర్మోత్సాహమును చూపుచున్నది."

—'ఆంధ్రపత్రిక' నుండి

1921 సహాయ నిరాకరణోద్యమంలో, ఆంధ్రులు వహించిన పాత్రను గురించి 'దేశభక్త' కొండ వెంకటప్పయ్య ఇట్లా వ్రాశారు :

"భారత దేశమునందలి అన్ని భాగముల వారు పాల్గొన్న ఈ మహా పోరాటములో ఆంధ్రులు వహించిన పాత్ర తక్కువైనదేమీకాదు. ఆంధ్రుల ఘనకార్యములలో కొన్నిటిని భారతదేశ ప్రజలు యావన్మంది ప్రశంసించిరి. ఇందు మనమెంతయు గర్వింపదగుదుము. వీనిలో చీరాల, పేరాల ప్రజల సత్యాగ్రహమొకటి. తన యూనియన్‌ను మునిసిపాలిటీగా మార్చుటకు అసమ్మతి దెలుపుటకై చీరాల పేరాల ప్రజలు సుమారు 20 వేలమంది తమ ఇండ్లను వాకిళ్ళను వదలి గ్రామం వెలుపల పూరి పాకలలో ఒక సంవత్సరము వసించిరి. ప్రపంచ చరిత్రలో దీనికి సాటియేదియు లేదని చెప్పవచ్చును. ఇందుకు ఈ స్వాతంత్ర్య మహాపోరాటములో తన ప్రాణముల నర్పించిన ప్రతిభాశాలి, నిష్కళంక దేశభక్తుడు కీ॥శే॥ ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య గారు ఘనెంతయు అభినందనార్హుడు."

భారతదేశమంతటను ప్రతిధ్వనించిన సహాయ నిరాకరణోద్యమము కాంగ్రెసు యెడల ప్రజల నిరతిశయ భక్తిని ప్రకటించుటచేతను, అచంచలులై యుండుట చేతను ప్రభుత్వమువారు తీవ్రతరమైన నిర్బంధచర్యలను గైకొన్నవారైరి. ప్రజలను భయపెట్టుటకు గుంటూరు పురములో చాలా మాసముల పర్యంతము సైనికులను, మర ఫిరంగులు కలవారిని నియమించిరి. వీరు నగర వీధులలో గస్తి తిరుగుచుండిరి. ఈ విధముగానే ప్రజలను భయపెట్టుటకు పెదనందిపాడు పరిసరముల కొంతసైన్యమును వుంచిరి. ప్రభుత్వమువారు యెంత తీవ్రనిర్బంధ చర్యలుగైకొన్నను పన్నులను నిరాకరించిన కీర్తి ఆ ప్రాంతప్రజకు దక్కినది. ప్రభుత్వమువారికి పన్నులను నిరాకరించుట మాత్రమేగాక, వారు ప్రభుత్వోద్యోగుల నందరిని సాంఘిక బహిష్కారములకు లోను గావించిరి. గుంటూరు జిల్లా యందు యితర గ్రామములును, ఆంధ్రదేశము నందలి యితర భాగములును పెదనందిపాడు మార్గముననుసరించెను.

## గ్రామోద్యోగియుల త్యాగము:

పెదనందిపాడు ఫిర్కాయందు దాదాపు అన్ని గ్రామముల ఉద్యోగియులు ఆంధ్రదేశమునందలి యితర ప్రాంతముల యందలి గ్రామోద్యోగులు రాజీనామా నిచ్చుట మరియెక ముఖ్యవిషయము. గ్రామోద్యోగులు రాజీనామా నిచ్చుట వల్ల ఏ భూమి యెవరిదో, ఏ రైతు యెంత పన్ను చెల్లిచవలెనో ప్రభుత్వాధికారులు తెలిసి కొనుట అసాధ్యమయ్యెను. ఈ కారణం చేత నిరంకుశంగా, విచక్షణ మేమియు లేకుండా తమ చేతి కందిన ఆస్తులను జప్తు చేయదొడంగిరి. బార్డోలీలో పన్నుల నిరాకరణోద్యమము సాగింప తాను సంకల్పించుచుండినట్లు తెలుపుచు గాంధీ మహాత్ముడు రాజప్రతినిధికి ఒక శ్రీముఖము పంపియుండెను. ఆ శ్రీముఖములో గుంటూరు జిల్లా యందలి పన్నుల నిరాకరణోద్యమమునుగూర్చి ఆయన ప్రత్యేకంగా ప్రస్తావించుట గమనింపదగిన విష యము. అవసరమైన యెడల తాను గుంటూరు జిల్లాకు వెళ్ళవచ్చుననికూడా మహాత్ముడు ఆశ్రీముఖములో తెలిపెను. కాంగ్రెసు ఉద్యమమును సాగించుటలో ప్రజలు ప్రదర్శించిన మొండి పట్టుదలను, అచంచలమైన ప్రతిఘటనను జూచి ప్రభుత్వమువారు యదార్థముగా భీతచిత్తులైరని ఈ సందర్భమున చెప్పదగును. కాంగ్రెస్ ఆదేశము ప్రజలకు శాసన ముగా నుండెను. పన్నుల నిరాకరణోద్యమమును కాంగ్రెసు స్వయంగా ఉపసంహరించు కొని పన్నులు చెల్లించవలసినదని ఆదేశించు వరకు ప్రభుత్వమువారికి ఒక్క దమ్మిడీ యైనను చెల్లించలేదు. అప్పుడు మద్రాసు ప్రభుత్వ గవర్నరుగా నుండిన లార్డు

వెలింగ్డన్ తరువాత పార్లమెంటులో ఉపన్యసించుచు "గుంటూరు జిల్లా పన్నుల నిరాకరణోద్యమము భారతదేశము నందలి బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వ పునాదులనే కదిలించి వేసెనని" నుడివెను.

(కొండ వెంకటప్పయ్య గారి వ్యాసమునుండి)
ఆంధ్రపత్రిక 1947 ఆగస్టు 15

## నాన్ కో ఆపరేషన్ ఉద్యమ వైఖరి:

పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమంలో కాంగ్రెస్ వాదుల పాత్ర ఎక్కువ లేదనీ, రైతులే ఆ ఉద్యమాన్ని సాగించారనీ, ఈమధ్య వెలువడిన కొన్ని గ్రంధాల్లో, వ్యాసాల్లో పేర్కొనడం వాస్తవంకాదు.

రాష్ట్ర జిల్లా కాంగ్రెస్ సంఘాల తీర్మానాలను పరిశీలించినట్లయితే, గుంటూరు జిల్లాలో, పెదనందిపాడులో నిర్వహించిన సహాయ నిరాకరణోద్యమానికి ప్రధాన ప్రాతిపదికలువేసిందీ,ప్రచార కార్యక్రమాలు సాగించిందీ ఈ నాయకులనుట స్పష్టంగా కనుపిస్తుంది. వారు గ్రామోద్యోగులచే రాజీనామాలు పెట్టించారు. 'శాంతిసేన' ను నెలకోల్పారు. గ్రామ ప్రజలను ఐక్యపరచి నిర్మాణయుతంగా కట్టుదిట్టంచేశారు. ఉద్యమం జరుగుతున్న ప్రాంతాలకు యితర చోట్లనుండి కూడా ప్రజల అండ లభించేటట్లు చేశారు. ప్రజాహృదయాన్ని ఆవేసించిన స్వాతంత్ర్య తృష్ణ, అప్పటి దేశరాజకీయ పరిస్థితులు, ప్రజలను అట్టి మహదుద్యమానికి పురిగొల్పినవి. కాంగ్రెస్ స్వచ్ఛంధ సేవకులు ముందుండి నడిపించారు.

## ప్రభుత్వాధికార్ల కట్టు కథలు:

మరోముఖ్య విషయం- సహాయ నిరాకరణోద్యమం సందర్భంలో ప్రజలు దౌర్జన్య చర్యలకు దిగినట్లు ప్రభుత్వపరంగా చిత్రించబడింది. కాని ఉద్యమాన్ని అణచి వేసేందుకు అధికార్లు అదొక సాకుగా చూపారుతప్ప, ఎచ్చటా ప్రజలు ప్రతీకార చర్యలకు దిగినట్లు కనిపించదు.

పల్నాడు దురంతాలపై గద్దె రంగయ్య నాయుడుగారి నివేదిక, ప్రజల వాఙ్మూలాలు; అటపీ సత్యాగ్రహంపై వున్నవ లక్ష్మీనారాయణగారి నివేదిక; పెదనందిపాడు ఉద్యమాన్ని గురించి పరుచూరి వీరయ్యచౌదరి గారి నోట్సు, కాశీనాధుని నాగేశ్వరరావు గారి ఆంధ్రపత్రిక వ్యాసాలు, ప్రకాశం కమిటీ విచారణాంశాలు మున్నగునవన్నీ

ఈ యదార్థాన్నే రుజువు పరుస్తున్నవి. తమ దుష్కృత్యాలను కప్పిపుచ్చుకోడానికి ప్రభుత్వ నిరంకుశాధికారులు అట్టి కట్టుకథలు అల్లినట్లు కనుపిస్తుంది తప్ప వేరుకాదు.

ఉద్యోగులు, రిజర్వు పోలీసులు ఇండ్లలో దూరి యిష్టం వచ్చినట్లు ఆస్తులను జప్తుచేసారు. శాంతి సేనను కవ్విస్తూ వారి ముఖముంపై ఉమ్మివేశారు. రైతుస్త్రీలను పరాభవించారు. ఆ సందర్భాలలో కూడా వారు ఏ మాత్రం ఉద్రిక్తతకులోను కాలేదు. కాంగ్రెస్ ఆదేశమై ఉద్యమ ఉపసంహారం వరకు ప్రజలు, వలంటీర్లు అతి సహనంతో వ్యవహరించారు. వారిశాంతియుత ప్రవర్తన బహు విధాల ప్రశంసించబడింది.

## గమనార్హమైనమార్పు:

సమాజంలో మేధావులుగా పరిగణింపబడుతున్న న్యాయవాదులు అధ్యాపకులు కోర్టులను, విద్యాలయాలను బహిష్కరించడం, విద్యార్థులు చదువులకు స్వస్తిచెప్పి కార్యకర్తలుగా చేరడం, రైతాంగం ముదంజ వేయడం-వీరికి ప్రజలు అండగా నిలవడం సహాయ నిరాకరణోద్యమ కాలంలో స్పష్టంగా కనుపిస్తుంది.

వెట్టి మోతాదులతో సహా గ్రామోద్యోగులు ఒక్కుమ్మడిగా రాజీనామాలు చేయడం మూలంగా, గ్రామపరిపాలనా యంత్రాగం స్థంభించి పోయిన పరిస్థితి ఏర్పడిరది. ఈ రీతి స్వాతంత్ర్యోద్యమానికి అత్యంత బలం చేకూరినట్లయింది. ప్రజాచైతన్యం వెల్లుబుకింది. ఈ ఉద్యమ కాలంలో పరప్రభుత్వం పోలీస్ రిజర్వు సైనిక బలగాలపైన, నిర్బంధ విధానంపైన ఆధారపడవలసిన గతిపట్టింది. కొలది మంది అనుచరులు తప్ప ప్రజలనుండి ప్రభుత్వం వేరైంది, ఇది అప్పటి పరిస్థితులలో వచ్చిన గమనార్హమైన మార్పు.

### 'ప్రతిజ్ఞ'

*భారత దేశము నాదేరా*
*భారతీయుడను నేనేరా ॥భారత॥*
*భారత దేశపు ప్రజాస్వామికము*
*బడయగోరినే బయలు వెడలితిని ॥భారత॥*
*పారతంత్ర్యమును పారద్రోలుటకు*
*బద్ధకంకణుడ బయలు దేరితిని ॥భారత॥*
*శాంతి మార్గముల నత్స్వరాజ్యమును*
*నత్వరముగనే సమార్జించెదము ॥భారత॥*
*ప్రాణము పోయిన మానము విడువను*
*మానధనుడ విజ్ఞానఘనుడనే ॥భారత॥*

# కాకినాడ కాంగ్రెస్ సభ

సీ॥ సత్యాగ్రహ వ్రతాచరణ దీక్షాబద్ధ
కంకణాలంకృత గాత్రులార !
తతహీన పరతంత్రతా విముక్త్యర్థ న
దూహా వివర్జితో ద్యోగులార !
పరమ స్వారాజ్య సంప్రాప్తి విక్రాణిత
వస్త్ర భూషాది సర్వస్వులార ;
గాంధిమహాత్మ సంకల్ప పూరణసము
ద్యో ద్యోగాభావహన సమర్థులార !
మనల రాజ్యలక్ష్మి మరిమూడు నెలలో
గాంధి చెప్పినట్లు కౌగలించు
తడవికేల భక్తి దైవాత్మారిగొల్వుడు
ధీరులార ; భారతీయులార !

సహాయ నిరాకరణోద్యమం తర్వాత, 1923 సంవత్సరంలో అ. భా. కాంగ్రెస్ మహాసభ కాకినాడలో అత్యంత వైభవంగా జరిగింది. 1920నాటికే దేశ రాజకీయాలలో మహాత్మాగాంధీ నాయకత్వం స్థిరపడటం, ప్రభుత్వానికి వ్యతిరేకంగా అహింసాయుత అసహాయోద్యమాన్ని ప్రారంభించడం జరిగింది. ఆయన బార్డోలి సత్యాగ్రహాన్ని చేపట్టారు.

ఆంధ్రదేశంలో జరిగిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం చీరాల-పేరాల పురనిర్గమన ప్రస్థానం, పల్నాటిసీమలో, రాయచోటిలో పుల్లరి సత్యాగ్రహాలు మొదలగునవి దేశవ్యాపిత స్వాతంత్ర్య సమరానికి ప్రఖ్యాతి నార్జించి పెట్టినవి. చౌరీ చౌరా సంఘటన తర్వాత, గాంధీజీ, శాసనోల్లంఘనోద్యమాన్ని విరమించడం చదివాము. తదుపరి, ఆరెస్టు అయిన జాతీయ నాయకులను ప్రభుత్వం విడుదలచేసింది.

నిర్మాణ కార్యక్రమానికి, సత్య అహింసలకు ప్రాధాన్యతనిస్తూ కాంగ్రెస్ ప్రకటన చేసింది. మోతీలాల్‌నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, విఠల్‌భాయ్‌పటేల్ మున్నగు నాయకులు, కాంగ్రెస్ వాదులు శాసనసభా ప్రవేశం చేయాలని వాదించసాగారు. ఇలా

శాసనసభా ప్రవేశం చేయాలనేవారికి, గాంధేయ నిర్మాణ కార్యక్రమాన్ని అనుసరించా లనే వారికి ప్రోచేంజర్లకు — నోఛేంజర్లకు కాంగ్రెస్‌లో సిద్ధాంత సంఘర్షణ మొద లైంది. 1922 మార్చి 10వ తేదీన గాంధీజీని ప్రభుత్వం అరెస్టు చేసింది. కొందరు శాసనోల్లంఘనం విఫలమైనట్లు కూడా చర్చించసాగారు. ఈ రెండువాదనలను సమ న్వయపరిచి, ఉభయవర్గాలకు సమ్మతమైన ఒక రాజీ తీర్మానం రూపొందించడానికి కాకినాడ కాంగ్రెస్ మహాసభ తోడ్పడింది. గాంధీజీ సూచించిన నిర్మాణ కార్యక్రమాన్ని అనుసరిస్తునే, శాసనసభా ప్రవేశం చేయగోరేవారికి అనుమతి యివ్వడం ఈ రాజీ తీర్మాన లక్ష్యం.

ఆంధ్ర నాయకులైన కొండవెంకటప్పయ్య, డాక్టర్ పట్టాభి, ప్రకాశం ప్రభృ తులు జాతీయ నాయకులతో పాటు మహోపన్యాసాలు చేశారు. ఆంధ్రుల అత్యుత్సాహ భరిత స్వాగతం, ప్రేమానురాగాలతో కూడిన ఆతిధ్యం, యావద్భారత ప్రతినిధుల ప్రశంసలందుకొన్నది.

"నేను ఆంధ్ర మహిళను - నాది ఆంధ్రదేశం" అన్నారు సరోజినీదేవి కాకినాడ సభలో.

> "ఆంధ్ర రాజ్యాన్ని పరిపాలించిన చివరిరాజుల సాంప్రదా యాన్ని నాయకులు, వలంటీర్లు కాపాడినందుకు నాటి కృష్ణదేవరాయల ఆదరణ సత్కారాలను నేడు ఈ సభ మిగతా భారతదేశానికి ఎరుక పరచినందుకు నేను గర్విస్తున్నాను." అని అభినందించారు. "ఆంధ్ర దేశంలో నిశ్చలమైన వ్యక్తి శ్రీ బులుసు సాంబమూర్తి. కొన్ని వారాల క్రిందట సంభవించిన విపత్తు ఆయన హృదయాన్ని తీవ్రంగా గాయ పరచింది. తండ్రి అయిన ప్రతివ్యక్తి హృదయాన్ని గాయపరచే దుస్సంఘటన అది. అయినప్పటికీ, దేశ సేవలో నిమగ్నమైన ఆ వ్యక్తి తన దుఃఖాన్ని దిగమ్రింగి, మనోవేదనతో కార్చే కన్నీటిబొట్లను సోదర దేశీయులకు స్వాగతమివ్వడంలో ముత్యాలసరాలుగా మార్చి వేయగలి గారు. ఆయన హృదయ సంక్షోభం దీక్షాయుతమైన సేవగా మలచ బడింది. ఆంధ్రదేశ ధైర్యోత్సాహాలకు ఆయన ప్రతిరూపమైనపక్షంలో, ఆంధ్రులు దేశానికి విముక్తి సాధించగలవారు."
>
> —సరోజినీనాయుడు ప్రసంగం

కాంగ్రెస్ సంస్థకు ఒక స్వచ్ఛంద సేవకులసంఘం వుండవలసిన ఆవశ్యకతను గురించి, 'హిదూస్థాన్ సేవాదళ్' నిర్మాణానికి నాంది పలికింది 'కాకినాడ' కాంగ్రెస్ సభ లోనే. జవహర్‌లాల్‌నెహ్రూ హార్డికర్ బులుసు సాంబమూర్తి, గాదిచెర్ల హరిసర్వోత్తమ రావు మున్నగు ప్రసిద్ధ నాయకులతో ఒక సంఘాన్ని నియమించారు. కాంగ్రెస్ వలంటీర్లకు శిక్షణ యివ్వడానికి నియమ నిబంధనలు ఈ సభలోనే వీరు సిద్ధం చేశారు.

'ఆంధ్రప్రాంతంలోనే' గాక, హైదరాబాదు సంస్థాన ప్రజల్లో కూడా ఈ కాకినాడ సభ మహోత్సాహం కలిగించింది. స్వాతంత్ర్యోద్యమ నాయకత్వాన్ని, త్యాగ శీలురైన కార్యకర్తల బృందాన్ని తయారు చేసేందుకు తోడ్పడింది.

కాకినాడ సభకు పూర్వమే, 1923లో ఎ ఐ.సి సి.కి కొండవెంకటప్పయ్య అధ్యక్షుడుగా, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య కార్యదర్శిగా ఎన్నుకోబడటం ఆంధ్రులకు గర్వకారణమైన విషయం. కాకినాడ మహాసభకు ఆహ్వాన సంఘ అధ్యక్షుడుగా కొండ వెంకటప్పయ్య, కార్యదర్శిగా బులుసు సాంబమూర్తి వుండి, జయప్రదంగా నిర్వహించారు.

సభను సక్రమంగా జరగకుండా చేయడానికి దురహంకారి అయిన జిల్లా కలెక్టర్ అనేక అడ్డంకులు కలిగించాడు. కాంగ్రెస్ సభకు ఆర్థికంగా సహాయం అందకుండా చేయాలని ఆదేశించాడు కాంగ్రెస్ సభకు సహాయ పడినవారి పంట పొలాలకు నీటి సరఫరా వుండబోదనిబెదరిస్తూ, కలెక్టర్ గ్రామోద్యోగులకు ఒక సర్క్యులర్ జారీ చేశాడు. కాని, గ్రామోద్యోగులుగాని, ప్రజలు గాని ఆయన హెచ్చరికలను లక్ష్యపెట్ట లేదు. ఆ కలెక్టర్ బదిలీ అయి వెళ్ళి పోయినాడు.

ఆంధ్ర దేశంలో కాకినాడ సభకు రూ 1,20, 862లు విరాళాలుగా వచ్చినవి. ఒక్క గోదావరి జిల్లాయే సగభాగం ఖర్చునంతా భరించింది. అన్ని వర్గాల ప్రజలు సభ జయప్రదంగావడానికి తోడ్పడ్డారు.

కాంగ్రెస్ సభాధ్యక్షుడైన మహమ్మదాలీ అధ్యక్ష ప్రసంగాన్ని నాల్గు భాషలలో ఇంగ్లీష్, హిందీ, ఉర్దూ, తెలుగు భాషలలో వెలువరించడం ఒక విశేషం. పండితమోతీలాల్‌నెహ్రూ,సరోజినీనాయుడు, జమ్నాలాల్‌బజాజ్, సి. రాజగోపాలాచారి, గంగాధర దేశపాండే మౌలానాషౌకత్‌అలీ మున్నగు దేశనాయకులు వచ్చి, ఆంధ్రుల ప్రేమ పూర్వక ఆతిధ్యాన్ని స్వీకరించారు

మన్యం విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు కాకినాడ మహాసభకు హాజరై 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ద్వారా ఒక లేఖపంపి, సభలో చదువమన్నా డని, కాని ఆ లేఖను చదువలేదని చెప్పబడుతున్నది.

> "మహనీయుడైన మహాత్మాగాంధీని జైలుకు పంపుటకు మీరంతా కారకులు. ఆయన విడుదలకు ఆందోళన చేయడం మీ ధర్మం. నాకు తోచిన పద్ధతిలోనేను ప్రభుత్వంపై యుద్ధం చేస్తున్నాను. నాకుసహాయం చేయండి. నన్ను ఆశీర్వదించండి. కనీసం నైతిక సహాయం చేయండి నా దారికి అడ్డురాకండి," అని అల్లూరి సీతారామరాజు ఆ లేఖలో పేర్కొనట్లు తెలుస్తున్నది.

## 1923 నాగపూర్ జెండా సత్యాగ్రహం :

1923 మే ఒకటవ తేదీన కాంగ్రెస్ వలంటీర్లు జాతీయ పతాకాలు ధరించి, నాగపూర్ వీధులవెంట పోతుండగా పోలీసులు ఎదురొచ్చి, చెదరగొట్టారు. ఆ జెండా లను నిషేధించారు. జమ్నాలాల్ బజాజ్‌ను అరెస్టు చేశారు అనంతరం విఠల్‌భాయ్ పటేల్ అధ్వర్యాన, నాగపూర్‌లో జెండా సత్యాగ్రహం సాగింది. వివిధ రాష్ట్రాల నుంచి కాంగ్రెస్ వలంటీర్లు జట్లుజట్లుగా వచ్చి, ఈ సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

మన ఆంధ్ర రాష్ట్రం నుంచి నాళం చిన్న భీమరాజు, ఏపిద సత్యనారాయణ. పోతినగణపతిరావు పాత్రుడు, పార్వతీశం, మతంబాల సుబ్రహ్మణ్యంగుప్తా, నిడమర్తి వెంకన్న, నెమలికంటి మృత్యుంజయుడు మొదలగు కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులు 40 మందిదాకా నాగపూర్ వెళ్ళి, అక్కడి జెండా సత్యాగ్రహంలో పాల్గొని జైలు శిక్షలకు గురిఅయినారు. అక్కడి జైళ్ళలో ఈ రాజకీయ ఖైదీలు నానాబాధలు అనుభ వించారు. దేశంలో ఈ జెండా సమస్యపై తీవ్ర ఆందోళన జరిగింది.

ఎవరైనా ముందుగా ప్రభుత్వాధికారులకు తెలియచేసి, తమకు యిష్టం వచ్చిన జెండాలను తీసుకొని పోవచ్చునని, ప్రభుత్వం రాజీకి దిగి వచ్చింది. ఆ తర్వాత, అరెస్టు అయిన వలంటీర్లను జైలునుండి విడుదల చేశారు. అట్లా విడుదలై తిరిగివచ్చిన ఆంధ్ర వలంటీర్లకు ప్రజలు ఘన స్వాగతం చెప్పి గౌరవించారు.

# 'ఆంధ్రవీర' శ్రీ రామరాజు - మన్యవిప్లవం

అల్లూరి శ్రీరామరాజు 20 ఏండ్ల లేబ్రాయంలోనే సన్యసించిన యోగిపుంగవుడు. అద్వితీయమైన ధైర్యసాహసాలు గల మహాత్యాగశీలి. సర్వసంగ పరిత్యాగం చేసిన సుక్షత్రియుడు. స్వాతంత్ర్యం కోసం బ్రిటిష్ ప్రభుత్వానికి పక్కలో బల్లెమై 1922-24 ఏండ్లమధ్య రెండేళ్ళు సాయుధసమరం సాగించిన ధీశాలి. మంచి స్ఫురద్రూపి. మన్య విప్లవానికి యిట్టి మహనీయుని నాయకత్వం లభించడం అదృష్టం.

మన్య ప్రాంతాలలో గిరిజనుల బాధలు వర్ణనాతీతం. పుష్కలంగా అటవీ సంపద వున్నా, అనుభవం పరులపాలైంది. అటవీ ఫలసాయాన్ని అక్కడి బీదప్రజలు అనుభవించడానికే నోచుకోలేదు. అడవిలో పశువులు మేత మేయడానికి పన్ను, వంట చెరకు తెచ్చుకోడానికి పన్ను, ప్రజానీకం పన్నులతో సతమతమయిపోయేవారు. కొండలమధ్య తాత్కాలికంగా సాగుచేసుకొని బ్రతకడానికికూడా వీలులేకుండా 'పోడు వ్యవసాయం' పైన ప్రభుత్వం నిర్బంధాలు విధించింది. ముఠాదారీ పద్ధతిని ప్రవేశపెట్టి, ఒకరిమీద మరొకరిని ఉసికొల్పి, 'విభజించి-పరిపాలించు' సాగించి. ముఠాదార్లకు-మునసబులకు మధ్య తగవులు పెట్టింది. అటవీశాసనం మన్యం ప్రజలను నానా బాధలకు గురిచేసింది. ఉద్యోగులు,పోలీసులు చేసే అత్యాచారాలు భరించలేక,గిరిజనులు లోగడ పలుసార్లు తిరుగుబాట్లు లేవదీశారు. కాని ప్రభుత్వం వాటిని క్రూరంగా అణచివేసింది. తిరుగుబాటుదారులను కాల్చి చంపింది. కేసులుపెట్టి కొందరికి ఉరిశిక్షలు వేసింది. అయినా, కొండజాతి కోయదొరలలో లోలోన కోపాగ్ని రగుల్కొంటూ వచ్చింది.

## విప్లవానుకూల పరిస్థితులు :

శత్రుదుర్భేధ్యమైన కొండలు, అడవులు, అగాధమైన లోయలు గలది మన్యం ప్రాంతం. కల్లాకపటంలేని నిజాయితీపరులు ప్రజలు. నమ్మితే ప్రాణమిచ్చే మొండి ధైర్యం గలవారు. అవినీతికి ఆలవాలమై, శోషణాయుక్తమైన పరప్రభుత్వ పాలన. గర్భదరిద్రం అనుభవించే ప్రజలు. పోరాట సంప్రదాయాలు గల ప్రాంతం అది. స్వాతంత్ర్య పిపాస, త్యాగదీక్ష, దేశభక్తిగల శ్రీరామరాజుకు మన్యం ప్రజల బాధానివారణకై పోరాడటానికి యింతకంటే మరే అనుకూల పరిస్థితులు కావాలి? ఇందుకనే రాజు కార్యక్షేత్రం ఆ మన్యప్రాంతమయింది. రాజకీయ లక్ష్యసాధనకు ఆర్థిక పరిస్థితులు, ప్రజల కష్టాలు తోడైనవి. శ్రీరామరాజు, తన ధ్యేయం స్వరాజ్య స్థాపనయనీ,

ఇందుకు పరప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధపోరాటం సాగించడం అనివార్యమని దృఢనిశ్చయానికి వచ్చారు. కోయప్రజలను సంఘటిత పరచారు. త్రాగడును మాన్పించారు. గ్రామాల్లో పంచాయతీల నేర్పరచి, పంచాయతీల ద్వారా తగవులను పరిష్కరించబూనుకొన్నారు. అన్యాయాలను, ఆక్రమణలను ఎదిరించే ధైర్యసాహసాలను మన్యం ప్రజల్లో ప్రజ్వరిల్ల చేశారు.

మన్యం ప్రజలకు రాజు మాట వేదవాక్కు అయింది. ఆయనొక దైవాంశ సంభూతినిగా భావించారు. రాజుమాటకు తిరుగులేదు మాకారం మురాలో పలుకుబడి కలిగిన గంటందొర, మల్లుదొర మున్నగు వారిని ఆయన చేరదీశారు. వీరన్న పడాల్, అగ్గిరాజు ప్రభృతులు నాయకులైనారు.

శ్రీ రామరాజు నాయకత్వాన, కోయదొరల సహాయంతో స్వతంత్ర సేనావాహిని కదలింది. ముందుగా హెచ్చరికచేసి పోలీస్‌స్టేషనులు కొల్లగొట్టారు. తుపాకులను, మందుగుండు సామాగ్రిని సంపాదించుకున్నారు. స్టేషనులపై దాడిచేస్తూ 'గాంధీకి జై' అని నినాదాలు చేసేవారు. పోలీస్ బలగాన్ని ప్రజల సంఘటిత శక్తితో ఎదుర్కొగలమనే ఆత్మవిశ్వాసాన్ని ఆయన గిరిజనులలో గలిగించారు.

ఈ మన్య విప్లవం విశాఖ జిల్లాలోని చింతపల్లి, నరసీపట్నం తాలూకాలలో, గోదావరి జిల్లాలోని అడ్డతీగెల, రంపచోడవరం, పత్తిపాడు తాలూకాలో జరిగింది. 200 మందిపైగా ఈ పోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. లోతుగడ్డ, లమ్మసింగి, పెద్దవలస, మాకారం, గోలకొండ, పచ్చత్తి, గుడితేరు, ముదాదార్లు కూడా ఈ దళాల్లో చేరారు. మన్య విప్లవవీరులు చింతపల్లి, కృష్ణదేవపేట, రాజవొమ్మంగి, రంపచోడవరం అన్నవరం, అడ్డతీగెల మున్నగు పోలీసు స్టేషనులపైన దాడులుచేసి, ప్రభుత్వ ఆయుధాలను మందుగుండు సామాగ్రిని వశపరుచుకొన్నారు. మన్యం ప్రజలలో విజయోత్సాహం కలిగింది.

## ప్రజలకు దూరమైన ప్రభుత్వ యంత్రాంగం:

ప్రభుత్వ యంత్రాంగం ప్రజలకు దూరమైపోయింది. రాజు దళాల కదలికను, వారిరాక పోకల సమాచారాన్ని అందించే నాథుడేలేడు. శ్రీరామరాజు తమను ఉద్ధరించేందుకు వచ్చిన మహనీయునిగా భావించిన అడవి ప్రాంతాల ప్రజలంతా రాజు దళాలకు అండదండగా నిలిచారు. రాజుజాడ చెప్పిన వారికి వేలరూపాయలు యిస్తామని ప్రభుత్వం ప్రకటించినా ఫలితం లేకపోయింది.

"పుట్టిన వారికి ఎన్నటికైనా మరణం తప్పదు. కర్మపరిపక్వమయ్యేవారు తప్ప ఎవరూ మరణించరు. విజయమో- వీరస్వర్గమో" అని చెప్పి రాజు పోరాటాన్ని సాగించారు.

మన్యం ప్రజల తిరుగుబాటును అణచివేయడానికి పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్, డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్, ఏజెన్సీ కమిషనర్ 11మంది బ్రిటిష్ సైనికాధికారులు, అస్సాం రైఫిళ్ళవారు, మలబార్ స్పెషల్ పోలీసువారు, ఈస్టుకోస్టు రైఫిళ్ళవారు, కోరాపుట్ రిజర్వు పోలీసులు, ఏజెన్సీ పోలీసులు మొత్తం రెండు వేలమందికిపైగా అక్కడ వున్నట్లు అంచనా వేయబడింది. సైనిక శిబిరాలను నెలకొల్పారు. ఏజెన్సీ వాతావరణానికి అలవాటు పడని సైనికులు కొందరు జ్వరాల పాలైనారు. కొండబాటలు తెలియవు వారికి దారి చూపించేవారు లేరు. గ్రామస్థుల సహకారం లేదు.

## రాజు గెరిల్లా యుద్ధ నైపుణి :

శ్రీరామరాజుకు మొదట్లో ఆధునిక గెరిల్లా యుద్ధ శాస్త్ర పరిజ్ఞానంగాని, సంపూర్ణంగా విప్లవ వ్యూహ అవగాహనగాని, లేకపోవచ్చు. కాని, ఈ పోరాటంలోనే ఆయన అనేక అనుభవాలు గడించారు. యుద్ధనైపుణిలో సైనికాధి కారుల కంటే, తనదే పైచేయి అనిపించారు. అనుకూల స్థావరాల్లో పోలీసు, సైనిక బలగాలను ముప్పతిప్పలు పెట్టి, వాళ్ళను పాదాక్రాంతం చేసుకొన్నారు. అననుకూల పరిస్థితి ఏర్పడినప్పుడు వెనకకు తగ్గడం నేర్చుకొన్నారు ఇది ఆయన యుద్ధ నైపుణికి, పోరాట ఎత్తుగడలకు నిదర్శనం.

"విజయం సాధిస్తామా 'స్వరాజ్యం' స్థాపించుకొంటాం. యుద్ధ రంగంలో మరణించామా వీరస్వర్గమలంకరిస్తాం" అని శ్రీరామరాజు సింహగర్జనచేస్తూ, విప్లవదళాలను ఉత్సాహపరిచేవారు.

మన్యం తిరుగుబాటు సందర్భంలో, ప్రభుత్వానికి రూ 13 లక్షలు ధనం1700 తోటాలు, 150 తుపాకులు, 40 పట్టాకత్తులు నష్టం వాటిల్లినట్లు, యిద్దరు తెల్లసైనికాధి కారులను, కొందరు పోలీసులను కోల్పోయినట్లు ప్రకటించబడింది.

## ప్రజలపై సైనిక దాడులు:

ప్రభుత్వం అతితీవ్ర నిర్బంధాలకు పూనుకొంది. ఏజెన్సీ ప్రాంతాన్ని దిగ్బంధం చేసింది. విప్లవ దళాలలో చేరిన కుటుంబాల వారందరిపై నానా హింసలు

పెట్టింది. ప్రభుత్వంతో సహకరించని మునసబులను, మురాదార్లను బర్తరఫ్ చేసింది. అనేక మందిపై అరెస్టు వారంట్లు జారీచేసింది. అప్రకటిత 'మార్షల్‌లా' విధించినట్ల యింది. చేజిక్కిన వారిమీద కేసులు బనాయించి, జైళ్లపాలు చేసింది. సంఘర్షణల్లో కొందరిని కాల్చి చంపివేసింది. కొందరి దళ నాయకుల్లోని బలహీనతలు కూడా ఇందుకు తోడైనవి. ప్రభుత్వ చర్యలతో ప్రజల పోరాట ఉధృతం తగ్గింది. దళాల రక్షణే ప్రధాన సమస్య అయింది. మన్యం ప్రాంత బయట నుంచి రాజు ఆశించిన సహాయం అందటంలేదు. కొందరు దళాల ఆచూకీని చేరవేయనారంభించారు.

కొన్ని వార్తాపత్రికలు మన్యం ప్రజల పోరాటాన్ని దోపిడీ, దౌర్జన్య చర్యలుగా చిత్రించాయి. కొలదిమంది అనుచరులతో, పరిమిత ప్రాంతంలో శ్రీ రామరాజు సాగించే స్వరాజ్య సమర ప్రధాన్యతను గ్రహించలేకపోయారు. కొందరు శాసన సభ్యులు 'ముందు ఈ దోపిడీ చర్యలను అరికట్టండని' మదరాసు శాసన సభలో వాదించసాగారు.

రాజు దళాలకు మైదాన ప్రాంతాలతో సంబంధం తెగిపోయింది. ప్రభుత్వ సైనికమూకలు విప్లవదళాలను చుట్టుముట్టడం చేత, రక్షణ స్థావరాలకోసం కీకారణ్యా లకు తిరోగమించవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

అట్టి అననుకూల క్లిష్టపరిస్థితులలో కూడా శ్రీ రామరాజు అన్నవరం క్షేత్రం రాగా, అశేష ప్రజలు ఆయనకు బ్రహ్మరథం పట్టారు. హారతులు యిచ్చి, ఆయనకు కాళ్లు కడిగి నీళ్ళు నెత్తిపై చల్లుకొని, ప్రజలు తాము తరించినట్లుగా భావించారు. ప్రభుత్వోద్యోగులు సైతం స్వాగతం పలికారు. రాజు దర్శనభాగ్యం అటువంటిది.

## యావజ్జీవ, ద్వీపాంతరవాస శిక్షలు :

సైనికులు ప్రజలను పెట్టే బాధలు విని, తత్వజిజ్ఞాస గల రామరాజు తనకు తానై పట్టుబడివుండవచ్చు, లేక సైనికాధికారులే రాజును కాల్చివేయవచ్చు. ఏమైతేనేమి 1924 మే 7వ తేదీన సైనిక కమాండర్ తుపాకీ కాల్పులకు ఆయన బలిఅయినాడు. తర్వాత, దళ నాయకులు కొందరు పోరాడుతునే నేలకొరిగారు. మిగిలిన వారిని పట్టు కొని, కేసుపెట్టి ప్రభుత్వం వారికి ద్వీపాంతరవాస శిక్షలు విధించింది.

ఈ విప్లవ పోరాటంలో ఎండుదొర, కాకరగంగడు, గాంమల్లుదొర, సరిబాల ఘరదేశి, సాగిన సన్యాసిపడాల్, బోనంగి పోతరాజు, సుంకరి పోతయ్య, సంకోజి

పండడు, గోలిసింగి సన్యాసి, కర్రి కన్నిగాడు, కొలగాని సంగు మున్నగు వారికి యావజ్జీవ శిక్షలు వేశారు. ఎట్టకేలకు, మన్య విప్లవాన్ని కర్కశత్వంతో ప్రభుత్వం అణచివేసింది.

## స్వాతంత్ర్యోద్యమంలో ఉజ్జ్వలఘట్టం :

మన్య విప్లవం భారత స్వాతంత్ర్యోద్యమంలో ఒక మహోజ్జ్వల ఘట్టం స్వరాజ్యం కోసం జరిగిన పోరాటంలో యిది అంతర్భాగం. ఆంధ్రవీరుడు అల్లూరి సీతారామరాజు వీరోచితగాథ ఆచంద్ర తారార్కం చిరస్థాయిగా నిలిచి ఉంటుంది. ఆయన దేశభక్తి, త్యాగదీక్షలు ఆదర్శప్రాయమైనవి. శ్రీ రామరాజు ఆంధ్రుడై జన్మించడం, ఆంధ్రదేశానికి గర్వకారణం.

గాంమల్లుదొర అండమాను దీవుల నుండి విడుదలై వచ్చిన తర్వాత కాంగ్రెసు సంస్థ అధిష్టానవర్గం, వారికి రాజ్యసభ సభ్యత్వం యిచ్చి గౌరవించింది. మన్య విప్లవాన్ని, శ్రీ రామరాజు వీరగాథను, ప్రజలు వేనోళ్ల కొనియాడుతున్నారు.

## గాంధీజీ ప్రశంస :

గాంధీజీ 'యంగ్ ఇండియా' పత్రిక (18-7-1929) లో అల్లూరిసీతారామ రాజును అభినందిస్తూ ఇలా వ్రాశారు.

> "సాయుధ విప్లవంపైన నాకు సానుభూతిగాని, అభిమానంగాని లేవు. అయితే రాజువంటి శీలవంతుడు, నిరాడంబరుడు, త్యాగి, ధైర్యవంతుడు, ఉన్నతాశయుడు అయిన యువకుడిని నేను అభినందించకుండా వుండజాలను, అన్నపూర్ణయ్య సేకరించిన విషయాలు నిజమైనట్లయితే, ఆయన పితూరీదారుకాదు, గొప్పవీరుడు. ఈ దేశంలో వున్న యువకులందరూ, శ్రీ రామరాజుకున్న ధైర్య సాహసాలను, ఆయన దేశభక్తిని, నిర్మాణశక్తిని, చాకచక్యాన్ని అలవరచుకొని, వాటిని సంపూర్ణ అహింసాయుత పద్ధతుల ద్వారా స్వరాజ్య సంపాదనకు ఉపయోగించిన ఎంత బాగుండును?
>
> అణగ ద్రొక్కియుంచ బడిన అసంఖ్యాకమగు ప్రజాసామాన్యమునకు వున్నతిని చేకూర్చి, మేల్కొల్పుటకు, అహింస, సత్య సిద్ధాం

తములు దక్కవే రొండుమార్గము లేదని నాకు నానాటికి స్పష్టపడుతున్నది కోట్లకొలది ప్రజానీకానికి మరోమార్గం అనవసరం."

— ఎం.కె. గాంధీ

"శ్రీరామరాజు చూపిన ధైర్య సాహసాలు, దేశభక్తి పట్టుదల, పౌరుషము అన్నీఅతని ఖ్యాతిని నలుదిశలు వ్యాపింప జేసినవి. అతని విధానమును అంగీకరింప జాలనివారు కూడా, అతని విశాల భావాలను, మహోన్నత లక్ష్యాన్ని ప్రశంసింపక తప్పదు. భారతయువకులు భారతీయ వీరులనారాధించుట మరువకుందురుగాక!

—సుభాస్‌చంద్రబోస్

*స్వాతంత్ర్య వీరుడా! స్వారాజ్య భానుడా!*
*అల్లూరిసీతారామరాజా! అందుకో మా పూజలందుకో!*
*తెలుగువారి గుండెల్లో నిదురించినవాడా!*
*మానిదురించిన పౌరుషాన్ని రగిలించినవాడా!*
*త్యాగాలే భరిస్తాం - కష్టాలే సహిస్తాం!*
*నిశ్చయముగ, నిర్భయముగ నీ వెంటనె నడుస్తాం!!*

శ్రీ శ్రీ

## అదిలాబాద్ గోండుల తిరుగుబాటు:

తెలంగాణంలోని అదిలాబాదు కొండల ప్రాంతంలో,కొమరం భీమ్ గిరిజనులను దోపిడీ విధానానికి వ్యతిరేకంగా పోరాడేటట్లు చేశాడు. ఫారెస్టు అధికార్ల జులుమ్, గిరిజనేతరులు వెళ్ళి స్థానిక కొండజాతి ప్రజలపైన పెత్తనం సాగించడం, కొమరంభీమ్ నడిపిన గోండుల తిరుగుబాటుకు ముఖ్య కారణాలు.

పట్టాదార్లు, షావుకార్లు అమాయకులైన గిరిజనులను కొల్లగొట్టుకొని తినేవారు. అధికార్లు పెట్టే బాధలు కూడా వీటికి తోడైనవి. సహించ గలిగినంత వరకు భరించి, బాధలు దుర్భరమై, గోండులు పెద్ద తిరుగుబాటును లేవదీశారు. ప్రభుత్వం సైనిక బలంతో, ఆ పోరాటానికి నాయకత్వం వహించిన కొమరంభీమ్‌ను చంపివేసి, గోండుల తిరుగుబాటును నిర్దాక్షిణ్యంగా అణచివేసింది.

## నీలు విగ్రహ సమస్యపై సత్యాగ్రహం:

ఈ కాలంలో మదరాసునగరంలో జరిగిన నీలు విగ్రహ సత్యాగ్రహాన్ని గురించి తెలుసుకొందాము:

1927 లో మదరాసులో నీలు విగ్రహసత్యాగ్రహం సాగింది. 1857 ప్రథమ భారత స్వాతంత్ర్యయుద్ధం సందర్భంలో మదరాసు నుంచి ఉత్తరభారతానికివెళ్ళి అక్కడి సిపాయిల తిరుగుబాటును తీవ్రంగా అణచివేయడానికి ఈ కలనల్‌నీలు దొర బాగా తోడ్పడ్డాడు. అతని గౌరవార్థం, తెల్లప్రభువులు నీల్‌విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

తిరుగుబాటు చేసిన భారత సిపాయిలపైన కలనల్ నీల్ అనేక అత్యాచారాలు జరిపాడు. ప్రజలపైన ఆతడు చేసిన ఘోరదురంతాలు వినరానివి. అట్టి నీచునికి విగ్రహం వేయడం దేశభక్తులైన ఉబయదుల్లా సాహెబ్, సుబ్బరాయలు సహించలేక పోయారు.

ఆ యువకులు ఉలి, సుత్తెలు తీసుకవెళ్ళి ఆనీల్ విగ్రహాన్ని పడగొట్ట ప్రయత్నించారు. పోలీసులు వారిద్దరినీ అరెస్టుచేసి, జైలు శిక్షలు విధించారు. కొన్నాళ్ళు అట్లా సత్యాగ్రహం సాగింది. తదనంతరం, బులుసు సాంబమూర్తి మదరాసువెళ్ళి ఆ సత్యాగ్రహాన్ని పునరుద్ధరించి, ఉద్యమాన్ని నడిపించబూనారు. ఆయన సంపూర్ణ స్వరాజ్యవాది అప్పట్లో నాగపూర్‌లో మంచెర్షాఅవారీ నాయకత్వాన వలంటీర్లు ఆయుధ శాసనాన్ని ధిక్కరించి, ఆ పుర వీధులలో ఆయుధాలు ధరించి తిరగసాగారు. సాంబమూర్తి నాగపురం వెళ్ళి తామూ ఒక కత్తి చేబూని, శాసనోల్లంఘనం చేసి వచ్చారు. అది 'హింసామార్గం' అని గాంధీజీ 'యంగ్ ఇండియా' లో వ్రాశారు. మంచెర్షా అవారీకి అప్పట్లో నాలుగేండ్లు జైలుశిక్ష పడింది.

గాంధీజీ మదరాసు వచ్చినప్పుడు, 'నీలు విగ్రహంపై జరుగుతున్న ఉద్యమం మంచిదే-కాని సుత్తెగునపాలతో ఆ విగ్రహాన్ని ఛేదించడం హింసా మార్గం' అన్నారు. గాంధీ గారిని తిరుచునాపల్లి పర్యటనలో బులుసు సాంబమూర్తి కలుసుకొని, ఈ విషయం మాట్లాడారు. 'నీవు నీ ఆందోళన కొనసాగించు మట్టిముద్దలతో నీల్ విగ్రహాన్ని కప్పించు. సుత్తెలు గునపాలు ఎందుకు?' అని గాంధీజీ సలహా చెప్పారట.

> "సాంబమూర్తీ! స్వరాజ్య తృష్ణ నాలో అడుగంటి పోయిందని నీవు అనుకుంటున్నావేమో? లేదు. నేను సమయంకోసం ఎదురుచూస్తున్నాను. ఇనుము ఎర్రగాకాగగానే, తీసి దిమ్మమీద పెట్టి, దెబ్బమీద దెబ్బకొడతాం-నా చుట్టూచేయిచౌరీ చౌరాల వంటివి జరిగినా, నా శాంతి సమరాన్ని సాగించే ఉపాయం ఆలోచిస్తున్నాను." అని గాంధీజీచెప్పారు.

ఈ ఉదంతాన్ని గూర్చి, రామచంద్రుని వెంకటప్ప, 'వేదిక' పత్రికలో పేర్కొన్నారు.

వద్దురా మనకొద్దురా పరపాలనంబిక వద్దురా
హద్దుపద్దూలేని పన్నుల రుద్ది పీల్చుచునుండెరా ॥వద్దు॥
ఏడుకోట్ల ప్రజలుగూడా కూడులేకున్నారురా
కూడగొట్టి ప్రజల సొమ్ము ఓడనెక్కించాడురా ॥వద్దు॥
వెండి బంగారములనెల్ల దండిగా లాగాడురా
ముండమోపి కాగితాలకు దండమిడు మన్నాడురా ॥వద్దు॥
కర్రలాగి కత్తిలాగి గొర్రెలను చేశాడురా
వెర్రిమొర్రి 'లా' యటంచు విర్రవీగుతున్నాడురా ॥వద్దు॥
మాన ప్రాణములకు మహమ్మారియై యున్నాడురా
దీనమై మన దేశమాత దేవులాడుచునుండెరా ॥వద్దు॥
లేవరా! ఇదివేళరా! మన జీవితంబిక నేలరా
కావలేవా? కన్నతల్లీ గౌరవము కాపాడరా ॥వద్దు॥

—గరికెపాటి మల్లావధాని.

# ఉప్పు సత్యాగ్రహోద్యమం-1

"మా కొద్దీ తెల్ల దొరతనము"

మా కొద్దీ తెల్ల దొరతనము ! దేవ
మా కొద్దీ తెల్ల దొరతనము ।
మా ప్రాణాలపై పొంచి-మానాలు హరియించె ॥మాకొద్దీ॥
కోర్టులంటూ పెట్టి-పార్టీలు పుట్టించి-స్నేహభావము చంపినాడు
ద్రవ్య దాహము కల్పించినాడు
చెడ్డ యూహలు కల్పించినాడు
మా ఆహారముల ద్రుంచి-ఆహా ! యనిపించాడు ॥మాకొద్దీ॥
నూట నలుబదినాల్గు-నోటికి తగిలించి-మాటాడ వద్దంటాడు
మమ్ము పాట పాడ వద్దంటాడు
తనను దాటివెళ్ళ వద్దంటాడు
అయ్యొ ! చేటు తెచ్చుకమమ్ము-చెడిపోవమంటాడు ॥మాకొద్దీ॥
గాంధీటోపి పెట్టి-పాఠశాలకు బోవ-రావద్దు రావద్దంటాడు
రాట్నం బడిలో పెట్ట వద్దంటాడు
టోపీతీసి వీపుల బాదుతాడు
వాడి రాజద్రోహమంత రాట్నములో ఉన్నదట ॥మాకొద్దీ॥
ప్రాపంచమెల్లను పట్టి పిండేటంత-పశుబలము వాడికుందంట
దాన వశపరచుతాడు మమ్మంట
మమ్ము కసిదీర కొట్టుతాడంట
వాడి శషభిషలెల్లను-చెపుతాడు మాయింట ॥మాకొద్దీ॥
స్వేచ్ఛ తేజముతోడ-స్వేచ్ఛావధూమణి-కారాగృహమున వేచియుంది
పూల గుచ్ఛములను దాల్చియుంది
మీకు ముచ్చటలను తెల్పుతుంది
ఛీ చచ్చు రాజ్యము వీడి, సరిగ జైలుకురండి ॥మాకొద్దీ॥

—గరిమెళ్ళ సత్యనారాయణ

## సైమన్ కమిషన్ బహిష్కరణ :

'మాంటేగ్యూ ఛమ్స్‌ఫర్డ్' సంస్కరణలు పదిసంవత్సరాల తర్వాత సమీక్షించబడతాయని, లోగడ బ్రిటిష్ పాలకులు చేసిన వాగ్దానాన్ని అమలు పరుస్తామని ప్రజలను నమ్మించేందుకు 1927లో బ్రిటిష్ పార్లమెంటు ఏడుగురు సభ్యులతో కూడిన 'సైమన్ కమిషన్'ను నియమించింది. భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఎంతవరకు విస్తరింపచేయాలో సూచించమని బ్రిటిష్ ప్రభుత్వం ఈ విచారణ సంఘాన్ని కోరింది. సైమన్ ఇంగ్లండులో ఒక న్యాయవాది, కమిషన్ సభ్యులందరూ తెల్లదొరలే.

సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని కాంగ్రెస్ సంస్థ తీర్మానించింది. 'సైమన్ వెళ్ళిపో' (go back Simon) అనే నినాదాలు దేశమెల్లెడల మారు మ్రోగినవి కమిషన్ సభ్యులు ఎక్కడికి వెళ్ళినా నల్లజెండాల ప్రదర్శనలే వారికి ఎదురైనవి. ప్రభుత్వ ఆజ్ఞలను ప్రజలు లక్ష్య పెట్టలేదు.

లాహోరులో జరిగిన నిరసన ప్రదర్శనానికి లాలాలజపతిరాయ్ నాయకత్వం వహించారు. పోలీసుల లాఠీచార్జీలకు ఆయన గురియై తీవ్రంగా గాయపడి, అటు తర్వాత దివంగతుడైనారు. 'పంజాబ్ కేసరిగా' లాలాజీని దేశం ప్రశంసించింది.

మదరాసు నగరంలో నిరసన ప్రదర్శనం సాగిస్తున్న ప్రజలపై పోలీసులు కాల్పులు చేయగా, అజ్ఞాత వీరుడొకరు మరణించాడు. ఆ మృతవీరుని దేహాన్ని చూడడానికి సైతం అనుమతించలేదు. ప్రకాశం ముందుకు నడిచి, తుపాకులు ఎక్కు పెట్టిన పోలీసు వలయాన్ని ఛేదించుకొని రొమ్ము చూపి కాల్చుకోమన్నారు. ఆయన అద్వితీయ ధైర్యసాహసాన్ని ప్రదర్శించి, తదాది 'ఆంధ్ర కేసరి'గా ప్రసిద్ధిచెందారు. సైమన్ కమిషన్ రాకకు, ఆంధ్ర ప్రజలు తీవ్రనిరసన తెలియచేశారు. అప్పటికే, బందరులో గవర్నర్ రాకను బహిష్కరించి, గొట్టిపాటి బ్రహ్మయ్య ప్రభృతులు అరెస్టులకు గురి అయినారు.

## సంపూర్ణ స్వాతంత్ర్య దీక్ష :

కాంగ్రెస్‌లో యువనాయకత్వం వహించిన జవహర్‌లాల్‌నెహ్రూ; సుభాస్ చంద్రబోస్ ప్రభృతులు 'పూర్ణ స్వరాజ్యం' కావాలని కోరసాగారు. అధినివేశ ప్రతిపత్తి పనికిరాదన్నారు. 1929 లాహోరు కాంగ్రెస్ మహాసభ, జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన జరిగింది. సంపూర్ణ స్వాతంత్ర్యమే కాంగ్రెస్ లక్ష్యమని తీర్మానించారు.

1930 జనవరి 26వ తేదీన స్వాతంత్ర్య ప్రతిజ్ఞ తీసుకోబడింది. ఆ దినోత్సవమే స్వాతంత్ర్యావతరణ అనంతరం, రిపబ్లిక్ దినోత్సవంగా జరుగుతున్నది.

## నాటి 'స్వాతంత్ర్య దీక్ష :

"స్వతంత్రంగా వుంటూ, కష్టఫలం అనుభవిస్తూ, జీవితావసరాలను సమకూర్చుకొంటూ ఈ విధంగా వికాసానికి అనువైన సదుపాయాలు సంపూర్ణంగా పొందే హక్కు అందరితోపాటు మనకూవుంది. ఎటువంటి ప్రభుత్వమైనా ప్రజలకు ఈ హక్కును లేకుండాచేసి పీడిస్తే, ఆ ప్రభుత్వాన్ని మార్చివేయడానికి, రద్దు చేయడానికి మనకు హక్కు వుంది. ఇదే మన విశ్వాసం ... .. ...

బ్రిటిష్ ప్రభుత్వం మనదేశంలో మనకు స్వాతంత్ర్యంలేకుండా చేయడమేగాదు-ప్రజలను కొల్లగొట్టుకొని తినడమే తన గొప్పగా భావించింది. బ్రిటిష్ ప్రభుత్వం మూలంగా మన సిరిసంపదలు పోయినవి. రాజ్యాధికారం పోయింది. మన సంస్కారం చెడింది. ధర్మం నాశనమైంది. దీనికంతా కారణభూతమైన బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వంతో సంబంధం త్రెంచి వేసుకొని, మనం పూర్ణ స్వరాజ్యం పొందవలసిందే. . . ... ..

అహింసా ప్రచారానికి, ముఖ్యంగా అహింసాత్మకమైన ఉల్లంఘన సన్నాహానికి నిర్మాణ కార్యక్రమం నెరవేర్చడం చాల అవసరం. ఇది గాంధీజీ చూపిన కార్యక్రమం. దీన్ని కాంగ్రెస్ సంస్థ ఆమోదించింది. దీనిలో ఖద్దరు వ్యాపకం, మత సఖ్యతను పెంపొందించడం, అస్పృశ్యతను నివారించడం, ముఖ్యమైనవి. ఎట్టి కులమతబేధాలు లేకుండా తోటి వారిలో సౌమ్యభావం పెంపొందించడానికి సదా ప్రయత్నిస్తాము. వెనుకబడిన వారికి జ్ఞానోదయం కలిగించి, వారి దారిద్ర్యాన్ని రూపు మాపడానికి పాటు పడతాము. సంఘంలోని దీనజనుల శ్రేయస్సు కోసం సర్వవిధాల కృషి చేస్తాము. కట్టుబాటుగా వుండి కాంగ్రెస్ నీతి నియమాలను, కార్యవిధానాలను పాలిస్తామని 'ప్రతిజ్ఞ' చేస్తున్నాము. భారత స్వాతంత్ర్య పోరాటం సాగించే నిమిత్తం, సర్వదా కాంగ్రెస్ ఆదేశాలను పాటించడానికి సన్నద్ధులంగా వున్నామని శపథం చేస్తున్నాము."

ఈ విధంగా, దేశచరిత్రలో లాహోరు కాంగ్రెస్ ఒక ప్రధాన మజిలీ. ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించి, ఇష్టమైనచోట ఎవరికి వారు ఉప్పు తయారు చేసుకోండని గాంధీమహాత్ముడు ఉద్బోధించారు. ఉప్పు పన్నుకు వ్యతిరేకంగా ఏప్రియల్ 6వ తేదీ నుండి జాతీయ సప్తాహ కార్యక్రమం సాగించి.

## గాంధీజీ దండి యాత్ర :

1930 మార్చి 12వ తేదీన మహాత్మాగాంధీ సబర్మతీ ఆశ్రమం నుండి 79 మంది అనుచరులతో చరిత్రాత్మకమైన దండియాత్రకు బయలుదేరారు. 245 మైళ్ల కాలినడకను యాత్రచేసి అహింసాయోధులు దండికి చేరుకొన్నారు. గాంధీజీ సముద్ర స్నానంచేసి, ఉప్పు శాసనాన్ని ధిక్కరించి, ఉప్పు తయారు చేయడానికి పూనుకోగానే పోలీసులు వారిని అరెస్టు చేశారు. అనంతరం అబ్బాస్ తయాబ్జీ, తర్వాత సరోజినీ నాయుడు, మణిలాల్‌గాంధీ ఒకరు వెంట మరొకరు సత్యాగ్రహదళానికి నాయకత్వం వహించారు. ఆంధ్రదేశం నుండి ఎర్నేని సుబ్రహ్మణ్యం, గాంధీగారి వెంట దండి యాత్రలో పాల్గొన్నారు.

## ప్రభుత్వ నిర్భంధాలు :

పోలీసులు సత్యాగ్రహులపై తీవ్రంగా లాఠీచార్జి చేశారు. వలంటీర్లను గోతులలో పడద్రోశారు. కాని సత్యాగ్రహులు ప్రతీకారం చేయలేదు సహనశీలురై లాఠీదెబ్బలను భరించారు. ఇది ప్రపంచ ప్రజలను ఆశ్చర్య చకితులను చేసింది. సత్యాగ్రహులు చూపిన అహింసా వ్రతనిష్ఠ దేశదేశాలకు ప్రాకింది. ఈ ఉద్యమాన్ని ప్రత్యక్షంగా చూచిన ఒక పాశ్చాత్య పత్రికా విలేఖరి "గాంధీ మహాత్ముడు కారాగారంలో వున్నాడు. కాని నేడు దేశమంతటా ఆయనే కనిపిస్తున్నాడు" అని వ్రాశాడు.

బొంబాయిలో పౌరులు గాంధీదినోత్సవం జూన్ 5వ తెదీన జరిపారు. మైలు పొడుగున పెద్ద వూరేగింపు సాగింది. ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు కూడా చేసే పనులు మానివేసి జన సమూహంలో కలిసిపాల్గొన్నారు. ప్రభుత్వ దమనకాండ విచ్చల విడిగా సాగింది. వేలాది లాఠీఛార్జీలకు, అరెస్టులకు కాల్పులకు గురిఅయినారు. సత్యాగ్రహులు అహింసా వ్రతులై అపూర్వ త్యాగాలు చేశారు. ఎందరెందరో వీరవనితలు చెరసాలలు నింపారు.

సత్యాగ్రహాన్ని అణచివేసేందుకు వున్న నిర్బంధ శాసనాలు చాలక, రాజప్రతినిధి 11 ఆర్డినెన్సులు జారీచేశాడు, గాంధీ, నెహ్రూ, బోస్, ఆజాద్, రాజేంద్రప్రసాద్ మున్నగు జాతీయ నాయకులందరినీ జైళ్ళలో నిర్బంధించారు.

బొంబాయి, కలకత్తా, కరాచీ, చిటగాంగు, మిడ్నపూర్,లక్నో, ఢిల్లీ మొదలగు అనేక పట్టణాలలో పోలీసులు కాల్పులు జరిపారు. 'సరిహద్దుగాంధీ' ఖాన్ అబ్దుల్‌గఫార్ ఖాన్‌ను అరెస్టు చేసినప్పుడు వేలాది పఠానులు తీవ్రనిరసన తెల్పారు. ఆ ప్రజాసమూహంపైన కాల్పులు చేయడానికి 39వ ర్యాఘాలీ రైఫిల్ దళం తిరస్కరించి కఠిన శిక్షలకు గురిఅయింది. ఏప్రిల్ 18వ తేదీన యువ విప్లవ కారులు చిటగాంగు ఆయుధాగారంపై దాడిచేసి సెంట్రీలను చంపివేశారు ఈ సంఘటనలు ప్రభుత్వాన్ని కలవరపెట్టాయి. హింసాచర్యలకు గాంధీజీ చింతాక్రాంతుడైనారు.

## విఠల్‌భాయ్ పటేల్ రాజీనామా :

ఏప్రిల్ 25న కేంద్ర శాసన సభాధ్యక్షుడు విఠల్‌భాయ్ పటేల్ తమ పదవికి రాజీనామా యిస్తూ వైస్రాయికి ఈ విధంగా లేఖ వ్రాశారు:

> "ఆధునిక కాలంలో అతి గొప్ప వ్యక్తి అయిన మహాత్మాగాంధీ నాయకత్వంలో భారతజాతీయ కాంగ్రెస్ ప్రారంభించిన అహింసాయుత శాసనోల్లంఘ నోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. నాదేశ ప్రజల్లో వందలాది ప్రముఖులు మీ జైళ్ళలో మ్రగ్గుతున్నారు. మా దేశస్వాతంత్ర్యసమర చరిత్రలో యిటువంటి ఘట్టంలో నేను నా తోటి వారితో వుండటం సబబు శాసన సభాధ్యక్ష పదవిలో గాకుండా నేను నా దేశ ప్రజలకు చేయూతగా వుండాలని నిశ్చయించుకొన్నాను". విఠల్‌భాయ్ పటేల్ స్వరాజ్య పక్షానికి చెందినవారు. ఆయన రాజీనామా చేసి, ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. మిగతా 'స్వరాజ్జిస్టులు' కూడా తమ ప్రభుత్వ పదవులకు రాజీనామా యిచ్చారు. ప్రభుత్వ దమననీతి వీరికి కనువిప్పు కలిగించింది. రవీంద్ర కవీంద్రుడు నైట్ హుడ్ బిరుదాన్ని పరిత్యజించారు.
>
> ఈ ఉప్పు సత్యాగ్రహం మొదటి ఘట్టంలో 200 మంది అసువు లర్పించారు. 80 వేల మంది సత్యాగ్రహులు అరెస్టు అయినారు. కల్లు సారా దుకాణాల వద్ద వలంటీర్లు పికెటింగు చేయడం, విదేశ వస్త్రాలను దహనం చేయడం, ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించడం, నిషేధాజ్ఞలను ధిక్కరించి ఉప్పు తయారు చేయడం, మున్నగు కార్యక్రమాలు వివిధ ప్రాంతాల్లో భారీఎత్తున సాగాయి.

1931 మార్చిలో గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరిగింది, తత్ఫలితంగా ఉద్యమ విరమణ, ఆర్డినెన్సుల రద్దు, సత్యాగ్రహుల విడుదల జరిగినవి. కరాచి కాంగ్రెస్ మహా సభ, గాంధీ- ఇర్విన్ ఒడంబడికను ఆమోదించి సత్యాగ్రహోద్యమ విరమణకు తీర్మానించింది.

ఏప్రిల్‌లో లార్డు వెల్లింగ్డన్ కొత్త వైస్రాయిగా వచ్చాడు.

రెండవ రౌండ్ టేబుల్ సభకు కాంగ్రెస్ ఏకైక ప్రతినిధిగా మహాత్మాగాంధీ లండన్ వెళ్ళారు. భారతవాణిని వినిపించారు. కాని, సంధిషరతులను వైస్రాయి భగ్న పరిచాడు. జవహర్‌లాల్ మున్నగు నాయకులను జైళ్లలో బంధించాడు. ఇంగ్లండునుంచి గాంధీజీ బొంబాయికి తిరిగి రాగానే, వైస్రాయి వెల్లింగ్టన్ ఆయనకు ఇంటర్వ్యూ సైతం నిరాకరించి, ఎరవాడ జైలులో బందీగా చేశాడు.

దేశంలో మరల సత్యాగ్రహం సాగింది. ప్రభుత్వం తిరిగి 1932లో ఆర్డినెన్సుల రాజ్యాన్ని తీవ్రనిర్బంధాలను అమలు పరిచింది. కాంగ్రెస్ సంస్థను నిషేధించింది. 6 మాసాల స్వల్ప వ్యవధిలోనే 1,50,000 మంది దేశభక్తులను అరెస్టు చేసింది. వలంటీర్లను లాఠీలతో తీవ్రంగా మోదారు. స్త్రీ వలంటీర్లను అవమాన పాల్జేశారు. ప్రభుత్వ నిర్బంధాలు పెరిగినకొద్దీ ప్రజల, సత్యాగ్రహుల దీక్ష యినుమడించింది. కాని అప్పటి దేశపరిస్థితులను, ఉద్యమస్థాయిని అంచనావేసి, 1934లో సత్యాగ్రహాన్ని విరమించాలని గాంధీజీ, కాంగ్రెస్ కార్యవర్గంవారు దేశీయులను ఆదేశించారు.

ఈ ఉప్పుసత్యాగ్రహ సందర్భంలో ఆంధ్రదేశంలో జరిగిన శాసనోల్లంఘన కార్యక్రమాలు, ప్రభుత్వం అనుసరించిన దమననీతిని గురించి తెలుసుకుందాము.

## ఆంధ్రలో సత్యాగ్రహ శిబిరాలు :

ఆంధ్రదేశంలో ఉప్పు సత్యాగ్రహోద్యమం చాలా ముమ్మరంగా సాగింది. సత్యాగ్రహ శిబిరాలు వెలసినవి. ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించి, వలంటీర్లు ఉప్పును తయారుచేయడం, ఆ ఉప్పును తెచ్చి అమ్మడం జరిగింది.

గుంటూరులో 'దేశభక్త' కొండ వెంకటప్పయ్యగారి గృహ ఆవరణలో ఉప్పు తయారుచేయసాగారు. నెల్లూరు జిల్లా మైపాడు వద్ద, కృష్ణాజిల్లాలో బందరు సమీపాన గల చిన్నాపురం వద్ద, గుంటూరుజిల్లా వాడరేవు, కనపర్తి, దేవరంపాడుల వద్ద, పశ్చిమ గోదావరి జిల్లాలో మట్లపాలెం వద్ద, తూర్పుగోదావరి జిల్లా చోళంగి వద్ద,

గంజాంజిల్లా నౌపడా వద్ద, విశాఖ సముద్రంరేవు సమీపాన, మదరాసు సముద్రతీరాన సత్యాగ్రహ శిబిరాలు వెలసినవి. వేలాది సత్యాగ్రహులు శాసనోల్లంఘనం చేసి, ఉప్పు తయారుచేశారు. ఆయా ఉప్పు కొఠారుల వద్ద, అహింసా మూర్తులైన ఆసత్యాగ్రహుల మీద పోలీసులు చేసిన లాఠీఛార్జీలు, సాగించిన అకృత్యాలు వర్ణనాతీతం.

మదరాసు నగరంలో ప్రకాశం, కాశీనాథుని నాగేశ్వరరావు, గద్దె రంగయ్య నాయుడు, దుర్గాబాయి మున్నగు ఆంధ్ర నాయకులు శాసనోల్లంఘనంచేసి, అరెస్టులకు గురి అయినారు.

స్త్రీలు, పురుషులు వలంటీర్లు ఊరేగింపులుచేస్తూ, ఉప్పు కొఠారులపై దుమికి, ఉప్పు తయారుచేసేవారు. ఉప్పు సత్యాగ్రహోద్యమానికి వివిధ పట్టణాలలోని న్యాయ వాద సంఘాలవారు మద్దతునిచ్చారు. వర్తకులు సత్యాగ్రహ శిబిరాల నిర్వహణకు విరాళాలు యిచ్చారు. సరుకులు సప్లయి చేశారు. గ్రామీణ రైతు యువకులు కూడా వచ్చి సత్యాగ్రహంలో పాల్గొన్నారు. విద్యార్థులు చదువులకు స్వస్తిచెప్పివచ్చి వలం టీర్లుగా చేరారు. అశేష ప్రజలు ఉద్యమంపట్ల అభిమానంచూపారు. మహిళా వలంటీర్లు కల్లు సారా దుకాణాల వద్ద పికెటింగులు చేశారు. విదేశీ వస్త్రాల దహనకాండసాగింది. ఆంధ్రదేశమంతటా మహోత్సాహం వెల్లివిరిసింది.

సత్యాగ్రహాన్ని బలపరుస్తూ, గుంటూరు, చీరాల, తెనాలి, నెల్లూరు, రామ చంద్రాపురం, పెద్దాపురం మొదలగు మునిసిపాలిటీలు తీర్మానించినవి. మునిసిపల్ కార్యాలయాలపైన కాంగ్రెస్ పతాకాలను ఎగురవేసి, తమ దేశభక్తిని చాటాయి.

## సీతానగరం ఆశ్రమవాసుల త్యాగం

ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా ఆంధ్రదేశంలోని సత్యాగ్రహ ఆశ్రమాలు నిర్వహించిన పాత్ర అపూర్వమైనది. ఉదాహరణకు సీతానగరం సత్యాగ్రహ ఆశ్రమ చరిత్రను పరికించండి.

ఆశ్రమవాసులందరు డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం నాయకత్వాన ఈ ఉద్యమంలో పాల్గొని లాఠీఛార్జీలకు గురి అయినారు. జైలు శిక్షలు అనుభవించారు. దుర్మార్గుడైన పోలీసు అధికారి ముస్తఫాలీఖాన్ సత్యాగ్రహుల నందరినీ లాఠీలతో మోదించాడు. ఆశ్రమం అక్రమ సంఘంగా నిషేధించబడింది. జెండాను చింపివేసి, ఆశ్రమాన్ని ధ్వంసం చేశారు. డా॥ సుబ్రహ్మణ్యంను లాఠీలతోకొట్టి స్పృహతప్పి పోయిన స్థితిలో సైడ్ కాలువలోకి త్రోసివేశారు. ఆనాటి దెబ్బలే, తర్వాత ఆయన

మరణానికి కారణమైనాయి. వీరి సోదరుడు సీతారామయ్య స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి రాజీనామాచేసి సత్యాగ్రహంలో పాల్గొన్నారు సన్నివీసు కృష్ణారావు సతీమణి సుందరమ్మ జైలు శిక్షననుభవించి, తర్వాత క్షయ వ్యాధితో చని పోయింది. మద్దూరి అన్నపూర్ణయ్య సోదరుడు మదరాసువెళ్ళి, అక్కడ సత్యా గ్రహంలో పాల్గొని జైలు శిక్షకు గురి అయినారు. క్రొవ్విడి లింగరాజు ఉప్పాడలో అరెస్టు అయినారు. రామచంద్రుని వెంకటప్ప కాకినాడ శిబిర మొదటిజట్టు నాయకుడు. పోలీసు కిరాతకాలకు గురి అయి, జైలుకు వెళ్ళారు.

మద్దూరి అన్నపూర్ణయ్య, మొసలికంటి తిరుమలరావు, క్రొవ్విడి రామచంద్ర రావు, మాచిరాజు రామచంద్రరావు, ధరణీప్రగడ శేషగిరిరావు, ఓలేటి నరసింహ మూర్తి, మాన్యాపగడ వెంకటకృష్ణారావు మొదలగు ఆశ్రమవాసులందరూ ప్రభుత్వ దారుణ హింసాకాండను చవిచూశారు. జైళ్లకు వెళ్లారు కాంగ్రెస్ జెండా ప్రతిష్ఠను నిలప డానికై 65 ఏండ్ల వృద్ధుడు గుత్తి సుబ్బరాజు పోలీసుల లాఠీలను ఎదుర్కొని జైలు కెళ్లారు.

సత్యాగ్రహులపై జరిగిన పోలీసుల దౌర్జన్యకాండను రాజమండ్రి పౌరులు గర్హించారు. న్యాయపతి సుబ్బారావు అధ్వర్యాన పురప్రముఖులు ప్రభుత్వం వద్దకు రాయబారం వెళ్ళి, లాఠీఛార్జీలకు నిరసన తెల్పారు.

## ధ్రువతార 'కాంగ్రెస్ పత్రిక'

సీతానగరం ఆశ్రమం నుండి మద్దూరి అన్నపూర్ణయ్య సంపాదకత్వాన, 'కాంగ్రెస్' పత్రిక వెలువడుతుండేది. దేశభక్తుల, విప్లవవీరుల జీవితవిశేషాలు అందులో ప్రచురిస్తుండేవారు. ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధవీరులను గురించి వ్యాసాలు వుండేవి. మంగళపాండే వీరగాథను 'చిచ్చులపిడుగు' ప్రచురించినందుకు మద్దూరి అన్నపూర్ణయ్యకు రెండున్నర సంవత్సరాల కఠినశిక్ష విధించబడింది. 'ఆంధ్రవీర' అల్లూరి సీతారామరాజు స్మారక సంచికను కూడా కాంగ్రెస్ పత్రిక ప్రకటించింది. మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు, చందుభట్ల హనుమంతరావు, రామ చంద్రుని వెంకటప్ప మున్నగు 8 మంది ప్రసిద్ధ సంపాదకులు ఒకరివెంట మరొకరు వరుసగా అరెస్టుగావడం పత్రికారంగంలోనే అపూర్వమైన విషయం. అతివాద జాతీయ వాది అయిన మద్దూరి అన్నపూర్ణయ్య మొత్తం 14 ఏండ్లు కఠిన కారాగారశిక్షల ననుభవించిన త్యాగశీలి. ఆయన సతీమణి రమణమ్మ కూడా జైలుకువెళ్ళిన వీరపత్ని.

జాతీయ పత్రికలలో 'కాంగ్రెసు' ధృవతారగా వెలుగొందుతుంది. దేశభక్తులైన ఆ సంపాదకులందరూ చిరస్మరణీయులు.

ఈ ఆశ్రమాన్ని మహాత్మాగాంధీ, బాబు రాజేంద్రప్రసాద్ మొదలగు పుణ్యపురుషులెందరో సందర్శించి, ఆశ్రమవాసులు చేసిన ప్రజాహిత సేవా కార్యక్రమాలను, స్వతంత్ర సమరంలో గావించిన త్యాగాలను ఎంతగానో ప్రశంసించారు.

డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం స్వర్గస్థులవుతూ "బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రతిఘటనకు శాశ్వత చిహ్నంగా నా ఆత్మ నిలిచి వుంటుంది" అని ఆయన అన్న మాటలు మరుపు రానివి.

మద్దూరి అన్నపూర్ణయ్యను శిక్షించాలనే తీర్మానాన్ని మదరాసు కౌన్సిల్‌లో ప్రభుత్వ సభ్యుడు ప్రతి పాదించినప్పుడు, ప్రతిపక్ష కాంగ్రెస్ నాయకుడు సత్యమూర్తి చెప్పిన మాటలు గమనార్హమైనవి. "ఈ తీర్మానం తెచ్చిన ప్రభుత్వ సభ్యుడు మదరాసు చరిత్రలో, ఆకస్మిక వ్యక్తిగా గతించి పోతాడు. కాని యితడు శిక్షించాలని కోరుతున్న అన్నపూర్ణయ్య పేరు మాత్రం సువర్ణాక్షరాలతో లిఖించ బడుతుంది. దేశగౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని పరిరక్షించిన వ్యక్తిగా భావితరం ఆయన పేరును జ్ఞాపకం వుంచు కొంటుంది," అన్నారు సత్యమూర్తి.

## వాడపల్లి రథోత్సవంపై కాల్పులు:

సత్యాగ్రహం సాగుతున్న రోజుల్లో వాడపల్లిలో ఏకాదశినాడు రథోత్సవం జరిగింది. 10 వేలమంది పైగా తిరుణాల చూడడానికి యాత్రీకులు వెళ్ళారు. రథంపైన గాంధీజీ, జవహర్‌లాల్, సరోజినీదేవి చిత్రపటాలు కూడాపెట్టి, దేవుడిని ఊరేగింపుకు బయలు దేరతీశారు. డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంటు ముస్తఫాలిఖాన్ రిజర్వు దళంతో పోయి, జాతీయ నాయకుల ఫొటోలు పెట్టరాదని అభ్యంతరం పెట్టారు. పోలీసులు ఆ పటాలను వూడతీశారు. 'గాంధీగారి పటంలేనిది రథాన్ని లాగమని' ప్రజలన్నారు. అంతట జనంపై పోలీసులు లాఠీచార్జీచేశారు. కొందరు రెచ్చిపోయి సమీపంలోగల పోలీస్ పాకను తగల బెట్టారు.

అంతట పోలీసులు యాత్రీకులపై కాల్పులు చేయగా, ఇద్దరు వ్యక్తులు చని పోయారు. చాలా మందికి గాయాలు తగిలాయి. జనం పోలీసులను కొట్టి గాయపరి చారని, దొమ్మీ కేసుపెట్టారు. 'అది తప్పుడుకేసు అని, అనవసరంగా జరిపిన కాల్పు

లను సమర్థించుకోడానికి పోలీస్ అధికార్లు పన్నిన పన్నుగడయని' కోర్టులో రుజువైంది. కేసులోని 25 మంది ముద్దాయిలలో ముగ్గురు మాత్రమే కాంగ్రెస్‌కు సంబంధించిన వారని కాంగ్రెస్ విచారణ సంఘం పేర్కొంది. ఆనాటి కాల్పులలో పండ్ల దుకాణ దారైన మైలా రామన్న, ఇందుకూరు రామరాజు, మద్దిపాటి సత్యనారాయణ మొదలైన వారికి తీవ్రమైన గాయాలు తగిలాయి.

ఈ కేసు విచారణ జరుగుతుండగా, డి. వై. ఎస్. పి. ముస్తఫాలీఖాన్ కత్తి పిస్తోలు ధరించి, పోలీస్ యూనిఫారమ్ వేసుకొని కోర్టులోకి వచ్చాడు. ఆయన ఆయుధాలు ధరించి యూనిఫారమ్‌తో రావడాన్ని చూచిన ముద్దాయిల తరపు లాయరు వెంకటాచలం, అభ్యంతరం తెల్పాడు. 'తుపాకీని బయట పెట్టి మరీ కోర్టులోకి రమ్మని' జడ్జి ఆజ్ఞాపించారు. పోలీస్ అధికారి అట్లాచేయక తప్పలేదు. 'ముందు హెచ్చరిక లేకుండా, అనవసరంగా పోలీసులుకాల్పులు చేసినట్లు కనుపిస్తున్నదని' జడ్జి 1935 నవంబర్ 22వ తేదీన తీర్పు చెప్పారు.

కాల్పులలో గాయాలు తగిలిన దంతలూరి లక్ష్మీపతిరాజు తన జీవితాంతం వరకు ప్రజాసేవలో గడిపి స్వర్గస్తులైనారు. నంబూరు జగ్గరాజు, నాయన బాపన్న ఆ ప్రాంత ప్రజానాయకులుగా గణుతికెక్కారు. వాడపల్లి రథోత్సవం-పోలీసు కాల్పులు-తప్పుడుకేసు ఆ చుట్టు ప్రక్క ప్రాంతాల ప్రజల్లో జాతీయ ఉత్సాహోద్రే కాలను రగుల్కొల్పింది.

## పత్రికలపై ఆంక్షలు-పుస్తకాలపై నిషేధం :

సత్యాగ్రహ సమయంలో ప్రభుత్వం పత్రికలపైన అనేక ఆంక్షలు విధించింది. ధరావతు చెల్లించాలని 17 పత్రికలకు హెచ్చరికలు చేసింది. కొన్నిటిని మూసి వేయించింది. నెల్లూరులో ఉద్యమ కరపత్రాలను అచ్చువేయకూడదని ప్రింటింగ్ ప్రెస్సుల యజమానులకు మేజిస్ట్రేట్ ఉత్తర్వు జారీ చేశారు.

ఏలూరులో 'సత్యాగ్రహి' పత్రికను, ప్రెస్‌ను స్వాధీనం చేసుకొని ఆ పత్రికా సంపాదకుడైన ఆత్మకూరి గోవిందాచార్యులను అరెస్టు చేశారు.

సీతానగరం ఆశ్రమంపై దాడిచేసి 'కాంగ్రెస్' పత్రికను ఆపివేయించారు. గుడివాడలో సెక్యూరిటీ యివ్వలేదని, 'దరిద్ర నారాయణ' పత్రికను స్వాధీనం చేసుకొన్నారు.

ఆ ఉద్యమకాలంలో, అనేక రహస్య కరపత్రాలు, పుస్తకాలు ప్రచురించడం జరిగింది వాటిని ప్రభుత్వం నిషేధించింది. అనుమానంవున్న ప్రింటింగ్ ప్రెస్సుల పైన దాడులుచేసింది. రచయితలను, ప్రెస్ యజమానులను అరెస్టు చేసింది.

కలగా సత్యనారాయణ వ్రాసిన 'స్వరాజ్యపథం' పుస్తకాన్ని నిషేధించారు రచయితకు ఏడాది శిక్ష. యజమాని ఆర్. వీరభద్రరావుకు రూ 200 లు జరిమానా విధించారు.

గుంటూరులో దామరాజు పుండరీకాక్షుడు 'నవయుగం' 'గాంధీ విజయం', 'పాంచాల పరాభవం' మొదలగు నాటకాలు రచించారు. అధికార్లు ఆ పుస్తకాలను నిషేధించారు. గ్రంథకర్త పుండరీకాక్షునిని అరెస్టుచేసి, జైలుశిక్ష విధించారు. ఆ నాటకాలను ప్రదర్శించిన నటీ నటులను కూడా జైలులో నిర్బంధించారు.

నాళం కృష్ణారావు వ్రాసిన గాంధీమహాత్ముని 'దశావతార లీలలు', కోన వెంకట్రాయ శర్మ వ్రాసిన 'పూర్ణ స్వాతంత్ర్యం', జె. సి. కుమారప్ప వ్రాసిన 'ప్రభుత్వధనము-మన బీద తనము' తెలుగు అనువాదం; సి. ఎఫ్. ఆలండ్రూస్ రచించిన 'భారత స్వాతంత్ర్యం-స్వరాజ్య శరణ్యం' అనుగ్రంథాలను ప్రభుత్వం నిషేధించింది. ఆ రచయితలపై చర్యతీసుకొంది. 'పోరాడుతున్న భారత్' (**Strugling India**) అను గ్రంథాన్ని ఇంగ్లీషులో ఎం. రామమూర్తి వ్రాయగా, ఆ గ్రంధానికి వి. వి. గిరి పరిచయం వ్రాశారు. ఈ గ్రంథాన్ని ప్రభుత్వం నిషేధించింది. జగ్గన్నశాస్త్రి రచించిన 'స్వరాజ్యయుద్ధం', దరిద్ర నారాయణీయం' గేయం నిషేధింపబడినవి.

బందరులోని ఆంధ్రా బ్యాంకు, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ కార్యాలయాలను పోలీసులు సోదా చేశారు. వాటి సంస్థాపకులలో ముఖ్యుడైన డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య పేరగాని, ఆయన భార్య, కొడుకుల పేరగాని, డబ్బు యిచ్చి పుచ్చు కోటాలు, బ్యాంకింగ్ లావాదేవీలు అనుమతించవద్దని, అధికార్లు ఆ బ్యాంకులను ఆజ్ఞాపించారు.

ఈ విధంగా పత్రికలపైన, పుస్తకాలపైన నిషేధాలు, బ్యాంకులపై నిర్బంధాలు విధించడం జరిగింది.

## కాంగ్రెస్ రాజకీయ సభలు-అరెస్టులు :

ప్రభుత్వ నిషేధాజ్ఞలను, 144 సెక్షనులను ఉల్లంఘించి వివిధ పట్టణాలలో, గ్రామాలలో కాంగ్రెస్ రాజకీయ మహాసభలు నిర్విఘ్నంగా జరిగాయి. పెక్కు సభలకు మహిళా సత్యాగ్రహులు అధ్యక్షత వహించడం ఒక విశేషం.

పశ్చిమ గోదావరి కాంగ్రెస్ రాజకీయ మహాసభ కాళీపట్నం కొండయ్య, పసల కృష్ణమూర్తిగార్ల అధ్వర్యాన జరిగింది. నరసాపురం తాలూకా సభ పాలకొల్లులో రుద్రరాజు బంగారమ్మ అధ్యక్షతన జరిగింది. జూలై 23వ తేదీన భీమవరం తాలూకా మహాసభ తల్లా ప్రగడ ప్రకాశరాయుని అధ్యక్షతన జరిగింది.

గుంటూరు మండల మహాసభ తెనాలి గంగానమ్మ గుడివద్ద తల్లా ప్రగడ విశ్వ సుందరమ్మ అధ్యక్షతన జూలై 6వ తేదీన జరిగింది. జూలై 1వ తేదీన రేపల్లె తాలూకా సభ ఎల్లా ప్రగడ సత్యనారాయణ అధ్యక్షతన జరిగింది. బాపట్ల తాలూకా మహాసభ ఆగస్టు 8వ తేదీన లావు అంకమ్మ అధ్యక్షతన బాపట్ల గుడివద్ద జరిగింది. ఆగస్టు 15వ తేదీన బత్తెన వెంకటరంగయ్య అధ్యక్షతన సభ జరిగింది.

## గుంటూరులో రాష్ట్ర మహాసభ :

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ రాజకీయ మహాసభ, గుంటూరు పట్టణంలో వేదాంత కమలాదేవి అధ్యక్షతన జూన్ 5న జరిగింది. వివిధప్రాంతాల నుండి కాంగ్రెస్ నియం తలు, సత్యాగ్రహులు వచ్చి సభలో పాల్గొన్నారు. 21 మంది ప్రతినిధులు అరెస్టు అయినారు. 220 మందిని నిర్బంధంలోకి తీసుకున్నారు. తెనాలి తాలూకా సభ కంభం పాటి మాణిక్యాంబ అధ్యక్షతన తెనాలిలో జరిగింది. ఈ విధంగా, వివిధ జిల్లాల్లో సభలు సమావేశాలు జరిగినవి, 'సత్యాగ్రహోద్యమాన్ని కొనసాగించాలని' తీర్మానించారు. తీర్మాన ప్రతులను వీధులలో పంచుతూ, వలంటీర్లు వూరేగింపులు సాగించారు.

ఈ రాజకీయసభలు జరపకుండా పోలీసులు అనేక అవరోధాలు కలిగించారు. ముందుగా నిషేధాజ్ఞలు, 144 సెక్షనులు జారీ చేశారు. అయినప్పటికీ, ఆ నిషేధాజ్ఞ లను ధిక్కరించి, సభలు జరుపుతూ, వందలాది కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులు లాఠీ చార్జీలకు, అరెస్టులకు గురి అయినారు. ఆయాసభలు జరిగినచోట్ల ఆ రోజు, ఖద్దరు కట్టుకొన్న వాళ్లందరినీ పోలీసులు పట్టుకొని, నిర్బంధించారు.

ఈ విధంగా, ఉద్యమం సాగుతున్న సమయంలో రాజకీయ మహాసభలు, జాతీయ వారోత్సవాలు, రాజకీయ ఖైదీల దినోత్సవాలు జరుపుతూ, దేశ సేవకులు ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని కలిగించేవారు.

నిషేధాల మధ్య ఢిల్లీ చాందినీ చౌక్‌లో జరిగిన కాంగ్రెస్ సభకు, ఆంధ్రదేశం నుండి పలువురు హాజరైనారు. కొండ వెంకటప్పయ్య, ఉప్పల వెంకటకృష్ణయ్య,

భాగవతుల సుబ్బరామయ్య, పున్నవ లక్ష్మీబాయమ్మ, ప్రతాపగిరి రామసుబ్బయ్య మున్నగు వారు వెళ్ళి, కొందరు అరెస్టులకు గురి అయినారు.

ఏలూరు, బెజవాడ, బందరు, తెనాలి వస్త్ర వ్యాపారస్తులు విదేశ వస్త్రాలను తామిక తెప్పించబోమని ప్రతిజ్ఞచేశారు. కాకినాడలో కల్లు సారా అంగళ్లు మూసివేసు కోవలసి వచ్చింది. చిత్తూరు జిల్లాలోని గ్రామాలలో మద్యపానం చేసే వారిపైన గ్రామస్థులు కుల కట్టుబాట్లు విధించారు. ఏలూరు, కొవ్వూరు, అబ్కారీ వేలం పాటల వద్ద 144 సెక్షన్ పెట్టి, పోలీసులు వలంటీర్లను, జనాన్ని చెదరగొట్టారు.

## ఆర్డినెన్సుల రాజ్యం :

ఈ సత్యాగ్రహ ప్రారంభదశ నుండి ప్రభుత్వం అనేక ఆర్డినెన్సులను అమలు జరిపింది. సంస్థలను నిషేధించింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని, బెజవాడ కాంగ్రెస్ 'వార్ కౌన్సిల్'ను కృష్ణా, గుంటూరు, నెల్లూరు, మదరాసు జిల్లా కాంగ్రెస్ సంఘాలను, అనేక తాలూకా కాంగ్రెస్ కమిటీలను చట్టవిరుద్ధ సంస్థలుగా నిషేధించింది. అయినప్పటికీ, ఆంధ్రులు మహోత్సాహంతో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఈ సత్యాగ్రహోద్యమం విజయవంతం గావడానికి తాను ముఖ్యంగా ఆంధ్ర, బీహారు, గుజరాత్ రాష్ట్రాల మీద ఆధారపడుతున్నానని గాంధీజీ లోగడ ప్రకటించినదాన్ని ఆంధ్రులు నిజమని నిరూపించారు.

ఉ. గావని యూరకున్న నిక కల్గదు మోక్షము జ్ఞానులైన ఋ
ష్యాదులు జూపినట్టిది సహాయ నిరాకరణంబు మీరలా
మోదముతోడ గాంధి ఋషి బూజ్యుని చిత్తమునందు నిల్పని
ష్వేదము నొ స్వరాజ్యమును పొందుడి భారతవీర పుంగవుల్ ॥

—మాడభూషి వేదాన్త నరసింహాచార్యులు

# ఉప్పుసత్యాగ్రహోద్యమం-2

*వీరగంధము తెచ్చినారము*
*వీరలెవ్వరో తెల్పుడీ*
*పూసిపోవము మెడను వైతుము*
*పూలదండలు భక్తితో ॥వీరగంధము॥*
*నడుము గట్టిన తెలుగు బాలుడు*
*పారిపోవడు ఎన్నడున్*
*బాస యిచ్చిన తెలుగు బాలుడు*
*మరలి పోవడు ఎన్నడున్ ॥వీరగంధము॥*
*శాంతిపర్వము చదువవచ్చును*
*శాంతి సమరంబైన విమ్మట ॥వీరగంధము॥*

—త్రిపురనేని రామస్వామి చౌదరి

## గుంటూరు జిల్లాలో

ఉప్పు సత్యాగ్రహ సమరంలో కోస్తాజిల్లాలు, అందు గుంటూరు మండలం ప్రముఖ పాత్ర వహించింది. గుంటూరు కోనేరు గట్టువద్ద వందలాది స్వచ్ఛంద సేవకులకు కొండ వెంకటప్పయ్య వీరకంకణాలు కడుతుండగా, శారదా నికేతనం విద్యార్థినులు వారి నొసట తిలకం దిద్ది దేశభక్తి గీతాలను ఆలాపించారు ఆ దృశ్యాన్ని గాంచిన వేలాది ప్రజలు హర్షధ్వానాలు చేశారు. యడవల్లి వారి సత్రంలో ఏర్పాటు చేసిన సత్యాగ్రహ శిబిర నిర్వహణకై ప్రజలు సర్వవిధాల సహాయ పడినారు. వలంటీర్లు పుర వీధులలో పూరేగింపులు చేస్తూ, శాసన ధిక్కారానికి పూనుకున్నారు. ఉప్పుచేయ సాగారు. నలుమూలల వ్యాపిస్తున్న సత్యాగ్రహోద్యమానికి కొండ వెంకటప్పయ్య, వున్నవ లక్ష్మీనారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి, నడింపల్లి నరసింహారావు మున్నగు వారు నాయకత్వం వహించారు.

## సత్యాగ్రహ శిబిరాలు

ఒంగోలు తాలూకా కనపర్తి వద్ద, చీరాల సమీపంలోని వాడరేవు వద్ద, బాపట్ల తాలూకా గణపవరం వద్ద, రేపల్లె తాలూకా నిజాంపట్నం వద్ద సముద్ర తీరాల్లలో సత్యా

గ్రహ శిబిరాలు నెలకొల్పారు. ఈ కేంద్రాల వద్ద సముద్ర నీటిని సేకరించి, వలంటీర్లు ఉప్పుతయారు చేసేవారు. కనపర్తి సత్యాగ్రహులు, దేవరంపాడు గ్రామంలోని ప్రకాశం పంతులుగారి గృహాన్ని శిబిరంగా చేసుకొన్నారు. అక్కడి నుండి ఉప్పు తయారు చేయసాగారు. దీనిని నిరోధించేందుకు డిప్యూటీ సూపరింటెండెంటు పి. శౌరి రాజులు నాయుడు 30 మంది రిజర్వుతో సిద్ధమయినారు. అమ్మనబ్రోలువద్ద జిల్లా అధికార్లు మకాం వేశారు.

కనపర్తి సహజ కొఠార్లను పూడ్చివేసేందుకు ప్రభుత్వాధికార్లు ప్రయత్నించారు. కాని కూలీలు ఎవరూ పనికిరాలేదు. అమ్మనబ్రోలు కూలీలను రెట్టింపు కూలీ యిచ్చి తెచ్చి, భగ్నంచేయ తలపెట్టారు.

కనపర్తి శిబిర వలంటీర్లకు సహాయకులుగా వున్న చీరాల 'యుద్ధమండలి' సభ్యులను, తాటిచెట్లను నరికి వేసిన నిడుబ్రోలు వలంటీర్లను వారికి సహాయంగావుండిన గ్రామస్థులను అమ్మనబ్రోలు మకాంలో విచారించి వెంటనే జైలు శిక్షలు విధించేవారు.

వాడరేవు శిబిరంవద్ద సముద్ర నీటిని తెచ్చి, వలంటీర్లు ఉప్పు తయారు చేసేవారు. చుట్టు ప్రక్కల గ్రామాల వారుకూడా వచ్చి యథేచ్ఛగా ఉప్పుతయారు చేసుకోని వెళ్ళేవారు. 200 మంది స్త్రీలు 5 మైళ్లు నడిచివచ్చి తమకు కావలసిన ఉప్పుచేసుకొని తీసుకెళ్ళారు. అధికార్లు గ్రామస్థులను కూడా నిర్బంధించి, వారిని జైలు శిక్షలకు గురిచేశారు. తీవ్రంగా లాఠీఛార్జీ చేశారు.

ఉప్పు కొఠార్ల వద్ద తయారుచేసిన ఉప్పును మిగతా ప్రాంతాలకు పంపుతూ అమ్మకం చేసేవారు. జాతీయాభిమానంతో ఆ ఉప్పును కొనుగోలు చేసిన వారిని కూడా పోలీసులు అరెస్టు చేసి జైలు శిక్షలు విధించడం జరిగింది. చిటికెడు ఉప్పును వేల రూపాయలకు కొన్నవారు ఉన్నారు ఆ రోజుల్లో. ఆ విధంగా, ఎందరో స్వరాజ్య సమరానికి గుప్తదానం చేశారు. ఆ ద్రవ్యం సత్యాగ్రహ శిబిరాల నిర్వహణకు వినియోగించేవారు.

## దేవరంపాడు శిబిరగాథ:

1920 సహాయ నిరాకరణోద్యమ కాలంనుండి దేవరంపాడు ప్రాంత ప్రజలు దేశభక్తి ప్రపూరితులు. వున్నవ లక్ష్మీనారాయణ నేతృత్వాన, స్థానిక యువకుడు సాగి విజయరామరాజు దేవరంపాడు శిబిరబాధ్యత వహించారు. చుట్టూ గ్రామాల ప్రజలు వలంటీర్లకు సహాయసహకారాల్ని అందజేశారు.

వివిధ ప్రాంతాలనుండి జట్లు జట్లుగా వలంటీర్లు వూరేగింపు చేసుకుంటూ, మార్గ మధ్య గ్రామాలలో సభలు జరుపుతూ, శిబిరం చేరుకునేవారు. 300 మంది వలంటీర్లు ఆ శిబిరానికి చేరారు. కాంగ్రెస్ డిక్టేటర్ జనాబ్‌గౌస్‌బేగ్ సాహెబ్ అరెస్టు అయినాడు.

పోలీసులు శిబిరాన్ని వశపరచుకోగా, వలంటీర్లు సమీకృతులై మరల ఆ శిబిరాన్ని స్వాధీనం చేసుకునేవారు. ఈ విధంగా యిక్కడ మూడు సార్లు జరిగింది. సత్యాగ్రహ వ్రతనిష్ఠులైన స్త్రీలు, పురుషులు ఆ సమయంలో చూపిన త్యాగ దీక్షలు నిరుపమానమైనవి. చుట్టూ గ్రామాలలో ప్రజలను అది ఎంతగానో ప్రభావితం చేసింది.

అక్కడికి సమీపాన అమ్మనబ్రోలు గ్రామంవుంది. ఈ వూరిమీదుగానే దేవరంపాడు శిబిరానికి పోవలసివుంది. వున్నవలక్ష్మీ నారాయణ దంపతులు, యామినీపూర్ణ తిలక, వావిలాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన మూడుజట్లు అమ్మనబ్రోలు వెళ్ళాయి వలంటీర్లకు అన్నంపెట్టి ఆతిధ్యం యిచ్చారనే నేరంమోపి, డాక్టర్ కనుపర్తి నారాయణ రావు ప్రభృతులను అరెస్టుచేసి జైలుశిక్ష విధించారు. ఆరోజుల్లో కాంగ్రెస్ వలంటీర్లకు అన్నంబెట్టడమే పెద్ద రాజద్రోహనేరం.

ఈ విధంగానే, కరవడి గ్రామం మీదుగా మరికొన్ని దళాలు వెళ్ళాయి. ఒకసారి వలంటీర్ల ఆ గ్రామంలో జెండాను ఎగురవేశారు. ఎవరైనా వలంటీర్లకు అన్నం బెడితే వారిని కూడా శిక్షిస్తామని పోలీసులు బెదరించారు. గ్రామస్థులకు రోషంవచ్చింది. 'ఆతిధ్యం యివ్వడం హైందవ ధర్మం' అనుకొన్నారు. బెదరింపులకు లెక్కచేయక స్వచ్ఛంద సేవకులకు భోజనాలు పెట్టారు. ఆ నేరానికి పిశుపాటి సుబ్రహ్మణ్యం శాస్త్రి అనే సంస్కృత పండితుని పోలీసులు అరెస్టు చేశారు. పోలీసులు త్రివర్ణ పతాకాన్ని తీసివేయబోతే మహిళలు కూడా ముందుకురికివచ్చి జెండా గౌరవాన్ని కాపాడారు.

ఒక వలంటీరుకు తేలుకుడితే చివుడు శ్రీరాములు తేలుకాటుకు మందు వేశాడట. ఇదిరాజద్రోహనేరం అయింది. అందుకు, ఆయనకు ఆరుమాసాలు కఠిన శిక్ష పడింది.

ఇనమెళ్లూరు గ్రామంలో కూడా పోలీసులు కొందరిని అరెస్టు చేశారు.

దేవరంపాడు శిబిరం సాగించిన శాంతియుత పోరాటం చరిత్రాత్మకమైంది. 450 మంది కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులను ప్రభుత్వం నిర్బంధించింది. వారిలో ఆ ప్రాంతానికి చెందిన వారు 25 మంది పైగా వున్నారు. పలువురు లాఠీఛార్జీలకు గురి అయినారు. పోలీసులు ఒకసారి తుపాకులు కాల్చడానికి పూనుకొన్నా, శాంతి సైనికులు ఏ మాత్రం చెదరక తమ దేశభక్తిని చాటారు,

సైమన్ కమిషన్ రాకకు నిరసన ప్రదర్శనం

చెన్నపురి ఉప్పు-సత్యాగ్రహదళము

ఊరేగింపు-సత్యాగ్రహశిబిరమువద్ద. నాయకులు. శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు, శ్రీ గద్దె రంగయ్య.



కాకినాడ కాంగ్రెస్ మహాసభ 'ఆహ్వానసంఘం'



కాకినాడ కాంగ్రెస్ 'మహాసభ దృశ్యం'



ఆంధ్ర కాంగ్రెస్ సంఘం - కార్యవర్గ సభ్యులు
(సంజీవరెడ్డి, కోటిరెడ్డి, ప్రకాశం, గిరి, కళా వెంకటరావు, మంతెన [illegible] వెంకటరాజు, గోపాలరెడ్డి, పళ్ళంరాజు, [illegible] రామస్వామి చౌదరి మరువీళ్ళవిష్ణు ప్రభృతులు)



రాజమండ్రిలో [illegible] (1936 నవంబర్ 14)
శ్రీ దాడు రామారావు, పళ్ళంరాజు, బులుసు సాంబమూర్తి, సొవ్యాపతి సుబ్బారావు, దుర్గాబాయి గార్లు.



జవహర్ లాల్ నెహ్రూతో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ నాయకులు

డాక్టర్ లంక సుందరం M.P. వచ్చినప్పుడు, హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ నాయకులు బూర్గుల రామకృష్ణారావు, జమలాపురం కేశవరావు, టి. హయగ్రీవాచారి అహ్మా సత్యనారాయణ, రాజేశ్వరరావు, [illegible] రాజు ప్రభృతులు యిందు





ఆజాద్ హింద్ ఫౌజ్ కమాండర్లతో నేతాజీ సుభాస్ చంద్రబోస్



గాడిచెర్ల హరిసర్వోత్తమరావు



కల్లూరు సుబ్బారావు



పప్పూరి రామాచారి



ప్రభాకర్ జీ

## విజయ ధ్వజం ప్రతిష్ఠ :

సత్యాగ్రహానంతరం, దేవరంపాడు. త్యాగంతో పునీతమైన పుణ్యక్షేత్రంగా పరిగణింపబడింది. ఆంగీరస నామ సం॥ జ్యేష్ఠశుద్ధ ఏకాదశినాడు దేశభక్త కొండ వెంకటప్పయ్య త్రివర్ణపతాకాన్ని అచ్చట ఎగురవేశారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు అధ్యక్షతన గొప్ప బహిరంగసభ జరిగింది.

1935 నవంబర్ 21వ తేదీన అప్పటి అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షుడైన బాబు రాజేంద్రప్రసాద్, పూర్వపు శిబిరం వద్ద 30 అడుగుల ఎత్తో కాంక్రీట్‌తో నిర్మింపబడిన "విజయస్థంభాన్ని" ఆవిష్కరించారు వలంటీర్లు గావించిన త్యాగాలకు ప్రజలు జోహార్లు అర్పించారు.

ఆ సందర్భంలో ప్రకాశంగారు తమ భవనాన్ని, దానిచుట్టూగల 2300 గజాల స్థలాన్ని కాంగ్రెస్ సంస్థకు దానంగా యిస్తూ ఒక 'వీలునామా' రాజేంద్రబాబుకు సమర్పించారు. ధర్మ కర్తలుగా కల్లూరి చంద్రమౌళి, విజయరామరాజు, ఉప్పలూరి వేంకటకృష్ణయ్య ప్రకాశంగార్లు వున్నారు.

కాంగ్రెస్ మహోదయ సమయంలో, స్వతంత్ర పతాకను, టిప్పువీరుని శిలా విగ్రహాన్ని, విజయస్థంభాన్ని కాంగ్రెస్ అధ్యక్షునిచే ప్రతిష్ఠింపజేయడం, తమ సుకృతమని పరిసరగ్రామాల ప్రజలు, స్వచ్ఛంద సేవకులు ఎంతగానో ఆనందించారు. స్వరాజ్య జ్ఞాపక చిహ్నంగా అచటి 'విజయస్థంభం' ఆంధ్రావనికి గర్వకారణమైనది. ఆ విజయధ్వజాన్ని, శిధిలమైన పూర్వపు సత్యాగ్రహ శిబిరభవనాన్ని 'జాతీయ చిహ్నంగా' ప్రకటించి, అభివృద్ధి చేయడం అవసరమని భావిస్తున్నారు

## నల్లూరు శిబిరగాథ :

నల్లూరు సత్యాగ్రహ శిబిరం విషయంలో మహిళా వలంటీర్లు అద్వితీయ పాత్రను నిర్వహించారు. 1932 ఏప్రిల్ 3,4 తేదీలలో అరెస్టు చేయబడిన స్త్రీలుగాక 10వ తేదీన మరల 8 మంది అరెస్టు చేయబడినారు.

8వ తేదీన గడ్డిపాటి పిచ్చమ్మగారి నాయకత్వాన రెండు జట్లుగా మహిళలు రేపల్లె పురవీధులలో జాతీయ పతాకాలను చేబూని నగర సంకీర్తనం చేస్తూ, బహిష్కార కరపత్రములను పంచుతూ ఊరేగింపులు జరిపారు. వారిని పోలీసులు అరెస్టుచేసి స్థానిక

సబ్ జైలులో లాకప్‌లో నుంచి, రాత్రి ప్రొద్దు పోయిన తరువాత వదిలారు. మరుసటి దినమే 9వ తేదీ ప్రాతఃకాలముననే విడుదల కాబడిన 8 మంది స్త్రీ వాలంటీర్లు ఒకే జట్టుగా ఏర్పడి రేపల్లె సమీపంలోనున్న నల్లూరు శిబిరమునకు కాలినడకన బయలు దేరి వెళ్ళారు. ఆ గ్రామంలోని శిబిరాన్ని పోలీసులు అప్పటికే రెండుసార్లు స్వాధీనం చేసి కొన్నారు. మొదటి పర్యాయం 6 గురు స్త్రీలు, ఇద్దరు పురుషులు అరెస్టు చేయబడినారు. వారికి శిక్ష విధింపబడినది. రెండవ పర్యాయం అప్పటికే ముగ్గురు స్త్రీలు రిమాండులో ఉంచబడినారు. మూడవసారి 8 మంది జట్టు నల్లూరు శిబిరాన్ని మరల స్వాదీన పరచు కొన్నారు. ఆ సాయంత్రమే గ్రామంలోకి మహిళలు నగర సంకీర్తనం చేస్తూ ఉత్సవం బయలు దేరదీశారు. అనంతరం విదేశీ వస్త్రములను ప్రోగుచేసి వాటిని దహనం చేశారు

10వ తేదీ మధ్యాహ్నం కొల్లూరు స్పెషల్ డ్యూటీ సబ్ ఇనస్పెక్టర్ రిజర్వు పోలీసులతో నల్లూరు వెళ్ళి ఆ 8 మంది స్త్రీ వలంటీర్లను అరెస్టు చేశారు వారందరిని నడిపించుకుంటూ రేపల్లెకు తెచ్చి సబ్ జైలులో నిర్బంధించారు. 11వ తేదీ ప్రాతః కాలము డిప్యూటి సూపరింటెండెంటు, స్పెషల్ ఎస్. ఐ పోలీసులతోను తహశిల్దారు తోను కలిసి వచ్చి "1932 అత్యవసర ఆర్డినెన్సు 3వ సెక్షను ప్రకారం నల్లూరు శిబిరం స్థానిక ప్రభుత్వ స్వాధీనంలో ఉంచుకోబడినదని" గ్రామాల్లో దండోరా వేయించాడు. ఈ విధంగా 3,4 పర్యాయములు వాలంటీర్లను అరెస్టుచేసి శిబిరాన్ని పోలీసులు స్వాధీనపరుచుకోవడం, మహిళా వలంటీర్లు ఊరేగింపు చేసుకొంటూ వెళ్ళి మరల దానిని స్వాధీనపరుచుకొనడం, జరుగుతూవచ్చింది. రిజర్వుదళాలకు, పోలీసు బలానికి బెదిరి పోక గ్రామ స్త్రీ పురుషులు ఉద్యమానికి అండగావున్నారు మహిళా వలంటీర్లు అరెస్టులు, లారీచార్జీలు జరుగుతూవున్నా అసమాన ధైర్యసాహసాలను, నిరుపమాన దేశభక్తిని ప్రదర్శించారు. పాతూరి రాఘవమ్మ, మల్లిపెద్ది శేషమ్మ, కొల్లి నాగభూషణమ్మ, తుమ్మల చంద్రమ్మ, చేజండ్ల దుర్గాంబగార్లకు 17 సి. ఎల్ ఎ క్రింద ఆరునెలల చొప్పున కఠిన శిక్షలు విదించబడినవి.

## మహిళా వలంటీర్ల అరెస్టులు:

రేపల్లె తాలూకా పెదపులివర్రు గ్రామంలో జనవరి 22వ తేదీ తట్టా నరసమ్మ, దేవినేని రాజ్యలక్ష్మమ్మ గార్లు కాంగ్రెస్ కరపత్రాలను పంచుతుండగా అరెస్టుచేసి 1సం వత్సరం కఠిన శిక్ష విధించారు. బేతపూడి గ్రామంలో దేవభక్తుని రాజ్యలక్ష్మమ్మ, సుంకర లక్ష్మమ్మ గార్లను కాంగ్రెస్ ప్రచారం చేస్తున్నందుకు జనవరి 24వ తేదీన

అరెస్టు చేసి ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించారు. మార్చి [illegible] తేదీన నాదెండ్ల రంగమ్మ, కొల్లి రత్తమ్మ గార్లను అరెస్టుచేసి 17 సి.ఎల్.ఎ క్రింద ఒక సంవత్సరం శిక్ష విధించారు. రేపల్లె పట్టణంలో మార్చి 8వ తారీఖున పాటూరి రాఘవమ్మ, యనమద్ది ప్రసూనాంబ, దుర్గాంబ తుమ్మల చంద్రమ్మ గార్లు ప్రభాతభేరీలు, నగర సంకీర్తనలు జరుపుతుండగా అరెస్టు చేశారు అయ్యన్న [illegible] స్టేషనులో ఉంచి వదిలి తరువాత వదిలిపెట్టారు 12వ తేదీ "దండి యాత్రాదినం" సందర్భంలో మద్దిపట్ల శేషమ్మ, కోనేరు మంగమ్మ, నాదెండ్ల సీతారామమ్మ గార్లను, మరి ముగ్గురు మహిళా వలంటీర్లను అరెస్టు చేసి అనంతరం విడుదల చేశారు. చేబ్రోలు వాసిరెడ్డి పార్వతమ్మ, హనుమాయమ్మ, గోళ్ళపూడి రత్తమ్మ, ప్రసూనాంబ తుమ్మల చంద్రమ్మ, కోనేరు మంగమ్మ, రాజ్యలక్ష్మమ్మ గార్లను అరెస్టుచేసి ఒక్కొక్కరికి 6 నెలలు కఠిన శిక్షలు విధించారు.

భట్టిప్రోలులో రేపల్లె కాంగ్రెస్ డిక్టేటర్ యల్లాప్రగడ ఇందుమతమ్మ గారిని అరెస్టుచేసి 6నెలలు కఠిన శిక్ష విధించారు. ఏప్రిల్ 8వ తేదీన రేపల్లెలో జి పిచ్చమ్మ సజ్జారత్తమ్మ. తుమ్మల తులశమ్మ, యనమదల రత్తమ్మ గరికెపాటి రాధాకృష్ణమ్మ, యార్లగడ్డ రత్తమ్మ, కొల్లి రాఘవమ్మ, సూర్యదేవర వెంకమ్మ, వడ్లమూడి అన్నపూర్ణమ్మ సుఖవాసి అచ్చమ్మ శేషమ్మగార్లు ఇట్లు ఇట్లుగా ప్రచారం చేస్తుండగా, పోలీసులు అరెస్టుచేసి తరువాత విడుదల చేశారు.

తెనాలి తాలూకా గోవాడ గ్రామంలో చిలకమర్తి చింకమ్మ రామానుజమ్మ, పర్వతనేని కౌసల్యగార్లను అరెస్టుచేసి 117వ సెక్షను క్రింద కఠిన శిక్షలు విధించారు. చేబ్రోలు గ్రామస్థులు వాసిరెడ్డి హనుమాయమ్మ, సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మగార్లు కరపత్రములు పంచి పికెటింగులు చేస్తుండగా 143, 188, 17 సెక్షనుల క్రింద ఒక సంవత్సరం కఠిన శిక్ష రూ 200/- వంతున ఒక్కొక్కరికి జరిమానా విధించారు.

అమృతలూరుకు చెందిన మహిళా వాలంటీర్లు రేపల్లెలో మార్చి 8వ తేదీన నగర సంకీర్తనలు జరుపుతుండగా అరెస్టు చేశారు. తెనాలి కె. తాయారమ్మగారికి ఒక సంవత్సరం కఠిన శిక్ష రూ. 500/- జరిమానా, అది చెల్లించనందుచే 6 వారాలు జైలు శిక్ష విధించారు. తెనాలిలో మార్చి 12వ తేదీన వట్టికొండ హనుమాయమ్మ, అన్నపూర్ణ వాసిరెడ్డి పార్వతమ్మగార్లు "దండి యాత్రాదినం" జరుపుతుండగా 3 మార్లు అరెస్టు చేయబడ్డారు,

బాపట్ల తాలూకా మంతెన వారి పాలెం గ్రామంలోని మంతెన అచ్చాయమ్మ, దంతులూరి సుబ్బాయమ్మ, సుఖవాసి భ్రమరాంబగార్లను జనవరి 21వ తేదీన కర పత్రములను పంచుతుండగా అరెస్టుచేసి 6 నెలలు శిక్ష విధించారు.

బాపట్లలో తన్నీరు సీతారామమ్మ, బోడుపల్లి రామశేషమ్మ, తుమ్మల తులశమ్మ, వట్టికూటి రాధమ్మగార్లు ఫిబ్రవరి 22న విదేశీ వస్త్ర బహిష్కరణ చేస్తూం డగా అరెస్టు చేసారు.

రావిపాటి రాజ్యలక్ష్మమ్మ, 7 గురు స్త్రీ వాలంటీర్లు కరపత్రాలు పంచుతున్నా రని అరెస్టుచేసి మరల విడుదల చేశారు. భారతీదేవి రంగా, తుమ్మల దుర్గాంబ, పాదర్తి కనక సుందరమ్మగార్లను 17 సి. ఎల్. ఎ. సెక్షను క్రింద అరెస్టు చేసి ఒక్కొక్కరికి సంవత్సరం విక్షైదు రు 500/-జరిమానా,అదిచెల్లించకపోతె 6 నెలలు జైలుశిక్ష విధించారు.

మైనేని పాలెం వద్ద బసవ పున్నమ్మ, యల మంచిలి బసవమ్మాదేవి, సరళ కుమారి గార్లను, విదేశీ వస్త్రములను బహిష్కరించండని కరపత్రములు పంచుతుండగా అరెస్టుచేసి, 6 నెలలు కఠిన శిక్ష విధించారు.

గుంటూరు తాలూకా మంగళగిరి ముప్పనేని పుష్కరాంబ, గంధి జనార్ధనమ్మ, తెలగాగ నాగరత్నమ్మగార్లు ఫిబ్రవరి 12వ తేదీ గుంటూరులో "లా మెంబరు వెళ్ళిపో" అని నినాదాలు చేసినందుకు అరెస్టు చేశారు.

## కొన్ని ముఖ్య సంఘటనలు :

ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరిస్తూ, ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ వేదాం తం కమలాదేవి అధ్యక్షతన, గుంటూరులో జరిగింది. ఆ సందర్భంలో వీరభద్రయ్యా ద్వారం వద్ద కాపలాదారుగావున్నాడు. ఆయన పెద్ద మీసాలతో పైకి చూడడానికి చాం గంభీరమైన వ్యక్తి-కాని కుంటివాడు. రిజర్వు పోలీసులు వచ్చి వీరభద్రయ్యను లాఠీ లతో మోదటం సాగించారు. ఆయన స్పృహ తప్పి పడిపోయేంతవరకు, పోలీసులకు సందు యివ్వలేదు. ఇలాగే నాగెళ్ల వెంకటకృష్ణయ్యను లాఠీలతో బాదిగాయ పరిచారు 'వందేమాతరం-మందే రాజ్యం' అని నినాదాలు చేస్తూ ఆదేశ సేవకులు పోలీసులు కొట్టే దెబ్బలను సహనంతో భరించారు.

చివరకు రిజర్వు పోలీసులు గేటు లోపలికి వచ్చేసరికే, సభలో స్వాతంత్ర్య తీర్మానం పాసుచేసి, సభ వారంతా ఊరేగింపుగా బయలుదేరారు. ఆ రోజు గుంటూరులో 220 మందిని అరెస్టుచేసి, సబ్ జైలుకో కుక్కారు.

ఉప్పు సత్యాగ్రహ తరుణంలో తెనాలి గోసంరక్షణ సంఘం వారు గోశాలలోని ఆవుల కొమ్ములను, త్రివర్ణ పతాక మూడు రంగులతో అలంకరించారు. ఆ గోవుల మందను పట్టణ వీధులలోకి తోలారు. మనుషులతో పాటు, గోవులు కూడా త్రివర్ణ పతాకాలు ఎగిరించేసరికి, అధికార్లకు, కన్నెర్ర అయింది. ఆ గోవుల నన్నిటినీ అరెస్టు చేసి, 'బందెలు దొడ్డి'కి తోలించారు. ఈ వార్త తెల్లవారేసరికి, వార్తా పత్రికల్లో వచ్చింది గోవులను కూడా ప్రభుత్వం అరెస్టు చేసిందని ప్రజలు ఆశ్చర్యపడసాగారు. దానితో ఆ గోవులను విడుదల చేయక తప్పలేదు.

ఉద్యమ రోజుల్లో బుద్ధిరాజు రామచంద్రరావు గుంటూరు హిందూ హైస్కూలు హెడ్‌మాస్టర్‌గా వుండేవారు విద్యార్థులు ఉద్యమంలో పాల్గొన్నారనే కసితో పోలీసులు ఆ స్కూలు ఆవరణలోకి ప్రవేశించి, విద్యార్థి నాయకులను అరెస్టు చేయదలిచారు. కాని 'నేను ప్రధానోపాధ్యాయునిగా వున్నంతవరకు యిది 'నా ఎస్టేట్' నా అనుమతిలేనిదే పోలీసులు ఎవరూ యిక్కడ అడుగిడుటానికి వీలులేదు' అని వాళ్లను హెడ్‌మాస్టర్ వారించాడు. పోలీసుల కన్ను గప్పి, స్కూలు వెనుక గేట్ గుండా విద్యార్థి నాయకులను వెలుపలికి పంపించి వేశారు. తర్వాత ముందు గేట్లు తెరిపించారు. పోలీసులు లోనికి వచ్చి చూచేసరికి, కావలసిన వారెవరూ దొరకలేదు. ఆ రోజుల్లో అధ్యాపకులు కూడా ఎంత జాతీయాభిమానులుగా వుండేవారో ఈ ఉదంతంవల్ల బోధపడుతుంది.

ఉద్యమ రోజుల్లో ఎక్కడ మూడురంగులు కనుపించినా, తలపై ఖద్దరు టోపీ ధరించినా, అవి తమ అధికారాన్ని సవాలు చేస్తున్నట్లు ప్రభుత్వం భావించేది. భ్రమ పడేది. అట్టి వారిపైన నిర్బంధచర్యలు తీసుకొనేది. గుంటూరు గాంధీటోపీ ఉదంతం ఇంగ్లండులోని ప్రీవీకౌన్సిల్ దాకా వెళ్ళింది లేబర్ పార్టీ సభ్యుడైన ఫెన్నర్ బ్రాక్వే గాంధీటోపీ ధరించి, పార్లమెంటు సమావేశానికి హాజరై, పాలక పక్షానికి తగిన సమాధానం చెప్పాడు. గుంటూరు న్యాయవాదులు ఈ గాంధీటోపీ సమస్యను కోర్టుకు లాగి, విజయం సాధించగలిగారు.

కలకత్తాలో స్పెషల్ కాంగ్రెస్‌సభ సేన్‌గుప్తా అధ్యక్షతన 1933 మార్చి 31వ తేదీన జరిగింది ఆంధ్రనుంది ఆ సభకు నానా అవస్థలుపడి చేరుకున్నారు. వారి

లాల గోపాలకృష్ణయ్య, మొవ్వా ఆదినారాయణ గార్లను మార్చి 29వ తేదీన అరెస్టు చేశారు ఆచార్య ఎన్. జి. రంగా, దాసరి కోటయ్య, జి. వి. సుబ్బారావు, ఎ రామచంద్రయ్య, పల్లూరి బలరామరాజు గార్లను మార్చి 30వ తేదీన అరెస్టుచేశారు ఎస్ వి ఎల్. నరసింహారావును ఏప్రిల్ 1వ తేదీన అరెస్టుచేశారు. అవరాపురపు కృష్ణారావు, సాగి విజయరామరాజు, కాకుమాను నారాయణరావు, పోలూరి రామమూర్తి, షష్టిప్రోలు హనుమంతరావు, వీరమాచనేని వెంకటప్పయ్య గార్లను అరెస్టు చేశారు. వీరిని ఏప్రిల్ 6వ తారీఖున విడుదలచేశారు.

వ్యక్తి శాసనోల్లంఘన సందర్భంలో, ఆగస్టులో 5వ తేదీన వావిలాల గోపాలకృష్ణయ్య, గుళ్ళపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, తూనుగుంట్ల సత్యనారాయణ, మైలవరపు సుబ్రహ్మణ్యం, సుంకర బలరామమూర్తి, గోళ్ళమూడి వెంకయ్య గార్లను అరెస్టుచేసి 6 మాసాలు చొప్పున కఠినశిక్షలు విధించారు. మరికొందరు వలంటీర్లను గుంటూరు, రేపల్లె ప్రాంతాల్లో అరెస్టుచేసి, తర్వాత విడుదల చేశారు.

1930 సత్యాగ్రహంతో జిల్లాలో 1300 మంది దేశారాధకులు జైలుశిక్షల ననుభవించారు. వీరుగాక వేలాదిమంది లాఠీఛార్జీలకు, జరిమానాలకు గురి అయినారు

1932లో శిక్షలు పొందినవారు 630 మంది వున్నట్లుతేలింది.

1933 వ్యక్తి సత్యాగ్రహంలో కొలది మందే జైలుకెళ్ళారు. నల్లూరు, చేబ్రోలు, పల్లెకోన, గుంటూరు మొదలగు సత్యాగ్రహ శిబిరాలలో మహిళా వలంటీర్లు ప్రధాన పాత్ర వహించి లాఠీ దెబ్బలకు, అరెస్టులకు గురి అయినారు. ఒక్క చేబ్రోలు గ్రామం నుండే వందమంది స్త్రీ పురుషులు ఆ మహోద్యమంలో పాల్గొని చరితార్థులైనారు.

గుంటూరు పురపాలక సంఘం, ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో నాన్ కో ఆపరేషన్ నాటివలె గొప్ప ప్రముఖ పాత్ర నిర్వహించింది. ఉద్యమానికి అండగా నిలిచింది.

"Guntur Muncipality is probably The worst offender in Madras Presidency" అని జిల్లా కలెక్టర్ తన నివేదికలో పేర్కొన్నారు. మదరాసు రాష్ట్రంలోనే గుంటూరు మునిసిపాలిటి అతి దుష్టమైన నేరస్తుడన్నది ప్రభుత్వం. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, గుంటూరు మునిసిపల్ భవనానికు 'స్వతంత్ర సమరఖాంతి'

అని సముచిత నామకరణంచేసి, పురవాసులు తమ దేశభక్తిని చాటు కొన్నారు.

గుంటూరులో సనాతనస్త్రీ ధర్మమండలిని స్థాపించారు. పున్నవ లక్ష్మీబాయమ్మ, సత్యబామాయమ్మ, ఏకారత్నమాంబ మున్నగు దేశ సేవికలు స్వరాజ్యలక్ష్మి వ్రతాలు చేయించారు. శారదానికేతనం విద్యార్థినులు, అధ్యాపకులు పురవీధుల వూరేగింపులు జరిపారు జాతీయగీతాలు పాడుకుంటూ

నాగళ్ల కృష్ణయ్యచౌదరి, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి, మాడభూషి చల్లాచార్య, పుల్లయ్య, అలపర్తి సుబ్బయ్యచౌదరి, మేకా రాఘవయ్య ప్రభృతులు ప్రభుత్వ నిర్బంధాలకు గురి అయినారు.

గుంటూరులో నేతి చలపతి, అన్నాప్రగడ కామేశ్వరరావు, నడింపల్లి నరసింహారావు, గొల్లపూడి సీతారామశాస్త్రి అరెస్టు అయినారు చీరాల, తెనాలి, నరసరావుపేట, బాపట్ల మొదలగుచోట్ల నుండి వలంటీర్ల దళాలు బయలుదేరి శాసనోల్లంఘన కార్యక్రమాల్లో పాల్గొన్నవి.

తెనాలిలో పావులూరి రామారావు, షేక్ ఇస్మాయిల్ సాహెబ్, నీలం రాఘవయ్య విదేశవస్త్రాలను తగులపెట్టి అరెస్టు అయినారు. న్యాయవాదుల సంఘం, స్థానిక స్వపరిపాలనా సంస్థలు ఉద్యమానికి సానుభూతి చూపుతూ తీర్మానించినవి.

గుంటూరు మునిసిపల్ ఛైర్మన్ నడింపల్లి నరసింహారావు 'నా మునిసిపల్ హద్దులలో వున్న తాటిచెట్లను 24 గంటలలో తీసివేయాలని, లేదా తగుచర్య గైకొంటామని' ప్రభుత్వానికి ఒక నోటీస్ జారీచేశారు.

1931 మార్చి 6వ తేదీన వలంటీర్లపైన జరిగిన లాఠీఛార్జీలో నేతి వెంకటచలపతికి, మంతెన వెంకటరాజుకు పెద్ద దెబ్బలు తగిలినవి. బాపట్లలో మల్లాది యజ్ఞనారాయణ, కారంచేడులో ఎనమండ్ర వెంకటప్పయ్య, ఒంగోలులో సాగి విజయరామరాజు, నరహరి పద్మనాభం, కృష్ణస్వామి మున్నగువారిని అరెస్టు చేశారు. మద్దివెంకటరంగయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, ఖావయ్య చౌదరి, కె. సూర్యనారాయణమూర్తి ఇండ్లను పోలీసులు సోదాచేసి, వారిని అరెస్టుచేశారు.

ఒంగోలులో గుడిమెళ్ళ తిరువెంగళాచార్యులు అనే 14 ఏండ్ల కుర్రవాడు నిషేధకరపత్రాలు పంచుతున్నాడనే కోపంతో, ఆ బాలుకిని పోలీసులు తీవ్రంగా కొట్టారు. ఆ దృశ్యం జనాన్ని కదిలించింది.

వేదాంతం శంభుశాస్త్రి దళంతోపాటు దుర్భా కృష్ణమూర్తి రావులపాటి మధుసూదనరావు, భండారు వీరమల్లు ప్రసాద్ మున్నగు వలంటీర్లు నందిగామ తాలూకాలో విస్తృతంగా కాంగ్రెస్ ప్రచారం గావించారు. నందిగామ బజారులో 'రాణి స్తంభానికి' జాతీయ పతాకాన్ని కట్టినప్పుడు, దుర్భా కృష్ణమూర్తిని పోలీసులు క్రూరంగా లాఠీలతో మోదారు. జైలు శిక్ష విధించారు.

దుర్భా కృష్ణమూర్తి 1932లో సత్తెనపల్లిలో విదేశీవస్త్ర దుకాణాల వద్ద పికెటింగ్ చేసి, మరల లాఠీ ప్రహరణాలను, జైలు శిక్షలకు గురియైనారు. 1940 ఉద్యమ సందర్భంలో కూడా, రాయవెల్లూరు జైలులో డిటెన్యూగా నిర్బంధింపబడినారు.

ఈ ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని, పి. సుందరయ్య, వావిలాల, మాడభూషి వెంకటాచారి, పండితారాధ్యుల మల్లికార్జునశర్మ జొన్నలగడ్డ రామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్య, పులుపుల వెంకటశివయ్య, చదలవాడ పిచ్చయ్య, శిష్టా శివస్వామి, ఆంధ్రలో కుంభంపాటి సత్యనారాయణ, మద్దుకూరి చంద్రశేఖరరావు, తణికెళ్ళ వెంకట చలపతి, వేదాంతకవి, యడవల్లి వెంకట కృష్ణారావు, అల్లూరి సత్యనారాయణ మున్నగు యువక వీరులెందరో జైలు శిక్ష అనుభవించారు. వారునాటి స్వతంత్ర సమరంలో ప్రముఖంగా పాల్గొన్నారు.

## కృష్ణా జిల్లాలో
## బందరు సత్యాగ్రహశిబిరం :

బందరులో సత్యాగ్రహ శిబిర సన్నాహాలు జరిగాయి. చర్ఖా సంఘ ఆవరణలో శిబిరం ఏర్పాటు చేశారు. పురాణం సూరిశాస్త్రి ఆ శిబిరం ప్రక్కనే వున్న తన భవనాన్ని వలంటీర్ల బసనిమిత్తం యిచ్చారు. వర్తకులు శిబిర పోషణబాధ్యత వహించారు. ఈ శిబిరానికి 1930 ఏప్రిల్ 2వ తేదీన కాశీనాథుని నాగేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు. వలంటీర్లకు సత్యాగ్రహం, స్వరాజ్యం ఆశ్రమధర్మాలు మొదలైన సమస్యలపై నాయకులు వారంరోజులు శిక్షణ గరిపారు. శిబిరంలో చేరిన 250 మంది వలంటీర్లను 12 జట్లుగా విభజించారు వీరికి గోనుగుంట్ల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, కామినేని వెంకటప్పయ్య, వల్లభనేని రామబ్రహ్మం, కొల్లిపర సూరయ్య, కాశీనాథుని వీరమల్లయ్య, సూరపనేని గోపాలకృష్ణయ్య గార్లను దళాధిపతులుగా నియమించారు. బందరుకు 8 మైళ్ళ సమీపాన గల "చిన్నాపురం" గ్రామం సముద్రతీరం వద్ద ఉప్పు చేయడానికి కేంద్రంగా నిర్ణయించారు. ఆ శిబిర నిర్వహణకు ఆ పరిసరాల ప్రజలు సంపూర్ణ సహాయ సహకారాలు అందజేశారు.

శాంతిసైనికులు చిన్నాపురం వెళ్ళటకు తమ బస్సులను సప్లయిచేశారనే నేరం మోపి వల్లభనేని రామబ్రహ్మంగారి బస్సు లైసెన్సులను ప్రభుత్వం రద్దు చేసింది. ఆయనకు రూ. 500 జరిమానా విధించింది. బస్సు డ్రైవరు అన్నే వెంకటశివుడికి నాలుగు మాసాలు శిక్షవేసింది. చిన్నాపురం నుంచి తెచ్చిన ఉప్పును వలంటీర్లు, నాయకులు బందరు వీధులలో అమ్మకం చేశారు. ఈ రీతి ఉప్పుచట్టాన్ని ధిక్కరించి, సత్యాగ్రహ సమరం ప్రారంభమైంది.

ఈ కార్యక్రమంలో వలంటీర్లు కల్లు, సారాయి దుకాణముల వద్ద పికెటింగులు విదేశీ వస్త్ర, వస్తు దుకాణముల ముందు పికెటింగులు, తాటిచెట్లు నరికివేయడం, జాతీయ జెండా ప్రతిష్ఠాపనలు, చట్టాన్ని ధిక్కరించి ఉప్పు తయారుచేసి అమ్మడం ముఖ్యమైన కార్యక్రమాలుగా చేపట్టారు.

కృష్ణాజిల్లా వాస్తవ్యులు ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు గాంధీగారి దండియాత్రలో పాల్గొని, ఏప్రిల్ 15వ తేదీన బందరు వచ్చారు. ఆయనకు బ్రహ్మాండమైనస్వాగతం లభించింది. బందరు చౌకు సభలో ఆయన ప్రసంగించి, దండినుంచి తీసుకువచ్చిన ఉప్పు అమ్మారు.

ఏప్రిల్ 19, 20 తేదీలలో డా॥ పట్టాభిగారిని, చెరుకువాడ వెంకటనరశింహం గారిని పోలీసులు అరెస్టు చేసి, ఒక ఏడాది చొప్పున జైలు శిక్షలు విధించారు. ఈ అరెస్టులకు నిరసన తెలుపుతూ, బందరు పౌరులు హర్తాళ్ చేశారు. ప్లీడరు గుమాస్తాలు కూడా కోర్టుకు పోలేదు. ప్రజలు త్రివర్ణ పతాకాలు ఎగుర వేశారు.

వల్లభనేని రామబ్రహ్మంగారు తమ దళంతో కౌమరవోలు వెళ్ళి అక్కడ తాటి గెలలు నరికించారు. పోలీసులు రామబ్రహ్మంగారిని అరెస్టుచేసి 6 మాసాలు శిక్ష విధించారు.

## బెజవాడ శిబిరం :

ఇది యిట్లుండగా, బెజవాడలో ఆంధ్రరత్న భవనంలో మరొక సత్యాగ్రహ శిబిరం ఏర్పాటు చేయబడింది. గ్రామాల నుండి వందలాది రైతు యువకులు శిబిరానికి వచ్చి చేరారు. ఏప్రిల్ 2న అయ్యదేవర కాళేశ్వరరావుగారు శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. గంపలగూడెం రాజా కోటగిరి వెంకటకృష్ణారావుగారి నాయకత్వాన పేట బాపయ్యగారు, అన్నె అంజయ్యగారు మున్నగు 120 మందితో కూడిన సత్యాగ్రహుల మొదటి దళం పాదయాత్రగా బందరు బయలుదేరి వెళ్ళింది. డా॥ వెలిదండ్ల హనుమంతరావు నాయకత్వాన 2వ దళం వెళ్ళింది. కాట్రగడ్డ నారాయణరావు దళాధి పతిగా, పోతన గణపతిరావు, మొదలగు వారు వందమంది కాలినడకన వెళ్ళారు. ఏప్రిల్ 19న అప్పట్లో బెజవాడ మునిసిపల్ చైర్మన్‌గా వున్న అయ్యదేవర కాళేశ్వర రావుగారి నాయకత్వాన 80 మంది శాంతి సైనికులు ప్రత్యేక రైలు బోగీల్లో బందరు వెళ్ళారు. మేళతాళాలతో జాతీయగీతాలు ఆలాపిస్తూ వందలాది వలంటీర్ల దళాలు రాక ప్రజల్లో మహోత్సాహాన్ని రేకెత్తించింది.

## గుడివాడలో పోలీసు కాల్పులు :

అప్పట్లో జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా కాపూరి చిన వెంకటదాసయ్య గారు వుండేవారు. 1930 జూన్‌లో దాసయ్యగారి అధిపత్యాన గుడివాడలో బహిరంగ సభను కెట్టిపల్లి వెంకటరత్నం ప్రభృతులు ఏర్పాటు చేశారు. ఈ సభను జరుపరాదని అధికార్లు 144 సెక్షన్ జారీ చేశారు. ప్రభుత్వ నిషేధాజ్ఞను ధిక్కరించి, చుట్టు ప్రక్క గ్రామాల నుండి కూడా ప్రజలు తండోప తండాలుగా రాసాగారు. ఎవరో పోలీసులపైన రాళ్ళు రువ్వారనే నెపంతో, సభ వారిపైన పోలీసులు కాల్పులు సాగిం

చారు. ప్రజలను చెల్లా చెదురు చేశారు. ఈ కాల్పుల్లో దొంతపాడు గ్రామానికి చెందిన దాసరి వెంకటాచలపతిరావుగారికి తొడతో గుండు దెబ్బ తగిలింది. మరి కొందరికి గాయాలు అయినవి. కాసరి వెంకటదాసయ్యగారి నెత్తిపైన దావూద్ ఖాన్ అను పోలీసు అధికారి ఒక కుర్చీని పెట్టి, మోయమని అవమానపరచాడు. ఈ సభా సందర్భంగా పలువురిని అరెస్టుచేసి జైలు శిక్షలు విధించారు

## బెజవాడ శిబిరంపై పోలీసు దాడులు :

1930 జూన్ 21వ తేదీన, సత్యాగ్రహ శిబిరం నిర్వహింపబడుతున్న "ఆంధ్రరత్న భవనాన్ని" ప్రభుత్వం స్వాధీన పరచుకొంది. సత్యాగ్రహులను కొట్టి బయటకు వెళ్ళ గొట్టింది కాంగ్రెస్ సంఘాలను అక్రమ సంఘాలుగా ప్రకటించింది. సభలు సమావేశాలు జరుపరాదని 144వ సెక్షను జారీ చేశారు.

1929లో ఆంధ్ర కాంగ్రెస్ కార్యాలయం కోసం బెజవాడ గవర్నరు పేటలో ఒక భవనాన్ని కొనుగోలు చేశారు. అప్పటి వరకు ఈ ఆఫీస్ కాశీనాధుని నాగేశ్వరరావు గారి దుర్గావిలాస్ (హనుమాన్ పేటలో వుండేది. నూతన భవనం ఏర్పడిన తర్వాత "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య పేరిట, ఆ భవనానికి నామకరణం చేశారు. నాటి నుండి అది ఆంధ్రా కాంగ్రెస్ కార్యస్థానంగా వుంది. 1922 జులై 31వ తేదీన హరిబాబు నాయకత్వాన "ఆంధ్రరత్న" భవనాన్ని స్వాధీనం చేసుకోడానికి 60 మంది శాంతి సైనికులు ప్రయత్నించారు. పోలీసులు వారిపై లాఠీచార్జిచేసి 17 మంది వలంటీర్లను అరెస్టుచేసి జైలుకు పంపించారు మిగతావారిని తరిమి కొట్టారు. మరల అగస్టు 28న ఆరుగురు స్వచ్ఛంద సేవకులు తిరిగి ఆ భవనాన్ని స్వాధీనం చేసుకోగా, పోలీసులు వారిని కొట్టి హింసించి నిర్బంధించారు.

మూడవ పర్యాయం సెప్టెంబర్ 6వ తేదీన శాంతి సైనికులు బయలుదేరి ఆ కార్యాలయ స్వాధీనానికి ప్రయత్నించారు. ఇండియా లీగ్ ప్రతినిధి వర్గం వారు ఆ రోజు బెజవాడ సందర్శించినందున, పోలీసులు ఆ రోజు వలంటీర్లను నిర్బంధంలోకి మాత్రం తీసుకొని, తర్వాత వదిలి పెట్టారు. నవంబరు 14వ తేదీన మరల 8 మంది శాంతి సైనికులు 4వ సారి భవన స్వాధీనానికి వెళ్ళగా పోలీసులు తీవ్రంగా లాఠీచార్జీ చేశారు. ఈ విధంగా పి. సి. సి. కార్యాలయ స్వాధీనానికి జరిగిన శాంతియుత పోరాటం గొప్ప చరిత్రను సృష్టించింది.

## కాంగ్రెస్ వలంటీర్ల దీక్ష:

బెజవాడలో "ఆంధ్రరత్న భవనాన్ని" స్వాధీనం చేసుకునేందుకు వెళ్ళిన వలంటీర్లను పోలీసులు లోనికి రానివ్వలేదు. వారి వద్దనున్న జెండాలను, గాంధీటోపీలను లాక్కొన్నారు.

ఒకసారి దాని వెడలిన 8వ డిక్టేటర్ చాపరాల వెంకటనారాయణ, ఎం. వెంకటకృష్ణయ్య, ఎం. కోటయ్య, కె నరసయ్య పి. బాపులు (మునుసూరు) కె. శ్రీరాములు (కొమ్మమూరు)ను అరెస్టుచేసి బెజవాడ సబ్ మెజిస్ట్రేటు వద్ద హాజరు పరిచారు అయన కేసువిచారించి, ఒక్కొక్కరికి నాలుగు మాసాలు కఠిన శిక్ష, రూ 25 జరిమానా విధించారు.

8వ సారి దాటి వెడలిన 9 మంది వలంటీరులలో 7 గురిని విడుదలచేసి జి డి. రాములు, సుందర కృష్ణమూర్తి గారలను సబ్ జైలులో నిర్బంధించారు.

దాటి వెడలిన 8 మంది వలంటీరుల కేసును విచారించి క్రిమినల్‌లా చట్టం క్రింద 5 మాసాల కఠిన శిక్షను రూ 50 జరిమానా విధిస్తూ తీర్పు చెప్పారు. జరిమానా చెల్లించనట్లయితే, ఒక నెల అదనపు శిక్ష విధించారు భారత శిక్షాస్మృతి 447 సెక్షను క్రింద ఒక్కొక్కరికి రెండు మాసాల కఠిన శిక్ష రూ. 25లు జరిమానా చొప్పున విధించారు. జరిమానా చెల్లించనట్లయిన, 15 రోజులు అదనపు శిక్ష వేశారు. ఈ శిక్షలు ఒకదాని తర్వాత ఒకటి అనుభవించాలని తీర్పులో పేర్కొన్నారు. సెప్టెంబరు 5వ తేదీ నుంచి డిశంబరు 3వ తేదీ వరకు వలంటీర్లు 'ఆంధ్రరత్న భవనాన్ని' వశపరుచుకోవే యత్నంలో పోలీసుల లాఠీ చార్జీలను ఎదుర్కొన్నారు. జైలు శిక్షలు అనుభవించారు.

## వీరవనితల త్యాగాలు :

ఈసారి మహిళామణులు కూడా సత్యాగ్రహోద్యమాన్ని సాగించే కార్యభారాన్ని వహించారు. అలా ముందుకు వచ్చి ధైర్యసాహసాలతో పోరాడిన సూర్పుకృష్ణా మహిళా సత్యాగ్రహులలో వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, తులసమ్మ, కౌసల్యమ్మ, దిగుమర్తి జానకమ్మ, రంగిరాల సీతారామమ్మ ,గోనుగుంట లక్ష్మీనరసమ్మ మున్నగు వారంతా పేర్కొనదగినవారు.

కొమరవోలు ఆశ్రమం వద్ద జెండా ప్రతిష్ఠను కాపాడడానికి మహిళలు జరిపిన త్యాగదీక్షలు నిరుపమానమైనవి. కొమరవోలు ఆశ్రమాన్ని, భట్లపెనుమర్రు

గ్రంథాలయాన్ని తిరిగి స్వాధీనం చేసుకోగలిగారు. మహిళావలంటీర్లకు భోజనం పెట్టారనే నేరం మోపి, సూరపనేని గోపాలకృష్ణయ్య గారికి వెయ్యిరూపాయలు జరిమానా విధించారు. వలంటీర్లకు అన్నం పెట్టడమే ఆనాడు మహానేరమయినది. డోకిపర్రు వాస్తవ్యులైన పాములెట్టి వెంకటసుబ్బారెడ్డికి ఎనిమిది వందల జరిమానా విధించి, ఆ జరిమానా సొమ్మును వసూలు చేయడానికై ఆయనింటికి వచ్చిన బంధువుల నగలను కూడా పోలీసులు జప్తు చేసుకొని పోవడం జరిగింది.

స్త్రీలను అరెస్టు చేయకుండా, వారిపై కారపునీళ్ళు మురికినీళ్ళు చల్లించేవారు. వారిని నానా దుర్భాషలాడేవారు. లారీలపైన ఎక్కించుకొని పోయి దూరప్రాంతాలలో నిర్జనప్రదేశాలలో ఒంటరిగా వదలివేసేవారు వారు కాలినడకన నానా అవస్థలుపడి తిరిగి పల్లెకు చేరుకొనేవారు. ప్రభుత్వం రోజుకూలీలను నియమించి వారి చేత మహిళా వలంటీర్లను నానాబాధలు పెట్టించేవారు స్త్రీల మనో నిబ్బరాన్ని పోగొట్టడానికి చేసిన కుయుక్తులు ఇవి కాని మహిళా వలంటీర్ల అచంచల దీక్షముందు ప్రభుత్వ ఆటలేమి సాగలేదు. ఇక జైళ్ళకు పంపడం ప్రారంభించారు. చాలమందిని అరెస్టుచేసి జైలుఖానాలలో నిర్బంధించారు. వందలమంది పోలీసుల లాఠీ ప్రహారలకు, చెప్పరాని బాధలకు గురి అయినారు.

ఇక పశ్చిమకృష్ణాలో, సత్యాగ్రహులకు ఫలహారమిచ్చిన నేరానికి కాట్రగడ్డ రామసీతమ్మ గారికి ఒక ఏడాది కఠినశిక్ష 400 రూపాయలు జరిమానా విధించడం జరిగింది. జరిమానా డబ్బు వసూలుకు మధుసూదనరావుగారి సతీమణి ఒంటిమీద నగలు లాక్కొని పోయారు. వారింటిలోని ధాన్యాన్ని, సామాగ్రిని బండ్లమీద తెచ్చి బెజవాడలో అమ్మించారు. కాట్రగడ్డ మధుసూదనరావు గారి గృహాన్ని "నోటిఫై" చేసి పోలీసులు రెండేండ్లు దానిని ప్రభుత్వస్వాధీనంలో వుంచుకొన్నారు.

గరికపర్రు, కుమ్రమూరు, పుదుచారు, మైనుకొల్లు గురజాడ కపిలేశ్వరపురం, పులిగడ్డ, యాకమూరు, చెంట్రపోలు, ఉయ్యూరు, నెప్పల్లి గ్రామాలకు చెందిన 26 మంది మహిళామణులు ముందుకు వచ్చి ఈ ఉద్యమంలో పాల్గొన్నారు బెజవాడ నుంచి చిట్టిగారి భార్య క్రమరాంబ, పామర్తి సుందరమ్మ గార్లు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 17 మంది జైలుశిక్షలకు గురి అయినారు ఈ మహిళామణుల త్యాగం, దేశభక్తి ఎల్లరకూ మార్గదర్శకమైనది పురుషులకు కూడా ప్రోత్సాహ మిచ్చింది.

గరికపర్రులో పికెటింగుచేసిన రామినేని రాజమ్మ, మైనేని శ్రీరామమ్మ, గాది సుబ్బమ్మ, చెరుకూరి వియ్యమ్మ మున్నగువారు జైలుశిక్షలు అనుభవించారు. బెధ

కూరు వియ్యమ్మ, సూరపనేని అన్నపూర్ణమ్మ పెనిగెంట్ల లక్ష్మీకాంతమ్మ, కొల్లిపర లక్ష్మీ కాంతం పికెటింగ్ చేయడానికి పూనుకోగా, పోలీసులు వారిని ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి తరుముతూ వెంటాడారు. వీరు ఆ విధంగా 50 గ్రామాలలో ప్రచారం చేస్తూ గ్రామీణ మహిళల్లో నూతనోత్సాహాన్ని, చైతన్యాన్ని ప్రజ్వరిల్ల చేశారు.

1931 గాంధీ-ఇర్విన్ ఒడంబడిక తర్వాతకూడా గుడివాడ సత్యాగ్రహులపై బనాయించిన కేసులను ప్రభుత్వం ఉపసంహరించుకోలేదు. సూరంపూడి శ్రీహరిరావు మున్నగువారి నెందరినో నిర్బంధం నుంచి విడుదల చేయలేదు. నిజాం సరిహద్దులలోకి పింగళిలక్ష్మీనారాయణరావు గారిని వారిని వెలుపలకు వెళ్ళగొట్టారు భూమిశిస్తు పెంపు దలను తగ్గించలేదు.

వలంటీర్ల శిబిరాలపై పోలీసులు దాడులు ఎక్కువ చేశారు. బందిఖానాలు చాలక సత్యాగ్రహులను కొట్టి, దూరాన వదలివేశారు. రాత్రింబవళ్లు అనుమానాస్పదుల ఇళ్ళన్ని సోదాలు చేశారు గాంధీజీ మొదలగు జాతీయనాయకుల చిత్రపటాలను చించి వేశారు. జెండాలను తగులబెట్టారు ఖద్దరు భండారాలపైన, గ్రంధాలయాలపైన దాడులు చేసి పుస్తకాలను, వస్త్రాలను చిందరవందర చేశారు

రాట్నాలను విరగగొట్టించారు. వలంటీర్లు నెత్తిపై పెట్టుకున్న గాంధీ టోపీలను తీసివేయించారు వలంటీర్లు ఈ దుష్కృత్యాలనన్నింటిని ఎదిరించి, లాఠీల పోటులకు స్పృహతప్పి పడిపోయే పర్యంతం జాతీయగీతాలను ఆలాపిస్తుండేవారు.

## అంగలూరు వీరోచితపాత్ర :

ఆరెకపూడి నాగభూషణం గారిని 1930 ఉప్పు సత్యాగ్రహకాలంలో అరెస్టు చేసి, 9 మాసాలు శిక్ష విధించారు. 1931లో విడుదలై, సాధు సుబ్రహ్మణ్యం గారి ఆశ్రమానికి వెళ్ళారు ఆశ్రమవాసులంతా అరెస్టు అయేంతవరకు ఆయనను అజ్ఞాత వాసంలో వుండమని ఆదేశించారు.

వీరి సోదరి తిపిరినేని కౌసల్య, భార్య ఉషామణి జెండాలతో చుట్టుప్రక్కల గ్రామాల్లో ప్రచారం చేశారు. వల్లభనేని రామబ్రహ్మంగారి భార్య సీతామహాలక్ష్మమ్మ, గోనుగుంట్ల సుబ్రహ్మణ్యంగారి భార్య లక్ష్మీనరసమ్మ వీరు సల్గురు గుడివాడలో విదేశీ వస్త్రదుకాణముల వద్ద పికెటింగు చేశారు. పోలీసులు వచ్చి ఈ సత్యాగ్రహులపైన పిచి కారులతో కారపునీళ్లు మురికినీరు, రంగునీరు ముఖాలమీద కొట్టారు. 10 మైళ్ళ దూరం

తీసుకొనిపోయి ఒక్కొక్కరిని ఒంటరిగా పడవేసి పెట్టి హింసించారు. వీరు మరల శిబి రం చేయడం కొనసాగించారు. కొంతసేపు చక్కగా జాతీయ గీతాలు ఆలాపించేవారు. ఒకరోజు ఆమెకు జ్వరంరాగా, 11 ఏండ్ల సుగుణమణి పాటలు పాడేందుకు వెళ్ళి 5వ సత్యాగ్రహి అయింది. నాగభూషణంగారి తల్లి మాణిక్యమ్మ 6 వ సత్యాగ్రహిగా వచ్చారు ఇదిచూసి మహాలక్ష్మమ్మగారు వీరిలో కలిసారు. సాధు సుబ్రహ్మణ్యం గారి మేనకోడలు సుగుణమణి వచ్చారు. తర్వాత కోనేరు వీరరాఘవయ్య దంపతులు. గంటా వీరరాఘవయ్య దంపతులు వచ్చారు. ఇదొక పెద్ద సత్యాగ్రహ శిబిరంగా మారింది.

వీరు జట్లు జట్లుగా ప్రతిరోజు గుడివాడ వెళ్ళి నగర సంకీర్తనలు చేశారు. ఒక రోజున పోలీసులు వచ్చి అంగలూరు శిబిరంపై హింసాకాండ సాగించారు. వీరరాఘవయ్య, రఘురామయ్య, మాగంటి వెంకటకృష్ణయ్య గార్లను తీవ్రంగా లాఠీచార్జీచేసి, వారిని వెలుపలకు నెట్టగొట్టి, ఇంటికి తాళంవేశారు. అంతట గట్టుపైనే వారు వంట చేసుకోవలసి వచ్చింది.

2 నెలల 15 రోజుల తర్వాత శిబిరవాసులునందరిని అరెస్టుచేసి ఒక సంవత్సరం చొప్పున శిక్ష విధించి జైళ్లకు పంపారు సుగుణమణికి రెండేళ్లు శిక్ష వేశారు కాని, ఒక ఏడాది తర్వాత ఆమెను విడుదల చేశారు.

## కుటుంబాలతోసహా జైలు యాత్రలు :

స్వరాజ్య ఉద్యమాల్లో పాల్గొని భార్యాబిడ్డలతో, సోదర సోదరీమణులతో కలిసి జైలు శిక్షలను అనుభవించిన త్యాగశీలురు జిల్లాలో అనేక మంది వున్నారు జమీగొల్వేపల్లి వల్లభనేని రామబ్రహ్మం సీతామహాలక్ష్మమ్మ గార్లు, అంగలూరు పుగ్గిరాల బలరామకృష్ణయ్య వీరి సతీమణి కమలగార్లు; బందరు తంగిరాల రాఘవరావు వీరి సహధర్మచారిణి సీతారామమ్మ గార్లు యిలా దంపతి సహితంగా శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించారు.

మొగల్రాజపురం కాట్రగడ్డ మధుసూధనరావు, వీరితల్లి సీతారామమ్మ గారు బెజవాడ మరుపిళ్లచిట్టి, వీరి భార్య భ్రమరాంబగారు, చిట్టిగారి సోదరుడు, మరుపిళ్ల రామస్వామిగారు జైలు శిక్షలకు గురియైనారు.

కొమరవోలు గాంధీ ఆశ్రమ స్థాపకులు ఎర్నేని సాధుసుబ్రహ్మణ్యం, వీరి సోదరుడు సూర్యనారాయణగారు, కుటుంబం వారు అమృతమ్మ, లీలావతమ్మ,

కస్తూరిదేవి, రాధామనోహరంగార్లు; ముదునూరు గోపరాజు రామచంద్రరావు (గోరా) వారి సతీమణి, సరస్వతమ్మ గారు కుటుంబంతో సహా తర్వాత ఆగస్టు ఉద్యమంలో జైలు యాత్రలు చేశారు.

ఈడుగపల్లు సుంకర సత్యనారాయణ, వీరి సోదరులు వీరభద్రరావు మున్నగు వారు; కవుతరం కానూరి రామానందచౌదరి సోదరులు జైలు శిక్షలనుభవించారు. మరెందరో పేరు లేకుండా పరోక్షంగా స్వరాజ్య సమరానికి ఎంతో సహాయ సహకారాలు అందించిన వారున్నారు. ఆ నిష్కామ కర్మయోగులందరికి దేశం ఋణపడి వుంది.

*నమో భరత మాతా!*
*నమో భరత మాతా, సుజాతా,*
*నమో జగన్మాతా*
*అమోఘ దివ్య జ్ఞానసమేతా, అఖండ*
*వర భరత ఖండ మాతా!*
*గోలకొండ నీ రత్నకోశము,*
*కోహినూరు నీ జడలో పువ్వాకు*
*తాజమహలు నీ దివ్య భవనము ॥నమో॥*

— వడ్డాది సీతారామాంజనేయులు

# బందరు జెండా సత్యాగ్రహ యుద్ధం

ఉప్పు సత్యాగ్రహోద్యమ సందర్భంలో బందరులో జరిగిన జెండా సత్యాగ్రహయుద్ధం గమనార్హమైంది. తోట నరసయ్యనాయుడు 'జెండా వీరుడు'గా ప్రసిద్ధికెక్కారు. మట్నూరి కృష్ణారావుగారి లేఖిని నుండి వెలువడి, 'కృష్ణాపత్రిక'లో ప్రచురించబడిన ఆనాటి దృశ్యం యిందుకు కళ్లకు కట్టినట్లు వర్ణించడం జరిగింది.

బందరు కుండు వద్ద జెండా పోరాటం చరిత్రాత్మకమైనది. తాడికొండ వీరభద్రయ్య అయ్యవారిని (జెండా అయ్యవారు) చేతులు కాళ్లు పట్టుకొని 'ఆ కుక్కను ఈడ్చివేయరా' యని కేకలు వేయుచు రోడ్డుపై పది గజముల దూరము రెండుమారులు యీడ్చిరి. ఆళ్వారుగారిని నిచ్చెన మీదనుండి గుంజి నీళ్లలో బడవేసి ప్రక్కటెముకలపై లాఠీలతో క్రుమ్మిరి. ఈడుపుగొల్లు సుబ్బారావు గారి వ్రేళ్ళ పైనను ముంజేతుల పైనను గొట్టి ఎముకలను గాయపరిచిరి. చెరువు సుబ్బారావుగారి కట్టుబట్టను చింపివైచి దిగంబరుని జేసిరి వీరందరు అంతబలాఢ్యులు గాక పోవుటచే పోలీసువారికి గొంత శ్రమతో వశులు కాగలిగిరి. గాని తోట నర్సయ్య నాయుడు పేరొందిన వస్తాదగుటచే ఎక్కువ నిరోధము గావించి, ఎక్కువ దెబ్బలకు లోనగుట తటస్థించినది.

నరసయ్యగారు ఇనుపనిచ్చెన ఎక్కడం ప్రారంభించిన తోడనే సుమారు 15 మంది కానిస్టేబిల్సు ఒక్క పెట్టున వానిపై క్రుమ్మరిల్లిరి. కాని వీరినందరిని నిరోధించి ఆయన పైకెక్కసాగెను. చొక్కాను చింపి వేసిరి. ఇక చిత్రవధ ప్రారంభ మయ్యెను. ఆ కొట్టిన దెబ్బలకు లెక్కలేదు. మెడపై బూట్సు కాళ్ళతో తన్నిరి. కాళ్ళపై లాఠీలతో కొట్టిరి. చేతులు విరిచిరి. కాని నరసయ్య నాయుడు నిచ్చెన విడువలేదు. తన మెడను ఇనుప కడ్డీపై ఆన్చి అట్లే నిలబడెను. మెడపై కాళ్ళతో తన్నుచున్నను మెడనుఅట్లే యుంచెనుగాని వదలలేదు. "మహాత్మా నీవేగతి"యను స్మరణ తప్ప మరొక మాట లేక రణరంగమున నిలబడియుండెను. పోలీసువారు తన్నిన తన్నులకు ఇనుపకడ్డీ వంగెనుకాని మెడను వంచలేదు. వానిని 15 పోలీసు దూతలు పైబడి లాఠీలతో చెండాడుచున్నపుడా యశేషజనము హాహా కారములు జరుపుచు కన్నీరు గార్చుచు పోలీసు దౌర్జన్యమునకు కోపావేశులగు చుండిరి ఆ ప్రళయకోపాలనము మిన్ను ముట్టుచుండెను "మహాత్మానీవేదిక్కు" అని నరసయ్య ధీరుని నోటినుండి వెలువడుచుండిన ఆక్రందన స్వరములకు దుఃఖ పడనివారు ఎవ్వరు? ఆ స్వరములే శాంతికవచముగ జనుల నెల్లరిని కాపాడుచుండెను.

అపూర్వమైన దృశ్యము! ఆనాటి జలియనువాలాబాగు కథ జ్ఞప్తికి వచ్చెను. నరసయ్యనాయుని శిష్యులయిన తాలింఖానాలవారు 500 మంది వస్తాదులు నరసయ్య నాయుని రక్షించుటకు ముందుకు దుమకబోయిరి.

కాని వలంటీర్లు వారిని వారించి శాంతి భద్రతలు కాపాడుచుండిరి. పోలీసువారు చుట్టూనున్న వలంటీర్లను కూడా విడువలేదు. వైద్య సహాయమునకు వచ్చిన డాక్టరు చలపతిరావు గారిని గూడ బడద్రోసిరి. దౌర్జన్యమును పురిగొల్పుటకు పోలీసువారెంత ప్రయత్నించినను యాఅశేషజనము శాంతిని వీడక నరసయ్య నాయనిపై పడుచున్న ప్రహరణ పరంపరలను అలకించుచూ దైవము లేడాయని విలపించుచుండిరి. నరసయ్య నాయుడు స్పృహతప్పి పడిపోయెను.

'ఆగొడ్డునీడ్చివేయనుని' పోలీసు సబ్ఇన్స్పెక్టరు అరిచెను.నిలువబడిన సార్జంటులు **'Pull him down Pull him down'** అని కేకలు వేసెను. స్పృహ తప్పి పడి పోయిన వానిని గూడా తన్ని లాగివేయగల సాహసులా పోలీసు భటులు.

ఇంతలో వలంటీర్లు నరసయ్య నాయని మోసుకొని పోవుటకు మంచము దెచ్చిరి అదికూడ పోలీసు వారికి సమ్మతముగాలేదు. మంచము దెచ్చిన వాలంటీర్లను సహి తము పడద్రోసిరి. క్రిందపడిన వలంటీర్లు తిరిగిలేచి మంచమునెత్తి నరసయ్య నాయని దానిపైబెట్టి మోసుకొని వచ్చుచుండిరి. కాని నరసయ్య కొంత స్పృహవచ్చి కాబోలు ఆ మంచము నుండి క్రిందికి దుమికి తిరిగి జెండావైపునకు పరుగెత్త సాగెను. కాని వలంటీర్లు అందుకు ఒప్పుకోనలేదు. ఈ అభినవ ప్రహ్లాదుని ప్రాణము ఊరకపోవుట కెవ్వరు సహించగలరు? వాలంటీర్లు అందరు నొకగొలుసుగ చుట్టునుజేరి వానినిబంధించి శిబిరమునకు తీసుకొని పోయిరి. ఈ సంగతులేమియు ఒక గంటవరకు వానికి తెలియనే తెలియదు. ఒక ఘడియ వరకు వాని ప్రాణము గ్రుక్కపట్టి పోయినది. మరికొన్ని నిమిషములు పోలీసు వారింకను లాడన మొనర్చిన ఎడల నరసయ్య నాయుడు మంగళ వారము మధ్యాహ్నము 12 గంటలకే వీరస్వర్గము చూరగొనెడివాడు.

ఈ పోలీసు దౌర్జన్యమునకు బందరు పౌరులు యిసుమంత యైనను భీతిల్లక పోవుటయేగాక ఉద్యమము పట్ల ద్విగుణోత్సాహులైరని నాటిరాత్రి సభలు చెప్పకయే చెప్పుచుండెను. నాటిరాత్రి చౌకునకు వేనకువేలు వచ్చుటచే రెండు సభలేర్పాటు చేయ వలసి వచ్చినది. ప్రజలలో రగుల్కొనిన క్రోధానలమును సక్రమ మార్గమున త్రిప్పి సంతృప్తి పరచని ఎడల భావి పరిణామము బహు దుఃఖకరమయ్యెడిదనుటకు సంది యములేదు. నాటి సభలను పోలీసువారు నిషేధించి తుపాకులు పేల్చవచ్చునను అను

మానవుండియు, ప్రాణములు సహితము గోల్పోవుటకు సంసిద్ధులై నలుగురితో చావు పెండ్లియను సామ్యమున స్త్రీలను పిల్లలను గూడ దీసుకొని సభనలంకరించిరి.

డాక్టరు కోకా అహోబలరావు, రావుసాహెబ్ శెకించి హనుమంతరావు పంతులు, పురాణం కృష్ణమూర్తి మున్నగు పెద్దలు సభకు విచ్చేసి పట్టమికనెట్టి పోలీసుల క్రౌర్యమును సహింపరాదని వెల్లడిచేసిరి. పూర్వకృష్ణా జిల్లాలో షుమారు 200 గ్రామ చావడులపై స్వరాజ్యధ్వజము నిరాటంకంగా ఎగురుచుండ, బందరులో పోలీసువారు జెండాలపై దాడి వెడలి వాలంటీర్లను హింసించుటకు గారణమేమి? యని ప్రశ్నించిరి. ఈ పోలీసు దురాగతములకు పైయధికారులు యామోదమున్నదో లేదో ఎవరికిని తెలియదు. దానికి సంజాయిషి ఇచ్చువారు ఎవరూలేరు.

ప్రజలు సహజముగా నీ సంకట సమయమున మునిసిపాలిటీ వారి సహాయమును అర్థించుట న్యాయము, సహేతుకము రెండు సభలలోను అట్టి తీర్మానము చేయబడెను. మునిసిపలు భవనముపై జెండా ఎగురువరకు తమకొట్లు తెరవమని వర్తకులు శపధము పూనిరి. డ్రైవర్లు బస్సులు తోలమనిరి. ఖాయిదా వర్తకులు మచ్చల చావడిని మూసి వేయుటకు నిశ్చయించుకొనిరి. అట్టి ధృఢ నిశ్చయంతో నాటిసభలు ముగిసెను.

తెల్లవారెను. తెల్లసార్జెంటులు రిజర్వుపోలీసులను వెంటబెట్టుకొని లారీలను చేబూని వీధులవెంట కవాతుచేయసాగిరి. రాబర్టుసన్ పేట, ఇనుగుదూరు స్టేషనులలో పోలీసువారు తుపాకులను పుచ్చుకొని రణరంగమునకు బోవుచున్నటుల నిలబడి యుండిరి.

ఉదయము 8గంటలయినది. ఒక కొట్టును కూడా తెరవలేదు. బజారులోని 400 కొట్లు మూయబడి వున్నవి. నాటి ఉదయము ఏమి జరుగునోయని వేలకువేలు జనము చౌకునకు వచ్చుచుండిరి. ఖాయిదావర్తకులును, తదితర వర్తకులును మచ్చల సావడి మూసివైచి పెద్ద ఊరేగింపుతో మునిసిపలు ఆఫీసుకు బయలు దేరిరి. వారి వెంబడి షుమారు 1500 మంది జనము నడుచుచుండిరి. అంతతీర్ఘ ప్రజ ఈ పట్టణము లో ఎప్పుడును ఊరేగింపుకు బయలుదేరియుండలేదు. శాంతి శిబిరము నుండి వలంటీర్ల దళములు వేరొక మార్గము నుండి బయలుదేరి మునిసిపలు కౌన్సిలర్లను వారి ఇండ్ల యొద్ద దర్శించుచూ ఊరేగిరి. నాటిఉదయము, మునిసిపలు చైర్మను జగన్నాధరావు నాయుడుగారు లేరు. షుమారు 10 గంటలకు వారు లోనికేతెంచిరి-వాలంటీర్లు వారి మేడ యొద్దకు పోయి మునిసిపలు భవనముపై జెండానుకట్టిన గాని పోలీసు దౌర్జన్యము

నకు దహించుకొనిపోయివున్న ప్రజల మానసములు చల్లబడినవని చైర్మను గారికి తెలియ జెప్పిరి. జగన్నాధరావునాయుడు గారు స్వభావ సిద్ధముగా ఉదారహృదయులు. వారు గత దినము జరిగిన దురంతములను తెలుసుకొని అశ్రువులు రాల్చిరి. ఆపద్బాంధవులై యిదుగో యిప్పుడే స్వరాజ్య ధ్వజారోహణము చేయబోవుచున్నానని అభయహస్తమిచ్చు వరకు ప్రజలు పరితప్తమానసములకు గల్గిన యాహ్లాదము చెప్పనలవిగాదు. అంతట శిబిరము నుండి ప్రత్యేకముగా ఒక జెండా మేళతాళములతో బయలుదేర దీయబడెను. జగన్నాధరావునాయుడు గారు ఖద్దరుదారులై ఆ ఊరేగింపుతో మునిసిపలు భవనము ప్రవేశించిరి.

మునిసిపలు భవనము పురలక్ష్మి యొక్క దేవాలయము. చైర్మను అట నిజమైన పురోహితుడు. వారు స్వహస్తములతో పురలక్ష్మి మందారంపై స్వరాజ్యధ్వజారోహణము గావించిన పిమ్మట నిక కావలసిన దేమున్నది? పోలీసువారే గతదినము ఆ దురాగత ములను కావించని ఎడల బందరు పట్టణమున కిట్టి గౌరవము కలిగి యుండెడిదిగాదు. పోలీసువారి కృపారసమున నేటికి బందరు మునిసిపలు భవనము స్వరాజ్యలక్ష్మి నిలయ మయ్యెను.

( 'కృష్ణాపత్రిక' నుండి )

*ఖాదీగట్టి, 'స్వాతంత్ర భారతికి జై! గాంధీకి జై!' రంపు వే*
*కా దర్పంబున నా కుమారులు స్వరాజ్యశ్రీ జయోత్కంఠతన్*
*మీదై నిల్వగ, ఆంగ్ల పాలకుల గుండెల్ జారి విచ్చెత్తి, హిం*
*సా దౌష్ట్యంబులు రాసి వోసిరి. అహింసా యుద్ధ రంగంబులో.*

—మహావాది వెంకటరత్నం
('విశ్వభారతి' కావ్యం)

# ఉప్పు సత్యాగ్రహోద్యమం-3

*ఎందరో కందకుండ, మరి యెందరో బందెల నందకుండ*
*ఇంకెందరో దేశమున్ విడిచి ఈడిగలన్ బడకుండ*
*ఎందరే చందమునన్ శ్రమం బడక చప్పున చొప్పడునే స్వరాజ్య*
*మో హిందువులార! చింతిలకుడీ చెరసాలలకేగు మన్నచోన్.*
*చెరసాలలు పృథు చంద్రశాల లెయగున్ చేదోయి గీలించున*
*య్యరదండల్ విరిదండలయ్యెడును హేయంబైన చోడంబలే*
*పరమాన్నంబగు, మోటుకంబళులు దాల్పన్ పట్టు సెల్లాలగున్*
*స్థిరుడై యేనరుడాత్మ దేశమును భక్తిన్ గొల్చు నవ్వానికిన్.*

—చిలకమర్తి లక్ష్మీనరసింహం

*పశ్చిమ గోదావరి జిల్లాలో*

## మట్లపాలెం కేంద్రం :

పశ్చిమ గోదావరిలో మట్లపాలెంను ఉప్పు చేసే కేంద్రంగా జిల్లా కాంగ్రెస్ నాయకులు నిర్ణయించుకొన్నారు. ఈ గ్రామం సముద్రతీర సమీపానవుంది. ఈ గ్రామ పెద్ద పేరిచెర్ల సుబ్బరాజు వందలాది సత్యాగ్రహులకు ఆతిధ్యం యిచ్చారు. పందిళ్లు వేయించి, వలంటీర్లకు సకల వసతులు కలిగించారు.

ఆత్మకూరి గోవిందాచారి, దండు నారాయణరాజుగార్లు రెండు సత్యాగ్రహ దళాలకు నాయకత్వం వహించారు. మధ్య గ్రామాలలో వూరేగింపులు చేసుకుంటూ కాంగ్రెస్ వలంటీర్లు మట్లపాలెం చేరుకున్నారు. గరికెపాటి మల్లావధాని 'వద్దురా ' మన కొద్దురా పరపాలనంబిక వద్దురా' అని, 'భారతదేశం మనదేరా ! భారతీయుడను నేనేరా .' అని జాతీయగీతాలు పాడుతుంటే, వలంటీర్లతో పాటు ప్రజలు కూడా దేశ భక్తితో పరవశులయ్యేవారు. ఇచ్చట ఉప్పు తయారుచేసి, యితర పట్టణాలకు తెచ్చి, అమ్మకం చేసేవారు. పలువురు దేశ సేవకులు లాఠీ ఛార్జీలకు, అరెస్టులకు గురి అయినారు.

## భీమవరం శిబిరం :

ఈ సత్యాగ్రహ తరుణంలో భీమవరం శిబిరం చాలా ముఖ్యపాత్ర నిర్వహించింది. కాశీపట్నం కొండయ్య బెనారస్ హిందూ యూనివర్సిటీ నుంచి వచ్చి, ఈ శిబిర నిర్వహణ బాధ్యత వహించారు. తల్లాప్రగడ ప్రకాశరాయుడు, నరసింహ శర్మ, బుద్దిరాజు రాజభూషణరావు, ముష్టి లక్ష్మీనారాయణ, భూపతిరాజు రామమూర్తి, పంప్రతంగి రాజేశ్వరరావు మొదలగు దేశారాధకులు 200 మంది ఈ శిబిరంలో వుండేవారు. వీరంతా ఉద్యమంలో ఉత్సాహభరితులై పాల్గొని, అరెస్టు అయినారు.

సిద్ధాపురంలో తల్లాప్రగడ విశ్వసుందరమ్మ అధ్వర్యాన మరొక శిబిరం వెలసింది. వీరు తాటిచెట్లు మొవ్వలను నరికే కార్యక్రమం చేపట్టారు పి. సుందరయ్య, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, తణికెళ్ల వెంకటచలపతి మున్నగు వారు ఈ ఉద్యమంలో పాల్గొని అరెస్టు చేయబడినారు. సుందరయ్య అప్పట్లో మైనర్ అయినందున, బోర్‌స్టల్ స్కూలు జైలుకు పంపటం జరిగింది.

## తాడేపల్లి శిబిరం

డాక్టర్ నశీర్ అహమ్మద్ ముస్లిం దేశభక్తుడు. కలకత్తాలో వైద్య శాస్త్రం అభ్యసించి, ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో డాక్టర్‌గా సైన్యంలో సేవ చేసిన వ్యక్తి. ఆయన తాడేపల్లిగూడెం వచ్చి తన స్వగృహంలోనే సత్యాగ్రహ శిబిరాన్ని నెలకొల్పారు. గరికెపాటి జోగయ్యశర్మకు ఈ శిబిర నిర్వహణ బాధ్యత అప్పగించారు. వలంటీర్లు నల్లజెర్ల వద్ద తాటిచెట్లు నరికివేశారు. స్వచ్ఛంద సేవకుల అరెస్టుకు ప్రజలు నిరసన ప్రదర్శనలు జరిపితే, వారిని 30 మందిని అరెస్టు చేశారు. గెడా రఘనాయకులుని బోర్‌స్టల్ జైలుకు పంపారు. చింతలపూడి తాలూకాలో గద్దె విష్ణుమూర్తి, నెక్కంటి పు వీరయ్య ప్రభృతులకు 6 మాసాల వంతున శిక్ష విధించారు.

## తణుకు శిబిరం :

కొవ్వలి గోపాలరావు, ముదిగంటి జగ్గన్నశాస్త్రి నేతృత్వాన, తణుకులో శిబిరం ఏర్పడింది. ఇక్కడ 40 మంది వలంటీర్లపైన లాఠీఛార్జీ చేసి, జైళ్ళకు పంపారు. ఇవటూరి శరభరాజు 13 ఏండ్ల బాలుడు. చక్కగా ప్రసంగించేవాడు. ఆ బాలుని ప్రభుత్వం అరెస్టు చేసి, బోర్‌స్టల్ స్కూలుకు పంపించి. ఈ విధంగా పిన్న పెద్దలు వందలాది మంది అరెస్టు అయినారు.

అనేక గ్రామాల నుంచి వలంటీర్లు జట్లు జట్లుగా సత్యాగ్రహ శిబిరాలకు వచ్చి, ఈ ఉద్యమంలో పాల్గొన్నారు ఒక్క కుముదవల్లి గ్రామం నుండే 22 మంది దేశ భక్తులు జైళ్లకు వెళ్లారు. ఈ విధంగా పాలకొల్లు, నర్సాపురం, పలు గ్రామాల్లో శిబిరాలు ఏర్పడి ఉద్యమాన్ని తీవ్రతరం చేశాయి.

## లాఠీఛార్జీలు :

సత్యాగ్రహ శిబిరాలపై దాడులుచేసి, పోలీసులు కొమ్మారెడ్డి ఆంజనేయులు, నెక్కలపు వీరయ్య, చిలుకూరి వెంకటరెడ్డి, గజపల్లి రామచంద్రరావు, వెల్లంకి కృష్ణమూర్తి, జోగయ్యశర్మ, మొదలగు వారిని అరెస్టు చేశారు. లాఠీ ఛార్జీలకు గురి చేశారు.

అల్లూరి సత్యనారాయణరాజు, వర్ధమాని లక్ష్మీనరసింహం యెల్లా ప్రగడ నారాయణమూర్తి, కొటికల పూడి ఆంజనేయులు, వర్లపట్ల మాణిక్యాలరావు తీవ్ర లాఠీ ఛార్జీలకు గురి అయినారు.

## ఏలూరు శిబిరంపై పోలీసుల దాడి :

ఏలూరు గాంధీ జాతీయ విద్యాలయ ప్రాంగణంలో సత్యాగ్రహ శిబిరం ఏర్పాటు చేయడం జరిగింది. ఈ శిబిర వలంటీర్లపైన పోలీసులు చేసిన లాఠీఛార్జీ అతి అమానుషమైనది. గేట్లు ముందుగా బిగించి, రిజర్వు పోలీసులు శిబిరంలో ప్రవేశించారు. శాంతియుత సత్యాగ్రహులపై విచ్చవిడిగా లాఠీఛార్జీ చేశారు. వలంటీర్లలో భీతావహం కలిగించడానికి చేసిన అకృత్యం యిది. ఈ బీభత్సాన్ని చూసేందుకు వెలుపల జన సమూహం గుమిగూడారు. బడుల నుంచి విద్యార్థులు కూడా వచ్చారు. వారిపై తుపాకులు ప్రేల్చగా చెన్నారెడ్డి రాఘవరావు అనే 15 ఏండ్ల బాలునికి గుండుదెబ్బ తగిలింది.

ఈ సంగతి విని కార్మిక పేటల నుంచి జనం వచ్చారు. వాళ్లపై జరిగిన పోలీసు కాల్పులలో పైల అచ్చన్న అక్కడికక్కడే మరణించాడు. గొర్రెల రాములుకు తుపాకీ దెబ్బలు తగిలినవి. తర్వాత ఆసుపత్రిలో డాక్టర్లు అతని కాలు తీసివేయవలసివచ్చింది ఏలూరు శిబిర ప్రచురణాధికారిగా వున్న మంగళంపల్లి చంద్రశేఖరం, సత్యాగ్రహ శిబిరవార్తలను వ్రాసి వివిధ శిబిరాలకు, గ్రామాలకు అందిస్తుండేవారు. తర్వాత సత్యాగ్రహోద్యమంలో అరెస్టు అయినారు. అదొక పోలీసుల రాజ్యంగా మారింది. దుగ్గిరాల కమలమ్మ, దాసరి కృష్ణవేణి లక్ష్మీబాయమ్మ, శృంగవరపు లక్ష్మీనర

సమ్మ, కొమ్మూరి వీరవెంకమ్మ, సత్తిరాజు శ్యామలాంబ మొదలగు మహిళామణులను ఎందరినో అరెస్టుచేసి, ఖైదు శిక్షలు విధించారు.

## 'వీరభారతి' పత్రిక:

కాశెపట్నం కొండయ్య, శేషశాయితో కలిసి 'వీరభారతి' అనే పత్రికను సైక్లోస్టైయిలుతో తీసి, వివిధ ప్రాంతాలకు పంపుతుండేవారు. తద్వారా ఉద్యమ వార్తలను ఎప్పటికప్పుడు అందించేవారు. 'వీరభారతి' ఆచూకీ చెప్పమని, అల్లూరి సత్యనారాయణ రాజు సబ్ జైలులోవుండగా, ఆయన స్పృహతప్పి పడిపోయే పర్యంతం, రాక్షసంగా కొట్టి హింసపెట్టారు. అల్లూరి సత్యం ఆ దెబ్బలకు చనిపోయాడని తలచారు. ఈ సంఘటన శాసన సభలో బయటకూడా ప్రజల్లో గొప్ప సంచలనం కల్గించింది. అల్లూరి ఆంధ్ర యువజన సంఘ నాయకుడైనారు.

## రాజకీయ సభలు :

ప్రభుత్వ నిషేధాజ్ఞను ధిక్కరించి, జిల్లాలో రాజకీయ మహాసభలు జరిగాయి. 1932 జూన్ 26వ తేదీన భీమవరంలో జిల్లా రాజకీయ సభ పసల కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగింది. కాశెపట్నం కొండయ్య త్రివర్ణ పతాకాన్ని ఎగురవేశారు. సభలో సత్యాగ్రహ సమర తీర్మానాన్ని ఆమోదించిన తర్వాత, 150 మంది పట్టణంలో వూరేగింపు సాగించారు.

గారపాటి సత్యనారాయణ, అక్కినేని అప్పారావు, కొటికలపూడి ప్రకాశరావు, భోగరాజు పేరిరాజు, బొమ్మకంటి విశ్వనాథం, కాశెపట్నం శేషశాయి, కదిలింది వరహాల రాజు మొదలగు వలంటీర్లను పోలీసులు అరెస్టు చేశారు.

తణుకు రాజకీయ సభానంతరం, క్రూరమైన లాఠీఛార్జీ జరిగింది. నరసాపురం తాలూకా మహాసభ రుద్రరాజు బంగారమ్మ అధ్యక్షతన జరిగింది.

నేల వాగుల గ్రామంలో 1931లో రాష్ట్ర రాజకీయ మహాసభ జయప్రదంగా జరిగింది. ఆంధ్రనాయకుల ఉపన్యాసాలు, రాబోవు స్వతంత్ర సమరానికి వలంటీర్లను సన్నద్ధులను గావించాయి.

దండు నారాయణ రాజు, తర్వాత కొమ్మారెడ్డి ఆంజనేయులు జిల్లా కాంగ్రెసు డిక్టేటర్లుగా నియమింపబడినారు. ఈ విధంగా ఒక డిక్టేటర్ జైలుకు వెళ్లగానే, మరొకరు ఆ బాధ్యతలను స్వీకరించేవారు.

పాలకోడేరు గ్రామకర్ణం పెంకోడేరు సోమసుందరం, మసనబు కొత్తపల్లి బాపిరాజు తమ గ్రామోద్యోగ పదవులకు రాజీనామా చేశారు కలగంపూడి కర్ణం కాకర్లమూడి భాస్కరరావు కర్ణీకానికి రాజీనామా యిచ్చి ఉద్యమంలో చేరారు. తాలూకా బోర్డు అధ్యక్షుడుగావున్న దంతులూరి నారాయణ రాజు, ఆ పదవికి రాజీనామా చేసి, సత్యాగ్రహిగా జైలుకెళ్ళారు ఇట్లా ఎందరో ప్రభుత్వోద్యోగాలకు స్వస్తి చెప్పి, సత్యాగ్రహోద్యమానికి అభివృద్ధిచేకూర్చారు. సత్యాగ్రహంపట్ల అభిమానం చూపుతూ, పశ్చిమగోదావరి జిల్లాబోర్డు, ఏలూరు పురపాలక సంఘం, తణుకు పంచాయతి బోర్డు తీర్మానించాయి.

ఉదాహరణకు ఒక్క జనవరి మాసంలో జరిగిన అరెస్టులను గమనిస్తే, ఉద్యమ తీవ్రత అర్థమవుతుంది.

జనవరి 5 : సత్ప్రవర్తనకు హామీ యివ్వడానికి నిరాకరించినందుకు దుగ్గిరాల కమలాంబ, దాసరి కృష్ణవేణమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మలను జైలులో నిర్బంధించారు.

దండు నారాయణరాజు, ఆత్మూరి గోవిందాచార్యులు, మాజేటి నారాయణ, బి కృష్ణమూర్తి, వి. సూరిశాస్త్రి, వి. పట్టాభిరామయ్య లకు శిక్షలు విధించారు.

జనవరి 9 : ఏలూరులో పెనుగొండ శ్రీరాములు, ఎం. గంగాధరం, వై. రామయ్య, కె. శ్రీరాములును అరెస్టుచేశారు. పికెటింగ్ చేసినందుకు హిందీ పండితుడు వడ్లమూడి నరసింహంను, సత్తిరాజు శ్యామలాంబ, ఇ. మంగమ్మ, ముదమూరి స్వరాజ్యలక్ష్మిని పోలీసులు అరెస్టు చేశారు.

ఏలూరులో శృంగారపు లక్ష్మీనరసమ్మ, కొమ్మూరి వీరవెంకమ్మ, సి హెచ్. బుచ్చమ్మ, ఎ. ప్రకాశరావు, పేరిరాజు, వీరమాచనేని వెంకట నారాయణ, మాగంటి సీతారామదాసు, గరికెపాటి జోగయ్య, ఎం.పి. చంద్రశేఖరరావు, కలగర పిచ్చమ్మ గార్లను అరెస్టుచేశారు

కాంగ్రెస్ వలంటీర్లుకు ఆతిథ్యం యిచ్చారనే నేరంపైన డాక్టర్ మూల్పూరి రంగయ్య, చుక్కమ్మ గార్లను అరెస్టు చేశారు.

జనవరి 13 : పాలకొల్లులో బి. రామచంద్రరావును అరెస్టు చేశారు. తణుకులో కొవ్వలి గోపాలరావు, కనకమ్మ, ముదిగంటి జగ్గన్నశాస్త్రి మానా ప్రగడ కృష్ణారావు ఇండ్లను సోదాచేసి, వారిని అరెస్టుచేసి, శిక్షలు విధించారు.

జనవరి 14 : ఏలూరులో కొమ్మారెడ్డి ఆంజనేయులు, మాజేటి రామచంద్రరావు గార్లను అరెస్టు చేశారు.

జనవరి 17 : వీరవాసరంలో పెద్దాడ గోపాలకృష్ణయ్యపై విధించిన జరిమానా వసూలు చేసేందుకు ఆయన తండ్రి ఆస్తిని జప్తు చేశారు.

జనవరి 19 : నిషేధ కరపత్రాలు పంచుతుండగా, ఎల్లిపెద్ది కృష్ణమూర్తిని పోలీసులు లాఠీలతో కొట్టారు. సబ్‌జైలులో డాక్టర్ ముల్పూరి రంగయ్యను, మరి 15 మంది వలంటీర్లను కొట్టారు. ఖద్దరు ధరించండని ప్రచారం చేస్తున్న పి.వి. సోమయాజులును నర్సాపురంలో అరెస్టు చేశారు. చెరుకూరి నరసింహరాజును, భాస్కర ఈశ్వరుడిని అరెస్టు చేశారు.

సత్యాగ్రహోద్యమానికి సహాయ పడుతున్నారని రైతులపైన కక్ష తీర్చుకోడానికి, వారి పొలాలకు నీటి సరఫరాను ఆపివేయండని పబ్లిక్‌వర్క్సు శాఖ అధికార్లు ఉత్తర్వులు జారీ చేయడం జరిగింది. భూపతిరాజు సోమరాజుగారి 50 ఎకరాల భూమికి దళ్వాపంటకు నీరు పోకుండా అధికార్లు ఆపివేశారు. ఈ రీతి రైతులను ఆర్థిక యిబ్బందుల పాల్జేయాలని చూచారు.

## తూర్పుగోదావరి జిల్లాలో

ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో కాకినాడలో బులుసుసాంబమూర్తి, పారుపూడి సత్యనారాయణ కుమార్డు రామమోహనరావు, దుర్గాబాయ్ ప్రభృతులపై జరిగిన లాఠీ ఛార్జీ అతి అమానుషమైనది. సాంబమూర్తి గారిని స్పృహతప్పి పడిపోయేంత వరకు పోలీసులు లాఠీలతో కొట్టారు. ఆయనకు రెండేండ్లు జైలు శిక్ష విధించారు.

ఈవిధంగానే, 'పెద్దాపురంవిందు'జరుగుతుండగా, పోలీసులు దాడిచేశారు ఆలాఠీ ఛార్జీ కడుహేయమైనది. పెద్దాడ కామేశ్వరమ్మ, 'దేశబాంధవి' దువ్వూరి సుబ్బమ్మ, బారిస్టర్ కందుల వీరస్వామి, క్రొవ్విడి లింగరాజు మొదలగు వారు తీవ్రలాఠీఛార్జీకి గురిఅయినారు. కోడేటి రంగచార్యులు మోచేయివిరిగి, ఆయన స్పృహతప్పి పడిపోయారు.

డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంటు ముస్తాఫాపాలీఖాన్ క్రింద దప్పుల సుబ్బారావు పోలీసు మూకతోవచ్చి, కాకినాడ, పెద్దాపురం వద్ద సమావేశమైన కాంగ్రెస్ వలంటీర్లపైన అష్టి దుర్మార్గాలు చేశాడు

జామీనుయివ్వ నిరాకరించిన రెబ్బా ప్రగడ మందేశ్వరశర్మను. కోటవర్తి కనకమ్మను నిర్బంధించారు. గాంధీజీ అరెస్టుకు నిరసన తెల్పారని మళ్ళపూడిపళ్ళం రాజును పోలీసులు అరెస్టు చేశారు

అమలాపురంలో నిషేధ కరపత్రాలు పంచిపెట్టిన నేరానికి గరిమెళ్ళ సత్యనారాయణ, గరిమెళ్ళ సుబ్రహ్మణ్యం, నండూరి బాపిరాజు, కోలా నరసింహం, చల్లా సోమయ్య మున్నగు వారిపై తీవ్ర లాఠీఛార్జీ జరిగింది

అరెస్టులకు నల్ల జెండాల ప్రదర్శనం జరుపుతున్న మడుంపి నరసింహాచారి, చిన్న నరసింహాచారి, విద్యాల వెంకటప్ప్రాపు, పెండ్యాల పరబ్రహ్మశాస్త్రి మొదలగువారిని లాఠీలతో మోదారు.

కాకినాడలో టి. ఆండాలమ్మపై విధించిన జరిమానా వసూలు చేసేందుకు ఆమె బంధువుల ఆస్తిని అధికార్లు జప్తుచేశారు దోసకాయల పేటకుచెందిన ఎం. రంగారావుపై విధించిన జరిమానా వసూలుకు వారింట్లోని పెట్టెలు, మంచాలు వశపరుచుకొని వేలం వేశారు.

'రైతుపత్రిక' ఆఫీస్‌పై దాడిచేసి పోలీసులు అక్కడి సామానులన్నీ తీసు కెళ్లారు.

రాజమండ్రిలో 'ఖద్దరు కట్టు కోండని' ప్రచారం చేసిన వెన్నేటి సత్యనారాయణను లాఠీలతో కొట్టి అరెస్టు చేశారు.

విజయనగరంలో డి వి ఆర్. దీక్షితులు, కె.ఎల్.నరసింహాచారి, సాంబమూర్తి పరమహంస ఎ. సింహాచలం, ఎ రంగనాథం, వి. సత్యనారాయణ, మాధవశాస్త్రి గార్లకు జైలు శిక్షలు విధించారు. విజయనగరం 'ఖద్దరుడిపో'ను పోలీసులు వశపరచుకున్నారు

విశాఖ దాల చెరువు వద్ద పదిమంది కాంగ్రెస్ వలంటీర్లను పోలీసులు అరెస్టు చేశారు. గంజాంజిల్లా నౌపడావద్ద 20 మంది వలంటీర్లను నిర్బంధించారు.

బరంపురం పట్టణంలో శాంతియుతంగా పికెటింగ్ చేస్తున్న సత్యాగ్రహులు, పోలీసులపైన రాళ్లు రువ్వారనే నెపంతో రిజర్వు పోలీసులు కాల్పులు జరిపారు, ఆకాల్పులలో ఒక వ్యక్తి మరణించాడు. పలువురికి గాయాలు తగిలాయి.

మదరాసు నగరంలో ప్రకాశం, కాశీనాథుని నాగేశ్వరరావు, గద్దెరంగయ్యనాయుడు వి.ఎల్. శాస్త్రి, దుర్గాబాయ్ ప్రభృతులు సత్యాగ్రహ సమరాన్ని నిర్వహించారు.

విదేశ వస్త్రాలను బహిష్కరించండని కరపత్రాలు పంచిపెడుతున్నారనే నేరం పైన, కాశీనాధుని నాగేశ్వరరావు, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, ఎన్. రామస్వామి, టి. కుటుంబరావు గార్లకు జైలు శిక్ష విధించారు. ప్రముఖ పత్రికా సంపాదకుడైన ఖాసా సుబ్బారావుపైన తీవ్రంగా లారీఛార్జీచేసి, ఆయనకు జైలు శిక్ష విధించారు

ఉప్పుసత్యాగ్రహం సమయంలో తూర్పుగోదావరి జిల్లా పహించిన ప్రఖ్యాత చరిత్రను 'బొబ్బిలిపాట' వరుసలో కవి, స్వతంత్ర సమరసైనికుడు కోడేటి రంగాచార్యులు రచించిన పాటను గమనించండి:

## బుర్రకథ

జయము జయము, గాంధీమహాత్మకు-జయము దిగ్విజయము.
జయము జయము, మా సాంబమూర్తికి-జయము దిగ్విజయము॥
శాంతి సైనికులు బయలుదేరినది-సంవత్సరాది
శాంతియుతంబుగ యాత్రజరుగుటకు-చనుదెంచినావె
సీతానగరం విడిచిపెట్టినవి-శాంతిసైన్యములు
రాజంపేట మకాంచేసె, స్వరాజ్యసైన్యములు
కాటేరున్ను, రాజమండ్రిని-గడచి పోయినావి
సీతారాముల భజనచేయుచు-శాంతి సైన్యములు ॥జయము॥
ఈలోపునవే ర్యాలినుండి-ఇరువదిసైనికులు
కాకినాడకువచ్చి శిబిరమున-కాలిడినారంచీ
శాంతిసైనికులు కాకినాడకు-చనుదెంచగనే
శాంతి వీడి, పోలీసులిటునటు-గంతులు నిడగానే
ఉప్పు చట్టముకు గాంధీ మహాత్ముడు-నిప్పుపెట్టమనగా
చప్పున యెక్కడనుండో వచ్చిన-సాంబమూర్తి గనగా
కాకినాడ పట్నంలోపల-గడబిడ హెచ్చింది,
లోకముకెల్ల కల్యాణంబగు-రోజేవచ్చింది ॥జయము॥

ఎక్కడ చూచిన-గాంధీజిందా బహాదర్
ఎక్కడ చూచిన-గాంధీ టోపీ''
ఎక్కడ చూచిన-గాంధి ప్రతాపం''
ఎక్కడ చూచిన-గాంధి ప్రతిజ్ఞే''
ఎక్కడ చూచిన-ప్రజల గుసగుసే''
ఎక్కడ చూచిన-ఖద్దరు ధారులే''
ఎక్కడ చూచిన-శాంతి సైన్యమే''
ఎక్కడ విన్నా-ఉప్పు గొడవే'' ॥జయము॥
డాక్టర్ సుబ్రహ్మణ్యం సేనతో-తరలె కాకినాడ
'విక్టరి' మనదేయనుచు సైన్యములు-విడిచె కాకినాడ
పల్లెనుండి సేనాధిపతి-ఒక్కడు వచ్చాడు
తబ్బిబ్బుకాకుండ సైన్యము-తయారు చేశాడు
చెప్పేదేమిటి కృష్ణమూర్తి-ఆ సేనాపతి పేరు
నిప్పువంటివాడంటే చాలును-నిర్ణయమెందుకువేరు
సేనలోవున్న మొనగాళ్లనుచే-చెప్పగతేనండీ
ప్రాణాల్‌పోతే పోనీగాని-పంతము విడరండీ
'కళావారి వెంకట' రత్నారు-ఘనుడందరిలోన
వీరసైన్యము తోడ్కొనిరాగా వీరసాంబమూర్తి
తూరంగికి తనసైన్యముకూడ-తోడ్కొని పోయాడు
రెండు సైన్యములు కలిసినవంటి-దండి మగతనముతో
రెండు వైపుల రోడ్డుల నిండిన-వండీ ఉత్సవముతో
కాకినాడ పైరోడ్డునజనము-కదలిపోవుచుంటే
ఏకధాటిగా మైలుదూరము-ఎడతెరపి లేకుంటే
పోలీసువారధికారం బట్టి-రిపోర్టులు చేస్తుంటే
కాలుచున్న మొద్దులాగధి-కార్లుమండుతుంటే
పురమందిరము చేరిన దండీ-పురజనముతొ సేన
దరిసించిన వారందరు-మదిసంతసము పొందిరిలోన
వెన్నేటాయన, సేనకంతకు-వెన్నుముకగనుంటే
ఎన్నడైన అపజయమను మాటకు ఎన్నికలేకుంటే

పోకలవారు, చక్కావారు, ఆకులవారు, బెవికానూరు
ముష్టిందాట్లు, ముదునూరండీ, సంకుడు, మత్పల
అల్లక గట్టింక్తి, వేములూ, కోరుగంతులూ
వత్సవాయివారు, వృద్ధిపర్తివారూ, పందిరివారూ
పీసపాటివారు, మరుంగంటివారు, పుష్పలూరివారూ
మందల, అత్తిలి, తేజోమూర్తుల, కందులవారు, కాప
రాంవారు, ఆకెళ్లవా, రప్పనవారు, వాడ్రేవు, సోమంచి
పిలకా, అంగజాల, వారద్దేపల్లి, అల్లూరి, తణికెళ్ల
కాకర్లపూడి, కోడేటి, మహాభాష్యం, మంత్రిప్రగడ, సరస్వతు
లవా, ర్సామవేదము గొప్పవాళ్లంతా వచ్చిరి-కుప్పలు కుప్పలుగా
మహాత్యాగులు చేరారండి-మహాసైన్యములోన ॥జయము॥

మీటింగున మాట్లాడితె నేరం
ఓటింగున చేయెత్తితే నేరం
గాంధీటోపి పెట్టితే నేరం
గాంధికి జై అని అంటే నేరం
కాంగ్రెసులో-చేరితే నేరం
మల్లుబట్ట తగలేస్తే నేరం
కల్లుత్రాగ వద్దంటే నేరం
ఉప్పు బజారులో అమ్మితే నేరం
డప్పులు కొట్టం అంటే నేరం
రాళ్ళు వేయవద్దంటే నేరం
విదేశీని విడమంటే నేరం
స్వతంత్ర సంపాదనమే నేరం
ఇన్ని నేరములు కల్పించిన వాడెవరో యెంచండి
ఎన్నినాళ్లు పడబాధలు ఎదలో తలచండి ॥జయము॥

సాంబమూర్తికి పైదువేసిరి సంవత్సరమండి
సాంబమూర్తులే మీరందరును- సరభసమునలెండి
ఉప్పునీళ్ళను తెచ్చి రోడ్లుపై ఉడక పెట్టికొండి
ఇప్పటికైనా ప్రభుత్వ మిక్కడ ఎగరగొట్టరండి ॥జయము॥

ఎంతటి ఆపదలొస్తే మనకు- అంతా జయమంటి
ఎంతమంది జయిలకు వెళ్ళితే- అంతా జయమంటి
వింతకోసమై అరెస్టులంటూ- పేరెట్టారంటి
గంతులు వేస్తుందంటి ప్రభుత్వం- కాల్పులు చూడండి
ఆంధ్రదేశమున నాయకులందరి- నంపినారు జయిలునకు
స్వరాజ్యలక్ష్మి జయిలులోపల పరాకుచెందుతుంది
స్వరాజ్యలక్ష్మిని తీసుకరండి! ॥జయము॥

## రాయలసీమలో ఉప్పు సత్యాగ్రహం :

అనంతపురం జిల్లాలో కల్లూరి సుబ్బారావు, కలచవీడు వెంకటరమణాచార్యులు, పప్పూరి రామాచార్యులు కాంగ్రెస్ ప్రచారం చేసేవారు. కల్లూరి సుబ్బారావు బళ్లారి శిబిరానికి వెళ్లారు ఆయనను 108 సెక్షన్ క్రింద అరెస్టుచేసి, జైలుశిక్ష విధించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా విడుదలై, మదరాసులో ప్రకాశంగారి అధ్వర్యాన జరుగుతున్న ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, మళ్ళీ జైలుశిక్షకు గురి అయినారు

బళ్లారి సత్యాగ్రహశిబిరాన్ని ప్రభుత్వం అక్రమసంఘంగా నిషేధించింది. అనంతపురం ప్రాంతం నుండి వెళ్ళిన హిందూపురం నరసింహశెట్టి, సదాశివరావు, రాళ్ళపల్లి లక్ష్మణాచార్యులు మొదలగు వలంటీర్లను బళ్లారిలో జైలుశిక్షలు విధించడం జరిగింది.

పుటపర్తి వెంకటాచార్యులు, పాదుర్తి నారాయణాచార్యులు బొంబాయి నగరం వెళ్ళి, అక్కడ మహారాష్ట్ర కాంగ్రెస్ వలంటీర్లతో కలిసి అరెస్టు అయినారు.

హరేసముద్రం నరసింగరావు 20 ఏండ్ల యువకుడు. స్కూలుఫైనల్ చదువుతుండగా, చదువుకు స్వస్తిచెప్పి సీతానగరం సత్యాగ్రహ శిబిరానికి వెళ్ళాడు. బులుసు సాంబమూర్తిగారి అధ్వర్యాన జరుగుతున్న కాకినాడ సత్యాగ్రహుల జట్టులోచేరి అరెస్టు అయినాడు ఆ యువకుడు 6 మాసాలు జైలుశిక్షననుభవించి వచ్చి, దుర్గాబాయి అధ్వర్యాన జరిగే ప్రచారంలో పాల్గొని, లాఠీదెబ్బలకు గురి అయినాడు

తమిళనాడు నుండి నల్గురు కాంగ్రెస్ వలంటీర్లు కదిరివచ్చి దుకాణాల ముందు పికెటింగులు చేయనారంభించారు స్థానికులు ధర్మసింగ్, కదిరి శ్రీనివాసాచార్యులు, ఆ వలంటీర్లతో కలిసి పికెటింగు కార్యక్రమాల్లో పాల్గొని, పోలీసు నిర్బంధాలను ఎదుర్కొన్నారు. వీరు ధర్మవరంలో కూడా పికెటింగుచేశారు. 'కల్లుపెంట' అను నాటికను వ్రాసి, దానిని ప్రదర్శిస్తూ మద్య నిషేధ కార్యక్రమం ప్రచారంచేశారు కళ్యాణదుర్గం తాలూకాలో కూడా కల్లు సారాయిలు త్రాగరాదని విస్తృతంగా ప్రచారం జరిగింది. అప్పట్లో అనంతపురం మండల కాంగ్రెస్‌కు పాముదుర్తి గోవిందరెడ్డి అధ్యక్షుడుగా, సి ఓబిరెడ్డి ఉపాధ్యక్షుడుగా, కల్లూరి సుబ్బారావు ప్రధానకార్యదర్శిగా వుండేవారు. వీరు గుత్తి, తాడిపత్రి, పామిడి మున్నగు ప్రదేశాల్లో తీవ్రంగా కాంగ్రెస్ ప్రచారం చేశారు. యల్లమల కొండప్ప అనే రైతు ఉప్పుచేసి, చుట్టూ గ్రామాల్లో పంచిపెట్టాడు. సదాశివన్‌ను అరెస్టు చేశారు.

గాంధీ టోపీ ధరించడం అప్పట్లో నేరమైంది. అనంతపురం కళాశాలలో విద్యార్థు లెవరూ గాంధీ టోపీ ధరించరాదని ప్రిన్సిపాల్ నిషేధించాడు వై. రామనాధరావు, వకీలు లక్ష్మణపిళ్లై ప్రబోధంతో. ఒక్కసారిగా విద్యార్థులంతా గాంధీ టోపీలు పెట్టుకొన్ని తరగతులకు హాజరైనారు. అది చూచిన ప్రిన్సిపాల్ అదరిపడి, తాను చేసిన ప్రకటనను ఉపసంహరించుకోక తప్పలేదు.

కల్లు త్రాగవద్దని, కల్లు అంగళ్ళ వద్ద పికెటింగులు చేస్తున్న హట్టి శంకరరావును, యితర వలంటీర్లను కల్లుత్రాగేవారు పోలీసులు కలిసి చెప్పులతో కొట్టారు. అయినా, ఆ వలంటీర్లు తమ సహనాన్ని కోల్పోలేదు. కాళ్ళావేళ్ళాబడి త్రాగుడు మానండని వారిని ప్రాధేయపడ్డారు.

అలిఘర్ నుంచి ముగ్గురు మహమ్మదీయ దేశభక్తులు వచ్చి కాంగ్రెస్ ప్రచారం సాగించారు. వారిని అరెస్టుచేసి జైలుకు తీసుకొని వెళ్లుతుండగా, వేలాది మహమ్మదీయులు, ప్రజలు వారికి వీడ్కోలు యిచ్చారు కలెక్టర్ బంగళావద్ద అరెస్టులకు నిరసన తెల్పారు.

కడప పట్టణానికి కొండవెంకటప్పయ్య వచ్చినపుడు ఆయన ఏ సభలలో ప్రసంగించరాదని, ప్రభుత్వం ఆయనపై నిషేధాజ్ఞ జారీచేసి వెళ్లగొట్టింది.

కడప జిల్లాలో ఉప్పు సత్యాగ్రహ తరుణంలో కె సుబ్రహ్మణ్యం ముఖ్యపాత్ర వహించాడు. సిద్దవటం తాలూకా పొన్న పేరూరు గ్రామమునసబు, కరణాలు రాజీనామా చేశారు. బద్వేలు తాలూకాలో పన్నుల నిరాకరణ సాగించ తలపెట్టారు.

జమ్మలమడుగు తాలూకా ఉమ్మిరెడ్డి పల్లెలో సంగమేశ్వరశెట్టి తన బావి వద్దనే ఉప్పు తయారు చేయడానికి పూనుకున్నారు. ఉరగట్టుపొడు రాజులు రైతులు ఈ ఉద్యమానికి చేయూతనిచ్చారు. వీరిలో 13 మందిని పోలీసులు అరెస్టుచేసి, శిక్షలు విధించారు. రామశాస్త్రి ఆ విధంగానే జైలుకేగిన త్యాగి.

తాడిపత్రిలో పప్పూరి రామాచార్యులు అధ్యక్షతన సభ జరిగింది. తాడిపత్రి, అనంతపురం, ధర్మవరం మొదలగు ప్రదేశాల్లో జాతీయ పతాకాలు ఆవిష్కరించారు.

శ్రీకాళహస్తిలో ఏర్పేడు ఆశ్రమానికి చెందిన వి. కనకయ్యను అరెస్టు చేశారు. కర్నూలు జిల్లా ఆత్మకూరులో దుద్యాల శేషిరెడ్డికి జైలు శిక్షలు విధించారు.

ఉప్పు సత్యాగ్రహానంతరం, జైలు నుంచి దేశ సేవకులు విడుదలై రాగానే, మడకశిర తాలూకా రైతు మహాజనసభ కల్లూరి సుబ్బారావు అధ్యక్షతన వైభవంగా జరిగింది. అగళి నారాయణరావు ఆహ్వాన సంఘ అధ్యక్షుడు. ఆచార్య రంగా ప్రసంగిస్తూ :

> "నేను ముందుగా ఇక్కడి దేశభక్తులకు నమస్కరిస్తున్నాను. మనెదుట నున్న గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు దేశసేవకులలో ప్రథములు, దేశమంతా నిద్రిస్తున్న సమయంలో వీరు స్వాతంత్ర్య జ్యోతిని వెలిగించారు.
>
> కల్లూరి సుబ్బారావుగారికి నమస్కరిస్తున్నాను. ఈ ప్రాంతంలో వీరు స్వాతంత్ర్య జెండాను ఎగురవేసి, యిప్పటికే మూడు పర్యాయాలు కారాగార శిక్షలు అనుభవించిన త్యాగశీలి."

ఈ విధంగానే 1931 మే 16వ తేదీన సహకార సంఘాల మహాసభ గాడిచెర్ల వారి అధ్యక్షతన జరిగింది. రాయలసీమలో క్రమేణా రాజకీయ చైతన్యం పెరుగుతూ వచ్చి, పలువురు దేశారాధకులను జైలు కర్పించింది.

నెల్లూరు జిల్లాలో 'మైపాడు బీచ్' వద్ద ఓరుగంటి వెంకటసుబ్బయ్య, బొమ్మా శేషిరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, వి. లక్ష్మయ్య, ఎల్. సుబ్బరామిరెడ్డి ప్రభృతులు ఉప్పు తయారు చేశారు. పోలీసులు వారిని అరెస్టు చేశారు.

ఉప్పు సత్యాగ్రహంలో మొదటి దళంలో ఓరుగంటి వెంకటసుబ్బయ్య, పాతూరి బాలసరస్వతమ్మ వలంటీర్లతో సహా అరెస్టు అయినారు.

గాంధీమహాత్ముని అరెస్టుకు నిరసనగా రాయలసీమలోని గుత్తి, తాడిపత్రి, గుంతకల్లు పట్టణాలలో 'హర్తాళ్'లు జరిగాయి.

మదరాసు 'మైలాపూర్ బీచ్' వద్ద దుర్గాబాయి అధ్వర్యాన 9 మంది మహిళలు ఉప్పు తయారుచేసి, శాసన ఉల్లంఘన నేరానికి అరెస్టు చేయబడినారు. ట్రిప్లికేన్ బీచ్‌లో జరుగుతున్న బహిరంగ సభ మీద పోలీసులు తుపాకీ కాల్పులు చేశారు. ముగ్గురు మరణించారు. పలువురికి గాయాలు తగిలినవి.

వేదారణ్యం వద్ద ఆచంట రుక్మిణమ్మను, రక్షణదళాల్లో దేశభక్తిని రేకెత్తించే కరపత్రాలు పంచుతున్న నేరానికి అరెస్టు చేశారు.

## ప్రభుత్వ నిర్బంధాలు :

1932లో ఉప్పు సత్యాగ్రహాన్ని, శాసనోల్లంఘ నోద్యమాన్ని అణచి వేయడానికి ప్రభుత్వం అనేక కఠిన చర్యలు తీసుకొంది. సత్యాగ్రహ శిబిరాలపైన దాడులు చేసింది. వలంటీర్లపై క్రూరంగా లాఠీఛార్జీ చేసి, వందలాది మందిని అరెస్టు చేసింది. ప్రింటింగు ప్రెస్సులపైన, పత్రికలపైన తీవ్ర చర్యలు తీసుకొంది. రహస్యంగా ప్రచురించిన కరపత్రాలను, పుస్తకాలను నిషేధించింది. పలువురు రచయితలను, కవులను, గ్రంథ కర్తలను కూడా అరెస్టు చేసింది. శాంతంగా రాజకీయ సభలు జరుపుకొంటున్న సందర్భంలో, సభలు జరుగనీయకుండా, అరెస్టులుచేసి జైలు శిక్షలు విధించింది. మహిళా వలంటీర్లపైన రంగునీళ్లు చల్లి అవమానపరిచి, నిర్మానుష్య ప్రదేశాలలో వారిని ఒంటరిగా వదలివేయడం జరిగింది. కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులకు అన్నం పెట్టి ఆతిధ్య మిచ్చినందుకు అనేకమంది దేశాభిమానులను జైళ్లలో నిర్బంధించింది. ఈ విధంగా ఆ రోజుల్లో ప్రభుత్వం చేయని దుష్కృత్యాలులేవు.

1932 సెప్టెంబర్ మాసంలో ఇంగ్లండు నుండి భారతదేశం వచ్చిన 'ఇండియా లీగ్' ప్రతినిధివర్గ విచారణ సంఘం వారు ఎలెన్ లిత్కన్సన్, వి. కె. కృష్ణమీనన్ ప్రభృతులలో కొందరు ఆంధ్రదేశం కూడా పర్యటించి, ఇక్కడ జరుగుతున్న పోలీసు దుశ్చర్యలను బయటి ప్రపంచానికి చాటి చెప్పారు. బెజవాడ బార్ అసోసియేషన్ వారు, దిగవల్లి వెంకటశివరావుగారు కృష్ణా జిల్లాలో జరిగిన పోలీసుల హింసాకాండను గర్హిస్తూ, ఆ వివరాలను పత్రికా ముఖంగా, శాసనసభలో వినిపింపచేయడానికి కారణ భూతులైనారు.

## ఆంధ్రదేశంలో అరెస్టులు :

1930-32 ఉప్పు సత్యాగ్రహం సందర్భంలో గుంటూరు జిల్లాలో 191 మంది, కృష్ణా జిల్లాలో 112 మంది, పశ్చిమ గోదావరి జిల్లాలో 92 మంది, తూర్పు గోదావరి జిల్లాలో 85 మంది, నెల్లూరు జిల్లాలో 35 మంది, విశాఖపట్నం జిల్లాలో 19 మంది, గంజాం జిల్లాలో 14 మంది, అనంతపురం జిల్లాలో 11 మంది, తదితర రాయలసీమ జిల్లాల్లో మరి కొందరు జైలు శిక్షలు అనుభవించినట్లు ప్రభుత్వ రికార్డుల ద్వారా తెలుస్తున్నది.

## కొండ వెంకటప్పయ్యగారిలా వ్రాశారు :

"మహత్తరమైన ఈ సత్యాగ్రహ పోరాటంలో ప్లీడర్లు కోర్టులను బహిష్కరించిరి. ఆంధ్రదేశంలో వివిధ ప్రాంతములందు జాతీయ పాఠశాలలు స్థాపించిరి. వీనిలో ఏలూరు జాతీయ పాఠశాల పేరెన్నిక గన్నది. లక్షరూపాయల మూలధనంతో ఏలూరు పాఠశాలను నెలకొల్పిరి. సముద్ర ప్రాంత జిల్లాలన్నిటిలోను ఏకకాలమున ఉప్పు సత్యాగ్రహమును సాగించిరి."

**—'ఆంధ్రపత్రిక'-1947 ఆగస్టు 15**

## ఆంధ్ర పత్రిక కథనం :

ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో నాటి ఉప్పుసత్యాగ్రహోద్యమాన్ని గురించి వివరించారు :

"గత సంవత్సరమునందు ప్రవర్ధమానం బైన సత్యాగ్రహ ప్రస్థానము భరత వర్షమునందంతటను ఆంధ్రుల ప్రతిభను విస్తరింప చేసినది. ప్రఫుల్లరాయ్‌గారు చెప్పినట్లు ఆంధ్రులు పరమోత్సాహముతో సత్యాగ్రహ రంగమందాత్మార్పణము చేసిన విధము ప్రశంసార్హముగ నున్నది. ఏప్రిల్, మే నెలల్లోనే వందల కొలది సత్యాగ్రహులు నిర్బంధింపబడిరి. కాంగ్రెస్ సంఘము అక్రమ సంఘములుగ నిషేధింపబడినవి. ఆంధ్రరత్న భవనము, సత్యాగ్రహ శిబిరములు ప్రభుత్వ ఆక్రమణను పొందినవి. దేశమునందు ముఖ్య ప్రదేశములందు 144

శాసనము జారీచేయ బడినవి. గుడివాడ, ఏలూరులందు తుపాకులు ప్రేల్చబడినవి. గుంటూరు, బందరు, రాజమహేంద్రవరం, అంగలూరు మొదలగు ప్రదేశములందు లాఠీప్రయోగములు జరిగినవి. పోలీసువారు ప్రదర్శకులపై చూపిన అవమాన దౌర్జన్యములు ప్రజలలో పరమా సహ్యమును కలుగ చేసినవి.... .

శ్రీమతి దుర్గాబాయమ్మ చెన్నపురి యందున, శ్రీమతి వున్నవ లక్ష్మీబాయమ్మ గుంటూరు నందున, శ్రీమతి రుక్మిణమ్మ వేదారణ్యమునందున, ఇతర యువతులు భిన్నప్రాంత ములందున చూపిన సాహసోత్సాహములాంధ్రుల ప్రతిష్టను విస్తరింప చేసినవి. ..

యువజనులెందరో శ్రీకృష్ణజన్మ స్థానమును పరమానందముతో స్వీకరించి మాతృదేశాశీర్వాదములను పొందిరి."

—'ఆంధ్ర పత్రిక' ఉగాది సంచిక నుండి

# స్వతంత్రసమరంలో మరో అధ్యాయం

'ప్రియభారత జననీ'

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి
జయ జయ సశ్యామల సు
శ్యామ చలచ్చేలాంచల
జయ వసంత కుసుమలతా
చలిత లలిత చూర్ణకుంతల
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా
జయ జయ జయ ప్రియభారత॥ జయజయ॥

—దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి

భారత జాతీయోద్యమాన్ని నిర్వహించిన జాతీయ కాంగ్రెస్ సంస్థకు భవిష్యత్ భారత దర్శనాన్ని కలిగించిన వారు లోకమాన్య బాలగంగాధరతిలక్, మహాత్మా గాంధీ. వారి తరువాత పేరెన్నికగన్న వారు జవాహర్‌లాల్‌నెహ్రూ.

దేశపరిస్థితిని అవగాహన చేసుకోవడంలో నెహ్రూకు గొప్ప ప్రతిభ, అద్భుతమైన విషయ పరిజ్ఞానం, క్రమశిక్షణాయుతమైన మనస్సు, అంతర్జాతీయ దృక్పథం, ప్రజల మనోభావాలను అర్థం చేసుకొనగలిగిన శక్తి మున్నగు సుగుణాలు అబ్బినవి. వీటన్నిటి మూలంగా మన దేశ ప్రజలు అనుసరించవలసిన మార్గాన్ని నిర్దేశించగలిగారు.

ఒకరిపై మరొకరు ఆధిపత్యాన్ని చెలాయించే విధానాన్ని అంతం చేయడానికి, స్వేచ్ఛ, సమానత్వం, న్యాయం, ప్రాతిపదికలుగా నూతన సామాజిక వ్యవస్థ ఆవిర్భవించడానికి, ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న సామ్రాజ్య వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటాల్లో భారత ప్రజల స్వరాజ్య సమరం కూడా ఒక అంతర్భాగమని నెహ్రూ స్పష్టం చేశారు.

1929 సంవత్సరంలో, లాహోరు కాంగ్రెస్ మహాసభ, బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వంతో ఎట్టి సంబంధంలేని సంపూర్ణ స్వాతంత్ర్యం కాంగ్రెస్ లక్ష్యం' అని తీర్మానించిన తర్వాత, భారత స్వరాజ్య సమరంలో మరో అధ్యాయం ప్రారంభమై నడనవచ్చును. నెహ్రూ 'నేను ప్రజాస్వామ్యవాదిని—నేను సామ్యవాదిని' అని నిర్ద్వంద్వంగా ప్రకటించుకున్నారు.

1936లో జరిగిన లక్నో కాంగ్రెస్ మహాసభకు నెహ్రూ అధ్యక్షత వహిస్తూ, "భారతదేశం, యావత్ప్రపంచ సమస్యల నివారణోపాయం సోషలిజంలోనే వుంది. నేనీ పదంవాడుతున్నది ఏదో మానవశ్రేయస్సుకు అనే పద్ధతిలో కాదు. శాస్త్రీయంగా సక్రమ విధానం అదేనని నా గట్టి విశ్వాసం. సోషలిజం ఒక ఆర్థిక సిద్ధాంతమేకాదు. అది ఒక జీవనవిధానం, జీవితతత్వం" అన్నారు. అయితే, సోషలిజం మన భారతదేశ పరిస్థితులకు అనుగుణమైనదిగా వుండాలి. రాజకీయరంగంలో ప్రజాస్వామ్యం సక్రమంగా పనిచేయకపోతే అది హింసా విప్లవ పద్ధతిలోకి ప్రవేశిస్తుంది. మనంకోరే సోషలిజం— వ్యక్తి స్వాతంత్ర్యానికి భంగం కలిగించేదిగా వుండరాదు," అని నెహ్రూ వివరించారు.

అప్పట్లో నెహ్రూ తాను రచించిన 'విదర్ ఇండియా' (Whither India) అను కరపత్రంలో "ఆర్థికంగా అభివృద్ధి సాధించాలన్న ప్రగాఢవాంఛ, ప్రజానీకాన్ని అణగత్రొక్కి వుంచుతున్న శక్తులను నిర్మూలించాలన్న దృఢనిశ్చయం మన భారత జాతీయోద్యమానికి ఎంతో ప్రేరణ కలిగించాయి." అని పేర్కొన్నారు.

## కరాచీ ప్రాథమిక హక్కుల తీర్మానం:

కోట్లాది దరిద్రనారాయణుల ప్రయోజనాలను కాపాడేందుకు కృషిచేస్తున్న కాంగ్రెస్ లక్ష్యానికి, కరాచి కాంగ్రెస్ సభాతీర్మానం ఒక నిర్దిష్టమైన ఆకృతినిచ్చింది. 1931 సంవత్సరంలో, కరాచిలో కాంగ్రెస్ మహాసభ సర్దార్ వల్లభాయ్ పటేల్ అధ్యక్షతన జరిగింది. మహాత్మాగాంధీయే స్వయంగా ప్రవేశపెట్టిన ప్రాథమికహక్కులు (Fundamental rights) తీర్మానాన్ని ఆ మహాసభ ఆమోదించింది.

స్వరాజ్య ప్రభుత్వం రూపొందించే ఏ ప్రణాళికలలోనైనా వాక్‌సభా పత్రికా స్వాతంత్ర్యాలు, పౌరులందరికీ సమానహక్కులు, వయోజనులందరికీ ఓటింగ్‌హక్కు, ఉచిత ప్రాథమిక విద్యా సౌకర్యాలు, దోపిడీ దాస్యానికి తావులేని స్వాతంత్రం, భూసంస్కరణలవంటి హక్కులు విధిగా కల్పించబడాలని కరాచీ కాంగ్రెస్ తీర్మా

సించింది. సామాన్య ప్రజానీకంపై జరిగే దోపిడీవిధానాన్ని అంతం చేయాలంటే, రాజకీయ స్వాతంత్ర్యంతోపాటు, అర్ధాకలితో మ్రగ్గుతున్న కోట్లాది ప్రజానీకానికి నిజమైన ఆర్థిక స్వాతంత్ర్యం వుండాలని ఆ తీర్మానంలో స్పష్టంగా పేర్కొన్నారు.

## ఫైజ్‌పూర్ కాంగ్రెస్ వ్యవసాయ ప్రణాళిక :

1937లో ఫైజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభకు జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షత వహించారు. ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాలన్నీ భూసమస్యలను వివరంగా పరిశీలించి, మహాసభకు సమర్పించాలని లక్నో కాంగ్రెస్ కోరింది. ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాలు సమర్పించిన నివేదికలను చర్చించి, సమగ్ర వ్యవసాయ సంస్కరణల తీర్మానాన్ని ఫైజ్‌పూర్ కాంగ్రెస్ ఆమోదించింది.

> "ప్రస్తుతం పరిస్థితులకు తగినట్లు కౌలుదార్లకు కౌలురేట్లు నిర్ణయించాలి. ఆర్థికంగా లాభదాయకంకాని కమతాలను మినహాయించాలి. నిర్దేశిత కనీస పరిమితికి లోబడి, సక్రమ పరిమాణంలో వ్యవసాయాదాయంపైన ఆదాయపు పన్ను విధించాలి నిర్బంధ కార్మిక వినియోగ పద్ధతికి స్వస్తి చెప్పాలి. పొలాల్లో ఇండ్ల నిర్మాణం, చెట్ల పెంపకం మున్నగు వాటిపై కౌలు దార్లకు వార సత్వహక్కు యిచ్చి, కౌలుకాల పరిమితిని నిర్ణయించాలి. సహకార వ్యవసాయ విధానాన్ని ప్రవేశ పెట్టాలి. వ్యవసాయ కార్మికులకు తగిన పనివసతి కల్పించి, వారి జీవనానికి తగిన వేతనాలు లభింపచేయాలి. రైతు సంఘాలను నిర్మాణం గావించాలి." అని ఆ మహాసభ తీర్మానించింది.

ప్రాథమిక హక్కుల విషయంలో కరాచీ కాంగ్రెస్ ఆమోదించిన తీర్మానం వలెనే, ఈ ఫైజ్‌పూర్ కాంగ్రెస్ వ్యవసాయ కార్యక్రమంకూడా కాంగ్రెస్ చరిత్రలో హెచ్చు ప్రాముఖ్యతను సంతరించుకొంది.

1938లో సుభాస్ చంద్రబోస్ అధ్యక్షతన జరిగిన హరిపుర కాంగ్రెస్ మహాసభ, దేశాభివృద్ధి ప్రణాళికను రూపొందించేందుకు జవహర్‌లాల్‌నెహ్రూ అధ్వర్యాన కాంగ్రెస్ జాతీయ ప్రణాళిక సంఘాన్ని ఏర్పాటు చేసింది. స్వాతంత్ర్యా నంతరం, నేషనల్ ప్లానింగ్ కమిషన్ నిర్మాణానికి అది నాందీ వాచకమని చెప్పవచ్చును.

స్వాతంత్ర్యం అంటే అర్థం విదేశ ప్రభుత్వ పాలననుండి విడిపడటమేగాదు. దేశంలో దోపిడీ విధానాన్ని అంతమొందించి, దారిద్ర్యాన్ని బీదరికాన్ని నిర్మూలించి సోషలిజాన్ని స్థాపించినప్పుడే స్వాతంత్ర్యానికి నిజమైన అర్థం వుంటుంది. ఈస్వరాజ్యార్థాన్ని, ప్రాధాన్యతను గురించి, జవహర్ లాల్‌నెహ్రూ, సుభాస్‌చంద్రబోస్ వంటి కాంగ్రెస్ నాయకులు పలుమార్లు చెపుతూ వచ్చారు.

# స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం (1938)

దేశంలో 1930 నుండి 1933 వరకు అఖిల భారత జాతీయ కాంగ్రెస్ అధ్వ ర్యాన ఉప్పు సత్యాగ్రహోద్యమం జరిగింది. ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించి, వేలాది వలంటీర్లు జైళ్ళకు వెళ్ళారు. హైదరాబాదు సంస్థానం నుండి కూడా 150 మంది దాకా వలంటీర్లు, యితర శిబిరాలకు వెళ్ళి సత్యాగ్రహంలో పాల్గొని జైలు శిక్షలనుభ వించారు.

దేశవ్యాప్తంగా సాగిన ఉప్పు సత్యాగ్రహం హైదరాబాదు స్టేట్‌లోని జాతీయా భిమానులలో గొప్ప ప్రభావాన్ని కలిగించింది. సంస్థానంలో కూడా స్టేట్ కాంగ్రెస్ సంఘాన్ని ఏర్పరచుకోవాలనే సంకల్పం కలిగి, అందుకు ప్రయత్నాలు ప్రారంభిం చారు. ఈ కోర్కె ఒక రూపుధరించక ముందే, నిజాం ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్‌పైన నిషేధం విధించింది.

స్వామి రామానందతీర్థ ఆధ్వర్యాన 1938 అక్టోబర్ 24వ తేదీనుండి డిసెం బరు 24వ తేదీ వరకు రెండు మాసాలపాటు స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం నిర్వహిం చింది. గోవిందరావు నానల్ అధ్యక్షుడుగా, రామకృష్ణదూత్ కార్యదర్శిగా స్టేట్‌కాంగ్రెస్ తాత్కాలిక కార్యవర్గం ఏర్పడింది. హరిశ్చంద్రహెడా కార్యాలయ కార్యదర్శిగా వుండేవారు. 1200 మంది స్టేట్‌కాంగ్రెస్‌లో సభ్యులుగా చేరారు.

ఈ కాలంలోనే మైసూరు, తిరువాన్కూరు, రాజకోట, ఢెంకనాలు మొదలగు సంస్థానాలలో కూడా సంస్థాన ప్రజా ఉద్యమాలు ఉవ్వెత్తుగా లేచినవి. సంస్థానాధీశులు తీవ్ర నిర్బంధ విధానాలతో ఈ ప్రజా ఉద్యమాలను అణచివేయ సమకట్టారు.

## 400 పైగా సత్యాగ్రహుల అరెస్టు

హైదరాబాదు సంస్థానంలో కూడా ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వం కావా లని కోరుతూ, సత్యాగ్రహం జరిగింది. గోవిందరావు నానల్ ప్రథమనియంతగా ఒక 'కార్యాచరణ సంఘం' ఏర్పడింది. 1938 సెప్టెంబరు 7న స్టేట్ కాంగ్రెస్ నిషేధించ బడింది. పౌరసత్వహక్కుల కోసం కాంగ్రెస్ తీవ్ర ఆందోళన గావించింది. ప్రథమ సత్యాగ్రహ జట్టులో గోవిందరావు నానల్, రామకృష్ణదూత్, జనార్ధనరావు దేశాయ్, శ్రీనివాసరావు బోలికర్, రావి నారాయణరెడ్డి ప్రభృతులు అరెస్టు అయి జైలు శిక్షలకు గురి అయినారు. తర్వాత జట్లుజట్లుగా హైదరాబాదులో, వరంగల్లులో తదితర

ప్రాంతాల్లో వలంటీర్లు జైలు యాత్రసాగించారు. జమలాపురం కేశవరావు, టి. హయ గ్రీవాచారి, కాశోజీ మొదలగువారు 411 మంది సత్యాగ్రహం చేసి జైళ్ళకెళ్లారు. స్టేట్ కాంగ్రెస్ నాయకత్వాన జరిగిన మొదటి స్వాతంత్ర్య పోరాటంయిది.

ఈ సమయంలో ఆర్యసమాజం, హిందూ మహాసభ అధ్వర్యాన కూడా స్టేట్‌లో తీవ్రంగా సత్యాగ్రహ సమరం సాగింది. ఇందువల్ల మత సంఘర్షణలకు దారితీస్తే వేమోనన్న కారణంతో, గాంధీజీ యిచ్చిన సలహాను పాటించి, స్టేట్ కాంగ్రెస్, సత్యాగ్రహ పోరాటాన్ని విరమించడం జరిగింది. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు స్వామిరామానంద, వార్ధాలో సమావేశమై సత్యాగ్రహ ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలిపివేస్తూ తీర్మానించారు.

## వందేమాతరం ఉద్యమం :

1905 బెంగాలు విభజనాందోళన సందర్భంలో, జరిగిన వందేమాతరం ఉద్యమాన్ని గురించి లోగడ తెలుసుకున్నాము. హైదరాబాదు యూనివర్సిటీ విద్యార్థులు దసరా ఉత్సవాల సందర్భంలో 'వందేమాతరం' గీతాన్ని ఆలాపించడంతో ఇక్కడఈ వందేమాతరం ఉద్యమం ప్రారంభమైంది. 1939 నవంబరు 29వ తేదీన ప్రోచాన్సలర్ ఆ గీతాన్ని విద్యార్థులు పాడరాదని నోటీస్ జారీ చేశాడు. విద్యార్థులు ఆయన నోటీస్‌ను ఖాతరు చేయలేదు. సమ్మిష్టిగా గీతాన్ని పాడసాగారు. తెలుగు, కన్నడ, మరాఠీ సంస్కృతం భాషలను తరగతులలో బోధించాలని విద్యార్థులు ఆందోళన చేశారు. నవంబరు 29వ తేదీనుంచి డిసెంబరు 10వ తేదీ వరకు విద్యార్థులు సమ్మెసాగించారు. సమ్మె యితర జిల్లా కేంద్రాలకు కూడా వ్యాపించింది.

ఔరంగాబాదు, బీదర్, నాందేడ్, పర్భిణి, వరంగల్లు మొదలగు ప్రదేశాలలో కూడా విద్యార్థులు సమ్మె చేశారు. ఉస్మానియా యూనివర్సిటీ కళాశాల విద్యార్థులను 350 మందిని, సిటీకాలేజి విద్యార్థులను 70 మందిని, గుల్బర్గా కళాశాల, హైస్కూళ్ళ విద్యార్థులను మహబూబ్‌నగర్ హైస్కూలు విద్యార్థులను 310 మందిని విద్యాలయాధికార్లు 'ఖర్తరఫ్' చేశారు. ఆ విధంగా బహిష్కరింపబడిన విద్యార్థులను ఏ విశ్వవిద్యాలయంలో చేర్చుకోరాదని ప్రకటించారు.

హరిపురా, త్రిపురి కాంగ్రెస్ మహాసభలకు సుభాస్‌చంద్రబోస్ అధ్యక్షత వహించారు. స్టేట్ నుండి పలువురు ఆ మహాసభలకు వెళ్ళి రాజకీయ నాయకులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొన్నారు. ఆ ప్రభావం స్టేట్ రాజకీయాలపై బడింది.

విద్యార్థులు, అధ్యాపకులు, యువకులు, ప్రభావితులైనారు. ఫలితంగా స్టేట్‌లో జరిగిన సత్యాగ్రహానికి, వందేమాతరం ఉద్యమానికి మంచి బలం చేకూరింది.

ఉస్మానియా యూనివర్సిటీ వారు తొలగించిన విద్యార్థులను ఎక్కడా చేర్చుకో రాదని ప్రకటించినా, నాగపూర్ యూనివర్సిటీ పాలకవర్గంవారు, హైదరాబాదు స్టేట్ విద్యార్థులకు తమ విశ్వవిద్యాలయంలో అవకాశం కలిగించి, వారి భవిష్యత్ విద్యాభి వృద్ధికి దోహదమిచ్చారు. తదనంతర కాలంలో హైదరాబాదు ప్రజాప్రభుత్వంలో శాసన సభ్యులు, మంత్రులుఅయిన నూకల రామచంద్రారెడ్డి, పి.వి. నరసింహారావు, అచ్యుత రెడ్డి మున్నగువారు; దేవులపల్లి వెంకటేశ్వరరావు, ఆరుట్ల రామచంద్రారెడ్డి, బి. ధర్మ భిక్షం, వందేమాతరం రామచంద్రరావు మొదలగు రాజకీయ కార్యకర్తలు ఈ వందే మాతరం ఉద్యమంలో తీవ్రంగా పాల్గొన్నవారే.

వందేమాతరం గీతం ప్రార్థనా మందిరాల్లో పాడుకునేహక్కు విద్యార్థులకు గల దని ప్రోత్సహిస్తూ గాంధీజీ జవహర్‌లాల్‌నెహ్రూ సుభాస్‌చంద్రబోస్ సావర్కార్ మున్నగు దేశనాయకులు సందేశాలు పంపించారు.

## ధూల్‌పేట తప్పుడు కేసు:

హైదరాబాదు నగర నడిగడ్డలో ధూల్‌పేట వుండేది. ఉగ్రమాన్‌సింగ్ ఒక రాజ కీయ వారపత్రికను నడుపుతుండేవాడు. ప్రథమ స్వాతంత్ర్య యుద్ధకాలంలో వీరు బుందేల్‌ఖండ్ లోధియానా ప్రాంతాల నుండి వచ్చి ఇక్కడే స్థిరనివాసం ఏర్పరుచు కొన్నారు. వీరిని 'లోధాలు' అని పిలిచేవారు. లాలాపహిల్మాన్ మున్నగు వారు ఇక్కడ తాలింఖానాలుపెట్టి కసరత్ చేయడం నేర్పుతుండేవారు. సయ్యద్ జలాలుద్దీన్ సమాధివద్దకు ముస్లిం సోదరులు ఊరేగింపు చేసే సమయంలో ఎవరో ఒక ముస్లిమును కత్తితో పొడిచి చంపారనే నేరంపైన ఉగ్రమాన్‌సింగ్ లాలాపహిల్మాన్ మొదలగు 24 మందిని నిజాం ప్రభుత్వం అరెస్టుచేసింది. 1938 ప్రాంతంలో ఈ కేసు కొంత రాజకీయ ప్రాముఖ్యతను సంతరించుకొంది. కె. ఎఫ్. నారిమన్ బూలాబాయ్‌దేశాయ్ బ్రిజ్‌నారాయణ తవక్లి బూర్గుల రామకృష్ణారావు కాశీనాథరావు వైద్య మున్నగు న్యాయవాదులు ముద్దాయీల తరపున న్యాయవాదులుగా వాదించారు. హైకోర్టు కొందరికి యావజ్జీవ కారాగార శిక్షలు విధించింది. జుడిషియల్ అపీలులో కొందరు నిరపరాధు లని తీర్పు చెప్పకతప్పలేదు. కొందరు ముద్దాయీలు ఈ కేసులో శిక్షలనుభవించారు. అప్పట్లో ఈ కేసు కొంత సంచలనం కలిగించింది.

## బూటకపు రాజకీయ సంస్కరణలు

1938లో స్టేట్ కాంగ్రెస్ సాగించిన సత్యాగ్రహం, సంస్థాన ప్రజల ఆందోళనా ఫలితంగా 1939లో నిజాం ప్రభుత్వం కొన్ని బూటకపు సంస్కరణలు ప్రకటించింది. అవి కళ్ళనీళ్ళు తుడుపు మాత్రమేనని ప్రజలు గ్రహించారు 1946లో కూడా స్వల్ప మార్పులతో ఈ విధమైన సంస్కరణలనే మరల ప్రవేశపెట్టదలచింది. వాటిని బట్టి నూటికి 99 మందికి ఓటింగ్ హక్కు వుండదు. వంద రూపాయలు పన్ను చెల్లించే వారికే ఓటు హక్కు ప్రసాదించారు.

శాసన సభకు ఎట్టి అధికారాలు లేవు. శాసన సభ చేసిన తీర్మానాలను 'బాబేహుకుమత్' (ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్) అమలు జరపాలని నియమంలేదు. ఇది శాసన సభకు బాధ్యత వహించదు, నిజాం ప్రభువు ఈ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌ను నియమిస్తాడు ఈ కౌన్సిల్ నిజాం నవాబుగారి ఆజ్ఞలను శిరసావహిస్తుంది. ఈ రాజకీయ సంస్కరణల మూలంగా సంస్థాన ప్రజలకు జరిగిందేమీలేదని ప్రజలకు తేటతెల్లమైంది. ప్రభుత్వం ప్రకటించిన సంస్కరణలు అధిక సంఖ్యాకులైన హిందువులకు అల్ప సంఖ్యాకులైన ముస్లిములకు సమాన ప్రాతినిధ్యం కల్పించడం ద్వారా సంస్థానంలో మత కలహాలకు పునాదులు వేసినట్లయింది. నిష్పాక్షిక రాజకీయ పరిశీలకులు, విజ్ఞులైనవారు ప్రభుత్వ బూటకపు సంస్కరణలకు నిరసన తెల్పారు.

# క్విట్ ఇండియా ఉద్యమం-1

1939 సంవత్సరంలో ద్వితీయ ప్రపంచ యుద్ధం వచ్చిపడింది. జర్మనీ నియంత హిట్లర్ యూరప్‌లోని పెద్ద, చిన్న రాజ్యాలను చాలా వాటిని ఆక్రమించు కున్నాడు. ఇటలీ ముస్సోలినీ, జపాన్ టోజో హిట్లరుకు తోడైనారు. ప్రపంచాధిపత్యం కోసం సోవియట్ రష్యాపై హిట్లర్ దాడి చేశాడు.

భారత ప్రజాభిప్రాయంతో నిమిత్తం లేకుండా, బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం భారతదేశాన్ని యుద్ధంలోకి లాగింది. ఇందుకు నిరసన తెల్పుతూ, కాంగ్రెస్ మంత్రి వర్గాలన్నీ రాజీనామా చేసినవి. కాంగ్రెస్ కోరిన జాతీయ ప్రభుత్వ నిర్మాణాన్ని పర ప్రభుత్వం తిరస్కరించింది.

ఆట్టి స్థితిలో ఫాసిజం జయిస్తే ప్రపంచంలో ప్రజా స్వామ్యానికి రాగల ప్రమా దాన్ని కాంగ్రెస్ సంస్థ గుర్తించింది. అయితే, భారతదేశంలో జాతీయ ప్రభుత్వ ఏర్పాటుకు బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించక పోవడం వల్ల, కాంగ్రెస్ 1940 సెప్టెం బరులో యుద్ధ ప్రతికూలంగా వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించింది.

## 1940 వ్యష్టి సత్యాగ్రహం :

అహింసావ్రతులైన సత్యాగ్రహులు మాత్రమే ఈ వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొనే అర్హత కలిగి వుంటారని గాంధీజీ స్పష్టం చేశారు మొట్ట మొదటి సత్యా గ్రహిగా ఆచార్య వినోబా భావేను, ఆ తర్వాత జవహర్‌లాల్ మున్నగు వారిని ఎంపిక చేశారు. దేశ మంతటా ఈ విధమైన వ్యక్తి సత్యాగ్రహం సాగింది.

> "భారత జాతీయ కాంగ్రెస్ ఆదేశానుసారం నేను ఈ యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నాను. ఈ యుద్ధ నిర్వహణకై ప్రభుత్వానికి ఎట్టి సహకారం ఇవ్వవద్దని నా తోటివారిని కోరుతున్నాను." అని సత్యాగ్రహులు ప్రకటించే వారు.

ఎక్కడ ఎప్పుడు ఏ సమయంలో సత్యాగ్రహం చేయబోతున్నదీ సత్యాగ్రహి ముందుగా ప్రభుత్వాధికార్లకు తెలిపి, ఆ ప్రకారం చేయవలసి వుంటుందని గాంధీజీ ఆదేశించారు. ఆ ప్రకారమే సత్యాగ్రహులందరు చేసేవారు వ్యక్తి సత్యాగ్రహం చేయదలచిన వారి పేర్ల జాబితా ముందుగా గాంధీమహాత్మని అనుమతి పొందవలసి వుంటుంది.

1941 జనవరి నాటికి రాష్ట్రానికి 2250 మంది సత్యాగ్రహులు అరెస్టులకు గురి అయినారు. ఆ ఏప్రిల్‌నాటికి దేశంలో సత్యాగ్రహుల సంఖ్య 14 వేల మందికి పైగా పెరిగింది.

ఈ దశలో కాంగ్రెస్ ముస్లింలీగ్ నాయకులతో రాజీ సంప్రదింపులు సాగించేందుకు, సర్‌స్టాఫర్డ్ క్రిప్సుమిషన్‌ను బ్రిటిష్ ప్రభుత్వం యిక్కడకు పంపించింది. 'క్రిప్సు పథకం' ఎవరికీ ఆమోదయోగ్యం కాలేదు. జాతీయ కాంగ్రెస్ కార్యవర్గం ఆ ప్రతిపాదనలను తిరస్కరించింది.

## ఆంధ్రలో వ్యష్టి సత్యాగ్రహం :

ఆంధ్రదేశంలో మూడు మాసాలకాలంలో 1423 మంది వ్యష్టి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. ప్రకాశం మదరాసులో, పట్టాభి బందరులో, పార్లమెంటు శాసన సభ్యులు, వారి వారి నియోజకవర్గాలలో ఈ సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయినారు. మహిళలు కూడా యిందు పాల్గొన్నారు.

అప్పట్లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగా కళా వెంకటరావు వుండేవారు. ఆయన అరెస్టు అయ్యే సందర్భంలో, రాష్ట్ర సంచాలకునిగా (డిక్టేటర్) మంతెన వెంకటరాజును నియమించి జైలుకు వెళ్లారు. గాంధీజీ సలహాతో ఆయన వ్యష్టి సత్యాగ్రహాన్ని కొనసాగించారు. జిల్లాకొక ముఖ్యునివంతున కాంగ్రెస్ పక్ష 'ఏజెంట్లను' నిర్ణయించారు. వారి పర్యవేక్షణతో, ఈ సత్యాగ్రహం సాగింది. మంతెన వెంకటరాజు అరెస్టు అవుతూ, తర్వాత గొల్లపూడి సీతారామశాస్త్రిని నియమించి, జైలు కెళ్లారు. పోలీసులు సీతారామశాస్త్రిని కూడా అరెస్టు చేశారు. ఆ విధంగా ఈ వ్యక్తి సత్యాగ్రహం సాగింది.

## గుంటూరు జిల్లాలో అరెస్టులు-జరిమానాలు

| | | | |
|---|---|---|---|
| 1. రావి సత్యనారాయణ | తెనాలి | 3 నెలలు జైలుశిక్ష | రూ 300/- |
| 2. ఎం. మాణిక్యరావు | బాపట్ల | 6 నెలలు శిక్ష | రూ 200/- |
| 3. నీలం రామయ్య | తెనాలి | 4 నెలలు | రూ 100/- |
| 4. కె. కుమారస్వామి | వెల్లటూరు | 3 నెలలు | రూ 300/- |
| 5. జి. సుబ్రహ్మణ్యం | గుంటూరు | 4 నెలలు | |
| 6. ఎం. బి. సుబ్బారావు<br>7. ఎం. నాగేశ్వరరావు | ,, | 4 నెలలు శిక్ష | రూ 200/- |

| | | | |
|---|---|---|---|
| 8. అప్పుతు సుబ్బారెడ్డి | తెనాలితాలూకా | 6 నెలలు | |
| 9. పి రామారావు | ,, | ,, | |
| 10. గార్లపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి | గుంటూరు | 4 నెలలు | |
| 11. నల్లూరి రాజయ్య | కూచిపూడి | 4 నెలలు | |
| 12. అంపత్తి సుబ్బయ్య | తెనాలి | ,, | |
| 13. ఎస్. బలరామకృష్ణయ్య | పేరికంపూడి | ,, | |
| 14. జె. బసవపున్నయ్య | పరిమి | ,, | |
| 15. బి. కోటిశంకరనారాయణ | పురుషోత్తపట్నం | 6 నెలలు | |
| 16. కె. సీతారామయ్యచౌదరి | | 4 నెలలు | రూ 300/- |
| 17. ఎస్. కృష్ణయ్యచౌదరి | | ,, | |
| 18. ఎం. గోవిందరావు | | ,, | |
| 19. జి. చంద్రశేఖరం | | ,, | |
| 20. కె. సుబ్బారావు | | ,, | |
| 21. రావూరి అయ్యవారప్ప | | 3 నెలలు | |
| 22. కనకదుర్గాప్రసాద్‌గుప్తా | | ఒక సంవత్సరం | |
| 23. వి. బసవయ్య | | 4 నెలలు | |
| 25. ఎన్. వెంకటసుబ్బారావు | | ,, | |
| 26 రావి చినఅమ్మయ్య<br>27. నన్నపనేని వెంకట్రావు<br>28. పి. కృష్ణమూర్తి<br>29. ఎల్. సుబ్బారెడ్డి | తెనాలి | | |
| 30. కె. వెంకటరామశర్మ | నరసరావుపేట | 6 నెలలు | |
| 31. వావిలాల మాణిక్యాంబ | మాదల | 6 నెలలు | |
| 32. అప్పుతురామిరెడ్డి | సత్తెనపల్లి | 6 నెలలు | |
| 33. గొల్లమూడి దాసయ్య | అమరావతి | 3 నెలలు | రూ 200/- |
| 34. వి. సూరయ్య | గుంటూరు | 4 నెలలు | రూ 100/- |
| 35. ఆర్. భద్రాద్రి రామశాస్త్రి | | 3 నెలలు | |
| 36. ఎం. దక్షిణామూర్తి | చీరాల | 4 నెలలు | రూ 300/- |

| | | | |
|---|---|---|---|
| 37. వల్లూరు నరసింహాచార్యులు | | | |
| 38. ఎ. గోపాలకృష్ణయ్య | | 4 నెలల చొప్పున | |
| 39. గోళ్లమూడి పిచ్చయ్య | | | |
| 40. వి. రామానీడు | | | |
| 41. ఆర్. సుబ్బారెడ్డి | | 6 నెలలు | రూ 50/- |
| 42. జి. రామబ్రహ్మం | | 6 వారాలు | రూ 50/- |
| 43. పోతరాజు విశ్వనాథశర్మ | | 6 నెలలు | |
| 44. కూచిభొట్ల రామకృష్ణయ్య | రేపల్లె | 4 నెలలు | |
| 45. ఎం. అంజయ్య | ,, | ,, | |
| 46. జె. రామస్వామి | ,, | ,, | |
| 47. కె. సీతారామయ్య | ,, | ,, | |
| 48. వి. నాగభూషణం | తెనాలి తాలూకా | ,, | |
| 49. కె. వెంకయ్య | ,, | ,, | |
| 50. కె. హరిశ్చంద్రమహారాజు | ఈపూరు | 4 నెలలు | |
| 51. కె. వెంకటకృష్ణమూర్తి | వేటపాలెం | 4 నెలలు | రూ 100/- |
| 52. ఒ. పున్నయ్య | గుంటూరు | 2 నెలలు | |
| 53. ఎ. త్రిపురసుందరరావు | ,, | 2 నెలలు | |

ఈ విధంగా వ్యష్టి సత్యాగ్రహంలో జిల్లాలో 119 మంది పాల్గొని జైలు కెళ్ళారు వీరిలో 8 మంది మహిళలు కూడా వున్నారు. మరికొందరు సత్యాగ్రహం చేసినా, పోలీసులు వారిని అరెస్టుచేయలేదు. అట్టివారు గ్రామాలలో పాదయాత్రలు చేస్తూ యుద్ధ ప్రతికూల ప్రచారం చేసేవారు దేశరక్షణ చట్టం క్రింద జె. రామలింగయ్య, అన్నాప్రగడ కామేశ్వరరావు, పి వి. శివయ్య మున్నగువారిపైన అరెస్టు వారంట్లు జారీ చేయబడినవి.

## కృష్ణా జిల్లాలో అరెస్టులు-జరిమానాలు :

కృష్ణా జిల్లా నుండి ఎర్నేని సుబ్రహ్మణ్యం, అయ్యదేవర కాళేశ్వరరావు, వేముల కూర్మయ్య, కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు మున్నగు వారు వేర్వేరు ప్రదేశాలలో యుద్ధ ప్రతికూల నినాదాలుచేసి అరెస్టు అయినారు.

సాధు సుబ్రహ్మణ్యంగారి కుటుంబంలోని ఎర్నేని అమృతమ్మ, లీలావతమ్మ, కస్తూరిదేవి, రాధా మనోహరం, అరెస్టు అయినారు. పూనూరి సుందరమ్మ, గాదిరెడ్డి పుట్టమ్మ, మునిరెడ్డి అన్నపూర్ణమ్మ, గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మ, మున్నగు మహిళా మణులు వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

నందిగామ తాలూకాలో సూర్యదేవర అన్నపూర్ణమ్మను అరెస్టుచేసి, తర్వాత విడుదల చేశారు. తిరువూరు తాలూకాలో చిలుకూరి సత్తిరెడ్డికి 3 మాసాలు జైలుశిక్ష, వెయ్యిరూపాయిల జరిమానా విధించారు. ఆయన 6 మాసాల జైలుశిక్ష అనుభవించినా, జరిమానా క్రింద ఆయన ఆస్తిని జప్తు చేశారు.

ముష్టిగుంట్ల వాస్తవ్యుడు గద్దె రంగయ్యనాయుడు మదరాసు నగరంలో వ్యక్తి సత్యాగ్రహంలో కూడా పాల్గొని అరెస్టు అయినారు.

అయ్యదేవర కాళేశ్వరరావు, కాకాని వెంకటరత్నం, గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు, మరుపిళ్ళ చిట్టి-భ్రమరాంబ మొదలగు జిల్లా నాయకులు బెజవాడ, బందరు పట్టణాలలో అరెస్టు అయినారు. ఈ విధంగానే, వివిధ ప్రాంతాలలో వ్యక్తి సత్యాగ్రహాలు అనంతరం, ఆగస్టు ఉద్యమం జరిగింది.

## ఆంధ్రలో ఆగస్టు ఉద్యమం :

> "ఆంధ్ర దేశంలో 21 ప్రదేశాలలో పోలీసు కాల్పులు జరిగినవి. 39 మంది మరణించారు. (దేశంలో 68 చోట్ల సైనిక కాల్పులు జరిగినవి. 297 మంది మరణించారు.) 6 పోలీసు స్టేషన్లు ధ్వంసం చేయబడినవి. 17 చోట్ల బాంబులు ప్రేలినవి. ఒక ఇర్రిగేషన్ సిస్టంకు, 41 విద్యుత్ సరఫరా యంత్రాలకు నష్టం వాటిల్లింది. 232 చోట్ల రోడ్లకు నష్టం కలిగింది. ప్రభుత్వం యిద్దరికి మరణ శిక్ష విధించింది. 285 మందికి కొరడా దెబ్బలు తగిలినవి. 5,729 మంది అరెస్టు చేయబడినారు." అని ప్రభుత్వ రికార్డుల ద్వారా తెలుస్తున్నది.
>
> —'Freedom Struggle in A.P.'
> written by Dr. Sarojini Regani

## బొంబాయి ఎ.ఐ.సి.సి. సభ :

1942 ఆగస్టు 8వ తేదీన బొంబాయిలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశమై,గాంధీజీ ప్రతిపాదించిన "క్విట్ ఇండియా"(భారతదేశంనుండి వైదొలగిపోండి) అనే తీర్మానాన్ని ఆమోదించింది.

> "ఈ క్షణం నుండి ప్రతి భారతీయుడు తాను సర్వ స్వతంత్రుడనని భావించుకోవాలి. భారతజాతికి నేను ఉపదేశించే మంత్రం యిదే, (Do or die) విజయమో-వీర స్వర్గమో! మనం యిప్పుడు భారత స్వాతంత్ర్యాన్ని సాధించుకోడమో! లేక ఈ మహాప్రయత్నంలో మరణించడమో! జరగాలి. దేవునిసాక్షిగా మీరిట్టి ప్రతిజ్ఞచేయండి" అని గాంధీ మహాత్ముడు ప్రభోదించారు.

ఎ.ఐ.సి.సి. సభలో క్విట్ ఇండియా తీర్మానం ఆమోదించబడగానే, ప్రభుత్వం గాంధీ, నెహ్రూతో సహా కాంగ్రెస్ అగ్రనాయకులనందరినీ అరెస్టు చేసింది. నాయకుల అరెస్టు వార్తలు చెవినపడగానే ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. దేశమంతటా కల్లోలాలు చెలరేగినవి తంతితపాలా రైల్వే మొదలగు ప్రభుత్వ కార్యాలయాలపైన, పోలీస్ స్టేషనులపైన ప్రజలు దాడులు చేశారు.

ప్రభుత్వం క్రూర నిర్బంధాలకు పూనుకొంది. పలుచోట్ల కాల్పులు జరిగాయి. కొన్ని చోట్ల సైనికులు మెషీన్‌గన్‌లను ఉపయోగించారు. పశుబలం రాజ్యం చేసినట్లయింది. అయినా, 'మన దేశాన్ని స్వతంత్రం చేయాలి. ఈ మహాప్రయత్నంలో ఆహుతి కావాలి' అని గాంధీజీ యిచ్చిన సమరసందేశం యువకులను, విద్యార్థులను కార్యరంగంలోకి దింపింది. నాయకులు జైళ్ళలో మ్రగ్గుతున్న తరుణంలో ఎవరికి తోచినరీతి వారు వ్యవహరించారు. ఎట్టి త్యాగాలకైనా వెనుకాడలేదు.

## ప్రభుత్వ నిర్బంధాలు :

దేశంలో 250 రైల్వేస్టేషనులు, 500 పోస్టాఫీసులు ధ్వంసం చేయబడినాయని, 150 పోలీస్ స్టేషనులపైన ఉద్యమకారులు దాడులు జరిపారని, అధికార్లను చంపివేశారని ప్రభుత్వం అధికారికంగా ప్రకటించింది.

1942 ఆగస్టు 9 నుండి 1942 డిసెంబరు 31వ తేదీ వరకు 60,229మంది ఉద్యమకారులను ప్రభుత్వం అరెస్టు చేసింది. 18 వేలమందిని ఎట్టి నేరారోపణలు

లేకుండానే 'డిటైన్' చేసింది ఇవి ప్రభుత్వం ప్రకటించిన లెక్కలు. కాని మరెందరో వేలాది మంది నిర్బంధాలకు, లాఠీదెబ్బలకు, కాల్పులకు గురి అయినారు. ప్రజలపైన సామూహిక జరిమానాలు విధించడం జరిగింది.

చిమ్మూరు, అష్టీలలో బ్రిటిష్ సైనికులు ప్రజలపైన అతి ఘోరమైన అత్యాచారాలు జరిపారు. అయితే పరప్రభుత్వ కర్కశ విధానాన్ని ఎదిరించి, ఉత్సాహోద్రేక పరులైన యువకులు, విద్యార్థులు గొప్ప త్యాగశక్తిని, ధైర్యసాహసాలను ప్రదర్శించారు.

సతారాజిల్లా ప్రజలు నానాపాటిల్ నాయకత్వాన పోటీప్రభుత్వంగా పంచాయతీ రాజ్యాన్ని స్థాపించడం, దేశీయులను ఎంతో ఉత్తేజపరిచింది. ఈ ఆగస్టు ఉద్యమ సందర్భంలో అజ్ఞాతంలో వుండి (Under ground Movement) జయప్రకాశ్ నారాయణ, అరుణ అసఫాలి, అచ్యుతపట్వర్ధన్ ప్రభృతులు నిర్వహించిన రహస్య ఉద్యమం, వారుసాగించిన పోరాటకార్యకలాపాలు దేశీయుల ప్రశంసలకు పాత్రమైనవి.

## రాయల సీమలో :

కర్నూలు జిల్లాలో 190 మంది సత్యాగ్రహులు,

కడప జిల్లాలో 160 మంది సత్యాగ్రహులు,

అనంతపురం జిల్లాలో 98 మంది సత్యాగ్రహులు "వ్యక్తి సత్యాగ్రహం"లో పాల్గొనేందుకు గాంధీమహాత్ముని అనుమతి లభించింది. వీరిలో పలువురు ఆరెస్టుకు గురి అయినారు. అరెస్టు చేయబడని సత్యాగ్రహులు, యుద్ధ నినాదాలు చేస్తూ పాదయాత్రలు ప్రచారాలు గావించారు.

1942 ఆగస్టు ఉద్యమం సందర్భంగా, ఉద్యమ కారులు గుంతకల్లు సమీపాన రైల్వేలైనులమీద రాళ్లు, తుపాకీ మందు బస్తాలుపెట్టి, రైళ్ల రాకపోకలకు తీవ్రఅంతరాయం కలిగించారు.

పెనుకొండ వద్ద పాఠశాల డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ కార్యాలయానికి బోర్డు హైస్కూలుకు నిప్పంటించారు. విద్యార్థులు సమ్మె చేశారు అనేక చోట్ల తంతితపాలా తీగెలు త్రెంచి వేశారు. తాటిచెట్లు నరికి వేశారు.

ప్రభుత్వం కమ్మకొట్టాల గ్రామం మీద రూ 20వేలు, కొట్టాలపల్లి మీద రూ 5 వేలు పెద్దప్యాపలి మీద రూ 2 వేలు, సమ్మిష్టి జరిమానాలు విధించింది.

ప్రొద్దుటూరులో లూఠీలు జరిగాయి. అగదూరు, పాలగిరి, అనిమాల, వీరప్ప నాయునిపల్లి తుమ్మలపల్లి అంకాళానవపల్లె గ్రామ ప్రజలపైన సామూహిక జరిమానాలు విధించారు,

# క్విట్ ఇండియా ఉద్యమం-2

## గుంటూరు జిల్లాలో :

'క్విట్ ఇండియా' ఉద్యమ సందర్భంలో గుంటూరు జిల్లా అగ్రశ్రేణిలో వుండి పోరాడింది. 'కృష్ణాపత్రిక' నుండి, 'ఆంధ్రపత్రిక' నుంచి లభించినంతవరకు సేకరించి యిందు పొందు పరిచాను.

తెనాలి, గుంటూరు, నిడుబ్రోలు, చీరాల మున్నగు చోట్ల జనసమూహంపై పోలీసులు కాల్పులు సాగించారు. ప్రజలు రైల్వే తంతి తపాలా, రోడ్డురవాణా మొదలగు ప్రభుత్వ ఆస్తులకు నష్టం కలిగించారు. యువకుల కోపాగ్నికి బాపట్ల, చెరుకుపల్లి సబ్ రిజిస్ట్రార్ ఆఫీసుల్లోని రికార్డు దగ్ధమైపోయింది.

ప్రభుత్వం నిడుబ్రోలు, పొన్నూరు, అప్పికట్ల, చీరాల ఒంగోలు మొదలగు అనేక ప్రదేశాలపైన సామూహిక జరిమానాలు విధించింది. మలబార్ రిజర్వు దళాలను రప్పించి గ్రామాలపైన దాడులు చేయించింది. పలువురు ఉద్యమ నాయకులను జైళ్ళలో నిర్బంధించింది.

## ప్రభుత్వ రైల్వే ఆస్తుల ధ్వంసం।

1942 ఆగస్టు 12వ తేదీ బుధవారం ఉదయం 9 గంటలకు 2 వేలమంది జనం తెనాలి రైల్వే స్టేషన్ మీదకు ఎగబడి, ప్రక్కనేవున్న గూడ్స్ షెడ్‌కు నిప్పంటించారు. అది తగలబడింది. ఇదే సమయంలో మదరాసు నుంచి పూరీ పాసింజర్ రాగా, ప్రయాణీకులను దించివేసి, రైలు బండికి నిప్పు పెట్టారు. నాల్గు పెట్టెలు నిశ్శేషంగా కాలిపోయినవి. రైలు పట్టాలు పీకి వేశారు. తంతి తపాలా తీగెలను త్రెంచి వేశారు. అంతట జిల్లా మేజస్ట్రేట్ పోలీస్ సూపరింటెండెంటు రిజర్వు బలగంతో వచ్చి పడ్డారు. పోలీసులకు-ప్రజల మధ్య కొంత సేపు సంఘర్షణ జరిగింది. పోలీసులు లాఠీ చార్జీ చేశారు. యువకులు రాళ్లు రువ్వారు. పోలీసులు తుపాకీ కాల్పులు సాగించారు. నల్గురు మరణించారు. 10 మందికి గాయాలు తగిలినవి.

చుండూరు వద్ద పాసింజర్ బండికి ప్రజలు నిప్పంటించారు. 12వ తేదీన దుగ్గిరాల రైలు స్టేషన్‌కు తగుల పెట్టారు. రైలు పట్టాలు పీకివేయడంవల్ల బెజవాడ-ఒంగోలు స్టేషనుల మధ్య రాక పోకలు ఆగిపోయినవి.

సంగంజాగర్లమూడి వద్ద ప్రజలు రైలుస్టేషన్‌ను తగులపెట్టారు. గుంటూరు—మాచెర్ల, గుంటూరు—బెజవాడ మధ్య, గుంటూరు—తెనాలి మధ్య జనం రైలుపట్టాలు పీకి వేశారు. గుంటూరు—నంబూరుమధ్య పాసింజరు రైలుబండి పట్టాలు తప్పి, ఇంజన్, బోగీలు పల్టీలుకొట్టినవి.

## సమ్మిశ్రిష్టి జుల్మానాలు :

మదరాసు ప్రభుత్వం రాష్ట్రంలో రూ 2 లక్షల, 35 వేలు సమ్మిశ్రిష్టి జరిమానాలు విధించినట్లు ప్రకటించింది.

జిల్లాలో చీరాల, పేరాల, బోడిపాలెం, రామకృష్ణపాలెం, నవాబుపేటలపైన రూ 75 వేలు; నిడుబ్రోలు, పొన్నూరు గ్రామాలపైన రూ 20 వేలు, ఒంగోలు పట్టణం పైన రూ 5 వేలు, బాపట్ల, విజయలక్ష్మిపురం,మనుబ్రోలు, మండవపాలెం మీద రూ 5 వేలు సమ్మిశ్రిష్టి జుల్మానాలు విధించబడినవి.

నవంబరులో వెలువోలు సీతారామయ్య, అలపర్తి సుబ్బయ్య, రాజయ్య, చిట్టినేని అచ్చయ్య, బొడ్డపాటి సుబ్బారావు, పుతుంబాక శ్రీరాములు

మొదలగు కాంగ్రెసు వాదులను డెటిన్యూలుగా పట్టుకొని, రాయవెల్లూరు జైలులో నిర్బంధించారు.

## దేశభక్తుల అరెస్టులు :

దుగ్గిరాల కేసులో వెనిగెళ్ల సత్యనారాయణ, మరి నల్గురికి జైలు శిక్షలు విధించారు. చిలువూరువద్ద రైలు పట్టాలు పీకిన కేసులో ఎడ్ల లింగయ్య, సీతయ్య, మరి నల్గురికి జైలు శిక్షలు విధించారు.

ఒంగోలులో గుళ్లపల్లి ఆదినారాయణ, నరిహరి పద్మనాభం మొదలగు వారిని అరెస్టుచేశారు. పద్మనాభంను కొరడా దెబ్బలు కొట్టారు.

ఒంగోలులో జాస్తి వెంకటనరసయ్య (తెలుగు పండితుడు), రాపర్ల ఆదినారాయణ (అమృతలూరు), ఆకుల లక్ష్మినరసింహరావు (మూల్పూరు), రామానందస్వామి (తెనాలి) గార్లకు రెండు సంవత్సరాల చొప్పున శిక్షలు విధించబడినవి. చదలవాడ సీతారామాంజనేయులుకు 2 ఏండ్లు శిక్ష వేశారు.

గుంటూరు పట్టణంలో పున్నవ లక్ష్మినారాయణను అరెస్టు చేశారు. వారింట్లో నిషేధ కరపత్రాలు వున్నవని సోదా చేశారు.

తెనాలి సబ్‌కోర్టువద్ద పికెటింగ్ చేసిన నేరానికి ఉప్పల అన్నపూర్ణమ్మ (గోళ్ల మూడిపాడు), రావెళ్ళ వెంకాయమ్మ (చేబ్రోలు), అరమండ ఉషాదేవి (కూచిపూడి) మోదుగుల కౌశల్యమ్మ (మూల్పూరు) మున్నగు మహిళా వలంటీర్లను పోలీసులు అరెస్టు చేశారు. వీరికి ఒక్కొక్కరికి 18 మాసాల చొప్పున జైలు శిక్షలు విధించబడినవి

గుంటూరు అరండల్‌పేట ఇన్‌కంటాక్స్ ఆఫీస్‌లో ఎవరో బాంబుపెట్టారు. మాడభూషి శేషాచారి, గోవిందరాజుల సత్యనారాయణ, లింగమల్లి వెంకటేశ్వర్లు మున్నగు వలంటీర్లను పట్టుకొని, పోలీసులు విపరీతంగా కొట్టారు. అజ్ఞాతవాసంలోని భయంకరాచారి ఆచూకీ చెప్పండని దప్పల సుబ్బారాయుడు ఆ వలంటీర్లను నిర్బంధించారు.

చెరుకుపల్లి సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయాన్ని ప్రజలు తగుల పెట్టారు. ఆ కేసు సందర్భంలో డాక్టర్ భృగుబండ మృత్యుంజయుడు ఒక ఏడాది రహస్యంగా వుండి ఉద్యమాన్ని సాగించారు.

మాదల గ్రామ కేసు సందర్భంలో వావిలాల గోపాలకృష్ణయ్యను డెటెన్యూగా నిర్బంధించారు.

తెనాలిలో నగర సంకీర్తన చేసినందుకు నందిరాజు అమరయ్య, వై. రామకోటయ్య (పెదరావూరు), బి సత్యనారాయణ (మైనేనివారిపాలెం)లను అరెస్టుచేసి 9 నెలలు కఠిన శిక్ష విధించారు.

రేపల్లె తాలూకా గుత్తవారిపాలెం వాస్తవ్యులు గుత్తా చలమయ్య చర్చిల్ బొమ్మను తగులపెట్టినందుకు 9 నెలలు శిక్ష విధించారు నరసరావుపేటలో పోస్టాఫీస్ తపాలా పెట్టెకు మహోద్రావకం చల్లి తగులపెట్టినందుకు విద్యార్థి కె. సూర్యనారాయణ రెడ్డిని అరెస్టు చేశారు. నరసరావుపేటలో టి. కృష్ణమూర్తి, బి. వెంకటేశ్వరరావు, చివుకుల శేషశాస్త్రి, కోవూరు వెంకటేశ్వర్లు బహిరంగసభ జరిపి ఉపన్యసించారని పోలీసులు అరెస్టుచేసి రిమాండులో వుంచారు.

చిలుమూరు రైల్వేకేసులో ఎం. రవివర్మ, బండికట్ల హరిప్రసాద్, సి. అప్పారావు, కామినేని పానకాలు, కె. దశరధరామయ్య, అన్నె సీతారామయ్యగార్లకు రెండేళ్ల చొప్పున కఠిన శిక్షలు విధించారు. గుంటూరు జిల్లా విద్యార్థి సమాఖ్య కార్యదర్శి ఎం. రాధాకృష్ణమూర్తి, ఎన్. వెంకటస్వామి, జి నాగభూషణం గార్లకు మేజిస్ట్రేట్ ఒక ఏడాది వంతున శిక్షలు విధించారు. తర్వాత కొన్నాళ్ళకు జిల్లా జడ్జి కేసును విచారించి కేసు కొట్టివేశారు.

తెనాలి తాలూకాలో 'గాంధీజయంతి' జరిపినందుకు ఎలమంచిలి వెంకటప్పయ్య, పాలడుగు అరుణయ్య, భూషయ్య, హనుమంతరావు, కొత్తపల్లి వెంకటేశ్వర్లు, కుదరవల్లి సుబ్బయ్య, చందునాగభూషణం, అనంతనాగ బసవపున్నయ్య గార్లను అరెస్టుచేసి ఒక్కొక్కరికి ఒక ఏడాది వంతున జైలుశిక్షలు విధించారు. ముందుజాగ్రత్తగా బి సుబ్బారావు, పావులూరి రామారావు, వెలుపోలు సీతారామయ్యలను నిర్బంధించారు.

గుంటూరు పట్నంలో ఆంధ్ర విశ్వవిద్యాలయ పుస్తకభాండాగారానికి అగ్గిపెట్ట డానికి జరిగిన ప్రయత్నం బయటపడింది. పుస్తకాలపైన కిరోసిన్ నూనె చల్లడం జరిగింది. కాని అంతలో దానిని కనుగొన్నారు. మళ్ళి ప్రకటించే వరకు లైబ్రరీ మూసి వేయబడింది.

బాపట్ల మునసబు కోర్టు వద్ద పికెటింగ్ చేసినందుకు వక్కలగడ్డ సత్యానారాయణను అరెస్టు చేశారు.

చీరాల ఎ. సింహాచలం, ఎస్. సుబ్రహ్మణ్యం గార్లకు ఒంగోలు జాయింట్ మేజస్ట్రేట్ దేశరక్షణ చట్టం క్రింద నాలుగేండ్లు కఠినశిక్షలు విధించారు.

చీరాల సమీపాన కనగాల వాస్తవ్యులు మిన్నెగజపతిరావు, గూడవల్లి వాస్తవ్యులు జి. సీతారామయ్య, నరసింహారావు గార్లు యుద్ధ ప్రతికూల నినాదాలు చేసినందుకు, చందోలు పోలీసులు అరెస్టుచేశారు.

పొన్నూరులో అల్లూరి రాధాకృష్ణమూర్తి, చల్లా గోపాలకృష్ణయ్య అప్పయ్య గార్లను రైల్వేయాక్టు క్రింద అరెస్టు చేశారు.

తెనాలి-పూరీ పాసింజరు రైల్వేబండిని తగులపెట్టిన నేరానికి అడ్వకేట్ మల్లాది యజ్ఞనారాయణ, దర్భా కృష్ణమూర్తి మున్నగు 43 మంది మీద కేసుపెట్టారు.

తెనాలి తాలూకా అనంతవరం గ్రామంలో గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో సభ జరిపినందుకు నాగళ్ళ సాంబయ్య, తిరుమలరావు, మల్లికార్జునరావు, రాఘవయ్య, రామలింగం, పిన్నమనేని గాంధీ, కొల్లి వెంకటరామయ్య, ధూళిపాళ్ళ కోటయ్య గార్లను అరెస్టుచేసి 15 రోజులు రిమాండ్‌లో వుంచారు.

చిలుమూరు రైల్వే స్టేషన్ తగుల పెట్టిన కేసులో ముద్దాయిలుగా వుండి, పోలీసులకు చిక్కకుండా తప్పించుకొని తిరుగుతున్న మూల్పూరు హనుమంతరావు, తోటకూర సుబ్బరావు, యడ్ల సాంబయ్య, మునునూరి భార్గవరావు, ఘట్టమనేని రాములు, కె. కొండయ్యగార్లను పోలీసులు పట్టుకొని అరెస్టు చేశారు.

గుంటూరు విడిచి ఎచ్చటికీ వెళ్ళరాదని ప్రతివాద భయంకరాచారిపైన నిషేధపు టుత్తర్వు జారీ చేశారు వారికి అలవెన్సు క్రింద నెలకు రూ. 30 లు చొప్పున మాత్రం యివ్వబడుతుందన్నారు.

తెనాలి మునసబు కోర్టు, సబ్ కోర్టుల్లో నిషేధకరపత్రాలు పంచి పెట్టినందుకు చావులూరి బుచ్చయ్య, అనుమోలు సూరయ్య, చిట్టినేని రాధాకృష్ణమూర్తి, రాకూరు సింగ్ గార్లకు 6 మాసాల చొప్పున కఠిన శిక్షలు విధించారు.

తెనాలిలో కాల్పులలో ఇస్మాయిల్ ఖద్దరు దుకాణంపైన రూ. 600 లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించనందున రిజర్వు పోలీసులతో వచ్చి ఆ ఖద్దరు దుకాణాన్ని జప్తు చేశారు.

రేపల్లె తాలూకా పెదపులివర్రు గ్రామస్థులు కాండూరి సూరిశాస్త్రి, సూతక్కి వెంకటగోపాలరావు, గుంటూరు రామదాసు, యార్లగడ్డ కోటేశ్వరరావుగార్లకు 18 మాసాల చొప్పున కఠిన శిక్షలు విధించారు.

బాపట్లలో పి. సుబ్బయ్యను అరెస్టు చేశారు. చీరాలలో దేశరక్షణ చట్టం క్రింద అమర సుబ్బారావుకు ఒకటిన్నర సంవత్సరం కఠిన శిక్ష విధించారు.

గుంటూరు పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు చావలి సూర్యనారాయణను గాంధీ పార్కులో పోలీసులు అరెస్టు చేశారు. పి. లక్ష్మీనారాయణ, భయంకరాచారి, షేక్ గాలిబ్, పుల్లయ్య, టి. రామయ్యలను నిర్బంధించారు.

గుంటూరులో విద్యార్థులు పోలీసులపైన రాళ్ళు రువ్వారని, వారిపైన చాలసార్లు లాఠీ ఛార్జీలు జరిగినవి పోలీసులు తుపాకులు కూడా ప్రేల్చారు. కాల్పులలో ఇద్దరికి ప్రాణహాని సంభవించింది. 6 గురికి తుపాకీ గుండ్ల గాయాలు తగిలినవి.

గుంటూరులో గాంధీ జయంతి ఉత్సవంలో పాల్గొన్న కొండ వెంకటప్పయ్య గారి మనుమడు లింగమల్లి వెంకటేశ్వర్లు, మాడభూషి శేషాచార్యులను, చివుకుల వెంకటేశ్వర్లును దేశ రక్షణ చట్టం క్రింద అరెస్టు చేశారు. ఒక నెల కఠిన శిక్ష, రూ 50లు జరిమానా విధించారు. జరిమానా చెల్లించక పోతే మరొక నెల శిక్ష విధించారు.

నిడుబ్రోలులో కేంద్ర ఎం.ఎల్.ఏ ఆచార్యరంగాను అరెస్టు చేశారు. 'గోభూమి'ని సోదాచేసి, కొన్ని పత్రాలను తీసుకెళ్లారు వెల్లూరు సెంట్రల్ జైలులో ఆయనను డిటైన్ చేశారు.

బాపట్ల సబ్ రిజిస్ట్రార్ ఆఫీస్‌లో ప్రజలు రికార్డును తగులం పెట్టారు సబ్ రిజి స్ట్రార్‌కు దెబ్బలు తగిలినవి.

చెరుకుపల్లి సబ్ రిజిస్ట్రార్ ఆఫీస్‌లో కూడా రికార్డును తగులపెట్టారు. ఈ సంద ర్భంలో డా॥ భృగుబండ మృత్యుంజయుని మరో 14గురిని అరెస్టు చేశారు. పొన్నూరు పొగాకు కంపెనీ షెడ్లు తగులపడి పోయినవి. నిడుబ్రోలు, పొన్నూరులకు చుట్టు ప్రక్కల గ్రామాలు చేబ్రోలు, గరికెపాడు, ఆలూరు గ్రామాల్లో లూటీలు జరిగినవి. నిడుబ్రోలు, పొన్నూరు గ్రామాలకు మలబార్ పోలీస్ దళం వచ్చింది. 14వ తేదీ 15వ తేదీన చీకటి పడిన తర్వాత ఎవ్వరూ యిళ్లు వదలి వెలుపలికి రాకూడదని ఆంక్ష విధించారు.

మంగళగిరి వాస్తవ్యుడు జె. నరసింహ్వాం, గుంటూరు పోస్టాఫీస్ ఆవరణలో గల తపాలా పెట్టెను తగులపెట్టి, పోస్టుమాస్టరు వద్దకు పోయి 'గాంధీజీకి జై' అని నినాదాలు చేయించాడు. పోస్టుమాస్టర్ ఫోన్ చేయగా పోలీసులు వచ్చి నరసింహ్వాంను అరెస్టు చేశారు. అతనివద్ద నుండి కిరోసిన్‌మానె సీసాను వశపరుచుకొన్నారు.

గుంటూరులో ఆంధ్ర విశ్వవిద్యాలయం స్నాతకోత్సవంలో గవర్నరుకారుకు వలంటీర్లు నల్లజెండాలు చూపి, నిరసన తెల్పారు. 'స్వతంత్రకీ భారత్‌కు జై' అంటూ నినాదాలు చేశారు. వలంటీర్లను పోలీసులు అరెస్టు చేశారు.

అన్నాప్రగడ కామేశ్వరరావును, దుర్భా కృష్ణమూర్తిని అరెస్టు చేశారు. గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం అశాస్త్రీయ, అక్రమ సంఘంగా ప్రకటించబడింది. గుంటూరు పట్టణంలో డాక్టర్ ఎ. ఎస్. చలపతిరావును, మద్ది రంగయ్యను దేశరక్షణ చట్టం క్రింద పోలీసులు అరెస్టుచేశారు.

కడప రైల్వేస్టేషన్‌లో టంగుటూరి ప్రకాశంను అరెస్టు చేశారు. బాపట్ల న్యాయ వాది మాధవపెద్ది కాళిదాసును, కప్పగంతుల శ్రీరామమూర్తిని అరెస్టు చేశారు.

ఒంగోలు తాలూకాలో 5 గురు కాంగ్రెస్‌వాదులు కనపర్తి ఉప్పుకొఠారుల నుండి ఉప్పు తెస్తుండగా అరెస్టు చేయబడినారు. చీరాల పంచాయతీ బోర్డు అధ్యక్షుని పోలీ సులు అరెస్టు చేశారు. చీరాలలో గుద్దంటి శేషయ్య, ఊటుకూరు సత్యనారాయణ, దాసరి శ్రీరాములు, నల్లపోతు సత్యనారాయణ, దేవిశెట్టి వెంకటసుబ్బారావు గార్లను అరెస్టు చేశారు.

గుంటూరులో కె. వెంకటాచారి అను హిందూకాలేజి విద్యార్థిని, పి. రామ చంద్రుడు అను మరో విద్యార్థిని అరెస్టు చేశారు డిఫెన్సు ఆక్టు క్రింద అరెస్టు చేయ బడి, గుంటూరు సబ్‌జైలులో నిర్బంధింపబడిన కల్లూరు చంద్రమౌళి, రావి సత్యనా రాయణ, శరణు రామస్వామిచౌదరి, చింతమనేని భావయ్యచౌదరి, షేక్ ఇస్మాయి లును, మోటుపల్లి బాబురావును వెల్లూరు జైలుకు పోలీస్ ఎస్కార్టుతో తీసుకవెళ్లారు. తెనాలి పోలీసుకాల్పులలో దెబ్బతిన్న వకీలు ప్రయాగ రాఘవయ్య తర్వాత గుంటూరు ఆసుపత్రిలో మరణించారు.

గుంటూరులో ప్రతాపరామ సుబ్బయ్య, ఎం. కోటయ్యగార్లను అరెస్టు చేశారు.

నరసరావుపేటలో పి.వి. శివయ్య, ఎస్. సత్యనారాయణ, టి. సీతారామయ్య (వినుకొండ), మరో వెల్లటూరు కార్యకర్తను అరెస్టు చేశారు.

గుంటూరులో కాలేజీల వద్ద పికెటింగ్ చేసినందుకూ కె. వి. బసవయ్య మరి యిద్దరిని అరెస్టుచేశారు నిడుబ్రోలు రైల్వేస్టేషన్ తగులబడిపోయిన సందర్భంలో అరెస్టుచేయబడిన షేఖ్‌మస్తాన్, పి. వెంకటేశ్వర్లు, ఏ. వీరయ్య, జె. సత్యనారాయణ, కె. సుబ్బయ్య, రామచంద్రరావు గార్లకు ఒక్కొక్కరికి 3 $^1/_2$ ఏండ్ల చొప్పున కఠిన శిక్షలు విధిస్తూ ఒంగోలు జాయింటు మేజస్ట్రేటు తీర్పుచెప్పారు.

గుంటూరు జిల్లాలోని పూండ్ల మర్రిపూడి గ్రామాలపై రూ 1200లు చొప్పున సమ్మిశ్రిష్టి జరిమానాలు విధించినట్లు ప్రభుత్వం ప్రకటించింది.

అప్పికట్ల, ఈతేరు గ్రామాలపైన రూ 500లు వంతున సమ్మిశ్రిష్టి జరిమానాలు విధించినట్లు ప్రకటించారు.

గుంటూరుకు చెందిన ఆమంచర్ల గోపాలరావును గురుజాలలో క్రిమినల్ ప్రొసీ జర్ కోడ్ 151 సెక్షన్ క్రింద పోలీసులు అరెస్టుచేశారు.

చిలకలూరి పేటలో తవ్వా శ్రీనివాసరావు నిషేధకర పత్రాలు పంచిపెడు తున్నాడని అరెస్టు చేశారు. సబ్‌రిజిస్ట్రార్ ఆఫీస్‌పై దాడిచేశారనే నేరం క్రింద ఏడు గురిని అరెస్టు చేశారు. వీరికి ఒక్కొక్కరికి ఏడాది చొప్పున కఠిన శిక్షలు విధింప బడినవి.

కారెంపూడి పంచాయితీబోర్డు అధ్యక్షుని మరి యిద్దరినీ ఎస్. ఎల్. నరసిం హ్వారావును గాంధీజయంతి సందర్భమున అరెస్టు చేశారు

బాపట్లలో వేదాంతం వాసుదేవరావు, లక్కరాజు భార్గవరావు. మనోహర రావు గార్లకు ఒక్కొక్కరికి 18 మాసాల చొప్పున శిక్షలు, రూ200లు చొప్పున జరిమానాలు చెల్లించవట్లయిన మరో 4 నెలలు శిక్ష చెప్పారు.

గుంటూరు జిల్లా బోర్డు మెంబరు సాగి విజయరామరాజుకు ఉప్పు చట్టం క్రింద రెండు సంవత్సరాలు కఠిన శిక్ష విధించారు. దానితో కలిసి అనుభవించేటట్లు డిఫెన్సు చట్టం క్రింద మరి 18 నెలలు కఠిన శిక్ష విధించారు

బాపట్లలో జరిగిన దారీలను పురస్కరించుకొని కొత్తపల్లి యల్లమందు తాడి పెట్టిచెందు. తెడుజాలరు దండి సుబ్బారెడ్డి గార్లకు 6 నెలల చొప్పున శిక్షలు విధించారు. కావూరి వినయాశ్రమ అధిపతులు గొల్లపూడి సీతారామశాస్త్రిని అరెస్టుచేసి, రాయవెల్లూరు జైలుకు పంపుకెళ్లారు.

## కృష్ణా జిల్లాలో:

కాంగ్రెస్-సోషలిస్టు పార్టీ నాయకుడు అచ్యుతపట్వర్థన్ మద్రాసులో వుండి దక్షిణ భారతంలో రహస్య ఉద్యమాన్ని నడుపుతుండేవారు. రంగనాథ కుల్కర్ణి అనే మహారాష్ట్ర యువకుడు ఆంధ్రదేశానికి వచ్చి ఈ ఉద్యమంలో కొన్నాళ్లు పని చేశారు. కేంద్రం నుంచి సాహిత్యం రహస్యంగా చేరవేసే ఏర్పాట్లు చేశారు. అతనిని నిర్బంధించి కేసుపెట్టారుగాని రుజువుకాలేదు.

జాతీయ యువజన, విద్యార్థి సంఘాలను ప్రభుత్వం నిషేధించింది. రామకుమారవర్మ, ఎన్. వి. ఎన్. ప్రసాదరావు, భూపతి కోటేశ్వరరావు, మైనేని రామకోటయ్య, సూరపనేని శేషగిరిరావు, వి. ఎల్. సుందరరావు మున్నగు యువజన కాంగ్రెసు, విద్యార్థి కాంగ్రెసు నాయకులు కార్యకర్తలు క్విట్ ఇండియా ఉద్యమంలో తీవ్రంగా పనిచేశారు. జాతీయ యువజన శిబిరాలను నిర్వహించారు.

ముదునూరు గ్రామం రహస్య కార్యకలాపాలకు ఒక కేంద్రంగా వుండేది. అన్నె అంజయ్య, నేలపాటి ప్రకాశరావు మొదలగువారు తమ సహచరులతో యిక్కడి నుండి ఒక 'రహస్య ప్రెస్'ను నడుపుతుండేవారు గ్రామంలో రిజర్వు పోలీస్ దళం వుండేది. వారు గ్రామస్తులను కొట్టి, నిర్బంధాలపాలు చేసేవారు. కాని ప్రెస్ రహస్య స్థావరం తెలుసుకోలేకపోయారు. అది 'తిరుగుడు ప్రెస్'గా పేరు పొందింది.

పునాదిపాడు గ్రామ యువకులు చుట్టూవున్న కాసరనేనిపాలెం, చోడవరం, వల్లూరుపాలెం, వణుకూరు, కొయ్యగూరపాడు గ్రామాలలో కూడా ఉత్సాహంగా

పరచేశారు. పోలీసులు మద్దాలి జగన్నాథంను అరెస్టుచేసి తీసుకొని వెడుతుండగా, కంకిపాడు వద్ద జనసమూహం అడ్డగించి నినాదాలు చేశారు. జనంపై లాఠీఛార్జి జరిగింది.

ఉప్పులూరు రైల్వేస్టేషన్‌ను తగులబెట్టారు, పునాదిపాడు మైసూర్కాలును తగులబెట్టారు. గ్రామంపైన సామూహిక జరిమానా విధించబడింది. కొందరిపై కేసు బనాయించారు కాని, సాక్ష్యాధారాలు దొరకలేదు.

**కానరనేనివారిపాలెంలో** రహస్య సమావేశం జరిగింది. రిజర్వుదచ్చి జనాన్ని బెదిరించారు. కొందరిని కంకిపాడు పోలీస్‌స్టేషన్‌లో నిర్బంధించారు. కాని నాయకుల ఆచూకీ తెలుసుకోలేకపోయారు.

**చౌటుపల్లి గ్రామంలో** అట్లూరి సత్యనారాయణ, ఘంటసాల వెంకటేశ్వరరావు గార్ల నాయకత్వాన ఈ ప్రాంతాల్లో రైలుపట్టాలు పీకేశారు. తంతితీగెలు త్రెంచివేశారు. గ్రామం పైన సామూహిక జరిమానా విధించబడింది

**కౌతరం** గ్రామం సహాయ నిరాకరణోద్యమం కాలం నుంచి జాతీయోద్యమ కేంద్రాంలో ఒకటిగా ప్రసిద్ధిచెందింది. పలువురు దేశభక్తులుతయారైనారు. ఈ ఆగస్టు ఉద్యమం రోజుల్లో బొబ్బా వెంకటశేషయ్య, ఆదినారాయణమూర్తి, కానూరి చిన దాసయ్య, కానూరు రామానందచౌదరి నాయకత్వం వహించారు. రామానంద మద్రాసు కుట్రకేసు ముద్దాయిగా జైలుశిక్షలనుభవించి వచ్చారు. కోడూరి వెంకటాచలం, యల మంచిలి భాస్కరరావు పామిరెడ్డి సత్యనారాయణరెడ్డి మున్నగు యువకులు రైలు పట్టాలు పీకివేశారు. తంతితీగెలు త్రెంచారు.

**ఆకునూరు** కాకాని వెంకటరత్నం స్వగ్రామం. బండిపాలాక్షరావు, కూచిభొట్ల చలపతిరావు, కంతేటి చలపతిరావు మారెంపాటి వెంకటనరసయ్య, మిక్కిలినేని రాధా కృష్ణమూర్తి మున్నగువారు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. వీరు నిషేధవాఙ్మయాన్ని వివిధ ప్రాంతాలకు చేరవేసేందుకు తోడ్పడ్డారు.

**బెజవాడకు** చెందిన ఈమని రాజరత్నశర్మ, కుర్రా వెంకటరత్నం అజ్ఞాతంగా వుండి తీవ్రంగా పనిచేశారు నిడమానూరు చెన్నుపాటి రామకోటయ్య నాయకత్వాన యువకులు రైలుపట్టాలు పీకివేశారు నాల్గుగ్రామాలపైన జరిమానాలు విధింపబడినవి.

**చినపారుపూడి** ఒక 'దీవి' లాటి గ్రామం. ఇక్కడి కొడాలి వెంకట్రామయ్య యిల్లు. రహస్య సమావేశాలకు అనువైన కేంద్రంగా వుండేది. పుట్టగుంట ఆంజనే యులు కార్యకర్తలకు మంచి వసతులు సమకూర్చేవారు

వెల్లంకి పూర్ణచంద్రయ్య నాయకత్వాన కొండపల్లి—గంగినేని మధ్యగల వంతెనలు పడగొట్టడానికి డైనమెట్లతో పేల్చారు. కాని వాటికి కొద్దినష్టమే జరిగింది. ఈ సందర్భంలో పూర్ణచంద్రయ్యను అరెస్టుచేశారు. వెల్లంకి సుబ్బారావు రహస్య పత్రిక 'జై భారత్'ను నడపడంలో సహాయపడ్డారు.

**గొడవర్రుకు** చెందిన కోవెలమూడి రాఘవయ్య, మద్దాలి తాతాచారి, సూర్య దేవరసుబ్బారావు, చిగురూరు శేషయ్య, యలమంచిలి వెంకటేశ్వరరావు, మద్దాలి వెంకటేశ్వరరావు మొదలగువారు తపాలా పెట్టెలను తగులబెట్టారు. తంతితీగెలను త్రెంచివేశారు. డి.సి.సి. కార్యదర్శి సూరపనేని వెంకటేశ్వరరావు నాయకత్వాన యువకులు ఖందరు-బెజవాడ ట్రంకురోడ్డుకు నిడుమోలు దగ్గర గండికొట్టారు. కొలిమెర్ల గ్రామం పైన రూ 1600లు సాముహిక జరిమానా విధించబడింది.

**కొయ్యగూరప్పాడు** గ్రామ కార్యకర్తలు దోసపాడు-ఇందుపల్లి రైల్వే స్టేషనుల నడుమ రైలుపట్టాలు తీసివేయడంతో మూడురోజులు రైళ్ల రాకపోకలు ఆగిపోయినవి. కొందరికి జైలుశిక్ష విధించారు గ్రామ ప్రజలపైన సాముదాయక జరిమానా విధించారు.

**మైలవరంలో** బెజవాడ మఠం బాలసుబ్రహ్మణ్యంగుప్తా ఉపన్యసిస్తుండగా పోలీసులు అరెస్టు చేశారు. ఆయన జైలు నుంచి విడుదలై వచ్చినతర్వాత, జయంతిపురం సమీపాన గల అడవిలో సైక్లోస్టైయిల్ మిషన్‌పెట్టి, దానిపై రహస్య కరపత్రాలువేసి పంపిణీ చేశారు.

**నందివాడ** ఈడ్పుగంటి లింగయ్య నాయకత్వాన దోసపాడు గుడిపాడలమధ్య రైలుపట్టాలు పీకి వేయడంతో రిజర్వుదళం ఈ గ్రామాన్ని చుట్టుముట్టింది. జనంపై లాఠీ ఛార్జీ వేశారు. కొందరిని అరెస్టుచేసి జైలు శిక్షలు విధించారు.

**గుడివాడ** పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు కూరాడ భుజంగరావు నాయకత్వాన, రైలు పట్టాలు పీకివేశారని కేసుపెట్టి, ఆయనకు జైలు శిక్ష విధించారు.

విస్సన్నపేట రహదారీ బంగళాను ఉద్యమ కారులు తగులపెట్టారు. నాయుడు సుబ్బయ్య, జగన్నాథాచారి, కాశీ సోమశేఖరాచారి, సాలూరు సాహెబ్‌ను అరెస్టుచేసి, జైలు శిక్షలు వేశారు.

**తిరువూరు** హైస్కూలు పాకలను తగులబెట్టిన కేసులో గంగు సత్యనారాయణను అరెస్టుచేసి, 20 కొరడా దెబ్బలు బహుకరించారు. తాలూకా కాంగ్రెస్ అధ్య

క్షుడు పురుకుట్ల వెంకటప్పయ్యను అరెస్టుచేసి 9 మాసాలు శిక్ష విధించారు. కాకాని వెంకటరత్నం, మద్దాలి జగన్నాధంను అరెస్టు చేసి, సబ్ జైలులో నిర్బంధించి తరువాత సి. క్లాసు ఖైదీలుగా జైలుకు పంపారు.

**పోలుకొండ** అట్లూరి వెంకట సుబ్బయ్య, పిన్నమనేని సత్యనారాయణ, భాస్కరరావుల నాయకత్వాన ఉద్యమకారులు రైల్వేస్టేషన్ సమీపాన రైలు పట్టాలు పీకి వేశారు. వీరిని అరెస్టు చేసి, జైలుకు పంపారు ఈ గ్రామంపైన సామూహిక జరిమానా విధించారు.

గుంటుపల్లిలో పెదర్ల వేణుగోపాలరావును అరెస్టు చేసి, జైలు శిక్ష విధించారు.

**కొనకంచి** 1930 ఉప్పు సత్యాగ్రహం నుండి జాతీయోద్యమంలో ముఖ్యపాత్ర వహించింది. రేపాలబుచ్చి రామశేషయ్య శ్రేష్టి, అనుముల గోవిందశర్మ, బండి తిరుపతయ్య మున్నగువారు. కాంగ్రెస్ ఉద్యమంలో ప్రధానులుగా పని చేశారు. బండి తిరుపతయ్య క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని ఏడాది జైలు శిక్షనను భవించారు. బెజవాడలో డాక్టర్ టి వి ఎస్. చలపతిరావు ద్వారా కేంద్ర బులిటెనులు, రహస్య కరపత్రాలు ఆంధ్రదేశానికి అందుతుండేవి.

బందరు కాలువ వద్ద పోలీసులు 15 తూటాలు, ఒక దేశవాళి పిస్టల్, కొన్ని చేతిబాంబులు పట్టుకున్నారు. రాపర్ల సూర్యనారాయణ ఇంటిని సోదాచేసి, ఒక బ్రెటిల్‌ను, వాడిపేన మరిదయ్య ఇంటిని సోదాచేసి ఒక నాటు పిస్టల్‌ను పట్టుకున్నారు. ఈ సందర్భంలో చేబ్రోలు పి నాగేశ్వరరావును అరెస్టుచేసి దీర్ఘకాల కఠిన శిక్షలు విధించారు

## జగ్గయ్యపేటలో బాంబు ప్రేలుడు :

జగ్గయ్యపేటలో రెడ్‌క్రాస్ నిధికి ప్రభుత్వాధికార్లు 'చింతామణి' నాటక ప్రదర్శన ఏర్పాటు చేయడం జరిగింది. జిల్లా మేజిస్ట్రేట్, అధికార్లు ప్రదర్శనాన్ని తిలకిస్తున్నారు. అంతలో వారిపైన రెండు చేతిబాంబులు వచ్చిపడ్డాయి. ఆరుగురికి స్వల్పంగా గాయాలు తగిలినవి. ఆ సందర్భంలో 9 మందిని అరెస్టుచేసి, పోలీసులు కేసుపెట్టారు. తూమాటి యోగానందాచార్యులకు, మల్ల నాగయ్యకు ఏడు సంవత్సరాల చొప్పున శిక్ష విధించారు. దివ్వెల విశ్వనాధంకు నాల్గున్నర సంవత్సరాలు, డాక్టర్ కలవ కొలను శోభనాద్రికి మూడేండ్లు, పెద్దాపురం నాగభూషణం, చెరికంటి కృష్ణమూర్తి, అమరవాది శ్రీరామమూర్తి గార్లకు సంవత్సరం చొప్పున ఆ కేసులో శిక్షలు విధించారు.

ఈ బాంబు కేసులో నిందితుడైన డాక్టర్ శోభనాద్రి జైలు నుంచి తప్పించుకొని పారిపోయాడు. కొన్నాళ్లు అజ్ఞాతవాసంలో వుండి పనిచేసిన తర్వాత, పోలీసులు మరల పట్టుకొని ఆయనకు ఆరుమాసాలు అదనపు శిక్ష విధించారు,

## పశ్చిమ గోదావరిలో:

పశ్చిమగోదావరి జిల్లాలో దెందులూరు రైల్వేస్టేషన్ పైన ఉద్యమకారులు దాడి చేసి, నల్గురు పోలీసులువద్ద నున్న తుపాకులను గుంజుకున్నారు. రైల్వేస్టేషన్‌ను దగ్ధం చేశారు కొవ్వలి దెందులూరు గ్రామకార్యకర్తలు 25 మంది ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. తగిన సాక్ష్యాధారాలు లేక కేసు కొట్టివేయబడింది. ఉండిరైల్వేస్టేషన్‌ను కూడా ప్రజాసమూహం తగులపెట్టింది.

జోగన్నపాలెంలో ఆలూరి లక్ష్మీనారాయణ ప్రభృతులను సబ్‌జైలులో నిర్బంధించారు పతేపురం పచ్చమట్ల వెంకటరాజు ఇంట్లో సైక్లోస్టెయిల్‌తో రహస్య కర పత్రాలుతీసి. జిల్లాలో పంచేవారు. కమ్మల సుబ్బయ్యను డెటిన్యూగా పట్టుకున్నారు. సోమన్న యజ్ఞన్న శాస్త్రికి మూడుమాసాలు జైలుశిక్షవిధించారు. శీర్ల బ్రహ్మయ్యను డెటిన్యూగా నిర్బంధించారు. మోతే నారాయణరావు, బసవరాజు రంగసాయి, దేవినేని జగన్నాధరావు, మాగేపల్లి జగదీశ్వరరావులను అరెస్టుచేశారు గోకరాజు వెంకాయమ్మ కు వేసిన సుభద్రాదేవికి రెండేళ్ల చంతున జైలుశిక్షవిధించారు.

జిల్లాబోర్డు అధ్యక్షుడు డాక్టర్ మూల్పూరు రంగయ్య ప్రభుత్వవైఖరికినిరసనగా ఒకరోజు తమ యాజమాన్య సంస్థలను మూసివేస్తూ తీర్మానించగా, జిల్లాకలెక్టర్ ఆ ఉత్తర్వుని రద్దు చేశారు. పెదనింద్రకొలను. ఆకివీడు మొదలగుచోట్ల లూఠీలు కూడా జరిగాయి.

అగస్టు 17వ తేదీన, భీమవరంలో కాంగ్రెస్ పూరేగింపుపై పోలీసులు కాల్పులు చేశారు ఉద్రేకంతో జనం రైల్వేస్టేషన్‌ను తగలపెట్టారు. 10రోజులు సైనికదళాన్ని కాపలాపెట్టారు. కట్టావెంకన్నను అరెస్టుచేశారు దండునారాయణరాజును అరెస్టుచేశారు. ఆకివీడు గ్రామంపైన అధికార్లు ఎకరానికి రూ॥ 50లు వంతున అపరాధపు పన్ను విధించారు.

## భీమవరంలో కాల్పులు:

భీమవరం పోలీసు కాల్పులలో ఉద్దరాజు వెంకట్రాజు, గొట్టిముక్కల బల రామరాజు, ఒకబాలుడు, నారాయణరాజు మరణించారు కొందరు కాల్పులవల్ల అంగ విహీనులైనారు ఈ ఉదంతం, ఆంధ్రదేశంలో తీవ్రఉద్రేకతను కలిగించింది. ఉండి గ్రామంపై రూ॥ 6వేలు, సమిష్టి జరిమానా విధించబడింది.

పెంటపాడు పబ్లిక్‌వర్క్స్ సెక్షన్ ఆఫీస్ రికార్డును దగ్ధంచేశారు ఆ కేసులో బేడిరెడ్డి సత్యనారాణయరెడ్డికి 2 ఏండ్లు జైలుశిక్ష, 25 కొరడా దెబ్బలు, తాడేపల్లి ముస లయ్యకు 6 నెలల శిక్ష 20 కొరడా దెబ్బలు, వరదా బ్రహ్మానందం చిలుకూరి వీర భద్రరావు, మందలపర్తి చక్రపాణి, మెండు నరసింహారావు, ప్రసాదరావు షేక్

రహీంఖాన్, ఓ. సారంగపాణి గార్లకు 12 కొరడా దెబ్బలు విధించడం జరిగింది. పెంటపాడు గ్రామంపైన రూ 3 వేలు సాముదాయక జరిమానాలు వేశారు.

అత్తిలి, రైల్వేస్టేషన్ రికార్డు తగుల పెట్టారు. పారశాల రికార్డును ధ్వంసం చేశారు.

క్విట్ ఇండియా రోటరీ పత్రిక "రహస్య ఉద్యమం" సాగించండి అనుసందేశాన్ని అందచేసింది గోపాలరావు వెంకటానంద, తాడిమేటి సూర్యకుటుంబశాస్త్రి దానిని ప్రైపు చేయించి, వివిధ తాలూకాలకు అందచేసేవారు

అల్లూరి సత్యనారాయరాజును జిస్సూరులో గృహనిర్బంధంలో వుంచారు. తర్వాత డెటన్యూగా జైలుకుపంపారు.

పాలకొల్లు రైల్వేస్టేషను తగుల పెట్టిన నెరంలో పత్తికృష్ణారావు, పిళ్లాబుల్లెయ్య తుంపెల్ల వైడయ్య, రాజాసూర్యనారాయణ, గుమ్మడి వెంకటలింగం మున్నగువారికి జైలులు శిక్షలు విధించారు. భాస్కర్ల ఈశ్వరుడు శింగంసెట్టి సుబ్బారావు మామిళ్లపల్లి సోమయాజులుకు జైలు శిక్షలు వేశారు పాలకొల్లుపై రూ 14వేలు సాముదాయక పన్ను విధించబడింది.

## ఆజాద్ హింద్ సైనికులు :

నేతాజీ సుబాస్ చంద్రబోస్ ఏర్పాటు చేసిన 'ఆజాద్ హింద్ ఫౌజ్'లో పాల్గొన్న దాట్ల సత్యనారాయణరాజు (కలనల్ డి.ఎస్.రాజు) తాయి ఆంజనేయులు, షేక్అహమ్మద్, బాలంవీరంశెట్టి పశ్చిమ గోదావరి జిల్లా వాసులే. వీరు జైలు శిక్షలకు (ఢిల్లీ ఎర్రకోటలో) గురిఅయినారు.

ఈ రీతి పశ్చిమ గోదావరి జిల్లా క్విట్ఇండియా ఉద్యమ సందర్భంలో, అగ్ర శ్రేణిలో నిలిచి, పోరాటం సల్పింది.

## మదరాసులో అరెస్టులు :

మదరాసు నగరంలో వైద్యవిద్య నభ్యసిస్తున్న పి. తిరుమలరావు మున్నగు విద్యార్థులను, క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో ప్రభుత్వం జైలులో నిర్బంధించింది ఈ ఉద్యమంలో విద్యార్థులు డాక్టర్ తిరుమలరావు నాయకత్వాన ప్రముఖ పాత్ర వహించారు.

ఈ విధంగానే, ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలో క్విట్ఇండియా ఉద్యమం తీవ్రంగా సాగింది.

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల చర్చా ఫలితంగా, కళావెంకటరావు ఒక నిర్దుష్ట కార్యక్రమాన్ని దశల వారీగా అమలు జరిపేందుకు రూపొందించారు. ఇదే 'ఆంధ్రా సర్క్యులర్'గా ప్రసిద్ధి చెందింది. ఉద్యమ కార్యకర్తలకు మార్గదర్శకమైంది,

# హైదరాబాదు స్టేట్‌లో క్విట్ ఇండియా ఉద్యమం

*ఓ నిజాము పిశాచమా, కానరాడు*
*నిన్ను బోలిన రాజు మాకెన్నడేని*
*తీగలను తెంపి అగ్నిలో దింపినావు*
*మా తెలంగాణ కోటిరత్నాలవీణ*

దాశరథి కవి.

స్వామిరామానందతీర్థ కార్యకర్తలతో సహా వార్థాకు వెళ్లారు.

1940 ప్రాంతంలో 'సేవాగ్రాంలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం జరిగింది. సంస్థానంలో కూడా వ్యష్టి సత్యాగ్రహం నిర్వహించడానికి అనుమతించండని స్వామిరామానందతీర్థ,కార్యకర్తలు గాంధీజీని అభ్యర్థించారు. గాంధీజీ మాట్లాడుతూ "మీకు సత్యఅహింసలలో పూర్తి విశ్వాసంవున్నదా? అట్టివిశ్వాసం వున్న వ్యక్తులకే సత్యాగ్రహం చేయడానికి అనుమతిస్తాను. సంపూర్ణ ఆత్మాహుతి గావడానికి మీరు సిద్ధంగా వున్నారా? ఆలోచించుకొని చెప్పండి" అని వెళ్లి పోయినారు.

మరుసటి రోజు రామానందతీర్థ ప్రభృతులు గాంధీ గారిని కలుసుకొని,గాంధీజీ చెప్పిన దానికి అంగీకరించారు. 'మీ సంస్థాన ప్రజల పరిస్థితి బాగుపడాలంటే, కొలది మందైనా తమ జీవితాలను అర్పణ చేయ సిద్ధంకావలసి వుంటుందని ఆనాడు గాంధీజీ ప్రబోధించారు. తుది పోరాటం రానున్నట్లు ఆనాడే హెచ్చరించారు.

1940 సెప్టెంబరు 10వ తేదీన రామానందతీర్థ, కాంగ్రెస్ కార్యకర్తలు తిరిగి హైదరాబాదువచ్చారు. నిజాం నవాబుకు స్వామీజీ ఒక జాబును సిద్ధపరిచారు. 11వ తేదీన ప్రభుత్వం స్వామీజీని అరెస్టుచేసి. నిజామాబాదు జైలులో నిర్బంధించింది. ఆయన జైలులో 15 మాసాలు డెటిన్యూగా గడిపారు. అరెస్టు అయ్యే సమయంలో ఆయన గావించిన ప్రకటన గమనార్హమైనది :

> **"The Form may perish, but the spirit will su vive. We should be prepared to pay the price for the Ideal we hold dear."**

(ఈ భౌతికకాయం పంచభూతాల్లో కలిసి పోవచ్చు. కాని ఆశయం ప్రజ్వరిల్లుతూ వుంటుంది. మన ప్రేమాస్పదమైన ఆదర్శంకోసం ఎట్టి త్యాగాలకైనా మనం సంసిద్ధులం కావాలి.)

1941 డిసెంబరు 15వ తేదీన స్వామీరామానందతీర్థను జైలునుండి విడుదల చేశారు. అయితే, నిజాం ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్‌పైగల నిషేధాన్ని మాత్రం తొలగించలేదు.

సంస్థానంలో ఈ దశలో పలుచోట్ల 'యాక్షన్ కమిటీలు' ఏర్పడ్డాయి. 1941 జనవరి రెండవ వారంలో ప్రభుత్వం ఔరంగాబాదులో గోవిందరావు ప్రాష్, వి.డి. దేశపాండే మొదలగు కార్యకర్తలను అరెస్టుచేసి, 22 నెలల శిక్ష విధించింది. నాయకులను గిరెఫ్తన్‌లో నిర్బంధించింది.

అఖిల భారత సంస్థాన ప్రజా మండలి సమ్మేళనంలో గాంధీజీ ప్రసంగిస్తూ, 'దేశంలోని స్వాతంత్ర్య పోరాట శక్తులతో కలిసి సంస్థానాల ప్రజలు కూడా పోరాడాలని' ఉద్బోధించారు.

## జాతీయ జెండా ప్రతిష్ఠాపనులు :

స్టేట్‌లో కూడా జాతీయ జెండా ప్రతిష్ఠాపనం కార్యక్రమం చేపట్టారు. ఆగస్టు 9వ తేదీన స్వామీరామానంద తీర్థను అరెస్టు చేయడం జరిగింది. ఆ తర్వాత డాక్టర్ మేల్కొటె, వి.హెచ్ దేశాయ్, కృష్ణాచార్య జోషీ ప్రభృతులను అరెస్టు చేశారు. ఈ జెండా ప్రతిష్ఠాపనల మహోద్యమంలో ఇరువది ఒక్కవేలమంది స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు, అభిమానులు కారాగార శిక్షలు అనుభవించారు. 1942 అక్టోబరు నుండి రెండు మాసాల పాటు, రోజు కొకదళం వంతున కార్యకర్తలు అరెస్టు అయినారు. ఉత్సాహవంతులైన విద్యార్థులు, విద్యాలయాలను బహిష్కరించారు. హైదరాబాదు, సికిందరాబాదు మొదలగు కేంద్రాలలో గొప్ప నిరసన ప్రదర్శనలు జరిగినవి.

ఆగస్టు ఉద్యమ సందర్భంలో, శ్రీ కృష్ణదుబే నాయకత్వాన, వలంటీర్లు నాంపల్లి రైల్వేస్టేషన్‌లో గూడ్స్‌షెడ్‌కు నిప్పంటించారు. కొందరు సుల్తాన్‌బజారు పోలీసు స్టేషన్‌పైన దాడి చేయసమకట్టారు. కొత్తగూడెం సమీపానగల రైల్వేలైన్ పిష్‌ప్లేట్లు తొలగించినందువల్ల ఒక గూడ్సుబండి పడిపోయింది. జంటనగరాల, విద్యార్థులు సమ్మెచేశారు.

మహారాష్ట్ర యువకుడు శ్రీధర రంగనాథకుల్కర్ణి ఆంధ్ర ప్రాంతంలో పని చేస్తూ, పోలీసునిఘా నుంచి తప్పుకొని అజ్ఞాతవాసంలో హైదరాబాదు చేరి, యిక్కడి విధ్వంస కార్యక్రమాల్లో కూడా పాల్గొన్నాడు.

కాంగ్రెస్ సోషలిస్టు నాయకులు అరుణ అసఫాలీ మున్నగు వారు రహస్యంగా స్టేట్‌లో పర్యటించి, క్విట్ ఇండియా ఉద్యమ తీవ్రత చల్లారకుండా ఉద్యమవ్యాప్తికి కృషిచేశారు. ప్రభుత్వ నిషేధాజ్ఞలను ధిక్కరించి పద్మజనాయుడు, జ్ఞానకుమారిహెడా బూర్గుల రామకృష్ణారావు, రామాచారి ప్రభృతులు అరెస్టు అయినారు. సికిందరాబాదులో 150 మందిదాకా సత్యాగ్రహులు అరెస్టు అయినారు. ఈ జెండా ప్రతిష్ఠాపనల సందర్భంలో 21 వేలమంది వరకు స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు, జాతీయాభిమానులు కారాగార శిక్షలు అనుభవించారు. వరంగల్లు, ఖమ్మం, నల్గొండ ప్రాంతాలకు ఈ ఉద్యమం వ్యాప్తిచెందింది.

క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా, స్టేట్‌లో అరెస్టులకు గురి అయిన కొందరు ప్రముఖులు :

పండిత నరేంద్రజీ
హరిశ్చంద్రహెడా
జ్ఞానకుమారి హెడా
డాక్టర్ జి. ఎస్. మేల్కోటే
విమలా మేల్కోటే
జితేంద్ర రాష్ట్రపతి
పద్మజనాయుడు
రామస్వామి
బూర్గుల రామకృష్ణారావు
జి. రామాచారి
గంగాధర కృష్ణాగణపతిరావు
కృష్ణదూబే
ఎల్. నారాయణ
రాజేశ్వరరావు
సోమయాజులు
డి. నరసయ్య
కొమరగిరి నారాయణరావు
ఎం. ఎస్. రాజలింగం
శ్రీధర రంగనాథ కుల్కర్ణి
వందేమాతరం రామచంద్రరావు
ప్రేమరాజ్ యాదవ్
మల్లయ్యయాదవ్
కాశోజీ నారాయణరావు
బి. రంగనాయకులు
రామచంద్ర
అంజయ్య

1946 సంవత్సరంలో బ్రిటిష్ ఇండియాలో జనరల్ ఎన్నికలు జరిగి, పరిసర రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. 1946 జూన్ 10 తేదీన ఢిల్లీలో అఖిలభారత సంస్థాన ప్రజామండలి మహాసభ జరిగింది. ఈ దశలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పై గల నిషేధాన్ని, నిజాం ప్రభుత్వం తొలగించింది.

1946 జూలై 3వ తేదీన ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర పరిషత్తులు సమావేశమై, హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌లో చేరడానికి తీర్మానించాయి. స్వామి రామానందతీర్థ అధ్యక్షుడుగా, మాడపాటి రామచంద్రరావు కార్యదర్శిగా కార్యనిర్వాహక వర్గం ఎన్నుకోబడింది.

1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆగస్టు 27 వ తేదీన హైదరాబాదు సంస్థానం స్వతంత్ర రాజ్యంగా వుంటుందని నిజాం నవాబు ప్రకటించాడు.

## స్టేట్ నుండి జయప్రకాశ్ బహిష్కరణ :

ఈ లోగా ఒక ముఖ్యసంఘటన జరిగింది. 1947 మే 7వ తేదీన సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి అయిన జయప్రకాశ్‌నారాయణ హైదరాబాదుకు వచ్చారు సికిందరాబాదులో జరిగిన గొప్ప బహిరంగ సభలో ప్రసంగించారు. ప్రజాభిమతానుసారం హైదరాబాదు సంస్థానం భారత యూనియన్‌లో చేరేటట్లుగా సంస్థాన ప్రజలు తీవ్రాందోళన గావించాలని జయప్రకాశ్ ప్రజలనుద్బోధించారు. ఆయన ప్రసంగం నిజాం ప్రభువరేణ్యులకు కోపకారణమైంది. తక్షణం హైదరాబాదు విడిచి జయప్రకాశ్ వెళ్లిపోవాలని, రక్షణ నిబంధనల క్రింద హుకుం జారీచేయడం జరిగింది.

మే 8వ తేదీన బి. ఎస్. మహదేవసింగ్, నరేంద్రప్రసాద్ శాక్సెనా, నిర్ణీత ప్రకారం జయప్రకాశ్ ప్రసంగించవలసిన సభలో ఉపన్యసించి అరెస్టు అయినారు.

సభలు జరుపరాదనే ప్రభుత్వ ఉత్తర్వును, స్టేట్ నుండి జయప్రకాశ్ బహిష్కరణను నిరసిస్తూ, బూర్గుల రామకృష్ణారావు నాయకత్వాన, రామమూర్తి, వి.బి.రాజు, ఈశ్వరయ్య ప్రభృతులు సత్యాగ్రహం చేసి అరెస్టు అయినారు.

ఈ అరెస్టులకు ప్రజలు ముఖ్యంగా యువకులు రెచ్చిపోయి, కొందరు పోలీసులపైన రాళ్లు రువ్వారు. వీధులలోని విద్యుద్దీపాలను పగులగొట్టారు. హుస్మత్ గంజివద్ద ఒక పోస్టాఫీస్‌ను ధ్వంసం చేశారు. జయప్రకాశ నారాయణను ఉపన్యసించనీయకుండా

స్టేట్ నుంచి వెళ్లగొట్టడం ప్రజల్లో గొప్ప సంచలనం కలిగించింది. ప్రభుత్వ వైఖరి నిరసన తెల్పుతూ రైల్వే కార్మికులు తీర్మానించారు.

ఇదిట్లుండగా, నగరంలో మత సంఘర్షణ చెలరేగే పరిస్థితి ఏర్పడింది. నలుగురు వ్యక్తులు మరణించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రభుత్వం 317 మందిని అరెస్టు చేసింది.

## ఇండియన్ యూనియన్‌లో విలీనోద్యమం :

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ మహాసభ స్వామి రామానందతీర్థ అధ్యక్షతన జరిగింది. "సంస్థాన ప్రజలకు ఇష్టంలేకుండా నిజాంనవాబ్ జారీచేసిన ఫర్మానా ఎంత మాత్రం చెల్లనేరదని, హైదరాబాదు సంస్థానం ఎట్టి షరతులు లేకుండా 'ఇండియన్ యూనియన్'లో చేరిపోవాలని" బూర్గుల రామకృష్ణారావు ప్రతిపాదించిన తీర్మానాన్ని ఆ మహాసభలో ఏకగ్రీవంగా ఆమోదించారు. స్టేట్‌లో సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలన నెలకొల్పాలని తీర్మానించారు.

1947 ఆగస్టు 7వ తేదీన నిజాం ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించి ఎల్లెడలా జాతీయ పతాకాలను ఆవిష్కరించాలని నిర్ణయించారు. అప్పటి నుంచి స్వాతంత్రోద్యమం స్టేట్‌లో మరో నూతన ఘట్టంలోకి ప్రవేశించింది. స్టేట్ కాంగ్రెస్,కార్యాచరణ సంఘం ఏర్పడి, ఈ ఆందోళనను తీవ్రతరం చేసింది.

ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థుల వూరేగింపుపైన లాఠీఛార్జీ, భాష్పవాయు ప్రయోగం జరిగింది. ప్రభుత్వ దమనకాండకు వ్యతిరేకంగా సెప్టెంబర్ 8వ తేదీన విద్యార్థులు నల్లబాడ్జీలు ధరించి, నిరసన ప్రదర్శనలు జరిపారు. నిజాం కాలేజీదాకా పోలీసులు తరిమివేసి, కొందరిని అరెస్టుచేశారు. బి. సత్యనారాయణరెడ్డి, వై. శివరామ శాస్త్రి మున్నగు విద్యార్థినాయకులుకూడా ఈ ఆందోళనలో ప్రముఖపాత్ర వహించారు. స్త్రీలు కూడా ముందంజ వేశారు.

'ఇండియన్ యూనియన్‌లో చేరాలి' అను ఈ ఆందోళ సందర్భంగా అరెస్టు అయిన కొందరు ముఖ్యులు :

| | |
|---|---|
| విమలాబాయ్ మేల్కోటే | కె. వి. నరసింగరావు |
| జ్ఞానకుమారి హెడా | అచ్యుతరెడ్డి |
| కమలమ్మ | బి. వెంకటస్వామి |
| అహల్యాబాయి | అమృతలాల్ |

| | |
|---|---|
| సుమిత్రాబాయి | మాధవరెడ్డి |
| డాక్టర్ ఎం. చెన్నారెడ్డి | పాటి సుదర్శనరెడ్డి |
| లక్ష్మీ | ఎస్. బాబురావు |
| వీరారెడ్డి | మురళీధరరావు |
| రఘునాథరావు | ఎం ఎస్. రాజలింగం |
| రమాపతిరావు | బ్రిజ్‌రాణిగౌడ్ |
| దాశరధి | భోజ్‌రెడ్డి |
| కృష్ణాచార్యజోషీ | శ్రీనివాసలహోటి |
| హీరాలాల్ మోరియా | ఎస్. బి. గిరి |
| కేశవరెడ్డి | జైసేంద్రజెన్ |
| సీతారాంనాయుడు | హనుమంతరావు |
| కె. ఎస్. నారాయణ | ఎల్. నారాయణ |
| | శ్రీమతి రాజేశ్వరి |
| | కాటం లక్ష్మీనారాయణ |

కక్కేరి హనుమంతరావు, ఆయన సహచరులు గుల్బర్గాలో అరెస్టు అయినారు. పెడగోస్కర్ ముకుందరావు మున్నగువారు మరాఠ్వాడాలో అరెస్టు అయినారు.

నల్గొండజిల్లాలో కంచనేపల్లి వెంకటరామారావు, ఉమ్మెత్తల కేశవరావు, అక్కిరాజు వాసుదేవరావు మొదలగు వారు అరెస్టు అయినారు.

భండారు చంద్రమౌళీశ్వరరావు, కొలిపాక కిషన్‌రావు, చొడవరం విశ్వనాథం మున్నగువారు అరెస్టు అయినారు. సర్దార్ జమలాపురం కేశవరావు మధిరలో లక్ష మంది ప్రజలు హాజరైన సభలో జాతీయ పతాకాన్ని ఎగురవేసి అరెస్టు అయినారు.

సిరిసిల్లా, పరకాల, ఖమ్మం, మెట్‌పల్లి, హుజూరాబాద్, చేవెళ్ల, వరంగల్లు, కరీంనగర్, మంథెన మొదలగు అనేక ప్రాంతాల్లో పతాకావిష్కరణలు జరిగాయి. ప్రభుత్వాజ్ఞలను ఉల్లంఘించి, జెండాలు ఆవిష్కరించే సందర్భంలో పందలాదిమంది లాఠీఛార్జీలకు, పోలీసుల దమనకాండకు గురి అయినారు. వరంగల్లు కోటవద్ద జెండా ఆవిష్కరణకు పూనుకున్న మొగిలయ్య దారుణంగా హత్య చేయబడినాడు.

# స్టేట్‌లో ప్రజా పోరాటాలు :

హైదరాబాదు సంస్థానం
అగ్నిగుండమై మండింది
మధ్యయుగాల దురంతం
మహామారియై నిండింది
మువ్వన్నెల జెండాతో
ముందుకు పోరా!
అఖిలభారతావనిలో
అంతర్భాగం కారా!
ప్రజాస్వామ్య సామ్యవాద
పథమే మనది
రాజరికం త్వరలోనే
రాలిపోతుంది
రజాకార్ల ఈ రాజ్యం
ప్రజావళికి యమకూపం
మత దురహంకారానికి
ఇదే నగ్న నిజరూపం
కూలీ రైతుల్లారా!
యువతీ యువకుల్లారా!
ప్రాణాలను బలిపెట్టి
స్వాతంత్ర్యం తేండర్రా!
భారత మాత పాదాలను
త్యాగ రంజితం చేయండర్రా!

—దాశరథి కవి.

తెలంగాణాలో ముఖ్యంగా వరంగల్లు, నల్గొండ జిల్లాల్లో దేశ్‌ముఖుల, జాగీర్దార్ల దోపిడీ విధానానికి వ్యతిరేకంగా రైతులు, కూలీలు ఆంధ్ర మహాసభ (సంఘ) ఆధ్వర్యాన సంఘటితమైనారు. భూస్వాముల దౌర్జన్యాలు మితిమీరినప్పుడు పూర్వంవలె సహించి వూరుకుండలేకపోయినారు. వారి అకృత్యాలను, దుశ్చర్యలను ప్రతిఘటించ నారంభించారు,

తెల్దారుపల్లి రైతులు, ముల్కలగూడెం రైతులు, చల్లసముద్రం రైతులు సమైక్యంగావుండి, తమ న్యాయమైన హక్కుల కోసం పోరాడి విజయాలు సాధించగలిగారు పోలీస్ పటేలు, పట్వారీలు, వారి తాచేదార్ల దౌర్జన్యాలను అరికట్ట సాగారు.

ప్రజలపైన యిష్టం వచ్చినట్లు జులుం సాగించి, ప్రజాభిమానాన్ని కోల్పోయిన వారు, ఉంటున్న గ్రామాలను ఇండ్లను వదలి యితర చోట్లకు పలాయనం చిత్తగించ వలసిన స్థితి ఏర్పడింది. ఉద్యోగుల అవినీతిని, లంచగొండి తనాన్ని రూపుమాపడానికి కూడ 'సంఘం' కృషిచేసింది. ఈ విధంగా వరంగల్లు జిల్లాలోని 180 గ్రామాలలో వెట్టి చాకిరిని కొంత వరకు నిర్మూలించడం జరిగింది.

ఆంధ్ర మహాసభలకు వేలాది గ్రామీణ ప్రజలు హాజరౌతుండేవారు. పాలేరు ప్రాజెక్టు ఆంధ్ర మహాసభకు పదివేలమంది, ఖమ్మం పట్టణ మహాసభకు పదివేలమంది సమీకృతులైనారు స్థాయీ సంఘ సమావేశాలకు కూడా 5,6 వేలమంది దాకా ప్రజలు వచ్చి, సంఘబలాన్ని ప్రదర్శిస్తుండేవారు. ప్రభుత్వ నిర్బంధ విధాన వ్యతిరేకదినం పాటించి, వేలాది ప్రజలు తమ సంఘటితశక్తిని చాటారు. సామాన్య ప్రజలలో ఆత్మ విశ్వాసం పెరిగింది.

నల్గొండ జిల్లాలో రైతులు ఎదురుతిరిగి, దేశ్‌ముఖుల, జాగీర్దార్ల భూస్వాముల ఆగడాలను సాగనివ్వలేదు. నిజాం ప్రభుత్వ పోలీసులు భూస్వాములకు అండగా రంగంలోకి దిగారు. సైనిక రాజ్యంగా మార్షల్‌లా ప్రకటించింది. రజాకారు దళాలను ప్రోగుచేసి, గ్రామాలపైన దాడులు చేయసాగారు.

బాలేముల, పాతసూర్యాపేట, ధర్మవరం మల్లారెడ్డిగూడెం పులిగిల్ల మొదలగు నలభై గ్రామాలపైన నిజాం సైన్యాలు దాడులుచేసి, రెండు మాసాలలోనే వెయ్యిమంది కార్యకర్తలను, రైతుకూలి సేవకులను విపరీత నిర్బంధాల పాలుజేశారు. జనంపై దారుణంగా కాల్పులు చేయగా, ముగ్గురు స్త్రీలతోసహా 180 మంది మరణించారు. 200 మందికి గాయాలు తగిలినవి. అనేక తప్పుడు కేసులు బనాయించి, వేలమంది కార్యకర్తలను నెలల తరబడి కోర్టుల చుట్టూ త్రిప్పి, వేధించసాగారు.

దొడ్డ కొమరయ్యను హత్యచేయడంతో, తెలంగాణంలో యింక క్రోధాగ్ని ప్రజ్వరిల్లింది. తీవ్రంగా పోరాడసాగారు. భూమికోసం, భుక్తికోసం ప్రజలు ప్రాణాలు ఒడ్డారు. ఆంధ్ర మహాసభ- సంఘంవారి ఆదేశమైతేచాలు, ప్రజలు ఏమి చేయడానికైనా సిద్ధపడ్డారు. ప్రజాపోరాటం ఫ్యూడల్ వ్యతిరేకోద్యమంగా పరిణమించింది. నిజాం

ప్రభుత్వానికి ప్రతికూలంగా సాగుతున్న ఉద్యమంలో ఇది అంతర్భాగమైంది. సంస్థాన ప్రజోద్యమం ఒక నూతన దశకు చేరుకొంది.

## కార్మికుల సమ్మెలు :

నిజాం సంస్థానం ముస్లిం రాజ్యమని, ముస్లిముల అధిక్యత వుండాలని ఒక విధమైన ప్రచారం జరుగుతుండేది. అందుచేత ఈర్ష్యతో ఈ ఉద్యమాలు జరుగుతున్నవని కొందరి చేత పుస్తకాలు కూడా వ్రాయించారు. ఈ దుష్ప్రచారాలకు వ్యతిరేకంగా ఆ రోజుల్లో హిందూ కార్మికులు, ముస్లిం కార్మికులు కలిసి మెలిసి వరంగల్లులోని అజాంజాహిమిల్లు కూలీలు 4500 మంది కోర్కెల కోసం పెద్ద సమ్మె చేశారు. అట్లానే ఖమ్మం పట్టణ కార్మికులు కూడా సమ్మె సాగించి, విజయం సాధించారు.

ఈ సమస్యపై స్వాతంత్ర్యయోధుడు, ప్రఖ్యాత ఉర్దూ కవి మగ్దుం మొహిద్దీన్ యిలా వ్రాశారు:

> "ఇది ముస్లిం సంస్థానంకాదు, హిందూ రాజుల సంస్థానంకాదు. ఇది బ్రిటిష్ ప్రభుత్వం చేతుల్లో కీలుబొమ్మ సంస్థానం. కాశ్మీరులో డోగ్రా ప్రభుత్వం గానివ్వండి, హైదరాబాదులో నిజాం రాజ్యం గాని వ్వండి, రెండూ ఒకే తల్లిపాలు త్రాగి బ్రతుకుతున్నవి. ఆ తల్లి— ఆ పాపాల భైరవే 'బ్రిటిష్ సామ్రాజ్యవాదం.'
>
> సంస్థాన ప్రజలను బానిసత్వంలో ముంచి, తమదోపిడీని వున్న దున్నట్లుగానే వుంచి, రాజుల ఏకచ్ఛత్రాధిపత్యాన్ని, జాగీర్దార్ల పెట్టు బడిదార్ల దోపిడీ విధానాన్ని నిలుపుటయే దాని ముఖ్యోద్దేశం. రెండు కోట్ల హైదరాబాదు సంస్థాన ప్రజలు హిందువులు, ముస్లిములు కూడా బానిసలుగా వుండటానికి నేడు నిరాకరిస్తున్నారు. సంస్థాన ప్రజలు తమ రక్తంతో స్వాతంత్ర్య చరిత్రను లిఖిస్తున్నారు."

## అమరవీరుడు కొమరయ్య :

జనగాం తాలూకాలో కడివెండి గ్రామం వుంది. అది దొరసాని జానికమ్మ ఎస్టేట్. ఈమె అతిక్రూరురాలైన విసునూరి రామచంద్రారెడ్డి తల్లి. మహాకర్కోటకురాలు. కొమరయ్య ఇంటిపై దేశముఖ్ గుండాలు దాడిచేయబోగా, జనంచేరి ఎదురు తిరిగారు. ఆ గుండాలు పారిపోయి 'గడీ'లో దూరారు. లోనుండి వాళ్లు జనంపైన కాల్పులు

సాగించారు. ముందు వరుసలో వుండి, ఉత్సాహంతో నినాదాలిస్తున్న కొమరయ్య గుండాల తుపాకీకాల్పులకు బలియైనాడు.

చుట్టు ప్రక్కల గ్రామాల నుండి వేలాది జన ప్రవాహం విసునూరి దేశ్‌ముఖు బలగాలను ఎదురొడ్డి, చేతికందిన వాటితో ఆత్మరక్షణ చేసుకుంటూ పోరాటం సాగించారు. ప్రజాధాటికి తట్టుకోలేక దొరలు, గుండాలు పలాయనం చిత్తగించక తప్పలేదు. దొరికిన దుర్మార్గులకు ప్రజలు తగిన శాస్తి చేశారు. తెలంగాణా పోరాటానికి అది నాందీవాచకం. కొమరయ్య అమరవీరుడైనాడు స్టేట్ ప్రజాపోరాటం ఉచ్ఛస్థాయికి చేరుకొంది.

## 'అమరజీవి — కొమరయ్య'

అమరజీవివినీవు కొమరయ్యా!
అందుకో జోహార్లు కొమరయ్యా!
    న్యాయమనునది లేని నైజాము రాజ్యాన
    విశ్వరాక్షసుడైన — విసునూరి దేశముఖు
    పాలించుచున్నయా - పల్లె 'కడువెండి'లో
ప్రజల హక్కుల కొరకు కొమరయ్యా!
ప్రాణాల నిచ్చావు కొమరయ్యా!
    లంచగొండుల అండ దేశముఖులకు నుండ
    న్యాయ రక్షణ కొరకు నడుము బిగించితివి
    గుండాల తుపాకి గుండ్ల కెదురుగ నిల్చి
బలియైన వీరుల్లో కొమరయ్యా!
మొదటి తెలుగోడవోయ్ కొమరయ్యా!
    ఆంధ్ర మహాసభలోన ఐక్యమై మేమంత
    నీదు ఉద్దేశముల నెరవేర్చుటకుగాను
    నిల్చిపోరెదమోయి నిను మరువలేమోయి
నీవె మాకెల్లప్పుడు కొమరయ్యా!
మార్గదర్శికుడవోయి కొమరయ్యా!

—కె. ఎల్ నరసింహారావు

## 'జండావీరుడు' మొగిలయ్య హత్య :

వరంగల్లులో గౌడులకు చెందిన మొగిలయ్య, రామస్వామి సోదరులు స్థానిక యువకులను చేరదీసి, కసరత్, వ్యాయామం చేసేవారు. 1947 ఆగస్టు 15వ తేదీన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన రోజున, వరంగల్లు కోటపై మొగిలయ్య జాతీయ జండాను ఎగురవేస్తున్నాడు. వెనుకనుంచి రజాకార్లు వెళ్లి అతనిని బర్లెంతో పొడిచి, దారుణంగా హత్యచేశారు 'భారతమాతకు జై' అంటూ మొగిలయ్య ప్రాణాలు విడిచాడు. రామస్వామి ముక్కు తెగిపోయింది.

తెలంగాణాలో జాతీయజండా వీరుడుగా మొగిలయ్య ప్రఖ్యాతిచెందారు. ఆయన స్మారకార్థం అక్కడ భవననిర్మాణం జరిగింది ఆ వీరుని స్మృతికి ప్రజలు శ్రద్ధాంజలి సమర్పించారు.

ఈ సంఘటన జరిగిన వెంటనే ఎం. ఎస్. రాజలింగం, బత్తి రామస్వామి, హయగ్రీవాచారి, కాళోజీ నారాయణరావు 3 మాసాలపాటు వరంగల్లు విడిచిపోవాలని 'ఎక్స్టరన్మెంటు' ఉత్తర్వును జారీచేశారు.

## 'అమరజీవి' రామిరెడ్డి :

స్టేట్ కాంగ్రెస్ నిర్వహించిన ప్రతిఘటనా చరిత్రలో చింతలపూడి రామిరెడ్డి పేరు మరువరానిది. ఆయనిది నల్గొండజిల్లా రేణికుంట గ్రామం. రజాకారు మూకలు, నిజాం పోలీసులు జరిపిన దాడులు, చేసిన ఘాతుకాల నుండి ఆయన రేణికుంట గ్రామాన్ని కొంతవరకు కాపాడకలిగారు. ఆ కసితో సబ్ కలెక్టర్, పోలీస్ అధికార్లు లారీలనిండా రిజర్వును, రజాకార్లను వెంటతీసుకొని ఆకస్మికంగా రేణికుంటగ్రామాన్ని చుట్టుముట్టారు రామిరెడ్డి అతి ధైర్యసాహసాలతో వారితో పోరాడి, కొందరిని మట్టు బెట్టి కడకు వీరమరణం చెందాడు. ఆయన అమరజీవి.

ఈ విధమైన ప్రతిఘటనలు అనేకచోట్ల జరిగాయి. ప్రజలు తమ మానరక్షణ కోసం ఎదిరించి పోరాడారు. అట్టి అజ్ఞాతవీరుల వీరగాధలు ఎన్నో తెరమరుగైనవి. బయట ప్రపంచానికి తెలియరాలేదు.

## జర్నలిస్టు షోయబుల్లాఖాన్ హత్య :

షోయబుల్లాఖాన్ పట్టభద్రుడు, మంచి జాతీయాభిమాని. నిజాం ప్రభుత్వం, ఖారిజాబేదార్లు పెట్టే ప్రలోభావాలకు ఆ యువకుడు ఎంతమాత్రం లొంగలేదు. ఆయన

'తేజ్' పత్రికలో ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంస్థను, రజాకార్ నాయకుడైన ఖాశింరజ్వీ పైఖరిని తీవ్రంగా విమర్శిస్తూ వ్యాసాలు వ్రాసేవాడు. ఆ పత్రికను నిజాం ప్రభుత్వం నిషేధించింది. తర్వాత మందుముల నరసింగరావు నడిపే ఉర్దూ పత్రిక రయ్యత్‌లో సహ సంపాదకుడుగా కొన్నాళ్లు పనిచేశారు. స్వయంగా 'ఇమ్రోజ్' (ఈరోజు) పత్రికను తనసంపాదకత్వానే నడుపుతుండేవాడు. ముస్లిములలో జాతీయ భావాలు రేకెత్తించడానికి ఆ పత్రిక తోడ్పడుతుండేది. ఇది మహమ్మదీయులకు కంటగింపయింది.

షోయబుల్లాఖాన్‌ను చంపుతామని బెదరింపు లేఖలు వచ్చేవి. ఒకసారి బూర్గుల రామకృష్ణారావు, జ్ఞానకుమారి హెడా 'ఇమ్రోజ్' కార్యాలయానికి వెళ్లితే, ఆయనవారితో మాట్లాడుతూ, "నేను గాంధీజీ అడుగు జాడల్లో నడిచే అహింసావాదిని, ఒకవేళ దేశం కోసం న్యాయం సత్యంకోసం నా ప్రాణాలు బలియివ్వ వలసివస్తే, నేనెంతో గర్విస్తాను" అన్నాడు. ఆ జర్నలిస్టు అంతటి దృఢనిశ్చయం, ఉత్తమాశయం గలవారు.

మత మౌఢ్యాన్ని రెచ్చగొట్టే దుండగీడులు రజ్వీ ప్రోద్బలంతో, 1948 ఆగస్టు 21వ లేదీ రాత్రి హైదరాబాదు నడివీధిలో షోయబుల్లాఖాన్ చేతులు నరికి వేశారు. షోయబ్ రజాకార్ల తుపాకీ కాల్పులకు నేలకొరిగాడు. ఉత్తమాశయం కోసం ప్రాణం అర్పించిన షోయబుల్లాఖాన్ 'అమరజీవి' అయినారు. ఆ యువకుని దివ్యచరితం, హైదరాబాదు సంస్థాన విమోచనోద్యమంలో గణనీయమైనది. దేశభక్తుడు, త్యాగశీలి అయిన షోయబుల్లా తాను నమ్మిన ఆశయంకోసం ప్రాణత్యాగం చేసిన ఆదర్శ జర్నలిస్టు.

## ఆచార్య భన్సాలీ ప్రకటన :

గాంధీ మహాత్ముని ప్రియశిష్యులలో ఒకరైన ఆచార్య భన్సాలీ హైదరాబాదు సంస్థాన పరిస్థితులను తెలుసుకునేందుకు పర్యటించనుద్దేశించారు. ఆయన రాకకు నిజాం ప్రభుత్వం అనుమతి లభించింది.

ఆచార్య స్వయంగా పర్యటించారు ప్రజల బాధలను విన్నారు, కన్నారు. ప్రజల కష్టనివారణకు ఆయన ఆమరణ నిరాహారదీక్ష పూనవలసివచ్చింది. హృదయ విదారకంగా వివరించిన ఆ తాపసోత్తముని ప్రకటన భాగాలను గమనించండి :

> "రజాకార్ల వల్ల, తదితర అమానుష ప్రవృత్తుల వల్ల గ్రామాలలో జరుపబడిన దురాగతాలను నేను చూడజాలకపోయినాను. ముఖ్యంగా మేడేపల్లి, రేమిడిచర్ల, ఆపేనగరమనే గ్రామాలు పూర్తిగా పాడైనవి.

ప్రజల వద్ద ఆయుధాలు ఏమీ లేనందున యింత దురాగతాలు జరిగినవి. కొన్ని సమయాల్లో నైజాం పోలీసు మిలటరీ, రజాకార్లకు అండగావుంటూ అనేక అమానుషకృత్యాలు జరిపించింది. కొన్ని చోట్ల తహశీలుదార్లు స్వయంగా వారి వెంటవుండి అనేక పాశవిక దుశ్చర్యలు జరిపించారు . ....."

"రాక్షసులు మానవులపై బడినట్లు, రజాకార్లు తోటిమానవులపై బడి చెప్పనలవికాని దురాగతాలు సలిపిన రహస్యం విదితమైంది. ఏ వైపు తిలకించినా దహనావశేషాలే, దోపిడీలే, హత్యలే, మానభంగాలే. నా హృదయం వాటిని చూడలేక, ప్రజలకష్టపరిస్థితులు వినలేక బద్దలై పోయింది.....

"సమయం ఇంకా చెయిదాటి పోలేదు. కేంద్రప్రభుత్వం వెంటనే తగిన చర్య తీసుకోవడం చాలా అవసరం"

**—ఆచార్య భన్సాలి ప్రకటన భాగాలు**

## ప్రధాని నెహ్రూ వివరణ :

భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 1948 సెప్టెంబర్ 7వ తేదీన డిల్లీ పార్లమెంటులో హైదరాబాదు ఘోర దురంతాలను గురించి సభ్యులు అడిగిన ప్రశ్నలకు యిచ్చిన సమాధానంలో ఇలా వివరించారు:

> "ఆసంస్థానంలో ఆపిశాచ ప్రభుత్వం వారి కట్టుదిట్టాం క్రింద రజాకార్లు సంస్థాన ప్రజలపై అనుదినం విధివిరామం లేకుండా జరిపే దుండగాలను పూర్తిగా వివరించ పరచడం సాధ్యంకాదు ఐనాకొన్ని ఇటీవల మా ప్రభుత్వ దృష్టికి వచ్చినవాటిని మచ్చుకు తెలియజేస్తాను.
>
> ఒక గ్రామంలో దుండుగీడుల దౌర్జన్యాలను భరించలేక ప్రజానీకం చావో బ్రతుకో తేల్చుకునేందుకు సాహసించి, ఆ గ్రామాధికారి నాయకత్వం క్రింద పోలీస్ మిలటరీ బలగాన్ని ఎదిరించేందుకునిశ్చయించింది అపూర్వ ధైర్యసాహసాలతో వందలాది దుండగీడులను నాలుగు ఘామముల వరకు గ్రామంలోనికి అడుగిడనీయకుండా అడ్డగలిగింది. అపారమైన ఆయుధ సామాగ్రి, మందుగుండుగల ఆ మూక ముందర, పరిమిత మందుగుండు సామాగ్రిగల ఆప్రజానీకం, వెలుపలినుంచి

సహాయం అందే అవకాశం లేక, చివర చెల్లాచెదరై పోయారు. వెంటనే రజాకార్లు, సైనికులు ఆ గ్రామంపైబడి ఆస్తి పాస్తులను కొల్లగొడుతూ, స్త్రీలను చెరుస్తూ గ్రామానికి నాల్గువైపుల నుంచి నిప్పంటించారు. ఆ గ్రామాధికారి తలనరికి, బల్లానికిగుచ్చి ఆడుతూ పాడుతూ తప్పత్రాగి మరోపక్క గ్రామానికి వెళ్లారు. గ్రామస్తులను ఒక నిర్ణీతస్థలానికి చేర్చి తుపాకులు పేల్చి, జనాన్ని చంపివేశారు''

"మరొక గ్రామంనుండి ఆబాలగోపాలమంతా ఇల్లు వాకిళ్లు ఆస్తి పాస్తులు వదలేసి, అర్ధరాత్రివేళ ప్రక్కనున్న భారతయూనియన్ గ్రామానికి వెళ్లిపోతుండగా, ఈ సమాచారం తెలుసుకున్న ఆ దుండగీంద్రుడు, జనంపైబడి చెప్పనలవికాని దౌర్జన్యాలు జరిపిన విషయం విస్మరించలేము. మగవాళ్లనుచంపి, ఆడవారిని ఎత్తుకపోయారు.''

''అనేకచోట్ల ఆ సంస్థానంలో రైలు ప్రయాణీకులను దోచుకోడం, స్త్రీలను చెరబట్టడం, రైలుపెట్టెలను తగులబెట్టడం జరిగింది. హైదరాబాదు సంస్థానంలో దౌర్జన్యాలు ప్రారంభమైన నాటినుండి, మా ప్రభుత్వానికి లభ్యమైన సమాచారాన్నిబట్టి యింతవరకు రజాకారుమూకలు 70 గ్రామాలపై చెప్పనలవికాని దుండగాలు చేశారు. వందలాది గ్రామీణులను హత్యచేశారు వేలాదిమంది కాల్పుల్లో గాయపడ్డారు. అనేకమంది స్త్రీలను బలాత్కరించారు. పలువురిని అపహరించుకపోయారు. రైళ్లపైన 12 మార్లు దాడులు చేశారు. లూటీ చేయబడిన ఆస్తి విలువ కోటి రూపాయలు వుంటుంది. లక్షలాది ప్రజలు విధిలేక పరిసర ప్రాంతాలకు చేరుతున్నారు.

—పార్లమెంటులో నెహ్రూ వివరణ.

## తెలంగాణా మహిళల త్యాగం:

1916లో శ్రీమతి కజిన్సు హైదరాబాదు వచ్చారు. నగరంలో సరోజినీ నాయుడు లేడీహమీనహైదరీ, రుస్తుంజీసర్ధుంజీ మున్నగువారు సభకుహాజరై మహిళా విద్యాసాంఘిక సంఘాన్నొకదానిని స్థాపించారు. స్త్రీవిద్యాభివృద్ధికి ఈ సంఘం కొంత కృషిచేసింది.

1929లో గాంధీజీ, కస్తూరిబాగాంధీ హైదరాబాద్ సందర్శించారు. స్త్రీలకోసం ప్రేమ్‌థియేటర్ ఇప్పటి దిల్షాద్ సినిమాహాలులో సభ జరిగింది. 'విదేశవస్త్రాలుబహిష్కరించండి-స్వదేశీవస్తువులనే ప్రోత్సహించండి' అనే గాంధీ బోధలు యిక్కడి వారిలో మంచి ప్రభావాన్ని కలిగించాయి మితవాదులు సైతం ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. కుమారి పద్మజనాయుడు అధ్యక్షురాలుగా ఒక సంఘం ఏర్పడింది. ఖద్దరు, స్వదేశీ ప్రచారం గావించారు. రెసిడెన్సీ బజారులో ఖద్దరుకోట్టు పెట్టించారు రామకృష్ణ దూత్ చరఖా సంఘ బ్రాంచిని స్థాపించారు.

సుల్తాన్ బజారులో మిత్రమండలిని [ఫ్రెండ్స్ యూనియన్] ని స్థాపించుకున్నారు. సేవా కార్యక్రమాలు సాగిస్తుండేవారు. ఖండవల్లి లక్ష్మీరంజనం, కాదేపల్లి జగన్నాథం, నంబూరి కృష్ణమాచార్యులు, భాస్కరభట్ల నారాయణరావు మున్నగువారు 'ఆంధ్రరోవర్స్' అను స్వయం సేవక సంఘాలు స్థాపించి, శెలవుదినాల్లో గ్రామాలకు వెళ్లి ప్రజలకు చదువు చెప్పడం, వైద్య సహాయం చేయడం జరుగుతుండేది.

1925లో నడింపల్లి సుందరమ్మ, మాణిక్యమ్మ, టి. వరలక్ష్మమ్మ మొదలగు వారు ఆంధ్ర సోదరీ సమాజం ఏర్పాటు చేశారు. నిజాం ఆంధ్రసభలతో పాటు, ప్రత్యేకంగా మహిళా సభలు కూడా జరుగుతుండేవి. వి. రుక్మిణమ్మ, కలవకుంట సత్యవతి, బొజ్జం ఎకాంబరం, ఆరుట్ల కమాలాదేవి జాతీయోద్యమంలో కూడా పని చేస్తూ, స్త్రీలలో చైతన్యం కలిగించడానికి కృషిచేశారు. నిజాం ఆంధ్ర మహిళా సభలకు అధ్యక్షతవహించిన నడింపల్లి సుందరమ్మ టి.వరలక్ష్మమ్మ. ఎల్లాప్రగడసీతాకుమారి, మాడపాటి మాణిక్యమ్మ, నందిగిరి ఇందిరాదేవి, బూర్గుల అనంతలక్ష్మీదేవి, యోగ్యసీలా దేవి, రంగమ్మా ఓబులరెడ్డి, రాణి లలితాదేవి మున్నగువారు స్త్రీలలో ప్రబోధంకలిగించారు. ఆంధ్ర యువతీ మండలి, 1935లో స్థాపించబడి, పలువురు కవి పండితులను, సుప్రసిద్ధ సంఘ సేవకురాండ్రను ఆహ్వానించి, సభా సమావేశాలు జరపడం మూలంగా సాహిత్య కృషికి, సంఘసేవకు మంచి ప్రోత్సాహం లభించింది. శ్రీమతి జ్ఞానకుమారి హెడా, విమాలదేవి మేల్కోటే, సుమిత్రాదేవి ప్రసాద్, సంగం లక్ష్మీబాయమ్మ మొదలగువారు జాతీయ స్వాతంత్ర్యోద్యమంలోను, నిర్మాణ కార్యక్రమములలోను పాల్గొని జైలు శిక్షలనుభవించారు. హైదరాబాదు సంస్థానంలోని మహిళలు రజాకార్ల దురంతాలకు గురియై విపరీతమైన బాధలు పడ్డారు. రాజేశ్వరి చిత్రహింసలకు గురి అయినారు.

## త్యాగమార్గం చూపిన ఆంధ్ర మహిళలు !

స్వాతంత్ర్యోద్యమాలలో ఆంధ్ర స్త్రీలు నిర్వహించిన ఉజ్జ్వలపాత్ర చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినది. ఎందరెందరో వీరవనితలు ఈ మహోద్యమంలోకి దూకి, అసమానత్యాగాలు చేశారు. కుటుంబాలతో సహా జైలుయాత్రలు చేసిన వారున్నారు చంటి బిడ్డలను చంకనెత్తుకొని కొందరు జైళ్లకువెళ్లితే, మరికొందరు దేశమాత పిలుపునందుకొని, గర్భిణీ స్త్రీలు అయివుండి కూడా జైళ్లకు వెళ్లి, ఆజైలు లోనే బిడ్డలను కన్నవారున్నారు.

ప్రన్నవలక్ష్మీబాయమ్మ, భారతీరంగా,యామినీ పూర్ణతిలక, వేదాంతం కమాలా దేవి, మూల్పూరి చుక్కమ్మ, దుర్గాబాయి, ఆచంట రుక్మిణమ్మ, వల్లభనేని సీతామహ లక్ష్మమ్మ, పుప్పాల సుబ్బమ్మ, కంభంపాటి మాణిక్యాంబ, అన్నాప్రగడ సరళాదేవి, తుమ్మల దుర్గాంబ, దుగ్గిరాల కమల, గోపరాజు సరస్వతమ్మ, అరికెపూడి సుగుణ మణి, దిగుమర్తి జానకీబాయమ్మ, మరుపిళ్ల భ్రమరాంబ, పోకల తాయారమ్మ, ఎం. నాగలక్ష్మమ్మ, కలగరపిచ్చమ్మ, సూర్యదేవర రాజ్యలక్ష్మిదేవి, వాసిరెడ్డి హను మాయమ్మ,ఎల్లాయి సూరమ్మ, టేకుమళ్ల మహాలక్ష్మమ్మ, ఘంటా మల్లికాంబ, పాతూరి బాలసరస్వతమ్మ శ్రీ రాజ్యం సిన్హా, మానాప్రగడ సుందరమ్మ, తిక్కవరపు సుద ర్శనమ్మ, వావిలాల మాణిక్యాంబ, చారు అలివేలమ్మ, కొల్లాకనకవల్లి తాయారమ్మ, పొదర్తి సుందరమ్మ, తంగిరాల వీరరాఘవమ్మ, మద్దూరి కృష్ణవేణమ్మ, మొదలగు వారు స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని, జైళ్లకేగి, యితర సోదరీమణులకు త్యాగ మార్గం చూపారు. వేలాదిమంది స్త్రీ వలంటీర్లు కల్లు సారా దుకాణాలవద్ద విదేశవస్త్ర దుకాణాలవద్ద పికెటింగులు చేసి శాసనోల్లంఘనం చేసి లాఠీచార్జీలకు గురియైనారు. భార్యా-భర్తలు, తల్లి-కూతుళ్లు, అన్నా-చెల్లెళ్లు కుటుంబాలతో సహా జైళ్ళకెళ్లిన వారు న్నారు.

హైదరాబాదు సంస్థాన ప్రజల విమోచనోద్యమంలో కూడా విమాలా మేల్కొటే సుమిత్రాదేవి, జ్ఞాన కుమారి హెడా మొదలగు మహిళామణులు స్టేట్ కాంగ్రెస్ సత్యా గ్రహోద్యమంలో పాల్గొన్నారు. జైలు శిక్షలనుభవించారు. ఇక్కడి మహిళలపైన ఘోరదురంతాలు, మానభంగాలు జరుగుతుండడంతో, స్త్రీలను ప్రత్యక్షంగా రంగంలోకి దించకుండా స్టేట్ కాంగ్రెస్ నాయకులు మినహాయింపు చేసినట్లు చెప్పబడుతున్నది. అయితే, పలువురు స్త్రీలు యిక్కడి ఉద్యమాలకు ఎంతగానో పరోక్షంగా తోడ్పడ్డారు. ఆవీరవనితల త్యాగాలు చిరస్మరనీయం.

## 'సైనికులం — సేవకులం'

మేము సైనికులం, మేము సేవకులం
జాతీయ భారత సైనికులం, స్వచ్ఛంద కాంగ్రెస్ సేవకులం
స్వాతంత్ర్యం సిద్ధించేదాకా, దోపిళ్లు నాశంబగుదాక
ధర్మంబు స్థాపితమగు దాకా, పోరాడెదం — పోరాడెదం॥
గుండాల గుండెలు చెండెదము, జెండాల సంరక్షించెదం
అండన్న వారిని గాచెదం, ఖండాల నొకటిగ గల్పెదం॥
దురహంకృతి యనబడు దొరతనం, సిరివల్ల
పొందెడు మదబలం
నరరూప రాక్షసి కోరలను — సమయించెదం, సమయించెదం॥

నవాబులకు స్థానంలేదు
యిమ్మంచు అడిగెడిదిక లేదు
గానమ్ముగావిపి బాణమ్ము
సంగ్రామమునకు పయనమ్ము
రానిమ్ము దేవుడె కానిమ్ము
యెదిరింపలే డెదిరింపలేడు॥
బారు ఫిరంగులు మ్రోగినా
బాంబుల వర్షం కురిసినా
ఎత్తిన జెండా దించబోం
పతాకకు జై — త్రివర్ణ పతాకకు జై జై ॥

—చందాల రామకవి

అధ్యాయం–14

# స్టేట్‌లో తుదిపోరాట వ్యూహం

1947 ఆగస్టు 15వ తేదీ భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన పండుగ దినం. కాని హైదరాబాదు స్టేట్ పరిస్థితివేరు. వారు అప్పటికీ గాఢాంధకారంలోనే ఉన్నారు. స్వాతంత్ర్య వెలుగును చూడలేదు.

> "హైదరాబాదు సంస్థానాన్ని భారత యూనియన్‌లో చేరుస్తాం. ఇక్కడ కూడా సంపూర్ణ బాధ్యతాయుత ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పుతాం. అంతదనుక మాకు విశ్రాంతి లేదు. త్యాగాలకువెనుదీయం-కష్టాలను ఎదుర్కొంటాం" అని కార్యకర్తలు దీక్షబూనారు.

## ఆత్మరక్షణకు పోరాట పంథా :

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఒక కార్యాచరణ సమితిని (యాక్షన్ కమిటీ) నియమించింది. దిగంబర్‌రావుబిందూ ఈ సమితికి అధ్యక్షుడుగా వుండేవారు. కేవలం సత్యాగ్రహం చేయడం వల్లనే ఈ సంస్థానం భారత యూనియన్‌లో చేరుతుందనే నమ్మకం స్టేట్ కాంగ్రెస్ వాదులలో సన్నగిల్లింది. తీవ్ర కార్యాచరణకు పూనుకోవాలనే భావం ఎక్కువైంది. అప్పట్లో నిజాం నవాబు ఛత్రచ్ఛాయల క్రింద "ఆజాద్ హైదరాబాదు" అను నినాదం మరొకవైపు బయలుదేరింది.

ఇత్తెహాద్ ముస్లిమీన్ నాయకులు, రజాకార్లు చేస్తున్న దురాగతాలవల్ల స్టేట్‌లో ఒక విధమైన సాయుధపోరాటం అనివార్య మవుతుందనే భావన బలపడజొచ్చింది. కొందరు ముఖ్యులు స్టేట్‌లో వుండి సత్యాగ్రహం చేయాలని, మరికొందరు కార్యకర్తలు సంస్థానం వెలుపల 'బార్డర్ కాంపులు' ఏర్పరచి దళాలకు శిక్షణయిచ్చి, ఆత్మరక్షణ కోసం పోరాటం సాగించాలని ఒక పోరాట వ్యూహాన్ని నాయకులు రూపొందించారు.

ఈ వ్యూహానికి తగిన అనుకూల పరిస్థితులు కూడా కలిసివచ్చాయి. సార్వత్రిక ఎన్నికలు జరిగి స్టేట్‌కు నలువైపులా గల రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడటం జరిగింది. సరిహద్దులలోని కాంగ్రెస్ వాదులు, యితర రాజకీయ పక్షాల వారు దళాలకు చేయూతనిస్తూ, నిజాం ప్రభుత్వ వ్యతిరేకపోరాటాలకు అండగా వుండేవారు.

'అజాద్ హైదరాబాదు' నినాదం, ఇత్తెహాదుల్ ముస్లిమీన్‌ల పాశిస్టు దురాగతాలు, దౌర్జన్యకృత్యాల మూలంగా ప్రజలు భరించరాని పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇట్టి స్థితిలో కొందరు ఆత్మరక్షణకై సాయుధపోరాటం తప్ప మరొకమార్గం లేదనే నిశ్చయానికి రావటం జరిగింది. ఫలితంగా, సరిహద్దున శిబిరాల ఏర్పాటు— దళ సభ్యులకు శిక్షణయిచ్చి పోరాటం సాగించడం వంటి కార్యక్రమాలు చేపట్టారు.

ఈ తుదిపోరాట వ్యూహాన్ని గురించి స్వామిరామానందతీర్థ వ్రాసినది గమనించదగినది.

## తుదివ్యూహసరళిపై స్వామీజీ భావన :

"ఉద్యమ నిర్వహణకు మేము తలపెట్టిన ప్రధాన వ్యూహసరళిని గూర్చి ఈ దశలో కొన్ని విషయాలు చెప్పడం అవసరం. స్వాతంత్ర్య పోరాటంలోని అంతిమ ఘట్టంలో హైదరాబాదు స్టేట్‌కు భారతదేశంతో ఆయుధసంఘర్షణ తప్పదన్న విషయంలో మాకెవ్వరికీ సందేహంలేదు. అయితే, ఈ సంఘర్షణ ముందు మూకుమ్మడిగా సత్యాగ్రహోద్యమం జరగాలి. ఒకవర్గంవారు సాయుధులైనందున, స్టేట్‌ను స్వతంత్ర రాజ్యంగా ప్రకటించాలని నిజాము కలలుగంటున్నందున, సంస్థానంలో కొన్ని ప్రత్యేక పరిస్థితులు ఏర్పడినవి. ఈ పరిస్థితుల దృష్ట్యా భారతదేశంచే సైనికచర్య తప్ప మరేదీ హైదరాబాదు సమస్యకు పరిష్కారమార్గం కాదని మేము నిశ్చయించాము.

అయితే, యిదేసమయంలో సంస్థాన ప్రజలు కూడా సర్వోత్కృష్టమైన త్యాగాలు చేస్తేనేతప్ప, హైదరాబాదుపై భారతదేశంసైనిక చర్య తీసుకోవడానికి అనువైన పరిస్థితులు ఏర్పడవని మా నమ్మకం. కాబట్టి పలువురు నాయకులు సత్యాగ్రహోద్యమ సందర్భంగా జైళ్ళకు పోతుండగా, మరి కొందరు నాయకులు సంస్థానం వెలుపలవుండి ప్రజోద్యమానికి ఒక రూపం యివ్వడం అవసరమని భావించాము."

## స్టేట్ కాంగ్రెస్ నిర్దుష్ట కార్యక్రమం :

స్టేట్ కాంగ్రెస్ ఈ దిగువ కార్యక్రమాన్ని ప్రజలకు అందించింది. - గ్రామస్థులంతా కలిసి కట్టుగా వుండాలి. తాటిచెట్లను నరికివేస్తూ, ఆబ్కారీ చట్టాలను ధిక్కరించాలి. గ్రామస్థులకు కావలసిన కట్టెలు, అటవీఫలసాయాన్ని అడవుల్లోకి వెళ్ళితెచ్చుకోవాలి. నిజాం ప్రభుత్వం వైఖరికి తీవ్రనిరసన తెల్పుతూ, దుకాణాలు, పనిపాటలవారు బందును పాటించాలి. గ్రామాల పటేల్ పట్వారీలు సింధీలు తమ పదవులకు రాజీనామాయిచ్చి ప్రజా ఉద్యమానికి సహాయంగా వుండేటట్లు చూడాలి జాతీయ పతాకాలు ఇండ్లపైన, బహిరంగ కూడలి స్థలాల వద్ద ఎగురవేయాలి. సామూహికంగా జండా వందనం చేయాలి. 'ఇండియన్ యూనియన్‌లో చేరాలని' కోరుతూ, సభా సమావేశాలు జరిపి, స్వాతంత్ర్య వాంఛను ఎలుగెత్తి చాటాలి.

ఈ ముఖ్య కార్యక్రమాలను అమలు జరపడానికి గ్రామ కాంగ్రెస్ కమిటిలన్నీ వెంటనే పూను కోవాలని యాక్షన్ కమిటీ ఆదేశించింది.

## స్టేట్‌కాంగ్రెస్ రాజకీయ వైఖరి :

స్టేట్ కాంగ్రెస్ ఈ ఉద్యమాన్ని సాగించడంలో కొన్ని క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది.

బీద ముస్లిం ప్రజానీకానికి మతం పిచ్చరేకెత్తించి, స్వాతంత్ర్య ఉద్యమం వల్ల వారికేదో కొంపమునిగి పోయినట్లు అపార్థాలు కల్పించి చెప్పి ముస్లిములంతా పరిపాలకులమనే భ్రమలో పడవేశారు, రాజ్యాధిపతులు.

మజ్లిస్ ఇత్తెహాద్ ముస్లిమీన్ మతసంస్థను సృష్టించి, దానిని పాచికగా పెట్టి వెనుక వుండి వ్యవహారం సాగించారు నిజాంనవాబు. ముఖ్యమంత్రులు, రజాకారు దళాలను ఏర్పాటుచేసి, వారికి ఆయుధాలు యిచ్చి సంస్థాన ప్రజలకు ఎదురునిల్చి పోరాడేటట్లు చేశారు ఈ విధమైన కుట్రలు కుతంత్రాలతో స్టేట్ కాంగ్రెస్ వంటి జాతీయ సంస్థకు కూడా తమపాక్షిక ధోరణులు అంటగట్టజూచారు. పాలకుల దురహంకారాన్ని వారి మత మార్పిడులను ఎదుర్కోడానికి స్టేట్‌లో హిందూ మహాసభ, ఆర్యసమాజం వంటి సంస్థలు పూనుకొన్నాయి. ఆర్యసమాజంకూడ పౌరహక్కుల సాధనకు కృషిచేసింది. దీనిని అవకాశంగా తీసుకొని స్టేట్ కాంగ్రెస్ సంస్థ అధ్వర్యాన జరిగే ఆందోళనకు, ఉద్యమానికి కూడా హిందూమతరంగు పులమడానికి పాలకవర్గం ప్రయత్నించింది.

ఈ కారణంగా స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు ద్విముఖంగా పోరాడ వలసి వచ్చింది. కమ్యూనిష్టుపార్టీ అనుసరించిన రాజకీయ వైఖరి మూలంగా, తర్వాతదశలో స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు కొన్ని సందర్భాలలో త్రిముఖంగా కూడా పోరాడవలసిన పరిస్థితి ఏర్పడింది.

నిజాంనవాబు నిర్బంధవిధానం, రజాకార్ల దుశ్చర్యలు మితిమీరి పోవడం వల్ల ఆత్మరక్షణం కోసం ఆయుధాలు చేపట్టి పోరాడ వలసిందిగా ఈ దశలో కాంగ్రెస్‌కార్య కర్తలకు సలహా యివ్వడం జరిగింది.

ఇండియన్ యూనియన్‌లో హైదరాబాదు సంస్థానం విలీనం కావాలని కోరుతూ సాగిన ఉద్యమంతోపాటు, సరిహద్దు శిబిరాల (Border camps) పోరాటం కూడా అవసరమని స్టేట్ కాంగ్రెస్ భావించింది. ఆ విధంగా తగు ఏర్పాట్లు గావించనారం భించింది. దీని తర్వాత స్టేట్ కాంగ్రెస్ కూడా కమ్యూనిష్టులతో కలిసి 'సంయుక్త పోరాటం' సాగించేందుకు ఒప్పందం కుదిరినట్లు కొందరు, స్టేట్ కాంగ్రెస్‌వారు నిజాం ప్రభుత్వంతో రాజీచేసుకోబోతున్నారని మరి కొందరు ఎవరికి తోచిన విధంగా వారు ప్రచారం చేయసాగారు. కమ్యూనిష్టులు- స్టేట్ కాంగ్రెస్ వలంటీర్ల మధ్య సంఘర్షణలు జరిగిన కొన్ని ఉదంతాలు కూడా లేకపోలేదు, ఈ సందర్భంలో స్టేట్ కాంగ్రెస్ వైఖ రిని స్పష్టపరుస్తూ మదరాసులో సమావేశమైన కార్యాచరణసమితి చేసిన తీర్మానం గమ నించ దగినది. నిజాం నిరంకుశ పరిపాలనను అంతం చేసేందుకు ఉద్యమం పక్క మార్గాల పట్టకుండా, కేంద్రీకరించి కృషి చేయాలని ఆ తీర్మానంలో కోరారు.

## మదరాసు తీర్మానం :

"కమ్యూనిష్టులు వర్గపోరాట చర్యలు ప్రారంభించి, రాజకీయ స్వాతంత్ర్య సాధన కోసం నడుస్తున్న మహోద్యమాన్ని ప్రక్కదారి పట్టించేందుకు, దాని ఉధృతాన్ని తగ్గించేందుకు తోడ్పడే కృషి నిర్వహి స్తున్నట్లు, గమనించి ఈ కమిటీవారు తమ విచారాన్ని వెల్లడిస్తున్నారు.

"నైజాము నిరంకుశ పాలనను ఎదిరించి తమ ప్రాణాలను ఒడ్డి జీవన్మరణ పోరాటం కొనసాగిస్తున్న కాంగ్రెస్ వారిపైన కేవలం వారు తమ రాజకీయ ప్రత్యర్థులన్న కారణంచేత కమ్యూనిస్టు కార్యకర్తలు దౌర్జన్యాలు చేసిన సంఘటనలను గురించికమిటీకి నివేదికలు వచ్చాయి.

సర్వనాశనం చేస్తున్న నిరంకుశ భూస్వామిక బలాన్ని ఎదిరించి, తీవ్ర మైన పోరాటం జరుపుతున్న స్వాతంత్ర్యయోధుల పైన దౌర్జన్యాలు జరగడం ఎంతో దురదృష్టకరం. ఈ ప్రమాదకర ధోరణులను అరి కట్టాలని ఈ కమిటీవారు హెచ్చరిస్తున్నారు. .. ...

అయినప్పటికీ, ఓర్పు వహించండని నిరంకుశ ప్రభుత్వాన్ని కూలదోసేకార్యక్రమంపైనే దృష్టిని కేంద్రీకరించండని స్టేట్ కాంగ్రెస్ తన కార్యకర్తలను ఆదేశిస్తున్నది. ఆర్థిక సామాజిక దోపిడీని అంతులేకుండా కొనసాగించినట్లయితే, ప్రజాస్వామ్య స్వాతంత్ర్యం నిరర్థకమైన దవు తుందని స్టేట్ కాంగ్రెస్ విశ్వసిస్తున్నది. ఈ ఆశయ సాధన బాధ్యతా యుత ప్రభుత్వం ఏర్పడిన పిమ్మటనే ఫలించగలదని కూడా నమ్ము తున్నది.

అందుచేత, విజయం లభించే వరకు నిరంకుశ పరిపాలనను అంతం చేసేందుకు జరుగుతున్న ఈ పోరాటాన్ని, జంకూ గొంకూలేని దృఢనిశ్చయంతో యావచ్ఛక్తిని కేంద్రీకరించి నడిపించుట అత్యా వశ్యకము"

# స్టేట్ కాంగ్రెస్ మహాసభ

1946లో రాజకీయ సంస్థలమీద, స్టేట్ కాంగ్రెస్ పైన నిజాం నవాబు లోగడ విధించిన నిషేధాన్ని తొలగించక తప్పలేదు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఆవిర్భవించింది. 1946 జూలై 16, 17, 18 తేదీలలో స్వామీ రామానందతీర్థ అధ్యక్షతన హైదరాబాదులో స్టేట్ కాంగ్రెస్ సర్వసభ్య మహాసభ జరిగింది. అనేక చరిత్రాత్మక సభ. వేలాది ప్రజలు కూడా హాజరైనారు.

వెంటనే స్టేట్‌లో సంపూర్ణ బాధ్యతాయుత ప్రజా ప్రభుత్వాన్ని నెలకొల్పాలని, తెలంగాణా, మరాట్వాడా, కర్నాటక ప్రాంతాలను ఆయా పరిసర భాషా రాష్ట్రాలతో విలీనం చేయాలని కోరుతూ, ఆమహాసభ ఏకగ్రీవంగా తీర్మానించింది. అట్టి చరిత్రాత్మక తీర్మానాన్ని బూర్గుల రామకృష్ణారావు ప్రతి పాదించగా, దిగంబర్‌రావు బిందూ బలపరిచారు. ఆంధ్ర నుంచి ఆచార్య ఎన్. జి. రంగా, కర్నాటకం నుంచి ఎస్. నిజలింగప్ప. మహా రాష్ట్రం నుంచి శంకర్‌రావుదేవ, కాంగ్రెస్ సోషలిస్టునేత, కాంగ్రెస్ కార్యవర్గసభ్యురాలు కమాలాదేవి ఛటోపాధ్యాయ మున్నగువారు ఆ మహాసభకు విచ్చేసి, ఆ తీర్మానానికి, స్టేట్ కాంగ్రెస్ ఉద్యమానికి తమ పూర్తి మద్దతును తెలియ జేస్తూ ప్రసంగించారు.

## కార్యాచరణ సంఘం :

మహాసభానంతరం, స్టేట్ కాంగ్రెస్ నాయకులు సమావేశమై ఉద్యమ స్వరూప స్వభావాలను గురించి చర్చించారు. కొందరు నాయకులు స్టేట్‌లోపలే వుండి సత్యాగ్రహం చేయాలని , మరికొందరు ముఖ్యులు సంస్థానం వెలుపల సరిహద్దు శిబిరాలు నెలకొల్పి, పోరాటాలు సాగించాలని నిశ్చయించినారు. ఈ ఉద్యమ నిర్వహణకై దిగంబర్‌రావు బిందూ అధ్యక్షుడుగా, గోవిందరావు షరాఫ్, మాడపాటి రామచంద్రరావు, డాక్టర్ మేల్కోటే, జమలాపురం కేశవరావు, ప్రాణేశాచార్య సభ్యులుగా స్టేట్ కాంగ్రెస్ కార్యాచరణ సంఘాన్ని (యాక్షన్ కమిటీ) నొకదానిని స్వామీజీ నియమించారు.

## ప్రధాన కార్యక్రమాలు :

సరిహద్దు క్యాంపులలో స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు చేయవలసిన కార్యక్రమాలను గూర్చి చర్చించి, ఈ దిగువ కార్యక్రమాన్ని రూపొందించారు.

1. పటేల్ పట్వారీలచేత వారి ఉద్యోగాలకు రాజీనామాలు యిప్పించి, ప్రభుత్వ దస్తరాలను స్వాధీనం చేసుకొని, గ్రామాలలో నిజాం పరిపాలనను అంత మొందింప చేయడం.

2. ప్రభుత్వ యంత్రాంగం, రజాకారు రాక్షసులను ఎదిరించి, ప్రభుత్వానికి లెవీ ధాన్యం యివ్వకుండా ప్రజలను సమీకరించడం, రజాకార్లకు ఆహారధాన్యాలు అందకుండా చేయడం.

3. హైదరాబాదు సంస్థానానికి-భారత యూనియన్‌కు మధ్యనున్న సరిహద్దులను రూపుమాపటం, దీనికి ముఖ్యంగా కరోడ్ గిరినాకాలను ధ్వంసం చేయడం.

4. ప్రభుత్వ విశ్రాంతి భవనాలు, రజాకార్లకు నిజాం మిలటరీకి స్థావరాలుగా వుండి, అక్కడ నుంచివాళ్లు ప్రజలపై దాడులు చేయకుండా ఆ భవనాలను నిర్మూలించడం.

5. గవర్నమెంటుకు ఆదాయం సమకూర్చుతూ, త్రాగుడు పిశాచం ద్వారా ప్రజలకు బానిసత్వం ప్రసాదిస్తున్న తాటిచెట్లను, ఈత చెట్లను సమూలంగా నాశనం చేయడం.

6. ప్రజలపైన దాడులు సాగించేందుకు మిలటరీ, రజాకారు మూకల వాహనాలు నడవ కుండా రోడ్డువంతెనలను కూలద్రోసి, రహదారీ మార్గాలను ధ్వంసం చేయడం.

7. గెరిల్లా దళాలను ఏర్పాటుచేసి, మిలటరీపైన, రజాకార్లమీద మెరుపుదాడులు సాగిస్తూ వారు ప్రజలపై దాడిచేయకుండా నిరోధించడం.

8. గ్రామాలను 'రిపబ్లిక్' లుగా ప్రకటించాలి. గ్రామపంచాయతీలను ఏర్పాటు చేయాలి. ఆరిపబ్లిక్‌లలో నిజాం గవర్నమెంటుకు పన్నులు చెల్లించకుండా చూడాలి. గ్రామపంచాయితీలే పన్నులు వసూలుచేసి గ్రామపరిపాలనను సక్రమంగాను, ప్రజారంజకంగాను సాగించాలి. గ్రామానికి అవసరమైన 'రక్షకదళాన్ని' కూడా నిర్మించుకోవాలి. న్యాయపరిపాలన సాగించాలి.

కమ్యూనిష్టులవైపు నుండి దోపిడీలు, లూటీలు చేయడం, కాంగ్రెస్ కార్యకర్తల పైన దాడులు చేయడం మొదలైన అనుచిత కార్యక్రమాలకు దూరంగా వుండాలని, రజాకార్లమీద దాడిచేసి సంపాదించిన ఆహారధాన్యాన్ని ధ్వసం చేయకుండా దానిని ఆ గ్రామాల బీద ప్రజలకు పంచియివ్వ వలెనని, కాంగ్రెస్ కార్యకర్తలకు ఒక 'ప్రత్యేక సర్క్యులర్ ద్వారా కార్యాచరణ సంఘం హెచ్చరికలు చేయడం జరిగింది.

బొమ్మకంటి సత్యనారాయణరావు అప్పట్లో సరిహద్దు శిబిరాలు-వాటి ఇన్‌ఛార్జి నాయకులను గురించి తమ వ్యాసంలో ఇలా ప్రకటించారు:

## సరిహద్దు శిబిరాలు:

| క్యాంప్ కేంద్రాలు | ఇన్‌ఛార్జి నాయకులు |
|---|---|
| 1. పోలంపల్లి | కొమరగిరి అప్పారావు |
| 2. వేములనర్వ | వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య |
| 3. జొన్నలగడ్డ | మల్లెల రామారావు |
| 4. పెద్దారం | దేవులపల్లి గోపాలరావు<br>వేణుగోపాలం గుప్తా |
| 5. జయంతి | మూమసూరు నాగభూషణరావు |
| 6. తిరువూరు | ఊటుకూరు సత్యనారాయణరావు<br>జలగం వెంగళరావు |
| 7. గురుపట్లగూడెం | కొండపల్లి హనుమంతరావు |
| 8. జీలుగుమల్లె | గంగు సత్యనారాయణ |
| 9. భద్రాచలం | మాటూరి నరసింహరావు |
| 10. పరిటాల | దామెర జగన్నాధరావు<br>గుంటుపల్లి సత్యనారాయణరావు |
| 11. దొమ్మగూడెం | ఎస్. వి. ఎల్. నరసింహరావు |
| 12. మంగొల్లు | జూపల్లి రంగారావు |
| 14. మ్యాచెర్ల | కె. వి. రంగారెడ్డి |
| 15. తాళ్లపల్లి | రంగారెడ్డి |
| 16. నెమలి | సంపత్ కుమార్<br>కాజ నాగభూషణం |
| 17. కర్నూలు | పాగా పుల్లారెడ్డి |
| 18. చాందాకాంపు | కె. వి. నరసింగరావు |
| 19. చిలుకూరు | సత్యనారాయణరావు |
| 20. గానుగపాడు | కాటూరి కృష్ణమూర్తి |

తెలంగాణా ప్రాంత సరిహద్దులలో ఈ విధమైన శిబిరాలు ఏర్పడినట్లు ఆయా శిబిరాలకువారు ఇన్‌ఛార్జి నాయకులుగా వున్నట్లు బొమ్మకంటి సత్యనారాయణరావు వ్రాసిన వ్యాసంద్వారా తెలుస్తున్నది. మశికొండ నరసింహారావు, యాదగిరి, రఘునాథ్ నారాయణ, బాబురావు, రామచంద్రం, వసంతరావు మున్నగువారు శిబిర కమాండర్లుగా పనిచేసినట్లు ఆయన పేర్కొన్నారు.

ఇవిగాక, పెద్దారంకాంపు సీలా సిద్దారెడ్డి, శిరిపురం గండి మల్లికార్జునరావు, పరిటాలకాంప్ పర్సా కిషన్‌రావు, బల్హార్షా కె. ఏ. కేశవులు, వెంకటాపురం బి. రంగ నాయకులు, గోసవీడు ఉత్పల సత్యనారాయణ, పోలంపల్లి హనుమంతరావు మూచెర్ల రౌతు రాజేశ్వరరావు మున్నగువారు ఈ సరిహద్దు శిబిర పోరాటాల్లో పాల్గొన్నట్లు జి. హయగ్రీవాచారి వివరించారు.

మూడు ప్రాంతీయ కార్యాలయాలు మూడు పరిసర భాషాప్రాంతాలలో ఏర్పాటు చేశారు. కర్నాటక ప్రాంతకార్యాలయం 'గడగ్‌'లోను, మహారాష్ట్ర ప్రాంతీయ కార్యాలయం ఔరంగాబాద్‌లోను, తెలంగాణా ప్రాంతీయ కార్యాలయం విజయవాడలోను నెలకొల్పడం జరిగింది.

సర్దార్ జమలాపురం కేశవరావు మధిరలో సత్యాగ్రహం చేసేందుకు నిశ్చయించారు. ఆయన జైలుకు వెళ్లేముందు, విజయవాడకేంద్ర ఉద్యమ నిర్వహణ బాధ్యత జి. హయగ్రీవాచారికి అప్పగించారు. అజ్ఞాత ఉద్యమనిర్వాహకులుగా బొమ్మకంటి సత్యనారాయణరావు వుండేవారు. మాడపాటి రామచంద్రరావు ఈ ప్రాంతీయ 'లైజాన్' నాయకుడుగా వుండేవారు వి. బి. రాజు ప్రచారబాధ్యతలు నిర్వహించేవారు.

విజయవాడలోని తెలంగాణా ప్రాంతీయ కార్యాలయం ఆంధ్ర కాంగ్రెస్ నాయకుడైన అయ్యదేవర కాళేశ్వరరావు గారి మేడలోవుండేది. తర్వాత శిబిరం కామయ్య గారి భవనంలోకి మార్చడమైనది.

'సారధి' పత్రికను చాత్తాన తాఘ్నారి రామానుజస్వామి, డి. రామలింగం, 'తెలుగుదేశం' పత్రికను సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి నడుపుతుండేవారు. ఈ పత్రికలు నిజాం వ్యతిరేక పోరాటానికి, విశాలాంధ్ర ఉద్యమానికి మంచి ప్రచారసాధనాలుగా ఆ రోజులలో బాగా తోడ్పడ్డాయి. స్టేట్‌లో జరుగుతున్న ప్రజాపోరాటాన్ని వివరిస్తూ, ఒక 'బులిటెన్' ను వెలువరించేవారు అందులోని విషయాలను వివిధప్రాంతాలలోని కాంగ్రెస్ కార్యకర్తలు మైకులద్వారా ప్రచారం చేసేవారు. తెలంగాణా ప్రాంతంనుండి వచ్చినవారికి, వలందీర్లకు స్థానికప్రజలు సహాయం చేస్తుండేవారు.

1946 లో 'ఆంధ్రకేసరి' ప్రకాశం ముఖ్యమంత్రిత్వకాలంలో, కపింకాశీపతి సమాచారశాఖ డైరక్టర్‌గా వుండేవారు. తెలంగాణాఉద్యమ ప్రచార ప్రసారాలకు ఆయన తోడ్పడ్డారు.

1947 ఆగస్టు 15వ తేదీన స్వామీరామానందతీర్థ అరెస్టు ఆయినారు. డాక్టర్ మేల్కోటే, బూర్గుల రామకృష్ణారావు హైదరాబాదు నగరంలో, మధిరలో సర్దార్ జమాలపురం కేశవరావు, ఖమ్మంమెట్టులో కాలిపాక కృష్ణారావు మున్నగు నాయకులు జాతీయజెండా ప్రతిష్ఠాపనల సందర్భంలో సత్యాగ్రహాలుచేసి, అరెస్టుఅయినారు.

1948లో ప్రకాశం, బులుసు సాంబమూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు తెలంగాణా లోని సరిహద్దు ప్రాంతాలను సందర్శించడానికి బయలుదేరారు. టి. హయగ్రీవాచారిని జగ్గయ్యపేటలోవుంచి, మునగాల పరగణాకు, కోదాడుకువెళ్లారు. ప్రకాశం ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. ఆయన వెళ్లగానే, నిజాంసైనికులు సగౌరవంగా మిలటరీ శాల్యూట్ చేశారు. ఈ సంఘటన స్టేట్ కాంగ్రెస్ వలంటీర్లలో మంచి ఉత్సాహం కలిగించింది.

# స్టేట్ కాంగ్రెస్ వలంటీర్ల పోరాటాలు

## కరోడ్గిరి నాకాల ధ్వంసం:

హైదరాబాదు ప్రాంతానికి, భారతప్రభుత్వభూభాగానికి మధ్య సరిహద్దులలో 'కరోడ్గిరినాకాలు' వుండేవి నిజాం ప్రాంతంలోనికి వెలుపలనుండి ఏసరుకు వచ్చినా ఈ నా కాలలో పన్నులు వసూలుచేస్తుండేవారు. ఆ నాకాలను ధ్వంసం చేయడం కార్యకర్తలు ముఖ్యపనిగా పెట్టుకున్నారు.

తిరువూరుకు సరిహద్దు నిజాం గ్రామం ముత్తగూడెం 30 నాకాలకు కేంద్రంగా వుండేది. అది ట్రంకురోడ్డుపైవుంది. వట్టికొండ రామకోటేశ్వరరావు, పింగళి తిరుమల రావు నాయకత్వాన, తిరువూరు, పెద్దారం, నెమలి మున్నగు కాంపులనుండి కార్య కర్తలువెళ్లి ముత్తగూడెం నాకాను స్వాధీనంచేసుకొన్నారు. అక్కడి రికార్డును ధ్వంసం చేశారు. నాకాలలో పనిచేసే కొందరు నిజాం వుద్యోగులుకూడా రాజీనామాలుచేసి వీరి కృషిలో సహకరించారు.

ఈ విధంగా సరిహద్దులలోని కరోడ్గిరి నాకాలను స్టేట్ కాంగ్రెస్ వలంటీర్లు స్వాధీనం చేసుకున్నారు.

పోలీసు కాంపులకు అధికార్లు మోటారు వాహనాలపైన రాత్రింబవళ్లు తిరుగుతుండేవారు. ప్రజలను వేధించకుండా, వారిరాకపోకలను అరికట్టడానికి వలంటీర్లు రోడ్డువంతెనలు కూలగొట్టారు. బస్సులపై దాడిచేసి, ప్రయాణికులకు హానిజరగకుండా ఆ బస్సులను స్వాధీనం చేసుకొనేవారు.

ఎర్రుపాలెం సమీపాన గూడ్సుబండిని పడగొట్టి రైలు ఇంజన్‌ను చిన్నాభిన్నం చేశారు.

జొన్నలగడ్డ, వేములనర్వ, వలంటీర్లు మధిర బోనకల్ స్టేషనులమధ్య రైలు పట్టాలను పీకి వేశారు.

## వలంటీర్లకు సాయుధ శిక్షణ :

సరిహద్దు శిబిరాలలో వలంటీర్లకు సాయుధ శిక్షణ యివ్వడం ప్రారంభించారు. లోగడ ఆజాద్‌హింద్ ఫౌజ్‌లో సైనికుడైన అప్పారావు మిలటరీ శిక్షణ యిచ్చేవాడు.

నెమ్మదిగా తుపాకులు, మందుగుండు సామాగ్రి సేకరించసాగారు. మాడపాటి రామ చంద్రరావు అడుగగానే నూజివీడు ఎం ఆర్. అప్పారావు మూడుతుపాకులు యిప్పించే ఏర్పాటు చేశారు. నెల్లూరు అభ్రకంగనులలో ఉపయోగించే మందుగుండు సామాగ్రిని మారుపేర్లతో వెళ్ళి సంపాదించారు. వాటితో చేతి బాంబులు చేయనారంభించారు.

రేపాలకాంపు దగ్గర బాంబులు తయారు చేస్తుండగా, నేలమఱ్ఱి శిబిరంలో దురదృష్టవశాత్తు ఒకరు చనిపోయాడు. మరి కొందరికి గాయాలు తగిలినవి

మాజీ ఐ. ఎన్. ఎ. సోల్జర్ అప్పారావుకు తోడు దంకసాల నరసింహారావు, రామచంద్రం కూడా శిబిర వలంటీర్లకు సైనిక శిక్షణయిచ్చారు.

విజయవాడ శిబిరాన్ని ఆర్.ఆర్. దివాకర్, కె.ఎం మున్షీ, కళావెంకటరావు, వావిలాల గోపాలకృష్ణయ్య మొదలగు వారు సందర్శించి నిజాం వ్యతిరేకపోరాటాన్ని ప్రోత్సహించారు. రాజమండ్రిలో మద్దూరి అన్నపూర్ణయ్య, డాక్టర్ ఎ. బి. నాగేశ్వర రావు తోడ్పడ్డారు. కృష్ణాజిల్లాలో పేటబాపయ్య, కాకాని వెంకటరత్నం, కాశీశ్వరరావు ప్రభృతులు సహాయ పడ్డారు.

విజయవాడ మునిసిపల్ హైస్కూలు ఆవరణలో జరిగిన బహిరంగ సభకు 40వేలమంది హజరైనారు. స్వామీజీ అరెస్టు కాపోయ్యేముందు హైదరాబాదు సంస్థాన ప్రజాపోరాటాన్ని గురించి ప్రసంగించారు మదరాసు వెళ్ళి అచ్చటి సభాసమావేశాల్లో ఉపన్యసించారు. ఈ రీతి స్టేట్ ప్రజాపోరాటానికి మంచి మద్దతు లభించింది.

ఇటికాల-గద్వాల మధ్య తంతితపాలతీగెలను, రైలుపట్టాలను వలంటీర్లుధ్వంసం చేశారు.

## పరిటాల రిపబ్లిక్ :

ఈ కార్యక్రమాల్లో ముఖ్యమైన ఘట్టం రిపబ్లిక్కుల స్థాపన. పరిటాల చుట్టూ భారత యూనియన్ సరిహద్దు గ్రామాలు వున్నవి. గణాతుకూరు, బత్తినపాడు,మోగల్లు కొడవటికల్లు, ఉస్తేపల్లి మల్లవల్లి పరిటాల తాలూకాకు చెందిన గ్రామాలు. స్టేట్‌కాంగ్రెస్ వలంటీర్లు 1947 నవంబరు 7న ఈ పరిటాలను వశపరుచుకుని, విముక్తి ప్రాంతంగా ప్రకటించారు. ఆఫీసులపైన ఇండ్లపైన జాతీయ పతాకాలు ఎగురవేశారు.

మొదట రామకోటేశ్వరరావు, రఘునాధరావు, బాబూరావు సైనికదుస్తులుధరించి పరిటాల గ్రామం వెళ్లారు. వీరిని నిజాం అధికారులేమోనని భావించి. అక్కడి నిజాం

పోలీసులు సగౌరవంగా వందన సమర్పణ చేశారు. అంతట్లోనే మిగతా వలంటీర్లు వచ్చారు. వెంటనే ఆరక్షక భటులనుండి ఆయుధాలు లాక్కొన్నారు. తహసీల్దార్ ఆఫీస్ ట్రెజరీని ఆక్రమించుకున్నారు. పరిటాలను స్వేచ్ఛా ప్రాంతంగా ప్రకటించారు.

గ్రామస్థులను ఆహ్వానించి, బహిరంగ సభజరిపారు. ఆ సభకు లక్ష్మీకాంత రావు అధ్యక్షత వహించారు. దామెర జగన్నాధరావు, గుంటుపల్లి సత్యనారాయణ ఇన్ ఛార్జీలుగా, బి.ఆర్. రామచంద్ర కమాండర్‌గా వున్నారు. ఈ రిపబ్లిక్ స్థాపనతో, ప్రజాభిమానంలేని నిజాం ప్రభుత్వ యంత్రాంగం అక్కడ కూలిపోయింది.

ప్రజలందరు కూడి 'పంచాయతీ'ని ఏర్పాటు చేసుకొన్నారు. ఆప్రాంత గ్రామాధి కార్లు కూడా యిందుకు ఎంతగానో సహకరించారు. పరిటాల కేంద్ర పంచాయతి కమి టీకి మాదిరాజుదేవరాజు అధ్యక్షునిగా, చింతల అచ్చయ్య కార్యదర్శిగా ఎన్నికైనారు. వకీలు ఆవ్వాసత్యనారాయణ న్యాయసలహా దారుగా, రామచంద్రం మిలటరీ సలహా దారుగా వుండేవారు శాంతిభద్రతలను పరిరక్షించడం ప్రజలకు తగువసతులు కలిగిం చడం మొదలగు సివిల్ క్రిమినల్ వ్యవహారాలను కూడా వీరు చేపట్టారు.

పరిటాలను రిపబ్లిక్‌గా ప్రకటించి, ప్రథమంగా ఏర్పడిన ప్రజారిపబ్లిక్‌దేశంలో గొప్ప సంచలనం కలిగించింది. కార్యకర్తలలో ఎంతో ఉత్సాహాన్ని రేకెత్తించింది.

ఈ రిపబ్లిక్ పైన నిజాం సైనిక మూకలు దాడిచేయాలంటే, ఇండియన్ యూని యన్ సరిహద్దుల గుండా రావలసివుంది. అందుకు మదరాసు ప్రభుత్వ హోంమంత్రి డాక్టర్ సుబ్బరాయన్ అనుమతించలేదు. ఈ సందర్భంలో అవ్వా సత్యనారాయణ, సి.హెచ్ విశ్వనాధం, బండి వెంకయ్య మదరాసు వెళ్లి రిపబ్లిక్ పక్షాన తమ వాదనను వినిపించారు.

ఈ విధంగానే, ఎం. కోటయ్య, సీతారామరావు ఢిల్లీ వెళ్లి గాంధీజీని, వల్లభాయ్ పటేల్‌ను కలిసి ఈ ప్రాంత పరిస్థితులు వివరించారు. కేంద్ర ప్రభుత్వం 'పోలీస్ చర్యను' త్వరితం చేసేందుకు పరిటాల పబ్లిక్ స్థాపన తోడ్పడింది. పరిటాల రిపబ్లిక్ ఏర్పడిన తదుపరి మహారాష్ట్ర కర్నాటక సరిహద్దు ప్రాంతాలలో కూడా మరికొన్ని రిపబ్లిక్‌ల ఏర్పాటుకు అది మార్గదర్శకమైంది.

## గానుగపాడు రిపబ్లిక్ :

గానుగపాడు కాంగ్రెస్ సరిహద్దు కాంపు ఇన్‌ఛార్జిగా దూపగుంట్ల నారాయణ వుండేవారు. అసిస్టెంటుగా చిత్రాల సీతారామయ్య, ఆర్గనైజర్లుగా కవుటూరి సత్యనారాయణరావు, వనంకృష్ణమూర్తి, మత్తికాంతయ్య, నరసింహం, పొదిలి బసప్ప వుండేవారు,

మధిర తాలూకాకు చెందిన గానుగపాడు గ్రామానికి పల్లెర్లమూడి, చౌటపల్లి, చిక్కాలగూడెం, కొత్తూరు రామచంద్రపురం, మేకుంపల్లి శివారు గ్రామాలు. ఈ ప్రాంతానికి చుట్టూ కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా గ్రామాలు వుండటం చేత, కాంగ్రెసుదళాలు 1946 సెప్టెంబరు 11వ తేదీ రాత్రి 2 గంటలకు గానుగపాడును వశపరుచుకొని, రిపబ్లిక్‌గా ప్రకటించాయి. ఆఫీస్‌పైన జాతీయ జెండాను ప్రతిష్ఠించాయి. రెండువేల మంది ప్రజలతో సభచేసి, పై 6 గ్రామాలను రిపబ్లిక్‌లుగాను, భారత యూనియన్‌లో విలీనమవుతున్నట్లు తీర్మానించారు.

గానుగపాడు కస్టమ్స్ నాకాను కూడా ఆక్రమించుకొని ప్రభుత్వ రికార్డును దగ్ధం చేశారు. నిల్వవుంచిన లెవీధాన్యాన్ని బీదప్రజలకు పంచిపెట్టారు.

మాజీసైనికుడు పొదిలిబసప్ప ఆయుధాలను ఉపయోగించే పద్ధతిగురించి దళ సభ్యులకు శిక్షణయిచ్చారు. కొందరు చేతిబాంబులు తయారుచేయడం నేర్చుకొన్నారు. శిక్షణపొందిన అనంతరం, వీరు గానుగపాడు ప్రాంతంలో బాంబులు తయారుచేయ సాగారు. ఇవి తయారుచేస్తుండగా, తగినంత అనుభవంలేక పోవడంచేత, మందుప్రేలి వరంగల్‌కు చెందిన నరసింహం, పల్లెర్లమూడి గ్రామానికి చెందిన వడ్ల వెంకటనర్సయ్య మరణించారు. తల్లపురెడ్డి పిచ్చిరెడ్డి తీవ్రంగా గాయపడ్డాడు.

యర్రుబాలెం—గంగినేని రైల్వేస్టేషనులమధ్య రేమిడిచర్ల సమీపాన, గూడ్సు బండిని పడగొట్టే పనిని జంగం వెంగళరావు నాయకత్వాన దళం చేపట్టింది. గూడ్సు వాగెనులు, ఇంజన్ పట్టాలు తప్పినవి.

తునికపాడు కాంపు ఇన్‌ఛార్జి వేమిరెడ్డి ప్రతాపరెడ్డి, లతీఫ్‌మాస్టర్ (ఐ. ఎన్. ఎ) నాయకత్వాన, మరొకదళం భగవానులపురం సమీపానగల రోడ్డు వంతెనను కూలద్రోయ ప్రయత్నించింది ఈ కార్యక్రమంలో తునికిపాడు, తిరువూరు, గానుగపాడు, జొన్నలగడ్డ దళసభ్యులు కూడా పాల్గొన్నారు. ఆ సందర్భంలో నిజాం పోలీసుల కాల్పులకు గురియై ముత్తులింగం మరణించాడు. తొండల గోపవరం సమీపాన పలువురు కార్యకర్తలు రైల్వే టెలిఫోన్ తీగెలను త్రెంచివేశారు. తాటిచెట్లను నరికివేశారు. కల్లు సారాయి దుకాణాలను ధ్వంసంచేశారు.

## పర్కాలలో ఘోరదురంతం:

కాంగ్రెస్ ఆదేశానుసారం, పర్కాలలో నర్సక్కపల్లికి చెందిన ఎన్ చందర్‌రావు 1947 ఆగస్టు 15వ తేదీన మొదట సత్యాగ్రహం చేశారు. ఆయనను పోలీసులు అరెస్టు చేశారు.

పర్కాలలో సెప్టెంబరు 2వ తేదీన జాతీయజెండాను ప్రతిష్టించడానికి చుట్టు ప్రక్కల గ్రామాలనుండి 1500 మంది జనం కూడారు. అప్పటికే రజాకారు గూండాలను తెప్పించి, 60 మంది నిజాం రిజర్వు పోలీసులను పిలిపించి, జెండా ఉత్సవాన్ని భగ్నం చేయడానికి సర్వసన్నాహాలను చేసుకొన్నారు. ప్రజల పూరేగింపు సాగుతుండగా నిరాయుధులైన ప్రజలపైన ఒక్కుమ్మడిగా పోలీసులు కాల్పులు జరిపారు. ముస్లిముల ఇండ్లలో దాగివున్న రజాకార్లు జనంపైబడి హత్యాకాండ సాగించారు. 16 మంది మరణించారు. వందలమందికిపైగా గాయాలు తగిలాయి. నిజాం మిలటరీ వచ్చిపడింది చుట్టూ గ్రామాలవారిని 150 మందిని అరెస్టుచేసి, జైలుశిక్షలు విధించారు. ఆ ఘోర కృత్యాలకు, కాల్పులకు కారకులైనవారి నెవ్వరినీ అరెస్టు చేయలేదు సరికదా, ప్రజలను నానాహింసలకు గురిచేశారు.

## మృత వీరులు:

అనాటి కాల్పులలో బత్తుల సమ్మయ్య, గజ్జి పర్వతాలు, కొత్త అయిలయ్య, బొడాపురం వీరన్న, మేకల పోచయ్య, మంత్రి కోదాలి, పోతుగంటి పెద్దాలు, గుండారపు కొమరయ్య, దాతుపల్లి రాజయ్య, గల్లెకట్టె మల్లు, ముసలయ్య, తంగూర్ పూర్ణ సింగ్, కాపల అంకూసు, రాజహమ్మద్, వర్దెల్లి వీరయ్య, ఆకుతోట మల్లయ్య ఈ 16 మంది వీరమరణం చెందారు అమరవీరులైనారు. పర్కాలలో జరిగిన ఆ ఘోరదురంతం జలియన్ వాలాబాగ్ హత్యలను పోలివుంది. నిజాం ప్రభుత్వంపట్ల ప్రజల్లో ఉద్రేకాన్ని రగుల్కొల్పింది.

## చాందాకాంపు:

స్టేట్ కాంగ్రెస్ నిర్ణయం ప్రకారం, చాందా వద్ద సరిహద్దు శిబిరాన్ని ఏర్పాటు చేశారు. ఈ కాంపు ఇన్‌ఛార్జిగా కె. వి. నరసింగరావు నియమితులైనారు.

సెప్టెంబర్ 2వ తేదీన పర్కాలలో జరిగిన ఘోరకృత్యాల తర్వాత, నిజాం పోలీసులు చుట్టూగ్రామాల ప్రజలపైన దాడులు సాగించి అనేక అమానుషచర్యలు జరిపారు. ఆ దురంతాలను ఎదుర్కొనేందుకు కాంగ్రెస్ కార్యకర్తలు సమీకృతులైనారు 1947 అక్టోబరు ఒకటవ తేదీ సమావేశంలో 'గెరిల్లాల దళకమిటీ' ని ఏర్పాటు చేసుకున్నారు. ఈ గెరిల్లా దళకమిటీకి ఎన్. మనోహరరావు అధ్యక్షుడు, కె. ప్రకాశరెడ్డి ఉపాధ్యక్షుడు, కె. నర్సింహారెడ్డి కార్యదర్శి; సి వాసురెడ్డి సహాయ కార్యదర్శి—మేడపల్లి మల్లయ్య, వాడి నర్సింహారెడ్డి, బుచ్చి రామారావు, ఎస్, సీతారామారావు, రామబ్రహ్మం, జి. బుచ్చయ్య, ఆర్. చంద్రయ్య సభ్యులు.

1948 ఏప్రిల్‌లో నాగపూర్‌లో ఈ దళంలోనివారు సైనికశిక్షణ పొందారు. కొందరు చేతిబాంబులు, తుపాకులు, రైఫిళ్లు మందుగుండు సామాగ్రి సమకూర్చు కున్నారు ఇందుకు అప్పటి మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి రవిశంకరశుక్లా, సీతారాం పప్పు ప్రభృతుల సహాయం లభించింది, జిల్లా కలెక్టర్ వలంటీర్లకు తుపాకీ లైసెన్సులు కూడా మంజూరుచేయడం గొప్పవిశేషం

శిక్షణపొందిన దళాలు, గోదావరి నదిని దాటి జూన్‌లో చంద్రగిరి గుట్టకు చేరాయి ఈ విషయాన్ని నిజాం పోలీసులు పసిగట్టి ఆ గుట్టను చుట్టుముట్టారు. భీతిచెందివున్న ప్రజలలో దళాలు వచ్చిన సంగతి తెలిసికొంత మనోనిబ్బరం కలిగించింది. చంద్రగిరి గుట్టవద్ద జరిగిన సాయుధ సంఘర్షణలో ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టర్, ముగ్గురు రిజర్వు పోలీసులు గాయపడ్డారు మందుగుండు సామాగ్రిని, కొన్ని ఆయుధాలను అక్కడే వదలివేసి పోలీసులు పారిపోయినారు.

కాంగ్రెస్ దళాలు ఉప్పల రైల్వేస్టేషన్ దగ్గర మందుగుండు ప్రేల్చి, రైలుపట్టా లను చిందర వందరచేశారు ఆ ప్రాంతంతో రెండురోజులు రాకపోకలకు వీలులేకుండా చేశారు. ప్రజలు ముందుకువచ్చి కందకాలు త్రవ్వడంలో సహకరించారు

1948 జూలైలో చిరుమల గ్రామం వద్దగల భీమునిగుండు గట్టుపైన ఒక కాంగ్రెస్ దళం తన స్థావరాన్ని ఏర్పాటుచేసుకుంది. ఇక్కడ జరిగిన పోరాటంలో కూడా నిజాం పోలీసులు పారిపోయారు

బుద్ధారం గ్రామంలో అంబడిపల్లి నర్సయ్య కొట్టంలో దాచిన ఆయుధాలు పోలీసులకు పట్టుబడగా, దళసభ్యులు విజృంభించి పోరాడి తిరిగి ఆయుధాలను స్వాధీనం చేసుకోగల్గారు.

ఈ ప్రాంత గెరిల్లా కమిటీ ఉపాధ్యక్షుడైన ప్రకాశరెడ్డిని పోలీసులు పట్టుకొని నానా బాధలు పెట్టారు. ఆయన అరెస్టుకు కారకుడైన రేవాక రామచంద్రరావు ఇంటిని ప్రజలు దహనంచేసి, ఆయనను వూరినుండి వెళ్లగొట్టారు

రంగాపురంపైన పోలీసులు రజాకార్లు దాడిచేసి, పల్లిలి వీరయ్య, ఆకుతోట మల్లియ్య, రాజాహమ్మద్ గార్లను చెట్టుకు వ్రేలాడతీసి, వారిని కాల్చిచంపివేశారు.

నరసక్కపల్లి, రంగాపురం, నడికూడె, మేదరమెట్ల గ్రామాల ప్రజలు కాంగ్రెస్ దళాలకు తోడ్పడుతున్నారనే కసికొద్దీ, రజాకారు మూకలు 40 ఇండ్లు తగలబెట్టారు లక్ష్మీపురం గ్రామంలో కాంగ్రెస్ దళాలు ఎదురు దాడిచేసి, అమీరుద్దీన్ అనే రజాకార్ల నాయకుడిని హతమార్చాయి.

'ఆంధ్రవీర' అల్లూరి సీతారామరాజు





వేగేసిన నారాయణరాజు



గొట్టుముక్కల బలరామరాజు

## లాహోరు కుట్రకేసు విప్లవకారులు

(రాజగురు—భగత్ సింగ్—సుఖదేవ్)





చంద్రశేఖర్ ఆజాద్



విజయకుమార్ సిన్హా



మన్యం మల్లుదొర



హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ నాయకులు
స్వామి రామానంద తీర్థ







బూర్గుల రామకృష్ణారావు    కొండా వెంకట రంగారెడ్డి    పండిత నరేంద్రజీ

## భార్యాభర్తల జైలుయాత్రలు

ఆచార్య ఎన్.జి. రంగా, భారతీదేవి







ఆచార్య ప్రగడ కామేశ్వరరావు. సరళాదేవి



వల్లభనేని రామబ్రహ్మం, సీతామహాలక్ష్మమ్మ

సీతారామరావును అరెస్టు చేసినప్పుడు గెరిల్లాలు మెరుపుదాడి చేసి, అతనిని విడుపించుకున్నారు. ఆ సంఘర్షణలో పోలీస్ పటేల్ మరణించాడు.

సుల్తానాబాద్ తాలూకా రొంపికుంట పోలీస్ స్టేషన్‌పై పర్కాల తాలూకా గెరిల్లాలు దాడిచేసి, 5 రైఫిళ్ళను స్వాధీనం చేసుకొన్నారు. ఆ దాడి సందర్భంలో ఒక సెంట్రీ మరణించాడు ఇద్దరు పోలీసులకు గాయాలు అయినవి.

చెన్నూరు తాలూకా చారుపల్లి పోలీస్ స్టేషన్‌పైన కాంగ్రెస్ వలంటీర్లు, పర్కాల గెరిల్లా దళం కలిసి దాడిచేసి, రైఫిళ్ళను వశపరుచుకొన్నారు ఆ సందర్భంలో ముగ్గురు నిజాం పోలీసులు మరణించారు.

విర్రూరు రైల్వేస్టేషన్ వద్దనున్న పోలీస్ స్టేషన్‌పైన దాడిచేసి 10తుపాకులను స్వాధీనపరచుకొన్నారు. ఆ సందర్భంలో ముగ్గురు నిజాం పోలీసులు మరణించారు. ఈ చాందా కాంపులో శిక్షణ పొందిన కాంగ్రెస్ కార్యకర్తలు, మధ్యప్రదేశ్‌లోని సిరివంచ నుంచి వచ్చినదళంతో కలిసి, మహాదేవపూర్‌లోని నిజాం పోలీసుల మీద, రజాకార్లపైన తిరుగుదాడులు జరిపారు.

## బల్‌హర్షా ఉపకాంపు :

బల్‌హర్షా ఉపకాంపు ఇన్‌ఛార్జిగా కె. వి కేశవులు వుండేవారు. 1947 ఆగస్టు 15న జాతీయ జెండా ప్రతిష్ఠాపనలు జరిపి, వలంటీర్లను సమకూర్చారు. కె. వి. కేశవులు, రుద్రదేవ్, వి రాజేశ్వరరావు మున్నగు వారు ఈ కాంపులో పనిచేశారు. కె. వి నరసింగరావు ఇన్‌ఛార్జిగా చాందాకాంపు ఏర్పడిన తర్వాత, బల్‌హర్షా కాంపు చాందా కాంపులో కలిసిపోయింది. దాబా మోర్గండి, మురళి, సిరవంచలలో చిన్న శిబిరాలు ఏర్పడ్డాయి.

## కర్నూలు కాంపు

కర్నూలు కాంపు ఇన్‌ఛార్జిగా పాగా పుల్లారెడ్డి వుండేవారు. ఈ కర్నూలు కాంపు కార్యాలయం పర్యవేక్షణ క్రిందనే పంచలింగాల కాంపు, ఉరవకొండ కాంపు, సిద్దేశ్వరం కాంపు, కొత్తబుగ్గ కాంపు, సుంకేసుల కాంపు, మంత్రాలయం కాంపు నడుస్తుండేవి. వీటిల్లో కాంగ్రెస్ వలంటీర్లకు శిక్షణ యిచ్చేవారు.

పంచలింగాల కేంద్రంగా 5 గ్రామాలలో 'రిపబ్లిక్'ల స్థాపన జరిగింది,

## భాగ్యనగర్ రేడియో ప్రసారాలు :

కర్నూలు ప్రాంతీయ కార్యాలయం, హైదరాబాదు ప్రజా ఉద్యమ నిర్వహణకు రహస్యంగా 'భాగ్యనగర రేడియో' అనుపేరుతో ప్రసారాలు చేస్తుండేది. నిజాం పోలీసులు చేస్తున్న అత్యాచారాలను, రజాకార్ల రాక్షస కృత్యాలను తెలియజేస్తూ, వాటిని ప్రతిఘటించి ప్రజలు సాగిస్తున్న వీరోచిత పోరాటాలను బయటి ప్రపంచానికి ఆ ప్రసారాల ద్వారా వినిపించేవారు.

ఈ రేడియో సెట్టును వనపర్తి రఘునాధరెడ్డి, కోదండరామిరెడ్డి పల్లెపాటు గోవర్ధనరెడ్డి, జనార్ధనరెడ్డి నడిపిస్తుండేవారు. ప్రసారాల రచనా కార్యక్రమాలను గొట్టు ముక్కల కృష్ణమూర్తి, పి. ఎన్. మూర్తి; తెలుగు విభాగం గడియారం రామకృష్ణ శర్మ, ఉర్దులో టి. వి. నాగప్ప, ఆంగ్లంలో కె. వెంకటరెడ్డి నిర్వహిస్తుండేవారు.

ఈ దశలో కాంగ్రెస్ సోషలిస్టు వర్కర్లుచేసిన కృషికూడా ప్రశంసనీయమైంది. చాందా, నాగపూర్, షోలాపూర్, ఔరంగాబాద్, రాయచూరు మొదలగు చోట్ల శిక్షణా కేంద్రాలు నెలకొల్పి కార్యకర్తలకు శిక్షణ యిచ్చారు. ఈ సరిహద్దు కాంపులలో విద్యార్థులు, యువకులు ఎక్కువగా చేశారు. ఔరంగాబాద్ జైలు నుంచి తప్పించు కొని వచ్చిన జి. గౌతమ్‌రావు ప్రభృతులు చురుకుగా పాల్గొన్నారు.

పాల్వంచ ప్రాంతంలో మాటూరి నరసింహారావు నాయకత్వాన వంద గిరిజన గ్రామాలు స్వతంత్ర గ్రామాలుగా ప్రకటించుకొన్నవి.

వనపర్తి సంస్థానాన్ని భారత యూనియన్‌లో చేరుస్తానని ఆ జమీందారు రాజా రామేశ్వరరావు ప్రకటన చేశారు.

హైదరాబాదులో బాంబులు తయారు చేసే ఒక చిన్న కార్ఖానాను ఏర్పాటుచేసి, బాంబులను సరిహద్దు దళాలకు సరఫరా చేస్తుండేవారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో ఒక రహస్య రేడియో కేంద్రాన్ని కృష్ణశర్మ నడిపేవారు. నిజాం ప్రభుత్వం ఆయనను లోగడ బహిష్కరించినందువల్ల, అప్పట్లో బెంగుళూరులో వుండే వారు.

అదిలాబాద్ జిల్లాలో కె. వి. నరసింగరావు, కె. వి. కేశవులు, జె. గౌతమ్ రావు నాయకత్వాన రహస్య ఉద్యమం నడుపబడింది. షోలాపూర్ శిబిరాన్ని ఎల్. నారాయణ, బసవరాజు, వై. ఎస్. రాజు మున్నగువారు నడిపేవారు. పోలీసులతో జరిగిన సాయుధ సంఘర్షణలలో గంగాధర్, అగువోట్కర్, జగన్నాధ బాలేరావు, జగ్జీవన్‌రామ్ ప్రాణాలు కోల్పోయారు.

# భారత స్వరాజ్య సిద్ధి

1935 నూతన రాజ్యాంగ చట్టాన్ని అనుసరించి 1937లో సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. దేశంలోని 11 రాష్ట్రాలలో కాంగ్రెస్ గెలుపొంది, మంత్రివర్గాలను ఏర్పరిచింది. మిగతా రాష్ట్రాలలో ముస్లింలీగ్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. 1936–37 వరకు అప్పటి జాతీయ కాంగ్రెస్ సభ్యత్వం 50 వేలు మాత్రమే 1939 నాటికి ఈ సభ్యత్వం 50 లక్షలకు పెరిగింది.

1939లో అఖిల భారత కాంగ్రెస్ మహాసభ త్రిపురిలో జరిగింది. కాంగ్రెస్ అధ్యక్ష పదవికి సుభాస్‌చంద్రబోస్‌కు డాక్టర్ పట్టాభికి మధ్య తీవ్రపోటీ జరిగింది. సుభాస్‌బోస్ గెలిచాడు. 'పట్టాభి ఓటమి నా ఓటమి' అన్నారు గాంధీజీ. కాంగ్రెస్‌లో వామపక్ష మొగ్గుదలకు అది నిదర్శనం. మెజారిటీ కాంగ్రెస్ కార్యవర్గసభ్యులు సహకరించక పోవడంవల్ల, అధ్యక్షపదవికి సుభాస్‌బోస్ రాజీనామాచేసి, తర్వాత 'ఫార్వర్డ్ బ్లాకు' ను ఏర్పాటుచేశారు.

1939 సెప్టెంబర్‌లో ద్వితీయ ప్రపంచ సంగ్రామం సంభవించింది. భారత ప్రజల. ప్రజాప్రతినిధుల ఆమోదంలేకుండా దేశాన్ని యుద్ధలోకి దించరాదని కాంగ్రెస్ కోరింది. బ్రిటిష్ ప్రభుత్వవైఖరికి నిరసనతెల్పుతూ, అక్టోబరులో కాంగ్రెస్ మంత్రి వర్గాలన్నీ రాజీనామాచేశాయి. ద్విజాతి సిద్ధాంత పెడవాదనతో మహమ్మదాలిజిన్నా, 'ముస్లిం అధిక సంఖ్యాకుల ప్రాంతాలతో 'పాకిస్థాన్' ఏర్పాటుచేయాలని మంకుపట్టు పట్టాడు. ముస్లింలీగ్ 'విముక్తిదినం' పాటించి ఘర్షణలకు పూనుకొంది.

'యుద్ధాన్ని జయప్రదంగా సాగించాలంటే వెంటనే జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయమని' కాంగ్రెస్ కోరింది, యుద్ధసమయంలో జాతీయ ప్రభుత్వ నిర్మాణం సాధ్యంకాదని 1940 ఆగస్టు 8వ తేదీన రాజప్రతినిధి ప్రకటించాడు. 1940 అక్టోబరులో కాంగ్రెస్ వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభించింది.

1942 మార్చి 8న రంగూన్ పడిపోయింది. బ్రిటిష్ ప్రభుత్వం ఆ వెంటనే సర్‌స్టాఫర్డ్ క్రిప్సును భారతదేశం పంపి, నాయకులతో సంప్రదింపులు సాగించింది. యుద్ధానంతరం దేశానికి అధినివేశ ప్రతి పత్తిని యిస్తామని, యుద్ధం కాగానే రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పరుస్తామని క్రిప్సు ప్రతిపాదించాడు. ఆ సూచనలను కాంగ్రెస్, ముస్లింలీగ్ రెండూ తిరస్కరించాయి. క్రిప్సు రాయబారం విఫలమైంది,

పంజాబు, పశ్చిమోత్తర పరగణాలు, కాశ్మీరు, సింధూ, బెలూచిస్థాన్‌లు కలిపి, పాకిస్థాన్ కావాలని ముస్లింలీగ్ ఆందోళన చేసింది.

బొంబాయిలో 1942 ఆగస్టు 8న కాంగ్రెస్ ఎ ఐ. సి సి మహాసభ జరిగింది. గాంధీజీ సూచనల మేరకు 'క్విట్ ఇండియా' తీర్మానం ఆమోదించబడింది. ఆగస్టు 9వ తేదీన కాంగ్రెస్ అగ్రనాయకులను అరెస్టుచేసి ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానానికి పూనుకొంది.

## అజాద్ హింద్ ఫౌజ్

ఇది యిట్లుండగా, 1941లో కలకత్తాలో గృహనిర్బంధంలోనున్న సుభాస్ చంద్రబోస్ రహస్యంగా తప్పించుకొని, జర్మనీ జపాన్ దేశాలకుపోయి, హిట్లర్ టోజోలతో సంబాషణలు జరిపారు. వారికి బందీలుగా చిక్కిన బారత సైనికులతో 'ఆజాద్ హింద్ ఫౌజ్' (Indian National Army)ను ఏర్పరిచాడు. 1943లో మనదేశ సరిహద్దులవరకు పురోగమించారు. నేతాజీ సుబాస్ చంద్రబోస్ సాహసం, దేశభక్తి దేశప్రజలను ఎంతో ఉత్తేజపరిచింది. 'ఢిల్లీచలో' అని బోస్ బారత సైనికులను ఉత్సాహపరిచారు తర్వాత దురదృష్టవశాత్తు, విమాన ప్రమాదానికి గురిఅయి ఆయన అసువులర్పించారు.

1944 మే 6వ తేదీన గాంధీజీని ప్రభుత్వం విడుదలచేసింది. గాంధీ-జిన్నాల మధ్య సంబాషణలో జరిగాయి. కాని రాజీ కుదరలేదు. దేశంలో మత కలహాలు చెల రేగాయి. వైస్రాయిగా విన్‌లిత్గోబదులు లార్డువేవల్ వచ్చాడు 1945 జూన్ 25వ తేదీన సిమ్లా సభ జరిగింది, కాంగ్రెస్, ముస్లింలీగ్‌ల మధ్య రాజీ కుదరలేదు. ఈ ప్రతిష్ఠంభన యిలా కొనసాగుతుండగా, ఇంగ్లండులో లేబర్ పక్షం అధికారంలోకి వచ్చింది. అట్లీ ప్రధాని అయినారు. వైస్రాయి కౌన్సిల్‌ను బారతీయ సభ్యులతో పునర్నిర్మాణం చేస్తామని, రాజ్యాంగ నిర్మాణసభను ఏర్పరుస్తామని ప్రకటించారు.

1946లో సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. జనరల్ స్థానాల్లో కాంగ్రెస్, ముస్లిం స్థానాలలో ముస్లింలీగ్ గెలుపొందాయి. హీరోషిమా, నాగసాకి సంఘటనల తర్వాత జపాన్ లొంగి పోయింది.

ఆజాద్‌హింద్ ఫౌజ్ సైనికులపైన రాజద్రోహ నేరంమోపి ఢిల్లీ ఎర్ర కోటలో ప్రభుత్వం విచారణ ప్రారంభించింది. దేశభక్తిగల భారతీయులు సుభాస్‌బోస్ సైన్యానికి అండగా నిలిచారు. 1946 ఫిబ్రవరి 18వ తేదీన బొంబాయి మున్నగు రేవు

పట్టణాల్లో భారత నావికుల తిరుగుబాటు జరిగింది. 19వ తేదీన బ్రిటిష్ ప్రధాని ముగ్గురు మంత్రులను భారతదేశం పంపి, మంతనాలు కొనసాగించాడు.

1946 ఆగస్టు 16వ తేదీన ముస్లింలీగ్ 'ప్రత్యక్ష చర్యదినం' (Direct Action Day) జరపండని ముస్లింలీగ్ నాయకులు, జిన్నా ఉద్రేకపూరిత ప్రసంగాలు చేశారు కలకత్తా మొదలైనచోట్ల దౌర్జన్యాలు జరిగాయి. మతకలహాలు చెలరేగాయి. నౌకహాళి, కొమిల్లాలలో ముస్లిముల హింసాకాండ, దానికి ప్రతీకారంగా బీహారు మొదలగు ప్రాంతాల్లో ప్రతీకార జ్వాల ప్రజ్వరిల్లింది. మతకలహాల మహమ్మారి ఉత్తర భారతంలో వీరవిహారంచేసింది.

1946 డిసెంబర్ 9న భారత రాజ్యాంగ నిర్మాణ సభ (Constiuent Assembly) సమావేశం జరిగింది. రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగా ఎన్నికైనారు. ముస్లింలీగ్ వారు యిందు పాల్గొనలేదు.

1947 మార్చి 24వ తేదీన మౌంట్ బాటన్ నూతన వైస్రాయిగా వచ్చాడు. కాంగ్రెస్ ముస్లింలీగ్ నాయకులతో, స్వదేశ సంస్థానాధిపతులతో సంప్రదింపులు సాగించాడు. ఉత్తర భారతమంతటా హిందూ-ముస్లిముల మధ్య హింసాకాండ తీవ్రతరమైంది. 1947 జూన్ 3వ తేదీన వైస్రాయి దేశవిభజన పథకాన్ని ప్రకటించాడు. దేశ విభజనకు గాంధీమహాత్ముడు అంగీకరించలేదు కాని గత్యంతరం లేక నెహ్రూ, పటేల్ మున్నగు అగ్రనాయకులు ఎట్టకేలకు సమ్మతించారు.

1947 జూలై 1వ తేదీన, బ్రిటిష్ పార్లమెంటులో 'ఇండియన్ ఇండిపెండెంటు' బిల్లుకు ఆమోద ముద్రలభించింది. 1947 ఆగస్టు 15వ తేదీన భారతదేశం స్వతంత్ర దేశంగా అవతరించింది. పాకిస్థాన్ వేరే రాజ్యమైంది.

స్వతంత్ర భారతదేశం అనేక క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవలసివచ్చింది. కాందిశీకుల సమస్య కలతపరచింది. మతకలహాలను చల్లార్చవలసివచ్చింది. స్వదేశీ సంస్థానాలను నయానా, భయానా భారతదేశంలో సంలీనం చేసుకోవలసివచ్చింది. నూతన ప్రభుత్వం కొన్నిచోట్ల తీవ్ర శాంతిభద్రతల సమస్య ఎదుర్కొంది. ఈ అవరోధాలను దాటి, సార్వత్రిక ఎన్నికలు వయోజనులందరికీ ఓటు హక్కుతో జరిపించి, పంచవర్ష ప్రణాళికల ద్వారా దేశాభివృద్ధికి పూనుకోవడం జరిగింది. చైనా, పాకిస్తానుల వైపు నుంచి సంభవించిన సరిహద్దు, దురాక్రమణ యుద్ధాలను తట్టుకొని, దేశ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోగల్గాము ఆర్థిక సాంఘిక పురోభివృద్ధికి ప్రధాన

ప్రాతిపదకలు నిర్మించుకున్నాము. ప్రపంచ దేశాలతో స్నేహ సౌభ్రాతృత్వాలను పెంపొందించుకున్నాము.

## హైదరాబాద్ సంస్థానంలో నూతనశకం

భారతదేశంలో చిన్నవీ, పెద్దవీ కలిసి 622 స్వదేశీ సంస్థానాలు వుండేవి. 1947 ఆగస్టు 15వ తేదీ కల్లా స్వతంత్ర రాజ్యంగా ఏర్పడిన 'ఇండియన్ యూనియన్'లో సంస్థానాలన్నీ చేరిపోవాలని భారత ప్రభుత్వం ప్రకటించింది. కాశ్మీర్, జునాగడ్, తిరువాన్కూరు, హైదరాబాదు ఈ నాలుగు సంస్థానాలు మినహా, మిగతావన్నీ గడువులోపల ఇండియన్ యూనియన్‌లో చేరాయి.

తిరువాన్కూరు మొదట్లో స్వతంత్ర రాజ్యంగా వుంటానన్నది. కాని సంస్థాన ప్రజలు విలీనంకై తీవ్ర ఆందోళన, పోరాటం సాగించారు. దివాన్‌గావున్న సర్ సి. పి. రామస్వామయ్యర్‌కు ప్రాణాపాయస్థితి ఏర్పడింది. దివాన్ గిరికి ఆయన రాజీనామా చేశాడు. మహారాజ తన వెనుకటి నిర్ణయాన్ని మార్చుకొని, తిరువాన్కూరును 'ఇండియన్ యూనియన్'లో చేర్చాడు.

కాశ్మీర్ మహారాజా అభ్యర్థనను పాటించి, భారత సైన్యాలు యుద్ధరంగంలోకి దిగి, జమ్మూ-కాశ్మీర్ రక్షణకు పూనుకున్నాయి. జూనాగడ్ సంస్థానం కూడా విలీనమైంది.

ఇక హైదరాబాదు సంస్థానం విషయం పరిశీలిద్దాం. ఇది ఒకకోటి ఎనభై లక్షల జనాబా కలిగిన పెద్ద సంస్థానం. 1947 ఆగస్టు 15వ తేదీతో స్వదేశీ సంస్థానాలపై తమ సార్వభౌమాధికారాన్ని వదలుకుంటున్నట్లు బ్రిటిష్ పార్లమెంటు ప్రకటించింది.

## 'ఆజాద్ హైదరాబాదు' ఉన్మాదం :

ఇత్తేహాదుల్ ముస్లిమీన్ సంఘం వారు ఖాసిమ్‌రజ్వీ నాయకత్వాన 'ఆజాద్ హైదరాబాదు' అంటూ, స్వతంత్ర రాజ్యంగానే వుండాలని కోరారు. రజాకారు మూకలు ప్రజలపై దౌర్జన్యాలు సాగించారు. అనేక ఘోర కృత్యాలకు పాల్పడినారు. భారత సరిహద్దు గ్రామాలపై కూడా దాడులు చేశారు.

బ్రిటిష్ ప్రభుత్వం సంస్థానాలపై తన సార్వభౌమాధికారాన్ని వదులుకోగానే, హైదరాబాదు సంస్థానం స్వతంత్ర రాజ్యం అవుతుందని నిజాం నవాబు 1947 జూన్ 11వ తేదీన ఒక ఫర్మానా జారీ చేశాడు.

"He was entitıld to assume The Status of an Independent Soverign on Angwst 15th" అని నిజాం నవాబు ప్రకటించాడు.

హైదరాబాదు భవిష్యత్తును ప్రజలే నిర్ణయించాలిగాని సంస్థానాధీశుడుకాదని, తక్షణం భారత యూనియన్‌లో విలీనం కావాలని కోరుతూ స్టేట్‌లో తీవ్రాందోళన చెలరేగింది.

హైదరాబాదు సంస్థానం భౌగోళికంగా చూచినా, సరిహద్దు ప్రాంతాల ప్రజల దృష్టిలో వుంచుకొని ఆలోచించినా సంస్థానంలోని అత్యధిక సంఖ్యాక ప్రజలను గమనించినా హైదరాబాదు సంస్థానం విధిగా ఇండియన్ యూనియన్‌లోనే, చేరవలసి వుంటుంది. నిజాం నవాబు, రజాకార్లు కోరుతున్నట్లు స్వతంత్ర హైదరాబాదు గనుక ఏర్పడితే, అది భారతదేశ సమైక్యతకు, రక్షణకు ఎంతో ప్రమాదకరమనే విషయం వేరుగా చెప్పనవసరంలేదు. 'ఇండియన్ ఇండిపెండెంటు చట్టంలోని 7వ క్లాజును అవకాశంగా జేసుకొని, తనకు స్వతంత్ర రాజ్యస్థాయి కావాలని నిజాం నవాబు కోరాడు.

## ప్రధాని నెహ్రూ హెచ్చరిక :

ఆగస్టు 15వ తేదీలోగా సంలీనం కాని సంస్థానాధీశులు భారత ప్రభుత్వ వ్యతిరేకులుగా పరిగణింపబడతారని ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ హెచ్చరించారు. అయితే, వైస్రాయి మౌంట్‌బాటన్ సలహాతో, మరో రెండు మాసాలు గడువు పొడిగించారు.

ఇత్తెహదుల్ ముస్లిమీన్ సంస్థ సంస్థానేతరులైన, మత మౌఢ్యంగల మహమ్మదీయులను, పఠానులను, అరబ్బులను చేరదీసి, అధిక సంఖ్యాక ప్రజలనందరినీ భయభ్రాంతులను చేసింది. వారి నాయకుడు ఖాసింరజ్వీ 'ఉత్తర సర్కారుల్లోని బంగాళా ఖాతంలోని సముద్రజలాలలో నిజాం నవాబు పాదాలకు అభిషేకం చేయిస్తానని' ప్రగల్భాలు పలుకుతూ వచ్చాడు. విశాల 'ఇస్లమిక్ స్టేట్'ను సృష్టించాలని కలలు గన్నాడు. భారత ప్రభుత్వంతో జరిగే రాజీ సంప్రదింపులను రజాకారు మూకలు ఎప్పటి కప్పుడు భగ్నం చేస్తూ వచ్చాయి.

## యథాతథపు ఒడంబడిక :

1947 నవంబరు 27వ తేదీన, ఎట్టకేలకు యథాతథపు ఒడంబడిక (Stand-still agreement) మీద నిజాం సంస్థానాధీశుడు సంతకం చేశాడు. కాని ఆ ఒడంబడిక షరతులను ఉల్లంఘిస్తూ భారత యూనియన్‌పై కుట్రలు సాగిస్తూ వచ్చాడు. కేంద్ర ప్రభుత్వ అనుమతిలేకుండానే యితర దేశాలలో తన వ్యాపార ఏజెంట్లను నియ

మించాడు. పాకిస్తాన్‌కు 20 కోట్ల రూపాయలు ఋణంగా యిచ్చాడు. పాకిస్తాన్‌తో మంతనాలు ఎక్కువ చేశాడు. ఆయుధాలు, మందుగుండు సామాగ్రిని సిడ్నీకాటన్ ద్వారా ప్రోగుచేశాడు. రహస్యంగా యుద్ధ ప్రయత్నాలు చేయసాగాడు. భారత రాజ్యాంగ నిర్ణాయక సభకు తన ప్రతినిధిని పంపనని భీష్మించాడు. జనరల్ ఎడ్రూస్‌ను హైదరాబాదు సైన్యానికి కమాండర్‌గా చేశాడు. సరిహద్దుసగల భారత భూభాగాలపై కూడా దాడులు సాగించాడు. ఈ విధంగా, అగ్రిమెంటులోని షరతులను ఉల్లంఘించాడు. సంస్థానంలో అల్లకల్లోల పరిస్థితులు ఏర్పడ్డాయి రజాకారు దురంతాలు మితిమీరాయి. కమ్యూనిస్టుచర్యల ఫలితంగాకూడా, శాంతిభద్రతల సమస్య ఎదుర్కొంది.

## సంప్రదింపుల తతంగం :

భారత ప్రభుత్వంతో నిజాం ప్రభుత్వం జరిగిన సంప్రదింపుల తతంగాన్ని గూర్చి అఖిల భారత సంస్థాన ప్రజామండలి అధ్యక్షుడు డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య తమ ప్రకటనలో యిలా వివరించారు.

> "ఆదినుంచి అంతవరకు ఈ సంప్రదింపులు జిన్నా పద్ధతిని అవలంభించినందున వ్యర్థగా వుండాలి. స్వలాభానికై ఎత్తులు వేస్తూ సౌకర్యాలు కలిగించేందుకు ప్రాధేయపడుతూ,మూలసూత్రాలను సిద్ధాంతాలను ఛేదిస్తూ, సంప్రదింపులు విఫల పరుస్తూ కొంతకాలం అసట తీర్చుకుంటూ అవసర సమయమందల్లా మాయోపాయాలు పన్నుతూ, ఎత్తులువేస్తూ స్తంభింపజేస్తూ జరిగాయి. నిజాం సంప్రదింపుల తతంగమంతా వ్యవహారమునందు సర్దుబాటు బిగువు, స్తంభన మళ్ళి ప్రారంభమవుతుండటంవల్ల పేచీని విడతీసే వుద్దేశంతో భారతప్రభుత్వం వారికి సౌకర్యాలు కలిగిస్తూ వచ్చింది.
>
> బాధ్యతగల వ్యక్తులతో సంప్రదింపులు జరగడం లేదన్నట్లు యిప్పటికి భారత ప్రభుత్వం గ్రహించింది. అందువల్ల తమవిధానాన్ని వైఖరిని మార్చేసింది పిచ్చిపిచ్చిగా, అవివేకంగా ప్రవర్తిస్తే ఫలితం అనుభవించాలసి వుంటుందని పండిత నెహ్రూ పటేల్ ప్రభృతులు నైజాం నవాబును గట్టిగా మందలించారు. సంస్థాన మందు రజాకారు ప్రమాదం నానాటికి మితిమీరి పోతున్నందున దాన్ని అలా వదలడం రాజనీతికాదు"... .. అందువల్ల ఈ దోపిడీ మూకను రద్దుపరచి పేరా

లసిందనీ నైజాంని హెచ్చరించారు; కాదు పట్టుబట్టారు. కుంటిసాకులు చూపిస్తూ లయఖాలీ ఈరజాకారు సంస్థ అవసరాన్ని చూపెట్టాడు ఇంతే కాదు. యిహామాయోపాయాలుగాని. 'ప్లెబిసిట్' తతంగంగాని భారత ప్రభుత్వాన్ని నాయకత్వాన్ని ప్రజానీకాన్ని మురిపింపజాలవని తమ భామవేషం నిజరూపంతో బైటపడేకాలం సమీపించిందని కూడా లయఖాలి గమనించాడు. ఇకపాత వేషం రమ్యంగా వుండదని ఏదోవిధంగా ఇల్లు చేరిపోదామని నిశ్చయించి భారత ప్రభుత్వం వారి సంరక్షణ, విదేశ వ్యవహారాలు రహదారులు. శాసనాలు అక్షరాల హైదరాబాదుకు కూడా వర్తించుననీ ఆ శాసనాలు హైదరాబాదులో కార్యరూపందాల్చుననీ, ఏదైనా కారణాలవల్ల ఆశాసనాలను శాసనసభ ఆమోదించకపోతే, తనకుగల ప్రత్యేకాధికారాలవల్ల వీటిని అమలులోకి తీసుకొని వచ్చేదనని నమ్మించాడు. 1948 జూన్ 6న మరల లయఖాలీ మాంక్టన్‌ను వెంటవేసుకొని సంప్రదింపుల త్రాటిని కొనసాగించేందు కంటూ ఢిల్లీ చేరాడు."

డాక్టర్ పట్టాభి ప్రకటన

## భారత ప్రభుత్వ పోలీస్ చర్య :

భారత ప్రభుత్వం యిక ఉపేక్షింపజాలక పోయింది. నిజాం సంస్థానంలో శాంతి భద్రతల సంరక్షణకు, ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి 1948 సెప్టెంబరు 13వ తేదీన భారత ప్రభుత్వ సైనికదళాలు తక్షణం తగుచర్య తీసుకోవాలని దేశీయాంగ మంత్రి సర్దార్ వల్లభాయ్‌పటేల్ ఉత్తర్వు చేశాడు.

స్టేట్ నలువైపుల నుంచి జరిగిన 'పోలీస్ చర్య'కు పెద్ద ప్రతిఘటన లేకుండా పోయింది. రజాకారు మూకలు చెల్లాచెదురైపోయాయి. అవరోధాలు కలిగించాలని, వంతెనలు మొదలగు వాటిని విధ్వంసం చేయాలని నిజాం సైన్యాధికారులు చేసిన తుది ప్రయత్నాలను భారత సైనికులు వమ్ముచేశారు. ప్రేలుడు పదార్థాలను చేరవేస్తున్న జీపును, లెఫ్టినెంట్ టి. టి. ముర్రేను 18వ తేదీన భారత సైనికులు పట్టుకొన్నారు. ఖాశిం రజ్వీని అరెస్టు చేశారు.

నిజాం దుష్ట పరిపాలనలో అనేక కష్టాలు అనుభవిస్తున్న అశేష ప్రజలు భారత సైనికదళాలకు ఘనస్వాగతం చెప్పారు. పోలీస్ చర్య జయప్రదమైంది. నిజాం

నవాబు భారత సైన్యాలకు శరణుజొచ్చి, భారత ప్రభుత్వానికి లొంగిపోయినాడు. తాను ఐక్యరాజ్యసమితికి చేసిన ఫిర్యాదును ఉపసంహరించుకున్నాడు. సంస్థానం భారత యూనియన్‌లో విలీనమవుతున్నట్లు ప్రకటించాడు.

600 ఏండ్లు దక్కన్ ప్రాంతంలో పరిపాలన సాగించిన నైజాం నవాబు నిరంకుశ రాజరిక పాలన అంతరించింది. నిజాం పాలనా యంత్రాంగం కుప్పకూలి పోయింది. హైదరాబాదు సంస్థానంలో నూతన శకారంభమైంది.

పోలీస్ చర్య అనంతరం, ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్‌పటేల్ హైదరాబాదు వచ్చి, బహిరంగసభలో ఇలా ప్రసంగించారు :

> "హైదరాబాదు ప్రజలు యిప్పుడు భారతదేశంలో ఒక అంతర్భాగమైనారు. ఇది 'కేర్ టేకర్ గవర్నమెంటు'— ప్రస్తుత ఏర్పాట్లు తాత్కాలికమైనవి. ఈ సంస్థాన ప్రజల విముక్తి పోరాటాల్లో 300 మంది పైగా కాంగ్రెస్ కార్యకర్తలు మరణించారు. ఇక శాంతిభద్రతలు కాపాడటంలో సహాయపడటం మీ కర్తవ్యం. ఇక్కడి వ్యవహారాలను పరిష్కరించవలసిన వారు యిక్కడి ప్రజలే."
>
> "వివిధ మతాల మధ్య, కులాలమధ్య సఖ్యత అవసరం."

స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలకు కూడా పటేల్ ఇలా సలహా చెప్పారు :

> "స్వార్థానికి ముందు సేవ వుంచండి.
> వెనుకటి మీ సేవలకు ప్రతిఫలం కోరకండి.
> బలిదానాలకు మీరు ప్రతిఫలం కోరరాదు.
> అహింసామార్గాన్ని విడనాడబోకండి.
> అధికార పదవులకోసం ప్రాకులాడవద్దు."

# జాతీయ గీతాలు-పద్యాలు

జాతీయ స్వాతంత్రోద్యమ ప్రభావం ఆంధ్రసాహిత్యంపైన ఎంత బలీయంగా వున్నదో, ఆయాఘట్టాలలో వెలువడిన పద్య, గద్యరచనలను పరిశీలిస్తే బోధపడుతుంది. కవులు, గాయకులు, చిత్రకారులు స్వరాజ్య సమరంతో ప్రభావితులైనారు ప్రభుత్వ నిర్బంధాలను ఎదుర్కొన్నారు. లాఠీచార్జీలను, జైళ్లను చవిచూచారు. వారు భావో ద్రేకంతో, ధర్మావేశంతో వ్రాసిన రచనలు స్వచ్ఛంద సేవలకు ఎంతో ఉత్తేజాన్ని కలి గించినవి ఎట్టె కష్టాలు వచ్చినా వెనుకంజవేయక, ముందుకు మున్ముందుకు దూకించినవి. వివిధ ప్రక్రియలలో ఆంధ్రసాహిత్యం పుంఖాను పుంఖాలుగా వెలువడి, ఆంధ్రప్రజల లో బ్రహ్మాండమైన రాజకీయ చైతన్యాన్ని ప్రజ్జ్వరిల్లజేసింది. ఆ యా ఉద్యమకాలాల్లో ప్రచురింపబడినన్ని-జీవితచరిత్రలు, నాటకాలు, ప్రబోధాత్మక పద్యాలు, పాటలు, వీర రస ప్రధానమైన కావ్యాలు, మరెప్పుడూ వెలువడలేదంటే అది అతిశయోక్తికాజాలదు. వాటినన్నిటినీ పేర్కొనడం యిక్కడ సాధ్యంకాదుకాని, మచ్చుకు ఆనాటి కొన్ని దేశ భక్తిగేయాలు పద్యాలను మాత్రం ఉదహరిస్తాను.

ఏ దేశమేగినా ఎందుగాలిడినా
ఏ పీఠమెక్కినా యెవ్వరెదురైనా
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము!

అని రాయప్రోలు సుబ్బారావు దేశభక్తి గేయాన్ని రచించారు.

'దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా!'

అనే జాతీయగేయం వ్రాశారు గురజాడ అప్పారావు.

శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలువారిన భాగ్య సీమయి
వ్రాలినది ఈ భరతఖండము
భక్తి పాడర తమ్ముడా!

అని ఆలాపించారు రాయప్రోలువారు, ప్రాచీన భారత ఔన్నత్యాన్ని, విశిష్ఠతను కొనియాడుతూ ఇలా అనేక పద్యాలు-గేయాలు వెలసినవి. ఈ విధంగానే ఆంధ్రఔన్న

త్యాన్ని, ప్రతిభను పూర్వ పౌరుషాన్ని జ్ఞప్తికితెస్తూ, ఆ సుసంప్రదాయాలను కాపాడు కుంటూ కార్యోన్ముఖులు గావాలని కవివరేణ్యులు హెచ్చరించారు 'వందేమాతరం' కాలంనుండి చిలకమర్తి లక్ష్మీనరసింహం దేశభక్తితో తనకలాన్ని వినియోగించారు. బ్రిటిష్ ప్రభుత్వ దోపిడీ విధానాన్ని తీవ్రంగా గర్హించారు.

'భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగ దూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకు తున్నారు మూతులు బిగియగట్టి'

అని అనాటి దేశపరిస్థితిని చక్కగా అభివర్ణించారు. దేశీయులలో గాంధీజీ త్యాగ వైరాగ్యాలను, సత్య అహింసలను, నైతిక విలువల ప్రాధాన్యతను వివరించడం కవులలో గొప్ప ప్రభావాన్ని కలిగించింది. దేశదాస్య విముక్తికోసం అరెస్టులకు, త్యాగాలకు సిద్ధపడాలని కవులు ప్రబోధించారు.

ఎందరో కుందకుండ, మరియెందరొ బందెల నందకుండ
ఇంకెందరో దేశమున్ విడచి ఈడిగలన్ బడకుండ
ఎందరే చందమునన్ శ్రమంబడక చప్పున చొప్పడునే స్వరాజ్య
మో హిందువులార! చింతింకుడీ చెరసాలల కేగుమన్న చోన్

అని చిలకమర్తివారు ఉద్బోధించారు.

మంగిపూడి వేంకటశర్మ వ్రాసిన ఈ పద్యం చదవండి:

చోరులు జారులై వెలుగొచ్చుట తప్పగుగాని, సత్క్రియా
శూరులు ధీరులున్ సుపథ శోభితులై తగువారు జైళ్లలో
జేరుట తప్పుగాదు, మది సిగ్గిల బోకుడు దేశభక్తులను
సారతగల్గునాడు చెరశాలలుగాపు స్వరాజ్యశాలలే!

లోకమాన్యతిలక్ నిర్యాణానంతరం 1920 సంవత్సర ప్రాంతంలో గాంధీ మహాత్ముడు భారత రాజకీయరంగ ప్రవేశం చేశారు. నాన్‌కోఆపరేషన్ ఉద్యమాన్ని ప్రారంభించారు. త్యాగ మార్గాన్ని బోధించారు. 'స్వరాజ్య రథాన్ని లాగుటకు ప్రజ లంతా రండోయి! అని బలిజేపల్లి లక్ష్మీకాంత కవి ఆ రోజుల్లో కేకవేశారు.

తతి గాంధీ యుగమేగు దెంచె. నిక యేతత్ భారతీయ స్వరా
జ్యరథం బాతని సారథిత్వమునకే సాగించు డంచున్ జగ
ద్గురుడేగెన్ దివి లోకమాన్యుడపె యుద్ఘోషించె తూర్యధ్వనుల్

ఉరుతద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్! బలిజేపల్లి లక్ష్మీకాంత కవి స్వరాజ్య రథం 'స్వరాజ్య సమస్య' అనుఖండ కావ్యాలు రచించారు. మహాత్ముని గొప్పతనాన్ని, విశిష్టతను ఉగ్గడిస్తూ, దామరాజు పుండరీకాక్షుడు యిలా పద్యం వ్రాశారు:

కత్తులులేవు, శూలమును గాండివమున్ మొదలేవటుళక్కి నో
రెత్తి ప్రచండ వాక్పటిమనేనియు జాటడు, వైరిమీద దం
డెత్తగ సేనలేదు, బలిహీన పుకాయము, కోపతాపముల్
బొత్తుగసున్న అష్టివరమూర్తి మనోబలశాలి, గాంధిజే
యెత్తి నమస్కరించి స్మరయించుద మెప్డు స్వరాజ్య సిద్ధికిన్.

మాఢభూషి వేదాన్త నరసింహాచార్యులు వ్రాసిన ఈ జాతీయ పద్యం చూడండి:

ఉ॥ కాదని యూరకున్ననిక గల్గదు మోక్షము జ్ఞానులైన ఋ
షాదులు జూపినట్టిది సహాయ నిరాకరణంబు మీరలా
మోదముతోడ గాంధి ఋషి బూజ్యుని చిత్తమునందు నిల్పిని
ష్వేదమునౌ స్వరాజ్యమును జెందుడి భారత వీర పుంగవుల్

ఈముప్పూరుకవులు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని శ్రీకృష్ణజన్మస్థానం అలంకరించినవారే. వీరినాటకాలన్నీ ప్రభుత్వ నిషేధానికి గురియైనవే. దామరాజు వారి పాంచాల పరాభవం, స్వరాజ్య సోపానము, గాంధీ విజయం నాటికాలను ప్రెస్సులలో వెదకి పట్టుకొని అధికార్లు, పోలీసులు తగుల పెట్టించారు. ఆంధ్ర దేశమంతటా ఈ నాటకాలు వందల కొలది ప్రదర్శనాలు యివ్వబడినవి. ప్రేక్షకులలో స్వరాజ్య ఉద్రేకాన్ని కలిగించి, శాసనోల్లంఘ నోద్యమాలలోకి దూకించినవి. మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడిన తర్వాత, ఈ గ్రంధాలపైన నిషేధాలు తొలగించ బడినవి.

వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది విశ్వనాధశాస్త్రి గార్లు 'స్వరాజ్య గీతామృతం' వ్రాశారు. అందులో భారతమాత స్థవం యిలావుంది:

"దండాలు దండాలు భరతమాతా
ఆవిఅందుకొని దీవించు భరతమాతా!"

గాంధీజీ నాయకత్వం వహించి నడిపించిన కాంగ్రెస్ ఉద్యమాలలో పాల్గొని చెరసాలలను, లాఠీ దెబ్బలను చవిచూచిన కవివరేణ్యుడు, దేశభక్తుడు గరిమెళ్ళ సత్య నారాయణ వ్రాసిన.

'మా కొద్దీ తెల్ల దొరతనము!
మా ప్రాణాలు హరియించి మానాలుదీసేటి!' (మాకొద్దీ)

ఆంధ్రావనంతటా బహుళ ప్రచారంలో వున్న ప్రబోధ గేయం అది. ఆరోజుల్లో ఈ గీతం, ప్రతిదేశాభిమాని, వలంటీరు నోటిలో నాట్యమాడుతుండేది.

మంగిపూడి పురుషోత్తమశర్మ 1930లో సత్యాగ్రహోదంమంలో జైలుకేగిన దేశభక్తుడు. రాయవెల్లూరు సెంట్రల్ జైలులో అయన రచించిన ఈ గేయాన్ని చదవండి.

పతిత భారత ఘోర
పరిభవానల మార్చ
వ్రతులము, నవ్యభా
రతవీరసుతులము
వితత సర్వార్పణో
ద్యతి మతిని నీదరికి
కుతుకమున వచ్చినామే తల్లి."

ఉప్పు సత్యాగ్రహతరుణంలో వున్నవ లక్ష్మీనారాయణ అధ్యక్షతన సత్యాగ్రహుల సభ జరుగుతున్న సమయంలో త్రిపురనేని రామస్వామి చౌదరి విరాళం సమర్పించి సత్యాగ్రహ వీరులకు ఈ గీతంతోగౌరవాంజలి అర్పించారు.

"వీరగంధము దెచ్చినారము
వీరుడెవ్వరొ తెల్పుడీ
పూసిపోతాము మెడనువైతుము
పూలదండలు భక్తితో"

బసవరాజు అప్పారావు స్వాతంత్ర్య సమరయోధుడు. గాంధీజీని కీర్తిస్తూ వ్రాసిన గీతమిది :

"కొల్లాయి గట్టితేనేమి — మన గాంధి
కోమటై పుట్టితేనేమి ।
వెన్నపూసా మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై బ్రహ్మతేజస్సు ॥ కొల్లాయి ।

గాంధీజీ చక చకా నడుస్తుంటే జగతి కంపించేను అంటారు ఆయన.

కొసరాజు రాఘవయ్యా చౌదరి వ్రాసిన ఈ 'శాంతమూర్తి' పద్యం చదవండి :

సత్యాహింసలు, ప్రేమ సూత్రములు నీ సాన్నిధ్యలాభాన నౌ
న్నత్యమున్ గడించుకొన్నవి, ప్రశాంత జ్యోతి నీ మోముపై
నిత్యానందముగా వెలింగె, ఘనసందేశాలు నీ నోటిలో
ముత్యాలై పులకించె, సాధుగుణ సంభూతాత్మ! గాంధీప్రభూ!!

ఆ రోజుల్లో గాంధీజీ మాట వేదవాక్కు అయింది. ఆయన త్యాగధనులైన దేశ సేవకుల బృందాన్ని తయారుచేశారు. గాంధీ ఉద్యమాలు ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి.

'కవిశేఖర' గురజాడ రాఘవశర్మ సుప్రసిద్ధ స్వాతంత్ర్య యోధుడు. జైలు శిక్షల ననుభవించిన త్యాగశీలి. నాటి జాతీయ గేయాలతో బృహద్గ్రంథాన్ని రచించిన కవిపండితుడు. ఈ కవి వ్రాసిన జాతీయ జెండా పాటను చదవండి :

జండా ఎత్తర, జాతికి ముక్తిర
నిండగు శక్తిర, నిల్పర కీర్తిర ॥ జండా
దండిగ వైరులు - గుండులు ప్రేల్చిన
చెండుచు నెత్తురు - కండలు రాల్చిన।
ప్రాణముంటె, అభిమానముంటె మన
ప్రాణములైనన్ - బలిమొసంగి ॥మన జండా॥

ఆనాడు స్వచ్ఛంద సేవకులు జాతీయ జండా ప్రతిష్ఠను కాపాడుటకు ఎట్టి త్యాగాలకైనా సిద్ధపడ్డారు.

మహోవాది వెంకటరత్నం 'విశ్వభారతి' కావ్యంలో యిలా వ్రాశారు :

ఖాదీగట్టి, 'స్వతంత్ర భారతికి జై! గాంధికిజై' యంచు నే
కా దర్శంబున నా కుమారులు స్వరాజ్యశ్రీ జయోత్కంఠతన్
మీదైనిల్వగ, ఆంగ్ల పాలకుల గుండెల్ జారి, పిచ్చెత్తి హిం
సా దౌష్ట్యంబులు రాసి పోసిరి, అహింసా యుద్ధరంగంబులో.

అహింసా వ్రతులైన సత్యాగ్రహులపైన పరపరిపాలకుల మూకలు కవ్వించి, దాడులు చేసి నానా అకృత్యాలకు పాల్పడినాయి అయినా ఎట్టి ప్రతీకారం చేయకుండా అపర ప్రహ్లాదులుగా సత్యాగ్రహులు కష్టాలను సహనంతో భరించారు. ఆత్మశక్తికి తిరుగులేదని నిరూపించారు.

జాతీయ కాంగ్రెస్ నాయకత్వాన జరిగిన తుది స్వాతంత్ర్య సమరం ఆగస్టు ఉద్యమం — సుభాస్‌చంద్రబోస్, ఆజాద్‌హింద్ సేనలు భారతీయుల్లో ఉత్సాహోద్రేకాలు కలిగించాయి ఎట్టకేలకు స్వాతంత్ర్యం సిద్ధించింది. ఒక కవివరేణ్యుని పద్యం చూడండి :

నేతాజీ ప్రతిభా ప్రతాపములు, గాంధీతాత సత్యాగ్రహ
జ్యోతిర్దీప్తులు, దేశభక్తుల అఖండోత్సాహముల్ విశ్వవి
ఖ్యాతంబైన ఆగస్టు విప్లవ మహోగాథల్, సమైక్యమ్ముతై
స్వాతంత్ర్య ధ్వజమెత్తి భారత సౌభాగ్య భాగంబులన్ ।

ప్రస్థానించిరి త్యాగమూర్తులు, పవిత్రంబైన శ్రీకృష్ణ జ
న్మ స్థానంబున కెందరో, నిహతులైనా రెందరో శౌర్యధై
ర్య స్థైర్యంబులు చూపి విప్లవ సముద్రం గమ్ముతలన్, వారిసు
ప్రాప్తి శ్రేణికలే పునాదులట మా స్వారాజ్య సౌధాలకున్ ।

మహనీయులెందరో గావించిన త్యాగఫలమే స్వరాజ్యప్రాప్తి. అట్టి త్యాగమూర్తులకు సాహిత్యలోకం భక్తి గౌరవాలతో జోహారులర్పించింది.

'కవికోకిల' దువ్వూరి రామిరెడ్డి 'మాతృమందిరం' లోని ఒక పద్యాన్ని చిత్తగించండి :

మాతృదేవి బలిమంటపమందు
యజ్ఞ పశువుగ నిల్చినంతటి భాగ్య
మెవనికి సిద్ధించు నిందరిలోన
నా మహాపురుషుని యశి కాలుదమ్ము
ప్రజల శిరంబెక్కి భవ్యంబు సేయు ।

'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి పద్యం చూడండి :

దేశదాస్య విముక్తికై దీక్షబూని
బందిఖానాల బ్రతుకులు బలియొనర్చు
త్యాగమూర్తుల పాదపరాగ మెడల
పులుముకొన నెంతయో కాంక్షగలదు మాకు।

స్వాతంత్ర్యోద్యమ కాలంలో యువకులను, విద్యార్థులను ఉద్రేకపూరిత మొనర్చిన గేయం 'షురూహువా హైజంగ్ హమారా.' దీనిని వ్రాసింది, హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ.

చలావొలాఠీ చలావొడంఢా
ఉడాయేలగెహమ్ అపనారుుండా
షురూహువా హైజంగ్ హమారా॥
యుద్ధకరేంగే సిద్ధమరేంగే
నరనారీ యుత్సాత్ హమారా
షురూహువా హైజంగ్ హమారా !

ప్రజల గోడును తన గోడుగా భావించాడు కాళోజి కవి. ఎవరికీ జంకని సర్వస్వతంత్రుడు. లాఠీలకు, జైలు శిక్షలకు గురియైనాడు.

'లాఠీ దెబ్బల లక్ష్యమేమి
కఠిన శిక్షయె కాదు
చావు కైనను జంక నీయదు.' అన్నాడు.

నిజాం నవాబ్ దురంతాలకు, రజాకార్ల అకృత్యాలకు ఆగ్రహావేశ పరవశుడై

'మన కొంపలార్చిన మన స్త్రీలను చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
కండ కండగ కోసి కాకులకు వేయాలె
కాలంబు రాగానే కాటేసి తీరాలె !' అన్నాడు
—కాళోజీ

'ఓ నిజాము పిశాచమా ! కానరాడు
నిన్ను బోలిన రాజు మా కెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలోదింపి నావు
నా తెలంగాణ, కోటి రతనాల వీణ'

అని దాశరథి వ్రాశారు

'మా నిజాము రాజు జన్మ జన్మాల బూజు' అని ఈసడించాడు. ఆయన జైలు శిక్షలను, నిర్బంధాలను ఎదుర్కొని, అభ్యుదయ భావాలతో కవితా శంఖాన్ని పూరించాడు.

'నైజాము ఆంధ్రుడా ? నిజమైన వీరుడా
నాజీ ప్రభుత్వమా నరహంత కత్వమా
చూచి సహిస్తావా ? శూరుడవు కావేటి ?' అని

శిల్లా రాజోలురెడ్డి ఆంధ్రప్రజను మేల్కొల్పాడు.

ఉద్యమకాలంలో దాశరథికవి రచించిన మరొక స్వాతంత్ర్య గేయాన్ని చదవండి:

పిశాచాల నెదిరించగ
నిశా చరుల తలద్రుంచగ
నిజాం రాష్ట్ర ప్రజలారా !
భుజం కలిపి రండర్రా !

దమన నీతి యెంత కాల మిలా సాగుతుంది ?
దానవత్వ మెన్ని నాళ్లు ఇలా పెరుగుతుంది ?
సత్యాగ్రహ దావానల కీలావళి రగిలింది
చైతన్య మహా పతాక జాతిని మేల్కొల్పింది.

హైదరాబాదు సంస్థానం
అగ్ని గుండమై మండింది
మధ్య యుగాల దురంతం
మహా మారియై నిండింది
మువ్వన్నెల జెండాతో
ముందుకు పోరా !
అఖిల భారతావనిలో
అంతర్భాగం కారా ?
ప్రజాస్వామ్య సామ్యవాద
పథమే మనది
రాజరికం త్వరలోనే
రాలి పోతుంది

రజాకార్ల ఈ రాజ్యం
ప్రజావళికి యమ కూపం
మత దురహంకారానికి
ఇదే నగ్న నిజరూపం
కూలీ రైతుల్లారా !
యువతీ యువకుల్లారా
ప్రాణాలను బలిపెట్టి
స్వాతంత్ర్యం తెండర్రా !
భారత మాత పాదాలను
త్యాగరంజితం చేయండర్రా !

కుందుర్తి, ఆరుద్ర, సోమసుందర్, రెంటాల, గంగినేని మున్నగు అభ్యుదయ కవులంతా నిజాం వ్యతిరేక పోరాటాన్ని యితివృత్తంగా తీసుకొని గద్య, పద్య, కావ్యాలు రచించినవారే, అబ్బూరు రాజేశ్వరరావు, పొట్లపల్లి రామారావు, అడ్లూరి అయోధ్య రామకవి ప్రభృతుల రచనలు కూడా ప్రశంస లందుకొన్నాయి.

## అనాటి విప్లవగేయం :

హైదరాబాద్ బార్డర్ క్యాంపులలోని కాంగ్రెస్ దళాలు పాడుకున్న ఆనాటి విప్లవ గేయాన్నొక దానిని చదవండి: ఇది చందాల రామకవి వ్రాసినది.

మేముసైనికులం, మేము సేవకులం
జాతీయ భారత సైనికులం, స్వచ్ఛందకాంగ్రెస్ సేవకులం ।
తుఫానులే చెలరేగినా, మా ప్రాణాలు బలిఅయ్యినా
మమ్మాపలేదేశక్తియును యోధులం, మేము యోధులం ।
నిరుపేద రైతుకూలీలూ, ఈబాధలన్నీ మాపకనే
ఇకలేదు నిద్రాసౌఖ్యంబులు, ఆజాదుహింద్ సింహములం
వెనుజూపబోం, వెనుకాడబోం. పోరాడెదం- పోరాడెదం ।
స్వాతంత్ర్యం సిద్ధించేదాకా, దోపిళ్ళు నాశంబగుదాక
ధర్మంబుస్థాపితమగుదాకా, పోరాడెదం- పోరాడెదం ।

గుండాల గుండెలు చెండెదము, జెండాల సంరంక్షించెదం
అండన్న వారిని గాచెదం, ఖండాల నొకటిగ కల్పెదం ।
దురహంకృతి యనబడు దొరతనం, సిరివల్ల పొంగెడు మదబలం
నరరూప రాక్షసి కోరలను సమయించెదం, సమయించెదం ।

నవాబులకు స్థానం లేదు
యిమ్మంచు అడిగెడి దికలేదు
గానమ్ము కావిది బాణమ్ము
సంగ్రామమునకు పయనమ్ము
రానిమ్ము దేవుడె కానిమ్ము
యెదిరింపలేడెవిరింపలేడు ।
బారు ఫిరంగులు మ్రోగినా
బాంబుల వర్షం కురిసినా
ఎత్తిన జెండా దించబోం
పతాకకుజై— త్రివర్ణపతాకకు జై జై

## అయోధ్యరామకవి

అడ్లూరి అయోధ్యరామకవి నైజాం ప్రజల విషయం, నైజాంలో ప్రజల విప్లవం మొదలగు బుర్రకథలు, పాటలు వ్రాశారు. స్టేట్ కాంగ్రెస్ ఆ దేశాన్ని అను సరించి ఈతచెట్లు, తాటిచెట్లు నరికివేసి, సంస్థాన ప్రభుత్వానికి ఎక్సైజ్ ఆదాయం లేకుండా చేసిన రోజులవి. కల్లు సారాయీలు, మత్తుపదార్థాల సేవన మానండని ప్రబోధం గావించిన సందర్భమది. అయోధ్య రామకవి,

"లక్షల మత్తు వృక్షాల్
భేతాళములవలె కూలాయి
మత్తుకల్లు మందుకైననూ
బొత్తిగా దొరకక పోయెరా!" అని అప్పటి నిజస్థితిని వర్ణించారు.

## రాజకీయ వాఙ్మయం :

ఆ కాలంలో ప్రామాణికమైన రాజకీయ వాఙ్మయం కోకొల్లలుగా వెలువడింది. అప్పటి చదువరులు కూడా వాటిని ఆదరించి అభిమానించారు. గాడిచెర్ల హరిసర్వోత్తమ

రావుగారి హైందవ స్వరాజ్యము, చెరుకువాడ వెంకటనరసింహ్మాంగారి స్వరాజ్య దర్పణము, మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి తిలక్ జీవితము-ఉపన్యాసములు, మహాత్మాగాంధీ జీవితము, మాడభూషి వేదాంత నరసింహాచార్యులుగారి 'అసహాయోద్యమ విజయము, బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి స్వరాజ్య సమస్య మున్నగు గ్రంథ రాజములు ప్రధానమైనవి. నవయుగ గ్రంథమాల వారి భారత స్వాతంత్ర్యము, శాసన తిరస్కారము అనేగ్రంథాలు కూడా ముఖ్యమైనవి. అప్పట్లో వెలువడిన ఆ రాజకీయగ్రంథాలు, కరపత్రాలు అనేకం బ్రిటిష్ ప్రభుత్వ నిషేధానికి గురియైనవి కాని, ప్రజల అభిమానానికి అవి ఎంతో పాత్రమైనవి. అవి పాత గ్రంథాలయాలలో గాని, స్టేట్ ఆర్కైవ్స్‌లోగాని నేడు కనుపించడంలేదు. గురుజాడ రాఘవశర్మ కొంత వరకు వాటిని వెదకి సేకరించారు. వాటిలో కొన్నిటిని పునర్ముద్రించడం ఆంధ్ర సాహిత్య అకాడమీ వారుచేసిన మంచిపని.

ఇటలీ దేశభక్తుడు, స్వాతంత్ర్యయోధుడు గారీబాల్డీ. ఆయన ఇటలీని సమైక్య పరచాలని, బలవంతుడైన శత్రుమూకతో పలుసార్లు పోరాడుతూ, తాను గాయాలకు గురియైతున్నా, పట్టుదల వీడక, ఎట్టి కష్టపరిస్థితులు ఎదురైనా అధైర్యపడక, చివరకు విజయలక్ష్మిని చేకొన్న వీరాగ్రణి. ఆయన అతి నిరాడంబర జీవితం గడుపుతూ, ప్రజాభిమానాన్ని చూరగొన్న ఆదర్శవ్యక్తి. ఆదేశభక్తుని జీవితగాథ మన స్వాతంత్ర్యోద్యమ నాయకులను ఉత్తేజ పరిచింది.

జపాన్ సామ్రాజ్యవాదులకు ప్రతికూలంగా పోరాటం సల్పిన చైనా జాతీయ నాయకుడు సన్‌యట్ సేన్ గాథ మనకు జాతీయావేశం కలిగించింది.

ఆ విధంగానే, ఐర్లాండు స్వాతంత్ర్యం కోసం పోరాడిన డెవెలరా, మన స్వరాజ్య ఉద్యమానికి అండగా నిలిచారు ఇక్కడ స్వాతంత్ర్యోద్యమం సాగుతున్న కాలంలో మనదేశాన్నుండి ఐర్లాండు వెళ్ళి, అక్కడ ఉన్నత విద్య నభ్యసించి బారెస్టర్లుగా, విద్యాధికులుగా స్వదేశానికి తిరిగి వచ్చి, మన స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర వహించిన వారు అనేకులువున్నారు.

అమెరికా అబ్రహాంలింకన్, రష్యా విప్లవ అధినేతలెనిన్, టర్కీ నేత ముస్తాఫా కెమాల్‌పాషా, ఇటలీ దేశభక్తుడు మాజినీ, మున్నగు జాతీయనాయకులు భారత స్వాతంత్ర్య వీరులకు స్ఫూర్తినిచ్చారు. అందుచేతనే, ఆయాదేశాల జాతీయ నాయకుల జీవిత చరిత్రలు అనేకం భారతీయ భాషల్లో తెలుగులోను కూడా రచించి, ప్రచురించడం జరిగింది. ఆవాఙ్మయం స్వాతంత్ర్య పోరాటాల్లో పాల్గొనేందుకు మన యువతీ యువకులకు ఎంతగానో ప్రేరణ కలిగించింది.

# 'అమర జీవులు'

స్వాతంత్ర్యోద్యంలో పాల్గొని, అమరజీవులైన వారిని సంస్మరించుకుందాము.

**అల్లూరి సీతారామరాజు :** పశ్చిమ గోదావరిజిల్లా మోగల్లు గ్రామంలో 1897 జూలై 4వ తేదీన శ్రీరామరాజు జన్మించారు. దేశభక్తి ప్రపూరితుడై విశాఖ జిల్లా గిరి జనులను సంఘటిత పరిచి, 1922-24 సంవత్సరాల మధ్య బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వీరోచిత సాయుధ పోరాటం సాగించి, 1924 మే7వతేదీన సైనికుల తుపాకీ కాల్పులకు వీరమరణం చెందిన మహాయోధుడు.

శ్రీరామరాజు ఆచూకీతెల్పినవారికి ప్రభుత్వం పదివేల రూపాయలు బహుమతిని ప్రకటించింది. రెండేండ్లు పరపరిపాలకులకు సింహస్వప్నంగా వుండి, ముందుగా చెప్పి పోలీసుస్టేషనులు కొల్లగొట్టిన వీరుడితడు. పోరాట వ్యూహాన్ని రచించడంలో, యుద్ధాన్ని సాగించడంలో గొప్ప యుద్ధ విశారదుడు. స్వరాజ్యం కోసం పోరాడిన సమర సేనాని శ్రీరామరాజు. ఈ సాయుధ పోరాటంలో కొయ్యూరుగ్రామ ఉపాధ్యాయుడు బుడ్డయ్య దొర, పాడి చిన్నప్ప (తోటలూరు) వీరమరణం చెందారు.

**గాం గంటందొర:** విశాఖజిల్లా భట్టపణుకుల గ్రామమున సబ్‌గావున్న గంటం దొర,ఇతని సోదరుడు మల్లుదొర శ్రీరామరాజు నాయకత్వంలో జరిగిన మన్య విప్లవ సాయుధపోరాటంలో అత్యంత ప్రముఖ పాత్రవహించిన ప్రజానాయకులు. వీరిని పట్టి ఇచ్చినవాళ్ళకు బహుమతి యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. 1924 మే 7వ తేదీన వెదురుముడివద్ద బ్రిటిష్ సైనిక దళంతో జరిగిన సాయుధ పోరాటంలో గంటందొర వీరమరణం చెందారు.

చిట్టింపాడు గ్రామానికి చెందిన కోన కోనయ్య 1922 డిసెంబర్ 6వ తేదీన పెద్దగెడ్డపాలెం సమీపాన రాజన్నపేట గ్రామానికి చెందిన కోమిజి చింతాలు 1924 మే 6వ తేదీన కిర్రబువద్ద సాయుధ పోరాటాల్లో ఆసువులర్పించారు.

**మోసా చిన్నప్ప** (రామన్నపాలెం) 1922 డిసెంబర్ 6వ తేదీన జరిగిన పోరాటంలో వీరమరణం చెందారు.

చెదల చిన్నయ్య (గూడెం), మంచాల బోడేసు (గన్నెర్లపాలెం), నబే మల్లయ్య (మాలమాకరం) సీతారామరాజు నాయకత్వాన జరిగిన సాయుధ పోరాటాల్లో వీర మరణం చెందారు.

కన్నెగంటి హనుమంతు (మించాలపాడు) గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా 'పుల్లరి సత్యాగ్రహం' సందర్భంలో మించాలపాడు గ్రామ పెద్ద కన్నెగంటి హనుమంతు, 1922 ఫిబ్రవరి 6వ తేదీన పోలీసు తుపాకులకు ఆహుతి అయిన వీరుడు. ధైర్య సాహసాలకు ఆయనది పెట్టింది పేరు

గంగాచలం (తూర్పుగోదావరి జిల్లా) 1920 ఉప్పుసత్యాగ్రహం సందర్భంలో తూర్పుగోదావరి జిల్లా వాడపల్లి రథోత్సవంపై న పోలీసులు జరిపిన లాఠీదెబ్బలకు గురియై గంగాచలం తీవ్రంగా గాయపడ్డాడు. ఆ దెబ్బలఫలితంగా తర్వాత మరణించాడు.

గడ్డం ఓబులేసప్ప (ఉరవకొండ) అనంతపురం జిల్లా ఉరవకొండ గ్రామానికి చెందిన గడ్డం ఓబులేసప్ప 1930 ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. వరుసగా మూడురోజులు పోలీసులు లాఠీచార్జీచేయగా, ఆయన తీవ్రంగా గాయపడి, తర్వాత మరణించారు.

బోడె రామలింగయ్యచౌదరి (ఎండగండి గ్రామం) పశ్చిమగోదావరి జిల్లా ఎండగండి గ్రామానికి చెందిన రామలింగయ్యచౌదరి 1921, 1931 సత్యాగ్రహోద్యమాలలో పాల్గొన్నారు. భీమవరంలో పోలీసులు తీవ్రంగా లాఠీచార్జీ చేయగా, ఆదెబ్బలకు తర్వాత రామలింగయ్య మరణించారు.

మందపాటి పూర్ణచంద్రరావు. గుంటూరులో మందపాటి సూర్యారావు కుమారుడు పూర్ణచంద్రరావు ఇంటర్మీడియేట్ విద్యార్థి. గుంటూరు పార్కు స్వరాజ్య మైదానంలో 1942 ఆగస్టు 13వతేదీన జరిగిన పోలీస్ కాల్పులలో వీరస్వర్గ మలంకరించారు.

మాజేటి సుబ్బారావు (తెనాలి) తెనాలి పట్టణానికి చెందిన మాజేటి సుబ్బారావు 1942 ఆగస్టు ఉద్యమం సందర్భంలో సెప్టెంబర్ 2వ తేదీన తెనాలి రైల్వేస్టేషన్ వద్ద రిజర్వు దళంచేసిన కాల్పులలో వీరస్వర్గం అలంకరించారు.

ఖాస్కరుని లక్ష్మీనారాయణ (తెనాలి) 1942 క్విట్ ఇండియా పోరాట సందర్భంలోతెనాలి రైల్వేస్టేషన్ వద్ద ఖాస్కరుని లక్ష్మీనారాయణ పోలీస్ కాల్పులకు బలియైనాడు.

**ప్రయాగ రాఘవయ్య** (తెనాలి) తెనాలి ప్లీడర్ ప్రయాగ రాఘవయ్య క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో తెనాలి రైల్వే స్టేషన్ వద్ద జరిగిన పోలీసు కాల్పులలో తీవ్రంగా గాయపడి, తర్వాత ఆసుపత్రిలో మరణించారు.

**గొట్టుముక్కల బలరామరాజు** (భీమవరం) పశ్చిమగోదావరి జిల్లా ఆమిరం గ్రామ కార్యకర్త బలరామరాజు క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో భీమవరం ఊరేగింపు పైన జరిగిన పోలీస్ కాల్పులలో వీరమరణం చెందారు.

**గుంటా చిన్ననారాయణ** (మందసా) విశాఖజిల్లా మందసా గ్రామంలో 1940 ఉద్యమంలో పాల్గొన్న కార్యకర్త గుంటా చిన్ననారాయణ. ప్రజలు నిరసనప్రదర్శనం చేస్తున్నప్పుడు, పోలీసులు చేసిన కాల్పులలో ఆయన వీరమరణం చెందారు.

**కరికలగుంట చక్రపాణి** (మందసా) కరికల చక్రపాణి మందసాలో పోలీసులు జరిపిన కాల్పులలో మరణించారు.

**కడియాల యానాదయ్య** (కట్టిపాడు) ప్రకాశంజిల్లా కట్టిపాడు గ్రామానికి చెందిన కడియాల యానాదయ్య కాంగ్రెస్ ఆదేశానుసారం, ప్రభుత్వ యుద్ధ నిధులకు విరాళం యివ్వనిరాకరించిన దేశాభిమాని.

ఒంగోలులో దాంబులు తయారుచేసిన దేశభక్తులైన విప్లవకారులకు ఆశ్రయం ఇచ్చారనే నేరంమోపి, 1943 ఫిబ్రవరి 11వ తేదీన పోలీసులు యానాదయ్యను అరెస్టు చేశారు. నిర్బంధంలో పోలీసుల చిత్రహింసలకు గురియై, అసువులర్పించిన వీరుడు యానాదయ్య.

**ఇందుకూరి సుబ్బరాజు** (సత్యవాడ) పశ్చిమ గోదావరిజిల్లా సత్యవాడ గ్రామ రైతు. 1942 ఉద్యమంలో పాల్గొన్నారు. శిక్షపడింది. 1944 జూలై 1వ తేదీన తంజావూరు జైలులో మరణించారు.

**మండపాక రంగయ్యనాయుడు** (చంద్రపాలెం) తూర్పుగోదావరి జిల్లాకు చెందిన మండపాక రంగయ్యనాయుడు కాంగ్రెస్ నాయకత్వాన జరిగిన అన్ని ఉద్యమాలలో పాల్గొన్న స్వాతంత్ర్య సమరయోధుడు. 1942 జూన్ 2వ తేదీన బళ్ళారి జైలులో మరణించారు.

**పిన్నమనేని కనకయ్య** (పొలుకొండ) కృష్ణాజిల్లా పొలుకొండ గ్రామానికి చెందిన పిన్నమనేని కనకయ్య 1942 ఉద్యమ కార్యకర్త. జైలుశిక్ష పడింది. 1943 డిసెంబర్ 27న బళ్లారి జైలులో మరణించారు.

## పశ్చిమ గోదావరి జిల్లాలో అసువులు బాసిన అమరవీరులు :

1. దండు నారాయణరాజు—తంజావూరు జైల్లో మృతి
2. ఇందుకూరి సుబ్బరాజు—(సత్యవాడ) ,,
3. దండు వెంకట్రాజు—(మల్లిపూడి) రాజమండ్రి జైల్లో మృతి
4. పైల అచ్చన్న—(ఏలూరు) 1930లో ఏలూరు కాల్పుల్లో మృతి

1930లో ఏలూరు కాల్పులలో తుపాకీగుండ్ల దెబ్బతిని గాయపడినవారు.

1. చెన్నంరెడ్డి రాఘవరావు
2. వేగి దుర్గయ్య
3. గొర్రెల రాములు
4. గుండాల అప్పలస్వామి

1942 భీమవరం కాల్పుల్లో గాయాలు తగిలినవారు:

5. గుండేపల్లి వెంకన్న
1. వేగేశన నారాయణరాజు—(వేంపాడు) 1942 భీమవరం కాల్పుల్లో మృతి
2. గొట్టుముక్కల బలరామరాజు—(పెదలమిరలి) ,,
3. రుద్రరాజు వెంకట్రాజు—(కుముదవల్లి) ,,

**సర్దార్ దండు నారాయణరాజు** (నేల పోగుల గ్రామం) పశ్చిమ గోదావరిజిల్లా నేలపోగుల గ్రామానికి చెందిన దండు నారాయణరాజు 1889 అక్టోబర్ 15న జన్మించారు. ఆయన న్యాయశాస్త్ర పట్టభద్రుడు. ప.గో జిల్లా బోర్డు అధ్యక్షునిగా పని చేశారు, అన్ని స్వాతంత్ర్యోద్యమాల్లో పాల్గొన్నారు. 1942 ఉద్యమంలో ప్రభుత్వం నారాయణరాజును జైల్లో నిర్బంధించింది. ఆయన 1944 సెప్టెంబర్ 10వ తేదీన తంజావూరు జైలులో స్వర్గస్తులైనారు.

**నాగయ్య సంతోషం** (నందివాడ) కృష్ణాజిల్లా నందివాడకు చెందిన నాగయ్య సంతోషం, ఆగస్టు ఉద్యమం సందర్భంలో అరెస్టు అయినారు 1943 ఏప్రిల్ 13న బళ్లారి జైలులో ఆయన మరణించారు,

**రెడ్డి వెంకటయ్య** (ఉరఫ్ భూపతి) మన్యవిప్లవంలో పాల్గొన్నారనే నేరంమోపి గన్నేర్లపాలెం గ్రామస్థుడు రెడ్డివెంకటయ్యను అరెస్టుచేసి, ప్రభుత్వం 8ఏండ్లు కఠిన శిక్ష విధించింది. రాజమండ్రి సెంట్రల్‌జైలులో ఆయన 1924మే12వ తేదీన మరణించాడు.

**పనసల మల్లుపడాల్ లేక మల్లయ్య** (కంపరేగులగ్రామం) పనసల మల్లు పడాల్ కంపరేగుల గ్రామరైతు. మన్య విప్లవం సందర్భంలో ప్రభుత్వం అరెస్టుచేసి 8ఏండ్లు కఠిన శిక్ష విధించింది. రాజమండ్రి సెంట్రల్ జైలులో ఆయన 1924 మే6 వతేదీన మరణించారు.

**కంభంపాటి కుమారస్వామి** (మర్రిపూడి గ్రామం) గుంటూరుజిల్లా మర్రి పూడి గ్రామానికి చెందిన కంభంపాటి కుమారస్వామి 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆయనను ప్రభుత్వం అరెస్టుచేసి ఒక ఏడాది కఠిన శిక్ష విధించింది. 1930 నవంబర్ 11వ తేదీన ఆయన రాజమండ్రి సెంట్రల్ జైలులో మరణించారు.

**మారుటూరి శివసత్యనారాయణ** (ఇంటూరుగ్రామం) గుంటూరు జిల్లా ఇంటూరు గ్రామానికి చెందిన మారుటూరి శివసత్యనారాయణ 1930 ఉప్పుసత్యా గ్రహంలో పాల్గొన్నారు. బళ్లారి జైలులో లాఠీఛార్జీకి గురైనారు. 1932 నవంబర్ 6వ తేదీన ఆయన స్వర్గస్థుడైనారు.

ఈ అమరజీవులలో ప్రభుత్వ సైనికులతో జరిగిన సాయుధ సంఘర్షణలలో పరమపదించినవారు, పోలీసుల కాల్పులలో మరణించినవారు, జైళ్ళలోను, వెలుపల జరిగిన తీవ్ర లాఠీఛార్జీలకు గురిఅయి, తర్వాత స్వర్గస్తులైనవారు వున్నారు. వీరందరూ ధన్యజీవులు.

## త్యాగధనుల కుటుంబాలు:

జాతీయ స్వాతంత్ర్య సంగ్రామంలో త్యాగధనులు, కుటుంబాలతో సహా పలువురు జైలు యాత్రలు చేశారు. జైళ్ళలోనే ప్రసవించిన వీరమాతలు వున్నారు. వారందరూ చిరస్మరణీయులు.

ముడుంబ నరసింహాచార్యుల కుటుంబంలో 8 మంది జైళ్ళ కెళ్ళారు. ఆయన సతీమణి వెంకటమ్మ జైలు నిర్బంధంలో ప్రసవించి కుమారులనుకన్నది. దొడ్డమాచార్యులు, వెంకటాచార్యులు, లక్ష్మీదేవి, స్వరాజ్యలక్ష్మి జైళ్ళలో శిక్షల ననుభవించారు.

ఏలూరుకు చెందిన సత్తిరాజు రామమూర్తి, భార్య మంగమ్మతో సహా జైళ్ళ కెళ్ళారు.

కొవికలపూడి అంజనేయులు, సరస్వతమ్మ (పూళ్ళ), అల్లూరి సత్యనారాయణ రాజు, అన్నపూర్ణమ్మ (జిన్నూరు), కొవ్వలి గోపాలరావు, కనకమ్మ (తణుకు). గోకరాజు సూర్యనారాయణరాజు, వెంకాయమ్మ (భీమవరం), పసల కృష్ణమూర్తి, అంజలి లక్ష్మి (పడమటి విప్పర్రు), జవ్వాజి అప్పారావు గుప్తా, రాజరత్నమ్మ (ఏలూరు) డాక్టర్ మూల్పూరి రంగయ్య, చుక్కమ్మ (పెదపాడు), తల్లాప్రగడ నరసింహ శర్మ, విశ్వసుందరమ్మ (చాగల్లు), తల్లాప్రగడ నాగరాజు, సుబ్బలక్ష్మమ్మ (తణుకు), మాగంటి బాపినీడు, అన్నపూర్ణాదేవి, దేగల సూర్యనారాయణ, వెంకట రత్నమ్మ (పెనుమంట్ర), మంతెన సూర్యనారాయణరాజు, నరసమ్మ (సత్యవీడు), గుజ్జుల వెంకటరావు, నాగరత్నమ్మ (నిడుదవోలు), దంపతులు జైళ్ళ కెళ్ళారు.

కృష్ణా జిల్లాలో దుగ్గిరాల బలరామకృష్ణయ్య, కమలమ్మ అరికెపూడి నాగభూషణం, ఉషారాణి-వల్లభనేని రామబ్రహ్మం, సీతామహాలక్ష్మమ్మ-అరికెపూడి రామనాధం, సుగుణమణి-బెజవాడలో మరుపిళ్ళచిట్టి, భ్రమరాంబ-ఎర్నేని సుబ్రహ్మణ్యం, దమయంతి-గోపరాజు రామచంద్రరావు, సరస్వతమ్మ-తంగిరాల వీరరాఘవరావు, సీతారామమ్మ - విజయకుమార సిన్హా, శ్రీ రాజ్యం సిన్హా-ఘంటా వీరరాఘవయ్య, మల్లికాంబ-మొదలగు దేశభక్తులు జైళ్ళ కెళ్ళారు.

గుంటూరు జిల్లాలో అన్నాప్రగడ కామేశ్వరరావు, సరళాదేవి-ఆచార్య ఎన్. జి. రంగా, భారతీదేవి-మంతెన వెంకటరాజు, అన్నపూర్ణమ్మ-పున్నవ లక్ష్మీనారాయణ, లక్ష్మీబాయమ్మ-తుమ్మల బసవయ్య, దుర్గాంబ-కొల్లా కాశీవిశ్వనాథం, కనకవల్లి

తాయారమ్మ-వావిలాల రామశర్మ, మాణిక్యాంబ-ప్రసాద్, నాగలక్ష్మమ్మ-సుఖవాసీ కృష్ణయ్య, భ్రమరాంబ—పావులూరి సుబ్బయ్య, రాఘవమ్మ-మున్నగు త్యాగశీలురు జైళ్ళకెళ్ళారు.

నెల్లూరు జిల్లాలో ఓరుగంటి వెంకటసుబ్బయ్య, భార్య మహలక్ష్మమ్మ, కుమార్తు వెంకటేశ్వరరావు, కుమార్తె మైత్రేయి, ఓరుగంటి రామచంద్రయ్యగార్లు కుటుంబంతో సహా జైలు యాత్రలు చేశారు.

తిక్కవరపు రామిరెడ్డి, భార్య సుదర్శనమ్మ-పాతూరి సుబ్బరామయ్య, భార్య బాలసరస్వతమ్మ-మొదలగు వారు జైళ్ళ కెళ్ళారు.

ఉభయ గోదావరి జిల్లాల్లో మద్దూరి అన్నపూర్ణయ్య, భార్య కృష్ణవేణమ్మ—దిగుమర్తి వెంకటరామస్వామి, భార్య జానకీబాయమ్మ-మంత్రాల లక్ష్మీనరసింహ్వాం, రామసీతమ్మ-బారు రాజారావు భార్య అలివేలమ్మ-మానాప్రగడ కృష్ణారావు, సుంద రమ్మ, టేకుమళ్ళ సీతారామస్వామి, మహాలక్ష్మమ్మ-పసల కృష్ణమూర్తి, అంజలి లక్ష్మమ్మ - కప్పగంతుల రామేశం, ఆదిలక్ష్మి-హోలపాటి సుబ్బారావు, సత్యభామా బాయి-మున్నగు వారు జైళ్ళ కెళ్ళారు.

ఈ విధంగానే కర్నూలులో ఎస్. నాగప్ప, సతీమణి అమరావతమ్మ-ఎల్లాయ్ సన్నయ్య భార్య సూరమ్మ-గౌతు లచ్చన్న, యశోద మున్నగు వారు జైలు శిక్షల ననుభవించారు.

హైదరాబాదు స్టేట్‌లో డాక్టర్ మేల్కొటే; విమలాంమేల్కొటే, హరిశ్చంద్ర హెడా, జ్ఞానకుమారి హెడా మున్నగువారు కుటుంబాల సహితంగా జైలు బాధలననుభ వించారు.

అయితే, అప్పట్లో నిజాంపోలీసులు, రజాకార్లు మహిళా సత్యాగ్రహులపైన చేస్తున్న దుర్మార్గాలవల్ల, స్టేట్ కాంగ్రెస్ స్త్రీలకు మినహాయింపు ఇచ్చినట్లు చెప్పబడు తున్నది. అయినప్పటికీ, పద్మజ, సుమిత్రాదేవి, ఆరుట్ల కమలాదేవి మున్నగు మహిళామణులు నిజాం ప్రభుత్వ క్రూర నిర్బంధాలకు గురిఅయినారు. సంగం లక్ష్మీ బాయమ్మ వంటివారు ఆంధ్ర ప్రాంతంలో సత్యాగ్రహంలో పాల్గొని, జైలుశిక్ష లనుభ వించారు. ఆ వీరవనితలందరూ స్మరణీయులు.

# స్వాతంత్ర్యోద్యమ సందేశం

నాదేశమేయిది నాదేశము

*వేదాది విద్యలు వెలసిన దేశము*
*నాదేశమే ధర్మసందేశము । నాదేశమే ।*
*సాధ్వీమతల్లుల జన్మదేశము*
*నాదేశమే నీతికుపదేశము । నాదేశమే ।*

*భోగులు, త్యాగులు పుట్టిన దేశము*
*నాదేశమే జీవితాదర్శము । నాదేశమే ।*
*సకల మతములకు స్థానమీదేశము*
*నాదేశమే మత సర్వస్వము । నాదేశమే ।*

## కాంగ్రెస్ మూల సిద్ధాంతాలు :

భారత జాతీయ స్వాతంత్ర్య సమర చరిత్ర—కాంగ్రెస్ చరిత్ర అవిభాజ్యమైనవి. నేడుకూడా ఆధునిక భారత చరిత్రతో యిది పెనవేసుకొనివుంది. అహింస, ప్రజాస్వామ్యం, సామ్యవాదం, మతప్రసక్తిలేని లౌకికతత్వాలకు ప్రతీకగా వుంది. ఇవే కాంగ్రెస్ సంస్థకు నిజమైన బలాన్ని చేకూర్చినవి. సంవత్సరాలు గడచినా కాంగ్రెస్ కట్టుబడివున్న మూలసిద్ధాంతాలు మాత్రం మార్పుచెందలేదు. అయితే, దేశపునర్నిర్మాణానికి అవసరమైన వివిధ దృక్పథాలను కాంగ్రెస్ ఎల్లప్పుడూ ఆహ్వానిస్తూనేవుంది. కాలానుగుణ్యంగా కాంగ్రెస్, విభిన్నాభిప్రాయాలు గల వారితో సర్దుబాట్లు చేసుకుంటూ వచ్చింది. కావుననే కాంగ్రెస్ ఆవిర్భవించిన వంద సంవత్సరాలకు కూడా సజీవంగా నేటికీ నిలిచివుండ గల్గింది. అనేక ఇతర పార్టీలు, రాజకీయ సంఘాలు దీర్ఘకాలం మన జాలక కాలగర్భంలో కలిసి పోయినవి.

ప్రపంచంలో కాంగ్రెస్ నేడు అతిపెద్దదైన ప్రజాస్వామ్యసంస్థ, దేశంలోని వివిధ మతాలు, కులాలు, వర్గాలు, ప్రాంతాలు, భాషలు గల వారందరినీ కాంగ్రెస్ కొంతవరకు ఐక్యంచేసి, ఒకే చత్రచ్ఛాయ క్రిందకు తేగలిగింది. స్వదేశీ సంస్థానాలన్నిటినీ, దేశ అంతర్భాగాలుగా చేసింది. భారతదేశ సమైక్యతకు, ప్రాదేశిక సమగ్రతకు పాటుబడుతున్నది.

దాదాబాయ్ నౌరోజీ, లోకమాన్యతిలక్, మహాత్మగాంధీ, పండిత జవహర్‌లాల్ నెహ్రూ మొదలగు మహానాయకులు మనకందించిన వారసత్వ ఫలితంగాను, చరిత్రాత్మకమైన మన స్వాతంత్ర్య ఉద్యమాల పర్యవసానంగాను, వేలాది మధ్య తరగతి

మేధావులు, కర్షకులు, పేదలు వివిధ వర్గాల వారు, స్త్రీ పురుషులు యువతీ యువకులు బాలురు మన జాతీయ స్వాతంత్రోద్యమాలలో పాల్గొని, మహత్తర త్యాగాలు చేశారు.

రవిఅస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యాన్ని ధిక్కరించి, గాంధీమహాత్ముడు జరిపిన భారతజాతీయ స్వాతంత్ర్య సమర విశిష్టతను, ఆయన వ్యక్తిత్వాన్ని తత్వాన్ని ఉగ్గడిస్తూ 'కృష్ణాపత్రిక'లో ముట్నూరి కృష్ణారావుగారు వ్రాసిన సంపాదకీయ భాగాలు గమనించండి :

> "గాంధీ మహాత్ముడట్టి మహావ్యక్తి- విశుద్ధ మానవత్వము యొక్క సాత్వికాధివ్యక్తి మహా సామ్రాజ్యముల దౌర్జన్యమును రూపు మాపగల ఆత్మశక్తి. దీనులక్షుదాగ్ని కీలలను జల్లార్చగల ప్రేమాను రక్తి. మహాత్ముడు తర్కించడు. ధర్మసూత్రములను జేనడు. శాస్త్ర ప్రమాణములచే సమర్థించుకొనడు. ఆయుద బలమునుపయోగింపడు. రాజనీతి మార్గములదాగడు. శబ్దజాలములలో దగుల్కొనడు. మతవేషము లను వేయడు. కేవల విశుద్ధ మానవస్వత్వమూని, తనజీవితమునే ఆదర్శ ముగా జూపుచున్నాడు.
>
> ఒక్కమాట, ఒక్కబాణము, ఒక్కపత్ని వీనియందే శ్రీరామ చంద్రుని జీవనమంతయు నిమిడియున్నట్లు, సత్యము, త్యాగము, అహింస ఈ మూటియందే మహాత్ముని జీవిత మంతయు నిమిడియున్నది. ఈ మూటికి మించిన ధర్మములులేవు, అనుష్ఠానములులేవు, సాధనములు లేవు. ఈ మూడునే మన పూర్వీకులు వేరు పేర్లతో పిలిచిరి. సత్యమునే జ్ఞానమనిరి, త్యాగమునే వైరాగ్య మార్గమనిరి. అహింసనే భక్తిమార్గ మనిరి. మానవుని యందీ త్రయము నిహితమై యున్నది. సమస్తమాన వుల కిదియెలక్ష్యము."

—'కృష్ణాపత్రిక' సంపాదకీయం

## మనజాతీయ వారసత్వం :

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగించిన ఉద్యమం పరంపరాను గతంగా వచ్చిన మన వారసత్వంగావుంది. 'బ్రస్సెల్సు'లో జరిగిన అణచబడిన జాతుల కాంగ్రెస్ సభలో పండితనెహ్రూ ప్రసంగిస్తూ, ఆశియా ఆఫ్రికా దేశాలవలస పాలనా విముక్తికి - భారతదేశ విముక్తి నాందీవాచక మవుతుందని ఆనాడే స్పష్టం చేశారు. అదిఎంత వాస్తవమైనదీ నేడు రుజువైంది.

1927 సెప్టెంబర్‌లో మోతీలాల్‌నెహ్రూ జవహర్‌లాల్‌నెహ్రూ, సోవియట్ యూనియన్ జరుపుకొంటున్న పదవ అక్టోబర్ విప్లవ వార్షికోత్సవంలో పాల్గొనడం, వారి ఆలోచనా విధానాలలోనే గొప్పమార్పు తెచ్చింది. నాటి నుండి నేటివరకు సోష లిస్టు దేశాలతో భారతదేశానికి సన్నిహిత మిత్రత్వం ప్రవర్ధమాన మవుతున్నది.

గాంధీమహాత్ముడు ఒక స్పష్టమైన నిర్మాణ కార్యక్రమాన్ని, నైతిక విలువలతో కూడిన ఉన్నత ఆదర్శాలను, సత్య అహింసలు ప్రాతిపదికగా స్వరాజ్య ఉద్యమ పంథాను, భారత ప్రజల ముందుంచారు. గాంధీజీ తన 50 ఏండ్ల వయస్సులో 1920 లో సహాయనిరాకరణోద్యమాన్ని, 60 ఏండ్లప్పుడు 1930లో ఉప్పుసత్యాగ్రహాన్ని, 70 ఏండ్లు పైబడిన వయస్సులో, 1942లో క్విట్ఇండియా ఉద్యమాన్ని కాంగ్రెస్ సంస్థ ద్వారా నిర్వహించారు. గాంధీజీ నడిపిన ఉద్యమాలు ఆయన ప్రవచించిన సిద్ధాంత అమోఘత్వంపైన, ప్రజాసామాన్యం యొక్క సానుభూతిపైన ఆధారపడి వున్నాయి. దేశీయులలో స్వాతంత్రేచ్ఛను, స్వచ్ఛంద సేవకులలో ఆత్మబలాన్ని కలిగించి, స్వరాజ్య సాధనకు ఆయన మార్గాన్ని సుగమం చేశారు.

కాంగ్రెస్ మూలసూత్రాలను పరిశీలిస్తే, రాజకీయంగా ప్రజాస్వామ్యం, ప్రజల సర్వం సహాయాధికారం; సాంఘికంగా మతాతీత లౌకికతత్వం, సంకుచిత మూఢ భావాల సంస్కరణ; ఆర్థికంగా దారిద్ర్య నిర్మూలన, యివీ సర్వకాలిక ప్రధాన సిద్ధాంతాలని తేలుతుంది. గాంధీజీ నాయకత్వాన కాంగ్రెస్ సంస్థ వీటిని రాజకీయ, ఆర్థిక, సాంఘిక విప్లవాలుగా రూపొందించింది. ఈ దృక్పథం దేశానికి స్వాతం త్ర్యాన్ని చేకూర్చింది. శాంతి, నిరాయుధీకరణ సందేశాన్ని నేడు ప్రపంచంలోని సభ్యదేశాలకు అందచేస్తున్నది. మన దేశ నాయకులు అనుసరించిన అలీన విదేశాంగ విధానం వల్ల నూతనంగా స్వాతంత్ర్యం సంపాదించిన ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల్లోని అలీన రాజ్యాలన్నిటికీ స్వతంత్ర భారతం నేతృత్వం వహించగలుగు తున్నది. దేశం అభివృద్ధి పథంలో పయనిస్తున్నది. ఇది భారతీయులందరికీ గర్వ కారణమైన విషయం.

తిలక్, గాంధీ, నెహ్రూ మున్నగు మహామహులు తమ భుజస్కంధాలపై నిర్మించిన సజీవ సంస్థ కాంగ్రెస్, భారతీయులను ప్రభావితులను గావించింది. భారత స్వాతంత్ర్య సమర చరిత్రను ఉద్దీపింపజేసింది.

ప్రధాని నెహ్రూ, ప్రజాస్వామ్య పద్ధతిన దేశాభివృద్ధికవసరమైన బలమైన పునాదులు వేశారు. బహుళార్థసాధక నదీలోయ ప్రాజెక్టులు, భారీపరిశ్రమలు, శాస్త్ర

సాంకేతిక పరిశోధనా సంస్థలు స్థాపించి, నవభారత నిర్మాణానికి పటిష్ఠమైన ప్రాతి పదికలు నిర్మించారు. వీటిని పెంచి పోషించి అభివృద్ధి చేసుకొనవలసిన బాధ్యత నేటి యువతరానిది.

## దరిద్ర నారాయణుల సేవ :

1931లో కాంగ్రెస్ సంస్థ పక్షాన ఏకైక ప్రతినిధిగా లండన్ రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరైన గాంధీమహాత్ముడు ప్రకటించిన ఈ దిగువవాక్కులు శిరోధార్యమైనవి. కాంగ్రెస్ ఆశయాన్ని ఇలా స్పష్టీకరించారు :

> "తినాకుడవాలేని నిర్భాగ్యులైన భారత ప్రజానీకానికి కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహిస్తుంది. కోట్లాదిప్రజల ప్రయోజనాలకు అనుగుణంగా వున్న వాటిని మాత్రమే కాంగ్రెస్ సంరక్షిస్తుంది. అనేక పర్యాయాలు వారి ప్రయోజనాల మధ్య సంఘర్షణ రావడం కనిపిస్తుంది. అట్టి సంఘర్షణే సంభవిస్తే, లక్షలాది ప్రజల ప్రయోజనాలను కాపాడటానికే ప్రాధాన్యత యిచ్చి, యితరుల ప్రయోజనాలను త్యాగం చేస్తుందని కాంగ్రెస్ తరవున ప్రకటించేందుకు నేనెంతమాత్రం వెనుకాడబోను." మహాత్ముని వాక్కులనుబట్టి జాతీయ కాంగ్రెస్ సంస్థ దరిద్రనారాయణుల సేవకే అత్యంత ప్రాధాన్యత యిచ్చినట్లు తేటతెల్లమవుతుంది.

స్వతంత్ర భారత ప్రభుత్వం, ఆ సంప్రదాయాన్ని పాటించి, హరిజన గిరిజనోద్ధరణకు, బీదప్రజల బాధానివారణకు పలుకార్యక్రమాలు చేపడుతూ వచ్చింది. మన ప్రణాళికా ఫలితాలు అట్టడుగునవున్న బీదప్రజానీకానికి అంది, వారు అనుభవించే విధంగా, ఆర్థిక సాంఘికాభ్యుదయ కార్యక్రమాల అమలుకు దీక్ష వహించవలసివుంది.

## ఆంధ్రప్రముఖులు :

జాతీయ కాంగ్రెస్ ప్రారంభ దశంలో, 1911 సంవత్సరం వరకు 'ఆంధ్రకు' ప్రత్యేక వ్యక్తిత్వమంటూలేదు. మదరాసీయులుగాను, దక్షిణాది వారుగాను, పరగణింపబడినారు. 1908లో కాశీనాథుని నాగేశ్వరరావు ఆంధ్రవారపత్రికను, జొన్నవిత్తుల గురునాథరావు 'ఆంధ్ర'ను స్థాపించిన, తర్వాత బందరులో ఆంధ్రసభను ఏర్పాటు చేసిన తదుపరి ఆంధ్రులనే పేరు వినికిడిలోకి వచ్చింది.

అయితే, కొందరు ఆంధ్ర ప్రముఖులు కాంగ్రెస్ప్రారంభదశలో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సభలకు హాజరవుతూ, కాంగ్రెస్ కార్యక్రమాలలో పాల్గొంటూవచ్చారు

బొంబాయిలో జరిగిన మొదటి కాంగ్రెస్ సభకు హాజరైన 72 మందిలో పి. రంగయ్య నాయుడు గారొకరు. బొంబాయి మొదటి సభకు, 1886లో కలకత్తాలో జరిగిన ద్వితీయ మహాసభకు బందరులో న్యాయవాదిగా వుండిన, రావుబహదూర్ సింగరాజు వెంకట సుబ్బరాయుడు గరు హాజరై, ప్రసంగించారు. ఆమరుసటి సంవత్సరమే ఆయన దురదృష్టవశాత్తు స్వర్గస్థులైనారు.

1891లో నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభకు మదరాసు నుండి వెళ్ళిన పనప్పాకం ఆనందాచార్యులు గారు అధ్యక్షత వహించే ఘనత దక్కింది. అలహాబాదు నాల్గవ మహాసభ నుంచి హాజరైన న్యాపతి సుబ్బారావు గారు రెండు మూడు పర్యాయాలు కాంగ్రెస్ కార్యదర్శి పదవినలంకరించారు. ఉప్పుపన్నుకు వ్యతిరేకంగాను, న్యాయ కార్యనిర్వహణ శాఖలను వేరు చేయాలని ఆయన ఆ సభలలో ప్రసంగించారు.

రాయలసీమ ప్రాంతాన్నుండి కాంగ్రెస్ సభలకు వెళ్ళిన గుత్తికేశవపిళ్ళె గారు కొన్నాళ్ళు కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. ప్రత్యేక ఆంధ్ర కాంగ్రెస్ కమిటీని ఏర్పాటు చేయాలనే తీర్మానానికి కేశవపిళ్ళె కూడా కారణభూతుడు.

ఆ విధంగా, ప్రారంభ కాంగ్రెస్ మహాసభలకు హాజరైన ఆంధ్ర ప్రముఖులందరూ స్మరణీయులు.

కాంగ్రెస్ శాసనోల్లంఘన కార్యక్రమం చేబట్టిన తర్వాత, కొండవెంకటప్పయ్య, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, ప్రకాశం ప్రభృతులు ఆంధ్రా కాంగ్రెస్‌కు సారధ్యం వహించారు. వీరు మితవాద కోవకు చెందినవారుగాను, బులుసు సాంబమూర్తి, డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం, మద్దూరి అన్నపూర్ణయ్య మున్నగువారు అతివాద జాతీయ వాదులుగాను (Left Nationalists) పరిగణింప బడినారు. వీరు సంపూర్ణ స్వాతంత్ర్యవాదులు. కాంగ్రెస్‌లో సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానం ఆమోదించబడక పూర్వమే, సంపూర్ణస్వరాజ్యం కావాలని ప్రచారం గావించి, ముందుగా అరెస్టు అయినారు.

బారురాజారావుగారు అలహాబాదులోని అఖిలభారత కాంగ్రెస్ కార్యాలయంలో వుండి, చాలాకాలం సంస్థకు కార్యదర్శిగా పనిచేశారు. తదనంతరకాలంలో, కళా వెంకటరావు, అల్లూరి సత్యనారాయణరాజు మున్నగువారు కొన్నాళ్ళు కార్యదర్శులైనారు.

స్వాతంత్ర్యానంతరం 1948 లో డాక్టర్ పట్టాభిసీతారామయ్య, తర్వాత నీలం సంజీవరెడ్డి, దామోదరం సంజీవయ్య, కాసు బ్రహ్మానందరెడ్డి అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్ష పదవుల నధిష్టించారు. కారణాలు ఏమైనప్పటికీ, అఖిలభారత జాతీయస్థాయిలో ఆంధ్రనాయకులు చాలాకాలం వరకు సముచిత స్థానం పొందజాలక పోయినారు.

అయితే, నాయకులలో భిన్నాభిప్రాయాలు వున్నప్పటికీ, స్వాతంత్ర్యోద్యమం జరుగుతున్న కాలంలో, 'దేశభక్తి' వారనందరినీ ఐక్యపరచి, ఏకోన్ముఖంగా స్వరాజ్య సమరాన్ని సాగించడానికి అవకాశం కలిగించింది. అందుచేతనే, కాంగ్రెస్ సాగించిన స్వరాజ్య పోరాటాలు అన్నిటిలోను ఆంధ్రులు ముందంజ వేశారు. చరితార్థులైనారు.

## నేటిగురుతర బాధ్యతలు :

ఒకసారి స్వాతంత్ర్యోద్యమంలో ప్రవేశించిన ఆంధ్రనాయకులు యికవెనుకంజ వేయలేదు. అన్ని స్వరాజ్య ఉద్యమాలలో అగ్రశ్రేణిలో నిలిచి పోరాడారు. కారాగార క్లేశమనుభవించారు ముందు వారు త్యాగాలు చేసి, యితరులను త్యాగశీలురను గావించారు. ఆనాటి స్వాతంత్ర్య సమర వీరుల నిస్స్వార్థ త్యాగం, నిరుపమానమైన దేశభక్తి కర్తవ్యనిష్ట, క్రమశిక్షణాయుత సత్ప్రవర్తన స్వరాజ్యాన్ని సంపాదించి పెట్టాయి.

దేశ స్వాతంత్ర్యం కోసం తమ జీవితాలను అంకితం చేసిన ఆ మహనీయులకు శ్రద్ధాంజలి ఘటించి, లభించిన స్వరాజ్యాన్ని 'సురాజ్యం'గా తీర్చిదిద్దుకోవలసిన గురుతర బాధ్యత ఈతరం వారిది.

ఇప్పటికే పలువురు రచయితలు వారివారి దృక్పధాన్ని అనుసరించి స్వాతంత్రోద్యమాన్ని గురించి పెక్కుగ్రంధాలు రచించారు. సుప్రశిద్ధ దేశారాధకులు కొందరు తమ అనుభవాలను, జ్ఞాపకాలను గ్రంధస్థం చేశారు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు కూడా కొన్ని గ్రంధాలను ప్రచురించాయి. మరి కొందరు తమ జిల్లాల్లో జరిగిన స్వరాజ్య సంగ్రామ గాధలను గూర్చి, గ్రంధాలు వెలువరించేందుకు తగు ప్రయత్నాలు గావిస్తున్నారు. భావితరాల వారికి మన స్వరాజ్య సమర చరిత్రను అందించవలసివుంది. అట్టి చరిత్రలలో ముఖ్యమైన వాటిని ఎంపికచేసి, విద్యార్థులకు పాఠ్యగ్రంధాలుగా, ఉప పాఠ్యగ్రంధాలుగా ప్రవేశ పెట్టడం అవసరం. స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి త్యాగ మూర్తులైన దేశభక్తుల జీవిత చరిత్రలు నేటి యువతీ యువకులకు స్ఫూర్తిని కలిగిస్తాయి.

స్వాతంత్ర్య సమర యోధుల కర్తవ్యం ముగియలేదు.

శాసనోల్లంఘన, సత్యాగ్రహోద్యమాల సందర్భంలో ఆంధ్రదేశంలో అనేక ఆశ్రమాలు వెలసినవి. ఆ ఆశ్రమాలను పునరుద్ధరించాలి. దేశసేవకు అంకితమయ్యే స్వచ్ఛంద సేవకులను తయారుచేయాలి. వారికి మంచి శిక్షణ గరిపి స్వాతంత్ర్య పరిరక్షణకు పూనుకునేటట్లు చేయాలి. కులమత భాషా ప్రాంతీయ, వేర్పాటు ధోరణులు వైరితలలు వేస్తున్న నేటి తరుణంలో, జాతీయ సమైక్యతా పరిరక్షణకు అందరూ అత్యంత ప్రాధాన్యత యీయవలసివుంది.

అల్లూరి సీతారామరాజు, కన్నెగంటి హనుమంతు మున్నగు అమర వీరులకు, సత్యాగ్రహోద్యమాలలో చరిత్రను సృష్టించిన ప్రదేశాలలో సముచిత స్మారక చిహ్నాలు నెలకొల్పడం అవసరం

జిల్లాలలో స్వరాజ్య భవనాలను నిర్మాణం గావించి, అందు జాతీయ నాయకుల, ఆంధ్రనాయకుల స్వాతంత్ర్య సమరయోధుల చిత్రపటాలను ప్రదర్శించాలి. స్వరాజ్య వీరుల విశేషాలతో కూడిన జీవిత చరిత్రలను, స్వాతంత్ర్య సమర గాథలను వివరించే గ్రంథాలనన్నింటినీ సేకరించి, స్వరాజ్య గ్రంథాలయాలను ఏర్పాటుచేయాలి. చరిత్ర కారులకు, పరిశోధకులకు ఆ గ్రంథాలయాలను అందుబాటులో వుంచి, చరిత్ర పరిశోధనకు ప్రోత్సాహం కలిగించాలి. విదేశాంగ రాయబార కార్యాలయాల ద్వారా, వివిధ దేశాలలో జరిగిన, జరుగుతున్న స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలను, విప్లవ వీరుల జీవిత చరిత్రలను తెప్పించి, ఆ గ్రంథాలయాలలో భద్రపరచాలి.

ఈ సూచనలు కార్యరూపం ధరించడానికి ప్రభుత్వం, స్వాతంత్ర్య సమర యోధుల సంఘాలు యితోధికంగా తోడ్పడగలవని ఆశించుదాము.

నేటిసమాజంలో జీవిత విలువలు మారుతున్నాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో కల్లు సారా పాకలవద్ద త్రాగవలదని సత్యాగ్రహులు పికెటింగులు చేశారు. తాటిచెట్లను నరికివేశారు. అందుకుగాను లాఠీదెబ్బలు తిన్నారు. జైళ్ళకు వెళ్ళారు. మరి నేడో? మత్తు పానీయాల సేవన సర్వసాధారణమైంది కల్లుపాకల నుండి క్లబ్బులదాకా, పట్టణాల నుండి పల్లెలదాకా, ఈ మద్యపాన జాడ్యం వ్యాపిస్తున్నది.

స్వరాజ్య పోరాట కాలంలో విదేశ వస్త్ర దుకాణాల ఎదుట స్వచ్ఛంద సేవకులు సత్యాగ్రహాలు చేసి, అరెస్టు అయినారు. స్వదేశీ వ్రతంబూనారు విదేశీ వస్త్రాలను కుప్పలువేసి తగలబెట్టారు. కాని నేడో? ఒకరినిమించి మరొకరు విదేశవస్త్రాలను ధరిం

చడం, విదేశవస్తువుల వాడడం స్త్రీ పురుషులకు కూడా ఒక 'ఫాషన్' అయింది. వాటి కోసం వెంపరలాడటం ఎక్కువైంది. ఆనాటి స్వదేశాభిమానం ఏమైనట్లు?

'పరహితము పరమ ధర్మమని' ప్రబోధించారు మన పెద్దలు. ప్రజాసేవకై తమ జీవితాలను అంకితం చేశారు. సర్వత్యాగాలు చేశారు. ప్రాణాలను సైతం బలి యిచ్చారు. కాని నేడో? సాటివాడిని దోచుకొని తినడానికి వెనుకాడటంలేదు. ఎట్టి దుర్మార్గాలు, హింసాదౌర్జన్యాలు చేసైనాసరే, డబ్బు గడించడమే పరమావధి అయింది. ఆ అన్యాయార్జిత విత్తంతో స్వీయభోగలాలసాను విపరీతంగా పెంచుకోజూస్తున్నారు. సమాజంలో దౌర్జన్య మనఃప్రవృత్తి, అవినీతి విలయతాండవమాడుతున్నది. వివిధ వర్గాల మధ్య పెక్కు కలతలకు కార్పణ్యాలకు, సంఘర్షణలకు యిది దారితీస్తున్నది. సంఘంలో వుండవలసిన స్నేహ సామరస్యాలు మృగ్యమైపోతున్నవి. ఆనాటి ప్రజా సేవా తత్పరత ఏమైనట్లు?

'త్యాగైనేక అమృతత్వ మానసః' అన్నట్లు ఆనాడు దేశంకోసం, ప్రజలకోసం త్యాగంచేస్తూ కష్టాలను సంతోషంతో భరించారే, నేడు స్వార్థపరత్వం పెచ్చుపెరిగిపోతున్నదేమిటి? వ్యక్తి, తద్వారా సంఘం చైతన్యవంతం కానిదే ఎన్ని మంచి అభివృద్ధి పథకాలైనా బూడిదలో పోసిన పన్నీరు చందమవుతుంది.

'స్వంత లాభము కొంత మానుక — పొరుగు వానికి తోడుపడవోయ్' అని గురజాడ వారన్నట్లు, దేశం నాకేమిచ్చింది? అనిగాక, నేను దేశాభివృద్ధికి ఏమిచేశాను? నాతోటి ప్రజలకు నేనేమి తోడ్పడగలిగాను? అని ఆత్మవిమర్శ చేసుకొనవలసిన సమయం వచ్చింది.

స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి దేశభక్తులు పాటించిన జీవిత విలువలను జ్ఞప్తికి తెచ్చుకోవాలి. వారి ఆదర్శ ప్రవర్తనను అనుసరించాలి. ఆ సుసంప్రదాయాలను పాటించాలి. వారికి తగిన వారసులుగా మెలగాలి. దేశ భద్రతను, గౌరవాన్నికాపాడుకోవాలి. సోషలిస్టు సమాజపురోగతికి కంకణధారులంగావాలి. ఇదీ నేటి మనకర్తవ్యం.

మనముందు ఉదాత్తమైన జీవితలక్ష్యం వుండాలి. ఆ లక్ష్యసాధనకు అనుసరించే సాధనాలు కూడా పవిత్రమైనవిగా ఉండాలి. అట్టి నైతిక విలువలు, క్రమశిక్షణ, స్వార్థరాహిత్యం, అలవరచుకున్నప్పుడే, సమాజం బాగుపడుతుంది. దేశం అభివృద్ధి చెందుతుంది. ప్రజలు సుఖశాంతులతో మనగలుగుతారు. ఇది స్వాతంత్రోద్యమం మనకు అందించే సందేశం. ఈ బాధ్యతల నిర్వహణకు పునరంకితమవుదాం!

## అరవిందుని సందేశం :

స్వాతంత్ర్యానంతరం, 1948లో జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భంలో, అరవింద మహర్షి ఆంధ్రులకు పంపిన ఈ సందేశం గమనించండి :

"ఓజస్సే జస్సులు కలవీరపురుషులు ఆంధ్రులు. భారత రాజకీయ రంగంలో వారు నిర్వహించిన పాత్రవల్లనేమి, కళారాధనంలో, శిల్పనిర్మాణంలో సంగీత సాధనలో అగ్రగాములు గావడం వల్లనేమీ, ఆంధ్రులకు మరింతగా ఘనత దక్కుతుంది. గత చరిత్ర వైభవోపేతమైనప్పుడు భావి చరిత్ర కూడా వైభవోపేతమే. మరింత వైభవం గాకలప్పదు.

ఆంధ్రులు తమశక్తి సామర్థ్యాలను సక్రమంగా వినియోగించుకొని, స్రష్టగా, ద్రష్టగా, కర్మిష్ఠిగా వృద్ధి చెందడానికి తగిన విద్యాబోధన ఆంధ్ర యువకులకు అందజేయాలి. ఆంధ్ర యువకులు, విద్యార్థులు ఆంధ్ర పౌరులుగా మాత్రమేగాక, భారత జాతీయ పౌరులుగా కూడా మంచి శిక్షణ పొందాలి."

—అరవిందుని సందేశం

*మానముతోడ ప్రాణము సమానము కాదని గుర్తెరింగి*
*యజ్ఞానము బాసి, బంధముల నంగతి రోసి, స్వదేశమాతృ*
*సన్మానముతోడ నెన్నటికి మాయని కీర్తి గడింప యత్నముం*
*బూనని వాని జీవనము బూడిద పాలగు భారతాంబికా*

—భారతాంబికాశతకం

# భారత జాతీయ స్వాతంత్రోద్యమం

## కొన్ని ముఖ్యతేదీలు

| | |
|---|---|
| 1600 | ఈస్టిండియా కంపెనీ |
| 1772 | నుంచే పార్లమెంటువారి అప్పటప్పటి పరీక్ష |
| 1774 | రెగ్యులేటింగు చట్టము-'తనిఖీబోర్డు' ఏర్పాటు |
| 1793<br>1813<br>1833<br>1853 | విచారణలు |
| 1833 | కంపెనీ నౌకరీకి మతము, జన్మస్థానము, పుట్టుక, రంగు మొదలగునవి అనర్హతలు కాకూడదు. వ్యాపారము చేసుకొను హక్కు-రద్దు. |
| 1854 | మెకాలే విద్యా నివేదిక |
| 1857 | ప్రథమ భారత విప్లవం — (సిపాయీల తిరుగుబాటు) దేశంలో క్షామములు.<br>సివిల్ కోర్టులు, పోలీస్ రెవిన్యూ పరిపాలన, ఆయుధ చట్టం అటవీ శాసనము — పత్రికా స్వాతంత్ర్య నిరోధము బహిరంగ సభలు, స్థానిక పరిపాలన, విశ్వ విద్యాలయములలో నిరోధములు. |
| 1870 | లిట్టన్ నాటికి విప్లవ బీజాలు—హ్యూమ్ జాగ్రత్త. |
| 1851 | బ్రిటిష్ ఇండియా సంఘం (బెంగాల్), బొంబాయి సంఘం మొ॥ |
| 1870 | ఈస్టిండియా అసోసియేషన్ హిందూపత్రిక- మద్రాసు పూనా సార్వజనిక సభలు. |

1885 మహాజనసభ - థియాసఫీ - రామకృష్ణ.

1883 కలకత్తా ఆల్బర్ట్ హాల్‌లో సమావేశం-
సురేంద్రనాథ్

1885

1885 డఫ్రిన్ - ప్రతిపక్షం కావాలని.

1885 డిశంబర్ 25-31 లో పూనాలో భారత జాతీయ మహాజన సభ-
కలరావల్ల బొంబాయి నగరంలో జరిగింది.
నాటి ఉద్దేశ్యాలు 4

1885

1. సామ్రాజ్యములో దేశ సౌభాగ్యం గోరే
వారందరికి పరిచయం గలిగించుట.
2. జాతీయైక్యరాధి ప్రాయాలను పెంపొం
దించుట.
3. సాంఘిక సమస్యలపై చర్చలు.
4. ప్రజాసేవా కార్యములు రాబోయే ఏడాది
ఏమి చేయవలెనని నిర్ణయించుకొనుట.
హ్యూమ్ - (ఆంగ్లేయుడు),
దాదాబాయ్, మెహతా (పార్శీలు)
బదురుద్దీన్‌త్యాబ్జీ,
మౌలానా మహమ్మదాలి, (ముస్లిములు)
బీసెంట్.

1905 వరకూ సక్రమాందోళన యందు దృఢ విశ్వాసం-
ఇంగ్లీష్‌వారి న్యాయబుద్ధియందు ఎడతెగని
విశ్వాసం - కర్జన్ - బంగాళాదేశ విభజన,
వందేమాతరం ఆందోళన.

1910 ప్రెస్ యాక్టు.

1904 లో జపాన్ రష్యాపైన విజయం సాధించింది.
దానిప్రభావంగూడా భారతస్వదేశీఉద్యమంపై
వుంది.

1905 లో లార్డ్‌మింటో వైస్రాయిగా వచ్చారు.
లిబరల్ ప్రభుత్వం బ్రిటన్‌లో అధికారంలో

| | |
|---|---|
| | పుంచి. సెక్రటరీ ఆవ్ స్టేట్‌గా లా కర్జన్‌కు భారతీయుల స్వయంపాల.. నమ్మకం లేదు. బెంగాల్ విభజనను తల పెట్టాడు. |
| 1906 | పార్టిషన్‌కు వ్యతిరేకంగా 'వందేమాతరం' ఉద్యమం. యువకుల ప్రతీకార చర్యలు టెర్రరిస్టు ఉద్యమం-బ్రిటిష్ సివిల్ అధికార్ల హత్యలు. ఉద్యమాన్ని అణచుటకు బ్రిటిష ప్రభుత్వ తీవ్రనిర్బంధాలు. |
| | 'స్వరాజ్యం - నా జన్మ హక్కు' అని దాదా బాయ్ నౌరోజీ. |
| 1909 | లో మింటో- మార్లే సంస్కరణలు. 1892 లో ఇండియన్ కౌన్సిల్ చట్టంలో కొంత మెరు గులు దిద్దారు. భూస్వామ్య, పారిశ్రామికాది కార్లకు పరిమిత ప్రాతినిధ్యం. నామినేషనులతోపాటు పరిమిత ఎన్నికలు. |
| 1910 | లో లార్డ్ హార్డింజ్ వైస్రాయిగా వచ్చారు. |
| 1911 | లో బెంగాల్ విభజన రద్దు. నిర్బంధాల సడలింపు కింగ్ ఎడ్వర్డ్ VII 1910 లో చనిపోగా, కింగ్ జార్జి క్వీన్ మేరీ భారత సందర్శన |
| 1911 డిసెంబర్ | లో "ఢిల్లీ దర్బార్" కలకత్తానుండి ఢిల్లీకి రాజధాని మార్పు. బెంగాల్‌ను తిరిగి ఐక్యపరచి ఒకే రాష్ట్రంగా గవర్నర్ కౌన్సిల్ క్రింద పాలన. బీహార్, ఒరిస్సా, చోటా నాగపూర్‌లను లెఫ్టినెంట్ గవర్నర్ పాలనక్రింద, అస్సాంను చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా చేశారు. |
| 1912 | తర్వాత బెనారస్, పాట్నా, మైసూరు విశ్వ విద్యాలయాల ఏర్పాటు. |

# హోంరూల్ ఉద్యమం

| | |
|---|---|
| 1914 జూన్ | లో బాలగంగాధర తిలక్ జైలునుండివిడుదలై నారు. |
| 1915 | లో మితవాద నాయకులు గోఖలే, ఫిరోజిషా మెహతాలు పరమపదించారు. |
| 1916 | లో హోంరూల్ ఉద్యమం - తిలక్ నాయకత్వం. [illegible]-కొత్త రా. నీతి - జైలు నుంచి బీసెంట్ విడుదల. కలకత్తా కాంగ్రెస్‌కు అధ్యక్షత. |
| 1917 | ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస ఏర్పాటు. 'స్వరాజ్యం' కావాలని గ్రామాల నుండి విజ్ఞప్తులపై సంతకాలు. |
| 1914 | ప్రథమ ప్రపంచ ఐరోపా యుద్ధ ప్రారంభం. |
| 1914 ఆగస్టు 4 | జర్మనీపైన బ్రిటన్ యుద్ధం ప్రకటించింది. భారతదేశం యుద్ధానికి సహాయం. సంస్థానాధీశ లందరూ అర్థ అంగ బలాన్ని ఇచ్చారు. యుద్ధంలో భారత సైనికులు 6 లక్షల మంది పాల్గొన్నారు. వీరిలో 26 వేలమంది మరణించారు. 70 వేలమందికి గాయాలు తగిలినవి. రు. 150 కోట్లు యుద్ధనిధికి సమర్పించబడింది. |
| 1915 | ఇండియా సంరక్షణ శాసనం చేయబడింది. |
| 1916 | చెమ్స్‌ఫర్డ్ వైస్రాయిగా వచ్చారు. అప్పటి సెక్రటరీ ఆఫ్ స్టేట్ మాంటేగ్యూ 'క్రమానుగత బాధ్యతాయుత ప్రభుత్వం లక్ష్యంగా' ప్రకటించారు. ఈ వాగ్దానంతో భారతదేశ డబ్బు, జనం, సైనికుల అండను పొందారు. |
| 1916-17 | తిలక్, అనీబిసెంట్‌ల హోంరూల్' ఉద్యమ ప్రచారం. |

| | | | |
|---|---|---|---|
| | మే | | హంటర్ కమిటీ నివేదిక. గాంధీజీ విస్మయం. ఆయన, సహాయం నుండి సహాయ నిరాకరణకు మార్పు. |
| | ,, | 28 | ఖిలాఫత్ కమిటీ సహాయనిరాకరణ ఆమోదం. |
| | సెప్టెంబర్ | 4-9 | కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్-నాన్ కో-ఆపరేషన్ తీర్మానం ఆమోదం. |
| | అక్టోబరు | 2 | ఎ. ఐ. సి. సి. సభ |
| | డిసెంబరు | 26 | నాగపూర్ కాంగ్రెస్—జాతీయ కళాశాలలు ఏర్పాటు చేయాలని. |
| 1921 | మార్చి | | బెజవాడ ఎ. ఐ. సి. సి. నిర్బంధాలు |
| | జులై | 8 | కరాచీలో ఖిలాఫత్ మహాసభ. |
| | సెప్టెంబర్ | 17 | ఆలీ సోదరుల అరెస్టు |
| | అక్టోబర్‌లో- | | గాంధీజీ కొల్లాయిగుడ్డ ధారణ. |
| | నవంబర్ | 17 | యువరాజు రాక-బహిష్కరణ, కొట్లాటలు, రక్తపాతం. |
| | | 19-23 | గాంధీజీ నిరాహారదీక్ష. దాస్, మోతీలాల్, లజపతిరాయ్ మొ॥ అరెస్టులు. |
| | డిసెంబర్ | | అహమ్మదాబాద్ కాంగ్రెస్-20 వేల మంది జైళ్ల యాత్ర. |
| 1922 | జనవరి | 12 | గుంటూరు జిల్లాలో పన్నుల నిరాకరణోద్యమం. |
| | ఫిబ్రవరి | 5 | చౌరీచౌరా ఉదంతం - 21 మంది పోలీసుల సజీవదహనం-ఉద్యమ విరమణకు గాంధీజీ నిర్ణయం. |
| | మార్చి | 10 | గాంధీజీ అరెస్టు. 6 ఏండ్లు జైలు శిక్ష. |
| | డిసెంబర్ | | గయా కాంగ్రెస్ - శాసనసభా కార్యక్రమానికి కాంగ్రెస్ వ్యతిరేకత. |
| 1923 | డిసెంబర్ | | కాకినాడ కాంగ్రెస్ - హిందూస్థాన్ సేవాదళ స్థాపన. |
| 1924 | డిసెంబర్ | 5 | ఏ షరతు లేకుండా గాంధీజీ విడుదల - కోహట్ సంఘటనలు - గాంధీజీ 21 రోజుల ఉపవాసం. |

నవంబర్ 23-24 శాసనసభా ప్రవేశానికి గాంధీజీ అంగీకారం.

డిసెంబర్‌లో బెల్గాం కాంగ్రెస్ మహాసభ-గాంధీజీ అధ్యక్షత.

1925 సెప్టెంబర్ 22 అ. భా. ఖద్దరు సంఘం ఏర్పాటు.

1926 కాంగ్రెస్ కేంద్ర శాసనసభలో ప్రవేశం.

1927 సైమన్ కమిషన్ నియామకం.

డిసెంబర్ మదరాసు కాంగ్రెస్ మహాసభ.

1928 ఫిబ్రవరి 3 సైమన్ కమిషన్ రాక - బహిష్కరణ - హర్తాళ్ళు.

ఆగస్టు 28-30 లక్నో అఖిలపక్ష సభ.

నవంబరు 19 లాలా లజపతిరాయ్‌పై పోలీసుల లాఠీఛార్జీ.

డిసెంబర్ కలకత్తా కాంగ్రెస్ - మోతీలాల్ అధినివేశ ప్రతిపత్తి, సుభాష్, జవహర్ సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని-ప్రభుత్వానికి ఏడాది గడువు.

1929 మే ఇంగ్లండులో రామ్సే మెక్డొనాల్డు అధికారంలోకి రాక.

అక్టోబర్ సామ్రాజ్యాంతర్గతంగా బాధ్యతాయుత పరిపాలన లక్ష్యమని ఇర్విన్ ప్రకటన; గాంధీజీ, అఖిలపక్ష నాయకులు వైస్రాయి నిజాయితీకి అభినందన; జవహర్, సుభాష్‌లు కార్యవర్గం నుంచి రాజీనామా.

డిసెంబర్ 23 వైస్రాయితో గాంధీ మోతీలాల్ సమావేశం, ఆయన వాగ్దానం చేయక పోవడం.

డిసెంబర్ 31 లాహోర్ కాంగ్రెస్-జవహర్‌లాల్ అధ్యక్షతను 'సంపూర్ణ స్వాతంత్ర్య' తీర్మానం.

1930 జనవరి 26 స్వాతంత్ర్య ప్రతిజ్ఞ, దేశవ్యాపిత అరెస్టులు; శాసన సభల బహిష్కరణ తీర్మాన ఆమోదం వైస్రాయికి గాంధీజీ 'అల్టిమేటం.'

మార్చి 12 సబర్మతి నుంచి గాంధీజీ దండి యాత్ర.

21 అలహాబాద్ ఎ. ఐ. సి. సి.

ఏప్రిల్ 5 దండి చేరుకొని, ఉప్పు శాసనోల్లంఘన: దేశంలో ఉద్యమ వెల్లువ.

ఏప్రిల్ 14 జవహర్ అరెస్టు: విఠల్‌భాయ్‌పటేల్ రాజీనామా; శాసనోల్లంఘన-ప్రదర్శనలు, షోలాపూర్‌లో అల్లర్లు; 6 పోలీసు స్టేషనులను తగులబెట్టడం. సర్ తేజ్ బహదూర్ సప్రూ, ఎం. ఆర్. జయకర్ రాజీ సంప్రదింపుల విఫలత.

1931 జనవరి 4 మహమ్మదాలీ ఇంగ్లండ్‌లో అస్తమయం.

ఫిబ్రవరి 6 మోతీలాల్ అస్తమయం

మార్చి 4 గాంధీ ఇర్విన్ ఒడంబడిక.

మార్చి 31 కరాచీ కాంగ్రెస్

ఆగస్టు 19 ఇంగ్లండ్ రౌండ్ టేబుల్ సభకు గాంధీజీ వెళ్ళడం; "నా జీవితం వుండగా నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండరాదని" శపథం.

డిసెంబర్ 18 గాంధీ స్వదేశాగమనం: సరిహద్దు రాష్ట్రాలు యు పి. బెంగాల్‌లలో ఆర్డినెన్సులు.

డిసెంబర్ 25 గఫూర్‌ఖాన్ అరెస్టు; వెయ్యమందిరెడ్ షర్టుల దళం ఏర్పాటు— జవహర్ అరెస్టు.

1930-31 10 నెలల్లో 90 వేలమంది అరెస్టు.

డిసెంబర్ 29 గాంధీజీకి వైస్రాయి వెల్లింగ్టన్ ఇంటర్వ్యూ నిరాకరణ

31 మరల సత్యాగ్రహానికి గాంధీజీకి అధికారమిస్తూ కార్యవర్గ నిర్ణయం.

1931 దేశవ్యాపిత శాసనోల్లంఘన; ఉప్పుశాసన ధిక్కారం; కల్లు సారా దుకాణాల వద్ద పికెటింగులు.

జులై 15 పెషావర్‌లో కాల్పులు-సరిహద్దు గాంధీ నాయకత్వాన ఫ్రాంటియర్ ప్రజలు. స్త్రీల పోరాటం- ఘూర్వాలీ సైనికులు ప్రజలపై కాల్పు నిరాకరించడం.

| | | |
|---|---|---|
| 1932 జనవరి | 4 | వెల్లింగ్డన్ తీవ్రనిర్బంధాలు, కాంగ్రెసుసంస్థపై నిషేధం-గాంధీజీ అరెస్టు. |
| ఏప్రిల్ | | డిల్లీలో రహస్య కాంగ్రెస్‌సభకు 500 మందిహాజరు; అరెస్టులు-మత కలహాలు. |
| సెప్టెంబరు | 20 | గాంధీజీ నిరశనవ్రతం. |
| " | 19-24 | నాయకుల సమావేశం, హరిజనుల దేవాలయ ప్రవేశానికి నిర్ణయం. |
| " | 24 | యరవాడ జైలులో ఒప్పందం డా॥ అంబేద్కర్ సమ్మతి |
| " | 26 | ఒప్పందాన్ని అంగీకరిస్తూ ప్రభుత్వ ప్రకటన, |
| మే | 8 | ఆత్మపరిశుద్ధతకై గాంధీజీ నిరాహార దీక్ష-గాంధీజీ విడుదల. శాసనోల్లంఘన ఉపసంహరణ. |
| జులై | 12 | పూనాలో నాయకుల ఇష్టాగోష్టి సంప్రదింపులు-సామూహిక ఉద్యమ విరమణ; వ్యక్తిసత్యాగ్రహానికి అనుమతి, |
| 1933 మార్చి —31 | | వరకు కొనసాగింపు. |
| జులై | 31 | గాంధీజీ 34 మంది ఆశ్రమవాసులతో సహా అరెస్టు, ఒక ఏడాది శిక్షలు. |
| అగస్టు | 16 | తిరిగి ఉపవాసం. |
| " | 23 | ఆరోగ్య క్షీణత-షరతులు లేకుండా విడుదల-గాంధీజీ దేశంలో హరిజన యాత్ర. |
| సెప్టెంబర్ | 20 | అనీబీసెంట్ మృతి. |
| " | 22 | విఠల్‌భాయ్‌పటేల్ మృతి. |
| 1934 ఏప్రిల్ | 7 | వ్యక్తి శాసనోల్లంఘనం గూడా విరమణకు నిర్ణయం. |
| మే | 18 | పాట్నా ఎ.ఐ సి.సి.- కాంగ్రెస్‌లో భాగంగా స్వరాజ్య పార్టీ ఏర్పాటు. |

| | | |
|---|---|---|
| అక్టోబర్ | 2 | కాంగ్రెస్ నుండి గాంధీజీ వైదొలగుట. కాంగ్రెస్ నిర్ణయంలో మార్పు. |
| 1935 | | కేంద్ర శాసనసభ ఎన్నికలలో పాల్గొన నిర్ణయం |
| 1935 ఆగస్టు | 4 | నూతన రాజ్యాంగ సంస్కరణలకు ఇంగ్లండ్ ఆమోదం-కాంగ్రెస్ కార్యవర్గం తిరస్కృతి. |
| డిసెంబర్ | 28 | కాంగ్రెస్ స్వర్ణోత్సవాలు-చరిత్ర ప్రచురణ. |
| 1936 మార్చి | | లక్నో కాంగ్రెస్ జవహర్ అధ్యక్షత; సామ్యవాద లక్ష్య ప్రసంగం. |
| మే | 10 | డాక్టర్ అన్సారీ మృతి |
| జూన్ | | అబ్బాస్ త్యాబ్జీ మృతి |
| ఆగస్టు | | కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళిక సిద్ధం. |
| డిసెంబర్ | | ఫైజ్‌పూర్ కాంగ్రెస్ |
| 1937 ఫిబ్రవరి | | ఎన్నికలు-కాంగ్రెస్ మెజారిటీ, 11 రాష్ట్రాల్లో 8 రాష్ట్రాల్లో కాంగ్రెస్ మంత్రివర్గాలు |
| మార్చి | | ఎ.ఐ.సి.సి. అధికార స్వీకారానికి ఆమోదం |
| అక్టోబరు | | వార్ధాలో బేసిక్ విద్యాసభ |
| నవంబరు | | కాంగ్రెస్ మంత్రివర్గాలు. మత కార్మిక తగాదాల్లో బలప్రయోగాన్ని గాంధీజీ ఖండించడం. |
| 1938 జనవరి | | షౌకతాలీ మృతి. |
| మార్చి | | త్రిపుర కాంగ్రెస్ |
| మే | | బోస్ రాజీనామా. అధ్యక్ష పదవిని రాజేంద్రబాబు స్వీకారం. |
| మే | 21 | సుభాస్ చంద్రబోస్‌చే ఫార్వర్డ్‌బ్లాక్ ఏర్పాటు |

## ద్వితీయ ప్రపంచయుద్ధం

| | | |
|---|---|---|
| ఆగస్టు | 20 | దేశ రక్షణ చట్టం |
| అక్టోబరు | 22-23 | కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా యివ్వాలని నిర్ణయం |

1940 మార్చి 19-20 మౌలానా ఆజాద్ అధ్యక్షతన రాంఘర్ కాంగ్రెస్.
కాంగ్రెస్‌వాదులు యుద్ధసహాయం చేయరాదని
తీర్మానం.
ప్రతి కాంగ్రెస సంఘం-సత్యాగ్రహ సంఘం
కావాలని.
వార్ధాలో కార్యవర్గ సభ
గాంధీని కాంగ్రెస్ నాయకత్వంనుంచి తప్పిం
చుతూ నిర్ణయం

జూన్ ఫ్రాన్సు పతనం, సుభాస్ అరెస్టు

జులై 3-7 జాతీయ ప్రభుత్వ మేర్పరచాలని తీర్మానం,

అక్టోబర్ 11 వ్యక్తి సత్యాగ్రహ ఆరంభం-వినోబాభావే అరెస్టు

31 జవహర్ అరెస్టు

డిసెంబర్ 30 ఆజాద్‌కు శిక్ష - 18 నెలలు

1941 ఆగస్టు 7 రవీంద్రకవీంద్రుని అస్తమయం. 25 వేల
మంది వ్యక్తిగత సత్యాగ్రహుల అరెస్టులు.
రు 3 లక్షల అపరాధపు సొమ్ము విధింపు

డిసెంబర్ 3 సత్యాగ్రహుల విడుదల. పెరల్ హార్బర్
పతనం.
23 - 30 గాంధీజీ నాయకత్వం నుండి
విడుదల.

1942 జనవరి 15-16 రణ పద్ధతిలో నడిపించడానికి కాంగ్రెస్
అంగీకారం.

ఫిబ్రవరి 11 జమ్నాలాల్ బజాజ్ మృతి.

మార్చి 7 రంగూన్ పతనం.

11 క్రిప్సు రాయబారవర్గాన్ని పంపుతామని
ప్రభుత్వ ప్రకటన, రాజాజీ పథక తిరస్కృతి,

26 ఎ.ఐ.సి.సి పై పోలీసుల దాడి ?

జులై 6 క్విట్ఇండియా తీర్మానం కార్యవర్గ ఆమోదం

ఆగస్టు 8 బొంబాయి ఎ.ఐ.సి.సి ఆమోదం.

| సంవత్సరం | నెల | తేదీ | సంఘటన |
|---|---|---|---|
| | | 9 | నాయకుల అరెస్టు. |
| | | 10 | కాం[గెస్ సంమాలపై నిషేధం. |
| | ఆగస్టు | 15 | మహాదేవ దేశాయ్ అస్తమయం-ఆగాఖాన్ భవనంలో. |
| 1943 | ఫి[బవరి | 10 | 3 వారాలు గాంధీజీ జైలులో నిరాహారదీక్ష, |
| | | 13 | అల్లర్లకు కాం[గెసుదే బాధ్యతయని [పభుత్వం-గాంధీజీ [పత్యుత్తరాలు. |
| | | 17 | మోడీ, సర్కార్, ఆనీ రాజీనామా. |
| | మార్చి | 3 | తో [వత దీక్ష ముగింపు. |
| | జూన్ | 18 | వై[సాయిగా వావెల్ రాక. |
| 1944 | ఫి[బవరి | 22 | ఆగాఖాన్ భవనంలో మాత కస్తూరి బాఅస్తమయం. |
| | మే | 6 | ఎట్టి షరతులు లేకుండా గాంధీజీ విడుదల. |
| | జులై | 9 | రాజాజీ పథకం |
| | సెప్టెంబర్ | 7 | గాంధీజిన్నా సం[పదింపులు, [పపంచ యుద్ధం ముగింపు-కేం[దశాసన సభ ఎన్నికలు, |
| 1946 | | | రాష్ట్ర శాసనసభ ఎన్నికలు-కాం[గెస్ 6 రాష్ట్రిలలో విజయం |
| | డిసెంబర్ | 10 | రాజ్యాంగ సభ, |
| 1947 | జనవరి | 20 | అట్లీ స్వాతం[త్య [పకటన, మౌంట్ బాటెన్ రాక, |
| | జనవరి | 23 | దేశవిభజనకు కాం[గెస్ అంగీకారం, |
| | జులై | 15 | భారత స్వాతం[త్య బిల్లు |
| | ఆగస్టు | 15 | పాకిస్తాన్, భారత దేశాల అవతరణ. |

# తెలుగునాట ప్రధాన పోరాట ఘట్టాలు

| | | |
|---|---|---|
| **1857-59** | | **ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధం** |
| 1857 ఏప్రిల్‌లో | | మంగళ పాండే ఆత్మ బలిదానం |
| మే | 10న | మీరట్‌లో సిపాయీల తిరుగుబాటు |
| 1859 ఏప్రిల్ | 16న | నానాసాహెబ్ నేపాలుకు పరారీ |
| ,, ఏప్రిల్ | 19న | తాతియాతోపే వీరమరణం<br>తర్వాత యుద్ధంలో ఝాన్సీరాణి వీరమరణం |
| 1857 జూలై | 17న | రెసిడెన్సీపై దాడికి ప్రయత్నం |
| 1857-58 | | సుబ్బారెడ్డి తిరుగుబాటు<br>షేక్‌పీర్ సాహెబ్‌కు శిక్ష<br>(లోగడ 1846లోనే ఉయ్యాలవాడ నరసింహారెడ్డికి మరణదండన) |
| 1885 | | బొంబాయిలో జాతీయ కాంగ్రెస్ ప్రథమ సమావేశం |
| 1892 | | గుంటూరులో మొదటి 'మండల మహాసభ' |
| 1901 | | శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం ఏర్పాటు<br>విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి స్థాపన. |
| **1905-10** | | **వందేమాతరం ఉద్యమం :** |
| 1905 | | బెంగాలు విభజన |
| 1911 | | విభజన రద్దు |
| 1907 ఏప్రిల్ | | 19-24 తేదీల్లో రాజమండ్రిలో బిపిన్‌చంద్రపాల్ ప్రసంగాల<br>138 మంది ట్రైనింగ్ కాలేజి విద్యార్థుల 'భర్తరఫ్' |
| 1907 మే | 1న | కాకినాడలో 50 మంది అరెస్టు |
| 1908 | | బొంబాయి నుండి ఆంధ్ర వారపత్రిక ప్రారంభం |
| 1908 | | బందరు జాతీయ కళాశాల స్థాపన |
| 1909 | | కరెవరం బాంబుకేసు<br>'స్వరాజ్య' వ్యాసం-గాడిచెర్ల ప్రభృతుల అరెస్టు |
| 1914 | | ప్రథమ ప్రపంచ యుద్ధం. |

| | | |
|---|---|---|
| **1916-18** | | హోంరూలు ఉద్యమం : |
| 1917 | | ఆంధ్రలో 52 హోంరూలు శాఖలు ఏర్పాటు<br>మదనపల్లి థియసాఫికల్ కాలేజి స్థాపన |
| 1918 జనవరి | 20 | బెజవాడలో ప్రత్యేక ఆంధ్ర కాంగ్రెస్ సంఘం ఏర్పాటు |
| **1920-22** | | అసహాయోద్యమం : |
| 1917 | | చంపారన్ సత్యాగ్రహం |
| 1918 | | కెయిరా సత్యాగ్రహం |
| 1919 ఏప్రిల్ | 6 | రౌలట్ బిల్లుకు నిరసన-దేశమంతటా హర్తాళ్ళు<br>వేల్సు యువరాజు రాకకు నిరసన ప్రదర్శనలు-<br>బొంబాయిలో 53 మంది మృతి-400 మందికి గాయాలు |
| 1919 ఏప్రిల్ | 13 | జలియన్ వాలాబాగ్ హత్యలు |
| 1920 ఆగస్టు<br>సెప్టెంబరులో | 1వ తేదీ | అసహాయోద్యమ తీర్మానం ఆమోదం.<br>(కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ మహాసభ) |
| 1921 మార్చి | 31, ఏప్రిల్ 1 | బెజవాడ ఎ ఐ సి సి మహాసభ |
| 1922 | | పెద నందిపాడు పన్నుల నిరాకరణ<br>చీరాల-పేరాల ప్రజల పురనిర్గమన<br>పల్నాడులో పుల్లరి సత్యాగ్రహం |
| 1922 ఫిబ్రవరి | 6 | కన్నెగంటి హనుమంతు వీరమరణం.<br>రాయచోటి ఫారెస్టు రైతుల ఆందోళన |
| 1922 మార్చి | 10 | గాంధీమహాత్ముని అరెస్టు.<br>ఉద్యమ విరమణ |
| **1924** మార్చి, ఏప్రిల్ | | నెలల్లో గాంధీజీ ఆంధ్రదేశ సంచారం. |
| 1923 | | కాకినాడ కాంగ్రెస్ మహాసభ |
| 1923 మే | 1 | నాగపూర్ జెండా సత్యాగ్రహం |
| 1922-24 | | మన్య విప్లవం |
| 1924 మే | 7న | అల్లూరి సీతారామరాజు వీరమరణం |
| 1923-24 | | అదిలాబాదు జిల్లాలో గోండుల తిరుగుబాటు<br>కొమరం భీమ్ హత్య |

1920 మార్చి 16 హైదరాబాదులో ఖిలాఫత్ సభ

,, 19 హైదరాబాదు సంస్థానంలో హర్తాళ్ళు

1921 నవంబరు 12 నిజాం ఆంధ్రజన సంఘ స్థాపన

1923 కాకినాడలో మొదట రాజకీయ సభ

1926 బొంబాయిలో ద్వితీయ రాజకీయ సభ

1928 పూనాలో తృతీయ రాజకీయ సభ

1927 శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయ 'రజతోత్సవం'

1928 28 సైమన్ కమీషన్ నిరసన ప్రదర్శనలు
మదరాసులో ప్రకాశం చూపిన ధైర్య సాహసాలు

1929 గాంధీజీ హైదరాబాదు రాక-సభలు

1929 లాహోరు కాంగ్రెస్ మహాసభ
'పూర్ణ స్వరాజ్య' తీర్మాన ఆమోదం

## 1930-32 ఉప్పు సత్యాగ్రహోద్యమం

1930 జనవరి 26 దేశంలో 'స్వాతంత్ర్య ప్రతిజ్ఞ'

1930 ఫిబ్రవరి 15 ఎ.ఐ.సి.సి సభ-నియంతగా గాంధీజీ ఎన్నిక

1930 మార్చి 12 గాంధీజీ 'దండియాత్ర'
రాజప్రతినిధిచే 11 ఆర్డినెన్సులుజారీ
పోలీస్ కాల్పులలో 200 మంది మృతి
60 వేలమంది అరెస్టులు

1931 మార్చి గాంధీ-ఇర్విన్ ఒడంబడిక
ఉద్యమం తాత్కాలిక విరమణ

1932 మరల ఉద్యమ తీవ్రత- 1,50,000 మంది అరెస్టులు

1933 వ్యక్తి శాసనోల్లంఘనం-

1934 సత్యాగ్రహ విరమణ.

1930 ఉద్యమంలో ఆంధ్రలో 1300 మంది సత్యాగ్రహులకు శిక్షలు

1932 ,, ,, 630 మందికి శిక్షలు

1930 జూన్ గుడివాడ సభపై పోలీసు కాల్పులు

| | | | |
|---|---|---|---|
| 1930-31 | | | బందరు జెండా సత్యాగ్రహ యుద్ధం<br>ఏలూరు శిబిరంపై పోలీసు కాల్పులు |
| 1932-33 | | | నిషేధాజ్ఞలు ధిక్కరించి రాజకీయసభలు-అరెస్టులు<br>కాకినాడ బాంబుకేసు-భయంకరాచారికి ద్వీపాంతరవాస శి<br>మహిళా సత్యాగ్రహులపై అకృత్యాలు<br>వలంటీర్లపై లాఠీఛార్జీలు, కొరడా దెబ్బలు |
| 1930 | ఏప్రిల్ | 18 | చిటగాంగు ఆయుధాగారంపై విప్లవకారులదాడి |
| 1931 | ఏప్రిల్ | | భగత్సింగ్, రాజగురు, సుఖదేవ్ల ఉరి<br>టెర్రరిస్టుల సాహసచర్యలు-ప్రభుత్వ తీవ్రదమనకాండ. |
| 1931 | | | కరాచీ కాంగ్రెస్ సభ<br>(ప్రాథమిక హక్కుల తీర్మానం ఆమోదం). |
| 1936 | | | నెహ్రూ అధ్యక్షతన లక్నో కాంగ్రెస్ సభ - సామ్యవాద ప్రబోధం |
| 1937 | | | ఫైజ్పూర్ కాంగ్రెస్ సభ<br>(వ్యవసాయ సంస్కరణలు ఆమోదం) |
| 1938 | | | త్రిపురీ కాంగ్రెస్-బోస్ అధ్యక్షత. |

## 1938 స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం

| | | | |
|---|---|---|---|
| 1938 | అక్టోబర్ | 24 | ప్రథమ సత్యాగ్రహ దళం అరెస్టు<br>411 మంది అరెస్టులు |
| 1939 | నవంబరు | 29 | వందేమాతరం గీతంపై నిషేధం<br>డిసెంబర్ 10 వరకు విద్యార్థుల సమ్మె- |
| 1939 | సెప్టెంబర్ | | ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం |

## 1940-42 క్విట్ ఇండియా ఉద్యమం :

| | | | |
|---|---|---|---|
| 1940 | | | వ్యక్తి సత్యాగ్రహం- యుద్ధవ్యతిరేకంగా |
| 1941 | జనవరికల్లా | | 2250 మంది సత్యాగ్రహుల అరెస్టులు |
| ,, | ఏప్రిల్నాటికి | | 14 వేలమంది పైగా అరెస్టులు |
| 1942 | ఆగస్టు | 8 | బొంబాయి ఎ.ఐ.సి.సి సభ<br>(క్విట్ ఇండియా తీర్మానం ఆమోదం) |

1942 6 మాసాల్లో దేశంలో 60,229 మంది అరెస్టులు
19 వేలమంది నాయకుల డిటెన్షన్
949 మంది పోలీసు కాల్పులకు ఆహుతి.
నానాపాటిల్ నాయకత్వాన సతారాలో పోటీ ప్రభుత్వ స్థాప
ఆంధ్రలో 21 చోట్ల పోలీసు కాల్పులు - 39మందిమృ
285 మందికి కొరడాదెబ్బలు - 5,729 మంది అరెస్టులు
గ్రామాలపై సమిష్టి జరిమానాలు

1940 సెప్టెంబరు 11 స్వామి రామానందతీర్థ అరెస్టు.

1940-42 స్టేట్‌లో క్విట్ ఇండియా ఉద్యమం- అరెస్టులు.
జాతీయ జెండా ప్రతిష్ఠాపనలు- తీవ్ర నిర్బంధాలు.

## 1942-43 ఆజాద్ హింద్‌ఫౌజ్

1941 గృహ నిర్బంధం నుండి సుభాస్‌బోస్ పరారీ.
నేతాజీబోస్ భారత సైనికులతో 'ఆజాద్ హింద్‌ఫౌజ్‌ఏర్పాటు

1943 భారత సరిహద్దుల వరకు పురోగమనం

1943 అక్టోబరు 21 తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పాటు

1946 దేశంలో సార్వత్రిక ఎన్నికలు
కాంగ్రెస్ విజయ దుందుభి

1946 స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగింపు

1946 జూలై 3 స్టేట్ కాంగ్రెస్‌లో ఆంధ్ర, మహారాష్ట్ర కర్నాటక పరిషత్తుల విలీకరణ,

1947 మే 8 జయప్రకాశ్ నారాయణ్‌ను స్టేట్ నుంచి బహిష్కరణ- నిరసన సభలు- అరెస్టులు.

1944 మే 6 గాంధీజీ విడుదల
రాజీసంప్రదింపులు ప్రారంభం.

1945 జూన్ 25 సిమ్లాసభ- కాంగ్రెస్ ముస్లింలీగ్‌ల రాజీవైఫల్యం

1946 ఫిబ్రవరి 18 భారత నావికసైన్యం తిరుగుబాటు

1946 ఆగస్టు 16 ముస్లింలీగ్ ప్రత్యక్ష చర్య-దేశంలో మతకలహాలు

1946 డిసెంబర్ 9 రాజ్యాంగ నిర్మాణ సభ

1947 మార్చి 24 వైస్రాయిగా మౌంట్ బాటెన్‌రాక

1947 జూన్ 3 దేశ విభజన పథకం

1947 జూలై 1 బ్రిటిష్ పార్లమెంటులో ఇండిపెండెంటు బిల్లు ఆమోదం

1947 అగస్టు 15 'స్వతంత్ర భారత్' అవతరణ.

## హైదరాబాదు సంస్థాన విలీనోద్యమం

1947 జూన్ 11 స్టేట్ 'స్వతంత్రంగా వుంటుందని' నిజాం ఫర్మానా
ప్రజా పోరాటాలు ఉధృతం-నిజాం నవాబుపై బాంబు
ప్రయోగం, నారాయణ్ పవార్ ప్రభృతుల అరెస్టు

1947 ఆగస్టు స్టేట్‌లో త్రివర్ణ పతాక ఆవిష్కరణలు అరెస్టులు.

1947 ఆగస్టు 15 స్వామీజీ అరెస్టు

1947 నవంబరు 27 'యథాతథపు ఒడంబడిక'

1948 వరంగల్లులో మొగిలయ్య హత్య

1948 ఆగస్టు 21న హైదరాబాదులో షా యబుల్లాఖాన్ హత్య

1948 సెప్టెంబర్ 7 స్టేట్‌లో జరుగుతున్న దురంతాలపై ప్రధాని వివరణ.

1947-48 బార్డర్ కాంపులు-కాంగ్రెస్ వలంటీర్ల సాయుధ పోరాటాలు

1947 సెప్టెంబరు 7 పరిటాల రిపబ్లిక్ స్థాపన
సరిహద్దు గ్రామాల్లో రిపబ్లిక్‌ల ఏర్పాటు

1947 సెప్టెంబర్ 2 పర్కాలలో జాతీయ జెండా వూరేగింపుపై పోలీసు కాల్పులు
16 మంది ఆహుతి
100 మందికి పైగా గాయాలు.

1948 సెప్టెంబరు 13 కేంద్ర ప్రభుత్వంచే 'పోలీస్ యాక్షన్'

,, 18 నిజాం ప్రభుత్వ లొంగుబాటు.

భారత యూనియన్‌లో హైదరాబాదు సంస్థాన విలీకరణ.

# అ. భా. కాంగ్రెసు మహాసభల అధ్యక్షులు

1885 బొంబాయి - డబ్ల్యు.సి. బెనర్జీ
1886 కలకత్తా - దాదాభాయి నౌరోజి
1887 మద్రాసు - బదురుద్దీన్ తయ్యాబ్జి
1888 అలహాబాదు - జార్జి యూల్
1889 బొంబాయి - సర్ విలియం వెడర్‌బరన్
1890 కలకత్తా - సర్ ఫిరోజిషామెహతా
1891 నాగపూర్ - పి. ఆనందాచార్యులు
1892 అలహాబాదు - డబ్ల్యు.సి. బెనర్జీ
1893 లాహోరు - దాదాభాయి నౌరోజి
1894 మద్రాసు - ఆల్ఫ్రెడ్ వెబ్
1895 పూనా - సురేంద్రనాధ బెనర్జీ
1896 కలకత్తా - మహమ్మద్ రహింతుల్లా సయానీ
1897 అమరోతి - సర్ సి. శంకరనాయరు
1898 మద్రాసు - ఆనందమోహన్ బోసు
1899 లక్నో - రమేశ్ చంద్రదత్తు
1900 లాహోరు - సర్ యన్.జి. చందావార్కరు
1901 కలకత్తా - సర్ డి.ఇ. వాచా
1902 అహ్మదాబాదు - సురేంద్రనాథ బెనర్జీ
1903 మద్రాసు - లాల్‌మోహన ఘోషే
1904 బొంబాయి - సర్ హెన్రీ కాటన్
1905 కాశీ - గోపాలకృష్ణ గోక్లే
1906 కలకత్తా - దాదాభాయి నౌరోజి
1907 సూరత్ - డా॥ రాసబిహారి ఘోష్
1908 మద్రాసు - ,,
1909 లాహోరు - పండిత మదనమోహన మాళవ్యా
1910 అలహాబాదు - సర్ విలియం వెడర్ బరన్
1911 కలకత్తా - పండిత భిషన్ నారాయణ ధార్
1912 బంకిపూర్ - ఆర్.యన్. మధోల్కర్
1913 కరాచీ - నవాబ్ సయ్యద్ మహమ్మద్
1914 మద్రాసు - బి. యన్. బాసు

1915 బొంబాయి - సర్ సత్యేంద్ర ప్రసన్నసిన్హా
1916 లక్నో - బాబు అంబి కాచరణ ముజుందారు
1917 కలకత్తా - అనీబిసెంట్ అత్యవసర కాంగ్రెస్ బొంబాయి
సయ్యద్ హసన్ ఇమాం.
1918 డిల్లి - పండిత మదనమోహను మాలవ్యా
1919 అమృతసర్ - పండిత మోతిలాల్ నెహూ్రి అత్యవసర కాంగ్రెసు
కలకత్తా — లాలా లజపతిరాయి -
1920 నాగపూర్ - సేలం విజయరాఘవాచార్యులు
1921 అహమ్మదాబాదు - హకీం అజమల్‌ఖాన్ జైలులో వున్న
సి, ఆర్. దాసుగారికిగాను.
1922 గయ - చిత్తరంజనదాసు అవసర కాంగ్రెస్ డిల్లి - మౌలానా
అబుల్ కలాం అజాద్
1923 కాకినాడ - మౌలానా మహమ్మదాలి -
1924 బెల్గాము - మహాత్మాగాంధీ
1925 కాన్‌పూర్ - శ్రీమతి సరోజనీదేవి
1926 గౌహతి - శ్రీనివాస అయ్యంగారు
1927 మద్రాసు - డాక్టరు యం. ఏ. అన్సారీ
1928 కలకత్తా - పండిత మోతీలాల్‌నెహూ్రి
1929 లాహోరు - పండిత జవహర్లాల్ నెహూ్రి
1931 కరాచి - సర్దారు వల్లభాయిపటేలు
1932 డిల్లి - సేట్ రంఛోడ్‌లాల్ అమృతలాల్
1933 కలకత్తా - జె. యం సేనుగుప్తాసతి
1933 కలకత్తా - యం. యస్. అనే
1934 బొంబాయి - రాజేంద్రప్రసాదు
1936 లక్నో — పండిత జవహర్లాలు నెహ్రూ
1936 ఫెయిజ్పూరు — పండిత జవహర్లాలు నెహ్రూ
1937 హరిపురా — సుభాష్ చంద్రబోసు
1938 త్రిపురి — సుభాష్ చంద్రబోసు, పిమ్మట రాజేంద్రప్రసాద్
1940 రాంఘర్ — మౌలానా అబుల్‌కలాం అజాద్
1946 మీరట్ — మొదట పండిత జవహరులాలు ఎన్నిక, ఆయన కేంద్ర
ప్రభుత్వంలోకి చేరినందున జె. బి. కృపలానీ ఎన్నిక
1948 జైపూర్ - డాక్టరు పట్టాభి సీతారామయ్య.

తమ సర్వస్వము దేశమాతగ, మహాత్మాగాంధిజీ నాయక
త్వమునన్, శాంతిపథాన సాగిన, మహాస్వాతంత్ర్య సంగ్రామరం
గమునన్, ప్రాణములొడ్డి, స్వేచ్ఛవెలుగంగా, ధాత్రినెంతే స్వరా
జ్యము సాధించిన, వీరయోధులకు, భక్త్యానంద సాష్టాంగముల్.

—గురుజాడ రాఘవశర్మ



కొండ వెంకటప్పయ్య : వీరిది గుంటూరు 1866 ఫిబ్రవరి 2వ తేదీ జన్మించారు. గుంటూరు మిషన్ బడిలో హైస్కూలు విద్యను, రాజమండ్రిలో, మదరాసులో కళాశాల విద్యనుచదివి, బి.ఎల్. పాసై బందరులో న్యాయవాద వృత్తి నవలంబించారు. కృష్ణా మండల మహాసభకు కార్యదర్శిగా వుండి, 'కృష్ణాపత్రిక'కు సంపాదకత్వం వహించారు. 1915లో ఐచ్ఛికంగా న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి, ప్రజాహిత కార్యక్రమాలలో నిమగ్నులైనారు.

1913లో బాపట్ల ప్రధమాంధ్ర మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. 1917లో నెల్లూరులో జరిగిన ఆంధ్రమహాసభకు అధ్యక్షత వహించారు. 1918లో ఏర్పడిన ప్రత్యేక ఆంధ్ర కాంగ్రెస్ కమిటీకి వీరే మొదటి ప్రధానకార్యదర్శి. తర్వాత అధ్యక్షులైనారు. 1923లో ఎ ఐ సి.సి. తాత్కాలిక అధ్యక్షులు. వీరు శాసన సభ సభ్యత్వానికి రాజీనామాచేసి,గాంధీగారి అసహాయోద్యమంలో ప్రవేశించారు బార్డోలీలో గాంధీజీలాగా, గుంటూరు జిల్లాలో సహాయనిరాకరోద్యమానికి వీరు నాయకత్వం వహించారు.

1930 ఉప్పు సత్యాగ్రహోద్యమానికి వీరే రాష్ట్రంలో ప్రథమ నియంతగా ఉన్నారు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో తమ 76వ ఏట కూడా జైలు శిక్షలనుభవించారు. ఆంధ్రలో సత్యాగ్రహాలన్నిటినీ ధైర్యసాహసాలతో నిశ్చలచిత్తంతో నడిపించి, ఆంధ్రదేశ భవితవ్యం ఈ దేశభక్తచేతిలో పదిలంగా వున్నదనేఖ్యాతి నార్జించారు. వెంకటప్పయ్యగారిది కాంగ్రెస్ సేవకులకు, స్వాతంత్ర్య సేనానులకు గురు పీఠం. ఈయన ఉద్యమ నాయకులకు నాయకుడు. మహాత్మాగాంధీకి అత్యంత సన్నిహితుడు. ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరుడు. సృష్టివిచారం, బ్రహ్మవిచారం గ్రంధాలు రచించారు.

మానవసేవయే మాధవసేవగా ఎంచి, యావజ్జీవిత పర్యంతం, ప్రజలకు సేవ చేశారు. అనుక్షణం దైవమానవసేవలో గడిపిన సయంమీంద్రుడు. తమ 84వ ఏట, 'దేశభక్త' 1949 ఆగస్టు 15వ తేదీ భారత స్వాతంత్ర్యదినోత్సవ పుణ్యదినాన గుంటూరులో పరమపదించారు.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య : వీరు 1889 జూన్ 2వ తేదీన పెనగంచిప్రోలులో జన్మించారు బాపట్లలో హైస్కూలులో, గుంటూరులో ఉన్నత విద్య నభ్యసించి, లండన్‌లో ఎం.ఎ. పాసై, ఎడింబరో విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో పట్టం పొందారు. ఎడింబరోలోని భారత సంస్థకు వీరు కార్యదర్శిగా పనిచేశారు.

స్వదేశానికి తిరిగివచ్చి రాజమహేంద్రవరం బోధనాభ్యసన కళాశాలలో, 1918లో బందరు జాతీయ కళాశాలలో కొంతకాలం అధ్యాపకులుగా పనిచేశారు. 1920 కలకత్తా కాంగ్రెస్‌సభకు హాజరైన గోపాలకృష్ణయ్య, సహాయనిరాకరణోద్యమ

కాలంలో చీరాల-పేరాల పోరాటాన్ని—జిల్లాలో పన్నుల నిరాకరణోద్యమాన్ని సాహసంతో నడిపించిన ధీశాలి. పోటీ ప్రభుత్వంగా, ఏర్పరచిన రాంనగర్ నిర్మాణానికి వీరే మూలపురుషులు. 'రామదండు' నేర్పరిచారు. ఆంధ్ర విద్యాపీఠ గోష్ఠులను నిర్వహించారు. ఆంగ్లంలో 'సాధన' పత్రికను నడిపారు. 144 సెక్షన్‌ను, ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించి, బరంపురం వద్ద అరెస్టు అయినారు ప్రజాసేవకులలో అరెస్టులంటే భయం తీర్చాడు. స్వరాజ్యమనగా రామరాజ్యమని వివరించారు. పౌన్నూరులో జరిగిన మహాసభలో ప్రజలు వీరికి 'ఆంధ్రరత్న' అనే బిరుదు ప్రదానంచేశారు యావదాంధ్ర దేశం వీరు పర్యటించి, అసంఖ్యాక సభా సమావేశాల్లో ఉపన్యసించి, ఆంధ్రప్రజలను దేశభక్తి ప్రపూరితులను గావించారు. 'ఆంధ్రరత్న' కేవలం రాజకీయనాయకుడు మాత్రమేగాదు, ఆయన కవి, పండితుడు. స్వరాజ్య, స్వధర్మ రక్షణకు కంకణం ధరించిన గొప్ప దేశారాధకుడు.

నిర్విరామకృషిలో 1926 నుండి రుగ్మత ఏర్పడి 1928 జూన్ 10వ తేదీన తన 38వ ఏటనే, గుంటూరులో దివంగతుడైనారు. వారి భౌతికకాయాన్ని చీరాలకు చేర్చి, 'రాంనగర్'లో ప్రజలు దహన సంస్కారాలు జరిపించారు.

**టంగుటూరి ప్రకాశం :** వీరిది ఒంగోలు తాలూకా కనపర్తిగ్రామం. 1872 ఆగస్టు 23వ తేదీన జన్మించారు రాజమండ్రి, మదరాసు పట్టణాలలో ఉన్నత విద్యనభ్యసించి, రాజమండ్రిలో కొన్నాళ్ళు న్యాయవాదిగావున్నారు ఆ మ సిసి పాలిటీకి చైర్మన్ అయినారు. లండన్‌లో బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడైవచ్చి, 1907లో మదరాసులో న్యాయవాదివృత్తి నవలంభించారు. లక్షలు గడించారు.

1921లో న్యాయవాద వృత్తిని విసర్జించి, తదాది సహాయ నిరాకరణ, సత్యాగ్రహోద్యమాలన్నిటిలోను పాల్గొని, పలుమార్లు, కారాగారశిక్షలనుభవించిన స్వాతంత్ర్య యోధుడు.

సైమన్ కమిషన్ బహిష్కరణ సందర్భంలో, అద్వితీయత్యాగం ప్రదర్శించి, 'ఆంధ్రకేసరి'గా ఖ్యాతిగాంచినధీరుడు. గుజరాత్‌కు వల్లభాయి పటేల్, బీహారుకు బాబూరాజేంద్రప్రసాద్, బెంగాలుకు చిత్తరంజన్‌దాస్, సుభాస్‌చంద్రబోస్‌ల వలె స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రులకు ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించి పెట్టిన మహానాయకుడు ఆంధ్రకేసరి. 'స్వరాజ్య' పత్రికా నిర్వహణలో, స్వాతంత్ర్య పోరాటాల్లో తమ యావదాస్తిని త్యాగంచేసిన త్యాగమూర్తి

చిరకాలం ఆంధ్ర కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షునిగా వుండి, కాంగ్రెస్ సందేశాన్ని నలుదిశల వ్యాపింపజేసిన కార్యదక్షుడు.

రాజాజీ మంత్రి వర్గంలో రెవిన్యూశాఖా మాత్యుడుగా వుండి, జమీందారీ విధాన రద్దుకు పునాది నిర్మించిన మూలపురుషుడు. 1946లో ఉమ్మడి మదరాసు రాష్ట్ర ముఖ్య మంత్రిగా, 1953లో ఆంధ్రరాష్ట్ర ప్రథమ ముఖ్య మంత్రిగా, ఆంధ్రదేశ అభివృద్ధికి ఎనలేని కృషిచేసిన పరిపాలనాధ్యక్షుడు అర్ధశతాబ్దంపైగా ఆంధ్ర రాజకీయాలలో ప్రకాశంగారు అత్యంత ప్రముఖపాత్రవహించారు. వారి 85వ ఏట హైదరాబాదు నగరంలో 1957 మే 20వ తేదీన పరమ పదించారు.

**వున్నవ లక్ష్మీనారాయణ :** వీరిది సత్తెనపల్లి తాలూకా వేములూరిపాడు గ్రామం. ఐర్లాండు వెళ్ళి ఉన్నతవిద్య నభ్యసించి బారిస్టర్‌గా స్వదేశానికి తిరిగివచ్చి, కాంగ్రెస్ నాయకత్వాన జరిగిన అన్నిస్వరాజ్య పోరాటాల్లో అగ్రశ్రేణిలో వుండి పాల్గొన్నారు. 1922 సహాయ నిరాకరణోద్యమకాలంలో పల్నాటి పుల్లరి సత్యాగ్రహోద్యమానికి నాయకత్వం వహించి, ఏడాది జైలు శిక్షకు గురిఅయినారు. 1930 ఉప్పు సత్యాగ్రహ తరుణంలో వున్నవ లక్ష్మీనారాయణ, వారి సతీమణి లక్ష్మీబాయమ్మ దేవరంపాడు సత్యాగ్రహశిబిర నిర్వహణ బాధ్యతవహించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో డెటిన్యూగా నిర్బంధింపబడినారు.

వున్నవ దంపతులు గుంటూరులో 'శారదా నికేతన్' నెలకొల్పి, స్త్రీ జనోద్ధరణకు అవిరళ కృషచేసిన సంఘ సేవాపరాయణులు.

జైలులో వారు వ్రాసిన 'మాలపల్లి' నవల ఆంధ్ర సాహిత్యంలో ఒక మణిపూస పల్నాటి వీరగాధను, 'నాయకురాలు' అనునాటకం రచించారు. తిక్కనపై ఆయన గొప్ప పరిశోధన గావించారు. వున్నవవారు గొప్ప సాహితీవేత్త, సంఘ సంస్కర్త, తీవ్రజాతీయవాది, ఆంధ్రోద్యమ మూలపురుషులలో ఒకరు, స్వరాజ్య సమరయోధుడు.

**గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామి సీతారాం) :** వీరిది రేపల్లె తాలూకా. న్యాయవాది, మదరాసులో విద్యార్థి దశలోనే వీరు వందేమాతరం ఆందోళనలో పాల్గొన్నారు. 1922లో ఆంధ్ర కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి.

కాంగ్రెస్ నిర్వహించిన అన్ని స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొని, అనేక పర్యాయాలు జైలు శిక్ష లనుభవించిన మహాత్యాగశీలి. ఖద్దరు వ్యాప్తికి, హరిజనోద్ధరణకు దీక్షతో కృషి చేసిన సుప్రసిద్ధ నిర్మాణ కార్యకర్త, వినయాశ్రమం స్థాపించి, గాంధీగారి నిర్మాణ కార్యక్రమాలను కొనసాగించారు.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం నిరాహారదీక్షచేసిన సర్వోదయ నాయకుడు. 'ఆంధ్ర హరిజన్' మున్నగు పత్రికలను నడిపారు వీరి అనన్యదేశభక్తి, అచంచల దీక్ష, నిర్మాణ శక్తి ప్రజా సేవకులందరికీ ఆదర్శప్రాయమైనవి స్వామీ సీతారాంగా 1960లో పరమ పదించిన తాపసోత్తముడు, తుమ్మల బసవయ్య, భ్రమరాంబ దంపతులు తమ ఆస్తినంతా వినయాశ్రమానికి విరాళంగా సమర్పించారు.

**నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు :** వీరిది గుంటూరు. 1890లో జన్మిం చారు. లండన్‌లొ బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణులై, గుంటూరులో ప్రాక్టీస్ ప్రారంభిం చారు. గాంధీజీ ప్రబోధంతో ప్రభావితులై జాతీయ స్వాతంత్ర్య సంగ్రామంలోకి దూకారు. పట్టణ మునిసిపాలిటీకి చైర్మన్ అయినారు. జిల్లాలో అసహాయోద్యమ కాలంలో, సైమన్ కమిషన్ బహిష్కరణలో ఉప్పు సత్యాగ్రహంలో ప్రముఖపాత్ర వహించి, జైలు శిక్షలనుభవించిన స్వాతంత్ర్యసమర సేనాని. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో ప్రభుత్వం వీరిని గృహనిర్బంధంలో వుంచింది.

గుంటూరు నియోజకవర్గం నుంచి సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా రాష్ట్ర శాసన సభకు ఎన్నికైనారు. 1953లో ఆంధ్ర శాసనసభకు తాత్కాలిక స్పీకర్‌గా వ్యవహ రించారు.

**కల్లూరి చంద్రమౌళి :** వీరిది మోపర్రు గ్రామం. 1898లో జన్మించారు. స్కాట్లండ్‌లో వ్యవసాయశాస్త్ర పట్టభద్రులైనారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో, 1932 శాసన నొల్లంఘనోద్యమాలలో పాల్గొని జైలు శిక్షలనుభవించారు. వ్యక్తి సత్యా గ్రహంలో, 6 మాసాలు జైలుశిక్షకు గురిఅయినారు. క్విట్ ఇండియా ఉద్యమ సమ యంలో డెటెన్యూగా నిర్బంధింపబడినారు.

వీరు గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్ష పదవినధిష్టించారు. 1937 నుండి అనేక పర్యాయములు రాష్ట్ర శాసనసభకు ఎన్నికవుతూ వచ్చిన ప్రజాప్రతినిధి. ఉమ్మడి మద రాసు రాష్ట్ర ప్రభుత్వంలో, తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో, మంత్రిగా వివిధ శాఖలను నిర్వహించారు కొన్నాళ్లు తిరుపతి దేవస్థానంబోర్డు అధ్యక్షునిగా, రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు.

**కాసు బ్రహ్మానందరెడ్డి :** వీరిది చిరుమామిళ్ల గ్రామం 1909లో జన్మిం చారు బి. ఎల్. పాసై న్యాయవాదిగా ప్రాక్టీస్ చేశారు. వీరి అన్నగారు కాసు వెంకట రెడ్డి నరసరావుపేట నియోజకవర్గం నుండి కాంగ్రెస్ శాసన సభ్యునిగా ఎన్నికై, పిన్న వయస్సులోనే స్వర్గస్థులైనారు.

1937లో కాసుబ్రహ్మానందరెడ్డి ఒంగోలు జిల్లాబోర్డు అధ్యక్ష పదవినలంకరిం చారు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని, నాలుగు మాసాలు జైలుశిక్షకు గురియై నారు. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో 2 ఏండ్లు డెటెన్యూగా నిర్బంధితులైనారు.

వీరు 1946 నుండి రాష్ట్ర శాసనసభకు ఎన్నికవుతూ వచ్చారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘానికి కార్యదర్శిగా వున్నారు. సంజీవరెడ్డి ముఖ్యమంత్రిత్వ కాలంలో స్థానిక స్వపరిపాలన, ఆర్థికశాఖలను వీరు నిర్వహించారు. 1964 నుండి 7 ఏండ్లు రాష్ట్ర ముఖ్యమంత్రిగాను, కేంద్ర హోంశాఖ మంత్రిగాను, అఖిలభారత కాంగ్రెస్

కార్యవర్గ సభ్యునిగాను, అధ్యక్షునిగాను, అటు ప్రభుత్వ పరిపాలనారంగంలో, యిటు కాంగ్రెస్ సంస్థాగతంగాను అనేక బాధ్యతాయుత పదవులు నిర్వహించారు.

**ఆచార్య ఎన్ జి. రంగా:** రైతు బాంధవుడుగా ప్రశిద్ధిచెందిన ఆచార్య రంగా, 1930 నుండి స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన దేశభక్తుడు. స్వాతంత్ర్య సమరయోధుడు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌కు అధ్యక్షుడు. అర్థ శతాబ్దం పాటు స్వతంత్ర వాణిని ఢిల్లీ పార్లమెంటులో వినిపించిన, వినిపిస్తున్న ప్రముఖ పార్ల మెంటేరియన్ నిడుబ్రోలులో శ్రీ రామానీడు విద్యాలయం నెలకొల్పి, పలువురు రైతు కార్మిక సేవకులకు శిక్షణ గరిపి, దేశానికి అర్పించిన ఆచార్యుడు. అ. భా. కిసాన్ సభకు, అ. భా. స్వతంత్రపార్టీకి, ఆంధ్ర కృషిక్‌లోక్ పార్టీకి మున్నగు వివిధ సంస్థలకు పునాదులు వేసిన మూలపురుషులలో ఆచార్య రంగా గారొకరు. వివిధదేశాలు పర్యటించి, అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతి నార్జించిన రైతు నాయకుడు. ఆయన సతీమణి భారతీరంగా స్వతంత్ర్య సమరంలో జైలు శిక్ష లనుభవించి భర్తకు చేదోడు వాదోడుగావున్నారు.

ఆంధ్రదేశంలో రంగాగారు పర్యటించని ప్రాంతంలేదు. ఆయన ఉపన్యసించని పట్టణంలేదు. ఆయన ప్రముఖ వక్త-బహుగ్రంథకర్త.

**మంతెన వెంకటరాజు:** వీరిది మంతెనవారి పాలెం గ్రామం. 1904 మే 20వ తేదీన జన్మించారు వీరు గాంధీజీ నాయకత్వాన జరిగిన సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని, పలుసార్లు పోలీసుల లాఠీ ఛార్జీలకు, జైలు శిక్షలకు గురియైనారు. సంపూర్ణ స్వాతంత్ర్యవాది. తాను మాతృదేశారాధనకు అంకితమై, తన బంధు మిత్రులను త్యాగ శీలురనుగా, దేశభక్తులనుగా తీర్చిదిద్దిన ధీశాలి. ఉప్పు సత్యాగ్రహ శిబిరనిర్వహణలో వీరితోపాటు, వీరి సతీమణి అన్నపూర్ణమ్మ గావించిన త్యాగం నిరుపమానమైనది.

గుంటూరు జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా, అధ్యక్షునిగా, రాష్ట్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శిగా, వ్యష్టి సత్యాగ్రహ రాష్ట్ర సంచాలకునిగా, ఎ. ఐ. సి. సి సభ్యునిగా పలుగురుతర బాధ్యతలను సమర్ధవంతగా నిర్వహించి, దేశ నాయకుల ప్రశంసలందుకున్నారు. కేసరి, జైహింద్ వారపత్రికలు స్థాపించి, స్వాతంత్ర్య సందేశాన్ని ఆంధ్రావనిలో ప్రతిధ్వనింపజేశారు. మంతెన వారి పాలెం వేసంగి రాజకీయ పాఠశాలకు ఆయన ఎంతో అండగా వుండి, ఆంధ్రలో అతివాద రాజకీయాలకు, విప్ల వోద్యమాలకు చేయూతనిచ్చారు ఉమ్మడి మద్రాసు శాసనసభ్యునిగా, ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యునిగా ప్రజాహిత కార్యక్రమాల అమలుకు తోడ్పడ్డారు. క్షత్రియుల్లో స్త్రీ పునర్వివాహాలు జరిపించిన సంఘ సంస్కర్త. హరిజనోద్ధరణకు, ఖద్దరు వ్యాప్తికి కృషి చేశారు. 1968 ఏప్రిల్ 17న స్వర్గస్థులైనారు.

**జనాబ్ గౌస్‌బేగ్ సాహెబ్ :** వీరి స్వగ్రామం చీరాల. మేనమామ గ్రామం గంటావారి పాలెంలో జన్మించారు. తండ్రి హాజీమొహిద్దీన్‌బేగ్, తల్లి ఫతీమాబీ, 1920లో దుగ్గిరాల గోపాలకృష్ణయ్యతో కలిసి కలకత్తా స్పెషల్ కాంగ్రెస్‌కు హాజరైనారు. నాటినుండి 'ఆంధ్రరత్న'కు కుడి భుజంగా నిలిచి దేశసేవచేసిన జాతీయ ముస్లిం. 1922 నాన్ కో ఆపరేషన్ ఉద్యమసమయంలో ఆయనను పొన్నూరులో అరెస్టుచేసి, ఒక సంవత్సరం శిక్ష వేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో దేవరంపాడు సత్యాగ్రహశిబిర వలంటీర్లతోపాటు గౌస్‌బేగ్ ఒక ఏడాది శిక్ష అనుభవించారు. 1932లో రాష్ట్ర కాంగ్రెస్ డిక్టేటర్. రాజమండ్రి, కడలూరు, కన్ననూరు, రాయవెల్లూరు జైళ్ళలో శిక్షలు అనుభవించిన త్యాగశీలి.

గుంటూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా, రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సభ్యునిగా ఎ. ఐ. సి. సి మెంబరుగా, చీరాల పురపాలక సంఘ ఉపాధ్యక్షునిగా, ఆంధ్ర జాతీయ ముస్లిముల మహాసభాధ్యక్షుడుగా వుండి, గౌస్‌బేగ్ కాంగ్రెస్ సందేశాన్ని వాడ వాడల్లో ప్రచారం చేశారు. 'నా తల్లి భారతి-నా వృత్తి దేశసేవ' అని సగర్వంగా చెప్పుకుంటూ 60 ఏండ్లు పైబడిన నవయువకునిగా పరమపదించిన వృద్ధ స్వాతంత్ర్య యోధుడు.

**వావిలాల గోపాలకృష్ణయ్య :** వీరిది సత్తెనపల్లి. ప్రముఖ ఆంధ్ర రాజకీయ వేత్తలలో వీరొకరు. బాల్యం నుండి ఆంధ్రోద్యమంలో, స్వాతంత్ర్య పోరాటాల్లో పాల్గొన్నారు. పలుమార్లు కారాగారక్లేశ మనుభవించిన దేశసేవకుడు. స్వాతంత్ర్యానంతరం నాల్గుపర్యాయాలు రాష్ట్ర శాసనసభ్యునిగా, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల సెనేట్ సభ్యునిగా, తెలుగు అధికార భాషా సంఘానికి మొదటి అధ్యక్షునిగా ఆంధ్ర భాషాభివృద్ధికి, ఆంధ్రాభ్యుదయానికి అపార సేవజేశారు.

ఆంధ్రరాష్ట్రం, సంస్థానాలు, ద్రవ్యనీతి, ప్రణాళికలు, విశాలాంధ్ర, కేంద్ర-రాష్ట్ర సంబంధాలు మున్నగు 60 గ్రంథాలు రచించారు. వార్తా పత్రికలకు వివిధ సమస్యలపై వందలాది వ్యాసాలు వ్రాశారు. నిరంతర నిరాడంబర ప్రజా సేవకుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయం, వీరికి 'కళాప్రపూర్ణ' బిరుదు యిచ్చి సత్కరించింది. హెల్సింకీలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభకు భారత ప్రతినిధిగా, మలేషియా ప్రపంచ తెలుగు మహాసభకు వెళ్ళి, వివిధ ప్రాక్పశ్చిమదేశాలు సందర్శించారు.

**కన్నెగంటి సూర్యనారాయణ మూర్తి** : వీరిది తెనాలి తాలూకా నందివెలుగు గ్రామం. రాయలసీమలో కాంగ్రెస్ ప్రబోధంచేస్తూ 1920 సహాయ నిరాకరణోద్యమంలో 6 మాసాలు కఠినశిక్షననుభవించారు. 1930 సత్యాగ్రహోద్యమంలో లాఠీ ఛార్జికి, ఒక సంవత్సరం జైలుశిక్షకు గురి అయినారు. తర్వాత రాయవెల్లూరు జైలులో రెండున్నర సంవత్సరాలు డిటెన్యూగా వున్నారు. గుంటూరుజిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘానికి వీరు అధ్యక్షులు

**అన్నాప్రగడ కామేశ్వరరావు** : వీరిది నరసరావుపేట తాలూకా నాదెండ్ల గ్రామం. ఉన్నతవయలోనే సైన్యంలోచేరి, స్వతంత్ర భావాలు వెలిబుచ్చడంతో, మరణ దండనకు గురియై, అధికారుల ఆందోళనవల్ల ఎలాగో తప్పించుకొనిరాగలిగారు

1921 సహాయ నిరాకరణోద్యమంలో, ఏడాది కఠినశిక్షననుభవించారు. గుజరాత్ మహిళ సరళాదేవిని వర్ణాంతర వివాహం చేసుకున్న సంఘసంస్కర్త. ఉప్పు సత్యాగ్రహోద్యమంలో భార్యాభర్తలిరువురు కారాగార శిక్షలు పొందారు క్విట్ ఇండియా ఉద్యమంలో డిటెన్యూగా నిర్బంధింపబడినారు అజ్ఞాతంగా వుండి ఉద్యమాన్ని నడిపించారు వీరు వివిధ జైళ్ళలో మొత్తం 7 సంవత్సరాలు జైలుశిక్షలనుభవించారు. విప్లవ భావాలు గల కామేశ్వరరావు, రష్యాను సందర్శించివచ్చిన సోషలిస్టు ప్రముఖుడు.

ఉమ్మడి మదరాసు శాసన సభకు కాంగ్రెస్ అభ్యర్థిగా ఎన్నికై, అనేక అభివృద్ధి కార్యక్రమాల అమలుకు పాటుపడ్డారు 'అంకుశం వారపత్రికను, స్థాపించి సంపాదకత్వం వహించారు. సోషలిస్టు రష్యా నూతన రాజ్యాంగం మొదలగు గ్రంథాలను రచించారు. కొత్తపట్నం, మంతెనవారిపాలెం, వేసంగి రాజకీయ పాఠశాలల నిర్వహణలో పాలుపంచుకున్న ప్రముఖ అతివాద జాతీయవాది. భారత విప్లవకారుల సంఘ నిర్మాతలలో ముఖ్యులు. 'విద్యావనం' స్థాపకులు.

**శనగపల్లి రామస్వామి గుప్తా** : వీరు గుంటూరులో 1862 లో జన్మించారు. 1891 సంవత్సరంలో 'రేట్ పేయర్ల అసోసియేషన్' ఏర్పరచి, ప్రజాహిత కార్యక్రమాలకు పూనుకొన్నారు. 1892 జూన్ 29, 30 తేదీలలో ప్రథమ కృష్ణా మండల మహాసభను గుంటూరులో జయప్రదంగా జరిపించారు. ఈ మండల మహాసభ యితర జిల్లాలకు మార్గదర్శి అయింది.

కాంగ్రెస్ ప్రారంభదశలో అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభలకు హాజరైన ప్రతినిధులలో రామస్వామి గుప్తా ఒకరు. గుంటూరులో 'దేశాభిమాని' పత్రికను స్థాపించి, నిర్వహించారు. 'దేశాభిమాని-వెలకానీ' అని కేకలేస్తూ ఆ పత్రికను అమ్మేవారు.

1921 సంవత్సరంలో పెొన్నూరులో 30వ మండల మహాసభకు రామస్వామి గుప్తా అధ్యక్షత వహించారు.

**సింగరాజు వెంకట సుబ్బారాయుడు :** వీరిది మచిలీపట్నం బి ఎ.బి.ఎల్. పాసై, మచిలీపట్నం కోర్టులో ప్రాక్టీస్ చేసి, లక్షల ధనం సంపాదించారు. చాలకాలం న్యాయ వాద సంఘానికి అధ్యక్షులుగా, పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేశారు. స్థానిక మునిసిపల్ కౌన్సిల్ సభ్యునిగా, చైర్మన్‌గా ఎన్నికైన ప్రజాప్రతినిధి. మహాజనశాఖకు వీరు అధ్యక్షునిగా ప్రజాసమస్యలపట్ల శ్రద్దవహించారు.

రావు సాహెబ్ సుబ్బారాయుడుగారు, 1885 లో బొంబాయిలో జరిగిన ప్రథమ కాంగ్రెస్ మహాసభకు, 1886 లో కలకత్తాలో జరిగిన ద్వితీయ కాంగ్రెస్ మహాసభకు హాజరైనారు. ఆ చర్చల్లో ప్రముఖంగా పాల్గొన్నారు. ఆయన ప్రభుత్వ, ప్రజల అభిమాన గౌరవాలను కూడా చూరగొన్న వ్యక్తి. 1887 లో వీరు పరమదించారు. వీరుభద్రపరచిన గ్రంథాలుతర్వాత బెజవాడ రామమోహన గ్రంథాలయానికి సమర్పించ బడ్డాయి.

**కాశీనాథుని నాగేశ్వరరావు :** వీరు 1867 మే 1వ తేదీన కృష్ణాజిల్లాలో ఎల కుర్రులో జన్మించారు. దేశోద్ధారకునిగా, విశ్వదాతగా ఖ్యాతిగాంచిన నాగేశ్వరరావు గారు, గాంధీజీకి అత్యంత ప్రీతిపాత్రుడైనారు. దేశారాదకునిగా స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని జైలుశిక్షలకు గురి అయిన త్యాగమూర్తి. అనేక గుప్తదానాలు చేసిన దాన కర్ణుడు.

వీరు 1908లో 'ఆంధ్ర పత్రిక'ను 1924లో 'భారతి' సాహిత్య పత్రికను స్థాపించి, ఆంధ్రులలో గొప్ప చైతన్యాన్ని, జాగృతిని కలిగించిన ప్రబోధకులు. 1918 గుంటూరులో జరిగిన ఆంధ్ర మహాసభకు వీరు అధ్యక్షత వహించారు. పెక్కు గ్రంథాలయ సభలకు, ఆదిమాంధ్ర హరిజన సభలకు అధ్యక్షత వహించారు 1936లో కేంద్ర శాసనసభకు ఎన్నికైనారు. కోస్తాఆంధ్రులకు- రాయలసీమ వాసులకు సామరస్యాన్ని, సఖ్యతను చేకూర్చే శ్రీబాగ్ ఒడంబడికను మదరాసులోని తమస్వగృహంలో జరిపించి, ఆంధ్రోద్యమవ్యాప్తికి తోడ్పడ్డారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వీరికి 'కళా ప్రపూర్ణ' బిరుదునిచ్చి సన్మానించింది.

**వల్లభనేని రామబ్రహ్మం :** వీరిది జమీగొల్వేపల్లి. సహాయనిరాకరోద్యమకాలం నుండి అన్ని స్వాతంత్రోద్యమాలలో పాల్గొన్నారు. 1930, 1940 ఉద్యమాల సందర్భంగా 6ఏండ్ల పైగా జైలుశిక్షలననుభవించిన సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధుడు. తూర్పుకృష్ణా జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షునిగా రామబ్రహ్మం జిల్లాలో కాంగ్రెస్ ప్రచారం గావించారు. వీరి సతీమణి సీతామహాలక్ష్మమ్మ కూడా స్వరాజ్య సమరంలో పాల్గొని 15 మాసాలు కఠిన శిక్షనను భవించారు.

**డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య :** పీరు పశ్చిమ గోదావరి జిల్లా గుండుగొలను గ్రామంలో 1880లో జన్మించారు. ఏలూరులో ఇంగ్లీష్ చదువుకొన్నారు తండ్రి గ్రామకర్ణం, ఆయనకు వచ్చే కొద్దిపాటి జీతంలో పట్టాభి చదువుకోసం నెలకు రూ 7 లు చొప్పున పంపించాడు కష్టపడి చదువుకొని మద్రాసులో ఎం.బి సి ఎం. వైద్య పరీక్షలో ఉత్తీర్ణులై తర్వాత బందరులో కొన్నాళ్ల డాక్టర్‌గా ప్రాక్టీస్ చేశారు.

డాక్టర్ పట్టాభి తెలుగు, ఆంగ్లంతోపాటు హిందీ సంస్కృత భాషల్లో కూడా మంచి పాండిత్యం సంపాదించారు. భాషా ప్రయుక్త రాష్ట్రవాది. ఆంధ్రోద్యమంతో, జాతీయోద్యమంతో మొదటి నుంచి వీరికి సన్నిహిత సంబంధం వుంది. పెక్కు సంవత్సరాలు అ భా. కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగా ప్రముఖ పాత్ర వహించారు.

వీరు గాంధీతత్వ భాష్యకారునిగా మంచిపేరు గడించారు. జైపూర్ జాతీయ కాంగ్రెస్ మహాసభకు 1948లో వీరు అధ్యక్షత వహించారు సంస్థాన ప్రజా మండలికి అధ్యక్షులు. స్వాతంత్ర్యోద్యమాల్లో జైలుశిక్షలనుభవించారు. 'జన్మభూమి' పత్రికనునిర్వహించారు.

సమగ్ర 'కాంగ్రెస్ చరిత్ర'నురచించిన చరిత్రకారుడు డాక్టర్ పట్టాభి. 'ప్రపంచ రాజ్యాంగాలు'; 'గాంధిజం - సోషలిజం;' 'Andhra Province For and against' అనుగ్రంధాలు రచించారు. బ్యాంకింగ్ దృష్టి వుండటంవల్ల ఆంధ్రాబ్యాంకు, ఇన్సూరెన్సు కంపెనీ మున్నగు సంస్థలు స్థాపించి ఆంధ్రలో బ్యాంకింగ్ అభివృద్ధికి తోడ్పడ్డారు. 1959 డిసెంబర్ 17న హైదరాబాద్‌లో స్వర్గస్తులైనారు.

**అయ్యదేవర కాళేశ్వరరావు :** స్వాతంత్ర్య సమరంలో అన్ని ఘట్టాలలో అగ్రశ్రేణిలోనిలిచి పోరాడిన అతిరధ మహారధులలో కాళేశ్వరరావు గారొకరు న్యాయవాద వృత్తికి స్వస్తిచెప్పి కాంగ్రెస్ ఉద్యమాలలో కారాగార శిక్షలు అనుభవించారు. కృష్ణాజిల్లాలో అప్పుడు వరకు ప్రభుత్వాధికారంలోవున్న జస్టిస్ పార్టీ నాయకులను ఓడించి కాంగ్రెస్ పరం చేయడానికి తీవ్రంగా కృషిచేశారు. బెజవాడ మునిసిపాలిటీకి చైర్మన్‌గా పనిచేశారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ముఖ్యమంత్రికి పార్లమెంటరీ సెక్రటరీ అయినారు. 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత, శాసనసభకు కాళేశ్వరరావు, శాసన మండలికి మాడపాటి హనుమంతరావు సభాపతులై శాసనసభారంగ కార్యక్రమాలకు ఎనలేని గౌరవంతెచ్చారు.

మొదటినుండి ఆంధ్రోద్యమంలో కూడాప్రముఖ పాత్రవహించిన కాళేశ్వరరావు 'విశాలాంధ్ర మహాసభ' నేర్పరచి, విశాలాంధ్రావతరణకు తీవ్రంగా కృషిచేశారు. నిజాం ప్రజలు సాగించిన స్వాతంత్ర్య పోరాటానికి ఆయన కొండంత అండగా నిలిచారు. 'తెలుగు అకాడమీని' నెలకొల్పి అనేక చారిత్రక, శాస్త్ర గ్రంధాలు వెలువరించారు. స్వయంగా చారిత్రక గ్రంధాలు రచించిన గ్రంధకర్త.

**మానికొండ సత్యనారాయణశాస్త్రి :** వీరిది కృష్ణాజిల్లా ఎరటూరుగ్రామం. అన్ని స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొని 7 ఏండ్లు బ్రిటిష్ ప్రభుత్వ జైళ్ళలో గడిపిన స్వాతంత్ర్య సమర యోధుడు. న్యాయశాస్త్ర పట్టభద్రుడు. బ్రిటిష్ మహాయుగం, రైతు-రాజు, లోకమాన్య తిలక్ జీవితం, యార్పుకృష్ణా జాతీయోద్యమం, మానికొండ రామాయణం మొదలగు 50గ్రంధాలు రచించిన సుప్రసిద్ధ గ్రంధకర్త. రాష్ట్రరెవిన్యూ మంత్రిగా వుండిన ప్రకాశం గారికి వ్యక్తిగత సహాయకుడిగావుండి, జమీందారీ రైతు విచారణ సంఘనివేదిక తయారీకి తోడ్పడినవ్యక్తి. 'గ్రామస్వరాజ్య' పత్రికకుఎడిటర్. ప్రకాశం ఫర్కా అభివృద్ధి పథక అధికారి మానికొండ వారు కర్మయోగి.

**గొట్టిపాటి బ్రహ్మయ్య :** సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమర యోధుడైన గొట్టిపాటి బ్రహ్మయ్య, కృష్ణాజిల్లా ఘంటసాలలో 1898 డిసెంబర్ 3వతేదీన జన్మించారు. జాతీయ స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, ఐదేండ్ల జైలు శిక్షలనుభవించారు. 1937 లోనంద్యాలలో జరిగిన 16వ ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభకు అధ్యక్షత వహించారు. 1937 నుండి 1940 వరకు డాక్టర్ పట్టాభి అధ్యక్షుడుగా, బ్రహ్మయ్యప్రధాన కార్యదర్శిగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్యకలాపాలు సమర్థతతో నిర్వహించారు. 1968 నుండి 1974 వరకు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు సభాధ్యక్షులైనారు. పి సి సి. అధ్యక్షపదవి నలంకరించారు. నిస్వార్థ కాంగ్రెస్‌నాయకునిగా, రైతుపెద్దగా ప్రజాభిమానాన్ని చూరగొన్న బ్రహ్మయ్య గౌరవార్థం, బందరులోని పట్టాభి భవనం పైన బ్రహ్మయ్య హాలు నిర్మించబడింది. వీరికి కేంద్ర ప్రభుత్వం 'పద్మభూషణ్' ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదులిచ్చి సన్మానించినవి.

**ఎర్నేని సుబ్రహ్మణ్యం :** 1921 అసహయోద్యమ తరుణంలో వీరు చదువుకు స్వస్తిచెప్పి గాంధీగారి సబర్మతీ ఆశ్రమంలో చేరారు. బార్డోలి స్వరాజ్యాశ్రమంలో వుండి సేవజేశారు. 1930 దండి సత్యాగ్రహంలో పాల్గొన్న 79 మంది గాంధీజీ అనుచరులలో ఈ సాధు సుబ్రహ్మణ్యం గారొకరు.

జైలు శిక్షలనుభవించి వచ్చిన తర్వాత, గుడివాడ తాలూకా కొమరవోలులో 'గాంధీ ఆశ్రమం' నెలకొల్పారు 1935లో బాబూ రాజేంద్రప్రసాద్ ఈ ఆశ్రమానికి ప్రారంభోత్సవంగావించారు.

సుబ్రహ్మణ్యంగారు, భార్య సీతావతమ్మ, అన్న సూర్యనారాయణ, ఆయన సతీమణి, 80 ఏండ్లు పండు ముదుసలితల్లి పున్నమ్మ, పలువురు బంధువులు ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, కుటుంబంతో సహా జైలు యాత్రలు చేశారు. 1940 ఉద్యమంలో పాల్గొని జైలు శిక్షలనుభవించారు స్వరాజ్య సమరంలో ఈ ఆశ్రమం చరిత్రను సృష్టించింది. సర్వోదయ నాయకుడుగా, భూదానోద్యమ కార్యకర్తగా నిర్మాణ కార్యక్రమాలను సాగించారు. గాంధీగారు వ్రాసిన 'అనాసక్తి యోగం' గ్రంధాన్ని వీరు అనువదించారు. 'సాధుసుబ్రహ్మణ్యం' గారని పేరొందారు.

**వెలిదెండ్ల హనుమంతరావు (ఎల్.ఎం.ఎస్) :** హనుమంతరావు గారిది విజయవాడ. ఉప్పుసత్యాగ్రహం సమయంలో, వీరు ద్వితీయ సత్యాగ్రహ దళానికి నాయకుడుగా వున్నారు. విజయవాడలో అరెస్టుచేసి, ఒకటిన్నర సంవత్సరాలు శిక్షవిధించి రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపించారు. వీరు జైలులో రాజకీయ ఖైదీలకు నాయకుడుగా ఎన్నుకోబడినారు.

సమంజసమైన, న్యాయమైన హక్కులకోసం నిరాహారదీక్ష బూనిన రాజకీయ ఖైదీలపైన జైలులో అమానుషంగా లాఠీఛార్జీ జరిగింది. తోటివారితోపాటు హనుమంతరావు తీవ్ర లాఠీదెబ్బలకు గురియైనారు. రాజమండ్రి నుంచి రాయవెల్లూరు జైలుకు తరలించారు. శిక్షాకాలం పూర్తిఅయిన తర్వాత, విదేశ వస్త్రాలను బహిష్కరించమని దుకాణాల వద్ద పికెటింగు చేశారు. తీవ్రమైన లాఠీదెబ్బలవల్ల వీరు 1934 అక్టోబర్ 21వ తేదీన స్వర్గస్థులైనారు. పట్టణ ప్రజలు వీరి గౌరవార్థం విజయవాడలో వెలిదెండ్ల హనుమంతరాయ గ్రంధాలయాన్ని, హాలును నెలకొల్పారు.

**పనప్పాకం ఆనందాచార్యులు:** ఆనందాచార్యులు 1843లో చిత్తూరు జిల్లా కట్టమంచిలో జన్మించారు. వీరితండ్రి కోర్టు సిరస్తాదారుగా ఉద్యోగం చేశారు. న్యాయశాస్త్ర పట్టభద్రుడై వీరు 1869లో మద్రాస్ హైకోర్టులో న్యాయవాదిగా వుండి మంచి పేరుప్రఖ్యాతులు సంపాదించారు. 1889లో మద్రాసు న్యాయవాదుల సంఘాన్ని వీరు ప్రధమంగా ఏర్పాటుచేశారు.

1885లో బొంబాయిలో జరిగిన మొదటి జాతీయ కాంగ్రెస్ మహాసభలో పాల్గొన్న 72 మంది ప్రముఖులలో ఆనందాచార్యులు ఒకరు. సప్తమ కాంగ్రెస్ మహాసభ నాగపూర్‌లో వీరి అధ్యక్షతనే జరిగింది. సైనికదళాలలో భారతీయులకు ఎక్కువ ప్రవేశం కల్పించాలని వీరు కోరారు.

వీరు సంఘసంస్కర్త. ఆరోజులలోనే వితంతువివాహాలను ప్రోత్సహించారు. పత్రికలకు అనేకవ్యాసాలు వ్రాశారు. తెలుగులో 'వైజయంతి' అను పత్రికను నడిపారు. ఆంగ్లంతోపాటు సంస్కృతంలో కూడా వీరు పండితులు. సప్తద్వీపమండలి పండితపరిషత్తు వీరికి 'విద్యావినోదిని' అను బిరుదును బహూకరించింది.

1895 నుంచి 8 సంవత్సరాలు ఆనందాచార్యులు, కలకత్తా ఇంపీరియల్ కౌన్సిల్ మెంబర్. 1908 నవంబర్ 28వ తేదీన పరమపదించారు.

**కడప కోటి రెడ్డి :** మదనపల్లి తాలూకా కోటిరెడ్డిగారిపల్లిలో వీరు 1886 సంవత్సరంలో జన్మించారు. వీరిది సామాన్య మధ్యతరగతి రైతుకుటుంబం. మదరాసు క్రిష్టియన్ కళాశాలలో చదివిన తర్వాత, బ్రిటన్ వెళ్లి ఆక్స్‌ఫర్డులో 1914లో న్యాయ

శాస్త్రంలో బి సి ఎల్ డిగ్రీని, లండన్ యూనివర్సిటీ నుండి ఎల్.ఎల్.బి. డిగ్రీని సంపాదించుకున్నారు స్వదేశానికి తిరిగివచ్చి, మదరాసు హైకోర్టులో ప్రాక్టీస్ ప్రారంభించారు. న్యాయవాద వృత్తినిమానివేసి, ప్రజాహిత కార్యక్రమాలలో నిమగ్నులైనారు.

మూడు దశాబ్దాలు కడప జిల్లా కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షునిగా, రాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షునిగా, కాంగ్రెస్‌లో బాధ్యతాయుత పదవులు నిర్వహించారు. రాయలసీమలో విస్తృతంగా కాంగ్రెస్ సందేశాన్ని వ్యాప్తి గావించారు. వ్యష్టి సత్యాగ్రహంలో జైలుకెళ్లారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో, ప్రభుత్వం వీరిని అమరావతి జైలులో డెటెన్యూగా నిర్బంధించింది.

1923లో కోటిరెడ్డి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికై, ఆంధ్ర, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఏర్పడినప్పుడు కౌన్సిల్ సభ్యునిగా పరిపాలనా బాధ్యతలు నిర్వహించారు వీరు స్వరాజ్యా పార్టీ శాసన సభా పక్ష ఉపనాయకుడు. 1965-66లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ శాసన సభా పక్ష ఉపనాయకుడు ప్రకాశం మంత్రివర్గ హయాములో వీరు ఎక్సైజ్, దేవాదాయశాఖ మంత్రి 1953లో ప్రథమ ఆంధ్ర రాష్ట్ర మంత్రి మండలిలో కాబినెట్ మంత్రి. మదరాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయాల సెనేట్, సిండికేట్ సభ్యుడు 1929లో రాయలసీమ మహాసభకు, 1937లో ఆంధ్ర మహాసభ, రజతోత్సవాలకు అధ్యక్షత వహించారు 'శ్రీ బాగ్ ఒడంబడిక' లో భాగస్వామి. వీరి సతీమణి కడప రామ సుబ్బమ్మ కడప జిల్లా బోర్డు అధ్యక్షురాలుగా, భర్తకు తోడునీడగా వుండేవారు. రాయలసీమ క్షామనివారణ సంఘానికి కోటిరెడ్డి గారు అధ్యక్షుడుగావుండి, క్షామ పీడిత ప్రజలకు పలు విధాల సేవచేశారు.

**మాడభూషి అనంతశయనంగార్:** వీరు చిత్తూర్లో ప్రముఖ న్యాయవాదిగా వుండేవారు. కొన్నాళ్లు పురపాలకసంఘ అధ్యక్షునిగా వున్నారు. వీరు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, జైలుశిక్షల ననుభవించిన స్వాతంత్ర్యయోధుడు. పార్లమెంటుకు కాంగ్రెస్ సభ్యునిగా ఎన్నికై, స్పీకర్ పదవినలంకరించారు. బీహారు గవర్నరుగా పని చేశారు. ఆంధ్రమహాసభకు అధ్యక్షతవహించారు. ఆంగ్ల సంస్కృతభాషల్లో పరిజ్ఞానంగల పండితుడు రాయలసీమ సమస్యలను క్షుణ్ణంగా అవగాహనచేసుకొని, వాటిపరిష్కారానికి పాటుపడిన కాంగ్రెస్ నాయకుడు.

**కల్లూరు సుబ్బారావు :** వీరిది కల్లూరు గ్రామం. 1897 మే 25వ తేదీన జన్మించారు. బెంగుళూరు మిషన్‌బడిలో హైస్కూలు విద్య నభ్యసించారు. అచ్చటి శేషాద్రి స్మారక గ్రంథాలయంలో పత్రికా, గ్రంథపఠనలద్వారా, స్వయం కృషితో విజ్ఞానం సంపాదించారు.

1920 నుండి కాంగ్రెస్ నాయకత్వాన జరిగిన సహాయ నిరాకరణ, సత్యాగ్రహ ఉద్యమాలన్నిటిలోను పాల్గొని, ఏడున్నర సంవత్సరాలు బ్రిటిష్ ప్రభుత్వ జైళ్లలో

కారాగార శిక్షలనుభవించిన స్వరాజ్య సమరయోధుడు. బళ్లారి, కడలూరు, తిరుచునాపల్లి, అమ్రోతి మొదలగు జైళ్లలో మ్రగ్గిన కాంగ్రెస్‌వాది. రాయలసీమలో స్వాతంత్ర్యోద్యమ ప్రారంభ దశలో బీజాలు నాటి, అర్థ శతాబ్దం పైగా దేశారాధనకు తన జీవితాన్ని అంకితం చేసిన మహనీయుడు

ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో కాంగ్రెసు శాసన సభ్యుడు. ఆంధ్ర రాష్ట్రావతరణానంతరం, ఉప సభాపతిగా, సంజీవయ్య ముఖ్యమంత్రిత్వహయాములో కాంగ్రెస్ శాసన సభాపక్ష చీఫ్‌విప్‌గా, ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనెట్ సభ్యుడుగా పదవి బాధ్యతలు నిర్వహించారు. రాజ్యాంగ నిర్మాణ సంఘ సభ్యుడు. 1923లో 'లోకమాన్య' పత్రికను స్థాపించారు. అనంతపురంలో కేశవ విద్యాలయాన్ని, హిందూపురంలో సేవా మందిరాన్ని నెలకొల్పారు. లేపాక్షి దేవాలయ పునరుద్ధరణకు కృషిచేశారు. తరచు కరువు కాటకాలకు గురి అవుతున్న రాయలసీమ అభివృద్ధికి, ప్రాజెక్టుల నిర్మాణానికి అహర్నిశలు పని చేశారు. కవి పండితులను ఆహ్వానించి, సముచితరీతి వారిని సత్కరించారు. తెలుగు, కన్నడ, ఆంగ్లభాషల్లో మంచివక్త. ఆయనిది అనర్గళ వాగ్ధోరణి. భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదునిచ్చి గౌరవించింది. 1973లో స్వర్గస్థుడైనారు.

**పప్పూరి రామాచార్యులు :** వీరు అనంతపురంలో 1896లో జన్మించారు. 1926లో 'సాధన' వారపత్రికను స్థాపించి, సంపాదకత్వం వహించారు.

ఉప్పు సత్యాగ్రహ తరుణంలో జైలు శిక్షలకు గురి అయిన స్వరాజ్యయోధుడు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో, డెటెన్యూగా నిర్బంధింపబడ్డారు.

1947లో అనంతపురం మునిసిపాలిటీకి అధ్యక్షునిగా ఎన్నికైనారు. రాష్ట్ర శాసనమండలి సభ్యుడు. సహకార సంస్థల అభివృద్ధికి కృషిచేసిన సహకారవేత్త. రాయలసీమ సర్కార్ ఆంధ్రుల మధ్య జరిగిన 'శ్రీబాగ్' ఒడంబడికకు ప్రముఖ భాగస్వామి. 1972లో స్వర్గస్తుడైనారు

**నీలం సంజీవరెడ్డి :** వీరిది ఇల్లూరు గ్రామం. 1913లో జన్మించారు. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని జైలు శిక్షననుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో డెటెన్యూగా నిర్బంధింపబడిన స్వాతంత్ర్య సమరయోధుడు.

1946లో మదరాసు శాసన సభ్యునిగా ఎన్నికైనారు. కాంగ్రెస్ శాసన సభా పక్ష కార్యదర్శి. మదరాసు ప్రభుత్వంలో మంత్రిగా, ఆంధ్ర రాష్ట్రంలో ఉప ముఖ్యమంత్రిగా 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత రెండు పర్యాయాలు ముఖ్యమంత్రిగా రాష్ట్ర పరిపాలన బాధ్యతలు నిర్వహించారు. కేంద్ర మంత్రిగా వున్నారు. 1967లో లోక్‌సభ స్పీకర్ పదవినలంకరించారు. దేశ రాష్ట్రపతిగాను, అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులుగాను అత్యున్నత పదవులు అధిష్ఠించిన ఆంధ్రనాయకుడు సంజీవ రెడ్డి.

**నివర్తి వెంకట సుబ్బయ్య :** వీరు పత్తికొండలో 1910 సంవత్సరంలో జన్మించారు. వీరు పట్టభద్రులు ప్రభుత్వోద్యోగానికి రాజీనామాచేసి, వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని, 8 మాసాలు జైలుశిక్షననుభవించారు 'క్విట్ ఇండియా' ఉద్యమ కాలంలో అజ్ఞాతంగావుండి రహస్య ఉద్యమాన్ని నడిపించారు. గాంధీగారి సేవాగ్రామం వెళ్ళి, వారి సలహాతో తర్వాత పోలీసులకు పట్టుబడ్డారు.

మదరాసు అసెంబ్లీలో సభ్యుడు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత, శాసన మండలి సభ్యుడు, కర్నూలు జిల్లా కాంగ్రెస్ కమిటీకి ప్రధాన కార్యదర్శిగా పని చేశారు. 'మనసీమ' వారపత్రికకు సంపాదకత్వం వహించారు. 1974లో ఆంధ్ర ప్రదేశ్ శాసన మండలికి అధ్యక్ష స్థానం అలంకరించారు. 1978లో వీరు స్వర్గస్తు డైనారు.

**కందుల ఓబులరెడ్డి :** వీరు 1911 జూన్ 7వ తేదీన లింగాపురంలో జన్మిం చారు చదువుకు స్వస్తిచెప్పి, కాంగ్రెస్ శాసనోల్లంఘనోద్యమాలలో పాల్గొన్నారు. వ్యక్తి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమాలలో తీవ్రంగా పనిచేశారు. రైతులు పన్నులు చెల్లించవద్దని ప్రబోధించారనే నేరంపైన ప్రభుత్వం వీరికి ఏడాది జైలు శిక్ష విధించింది. తర్వాత డిటెన్యూగా తంజావూరు జైలులో నిర్బంధించింది.

కర్నూలు జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షునిగా, 1946 నుండి 1951 వరకు ఆంధ్ర కాంగ్రెస్ కమిటీకి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు.

1955లో వీరు ఆంధ్ర శాసన సభ సభ్యుడు. 1956లో, 1978లో, 1980లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమంత్రిగా వివిధ శాఖలను నిర్వహించారు.

**పి. పార్థసారథి :** వీరిది కడప జిల్లా కోడూరు గ్రామం 1916లో జన్మిం చారు. విద్యకు స్వస్తిచెప్పి, వ్యక్తి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో జైలు శిక్షలకు, లాఠీచార్జీలకు గురి అయిన స్వాతంత్ర్య సమరయోధుడు.

వీరు కడప జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు. ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ్యునిగా, లోక్‌సభకు సభ్యునిగా ఎన్నికైన ప్రజా ప్రతినిధి. కేంద్ర ప్రభుత్వ డిప్యూటీమంత్రి పదవినలంకరించారు. వీరు 'గీతాంజలి'ని, 'కుమార సంభవం',ను అనువదించారు.

**పి. తిమ్మారెడ్డి :** వీరిది చిత్తూరు జిల్లా చీనేపల్లిగ్రామం. 1914లో జన్మిం చారు. మదనపల్లి థియసాఫికల్ కళాశాలలో పట్టభద్రుడు. రంగాగారి రామానీడు విద్యాలయంలో రాజకీయాలు నేర్చి, తిమ్మారెడ్డి రైతు రక్షణ యాత్రలలో ముందంజ వేశారు. క్విట్ ఇండియా ఉద్యమంలో డిటెన్యూగా నిర్బంధింపబడినారు. ఆంధ్ర రాష్ట్రీ

కాంగ్రెస్ సంఘానికి ఉపాధ్యక్షుడైనారు. 1964లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షునిగా పనిచేశారు

ప్రకాశం, సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గాలలో 1971 వరకు మంత్రిగా వుంటూ రెవిన్యూ, ఆహార, వ్యవసాయ శాఖను నిర్వహించారు. ఆంధ్ర స్వాతంత్ర్య సమరయోధుల సంఘానికి అధ్యక్షుడు.

**ఆర్.కె.రామ్ :** వీరిది చాగలమర్రి గ్రామం. 1922లో జన్మించారు. వార్ధా సేవాగ్రామ్‌లో, శాంతి నికేతన్‌లో విద్యనభ్యసించారు వ్యక్తి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలు శిక్షలననుభవించారు.

వీరు సంస్కరణ వివాహం చేసుకున్న సంఘ సంస్కర్త. గాంధీగారి నౌఖాలి శాంతి యాత్రలో పాల్గొన్న గాంధేయవాది. కర్నూలుజిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా పని చేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యునిగా, రాష్ట్ర సర్వోదయ సంఘ అధ్యక్షునిగా, జిల్లాబోర్డు సభ్యునిగా బహుముఖంగా నిర్మాణ కార్యక్రమాలలో పాలు పంచుకున్న సుప్రసిద్ధ కార్యకర్త. సర్వోదయ కార్యక్రమాలలో, భూదానోద్యమంలో, వీరికి సన్నిహిత సంబంధంగలదు.

**బులుసు సాంబమూర్తి:** సాంబమూర్తి తూర్పు గోదావరి జిల్లా 'దుళ్ళ' గ్రామంలో 1886లో జన్మించారు 1911లో కాకినాడలో క్రిమినల్ లాయర్‌గా మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించారు 1920లో గాంధీగారి సహాయనిరాకరణోద్యమ ప్రభావంతో న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి, దేశసేవకు అంకితమైనారు. సిల్కుసూట్లు తగులబెట్టితానుఅంగవస్త్రం ధరించి 'మహర్షి' యను పేరు తెచ్చుకున్నారు.

1923లో కాకినాడలో అ. భా. కాంగ్రెస్ మహాసభ ఆహ్వాన సంఘకార్యదర్శి. అప్పట్లో కుమారుడు మృతిచెందినా, ఆ దుఃఖాన్ని దిగమింగి మహాసభను జయప్రదం గావించి దేశనాయకుల ప్రశంసలందుకున్న స్థితప్రజ్ఞుడు సాంబమూర్తి. ఆంధ్రాకాంగ్రెస్ సంఘానికి కార్యదర్శి.

1937లో మద్రాసు రాష్ట్రశాసనసభ స్పీకర్‌గా ఎన్నికై, కడుసమర్థతతో, నిష్పాక్షికంగా శాసనసభాకార్యక్రమాలు నిర్వహించిన సభాపతి. ఆయన అతిత్యాగమూర్తి గొప్పధైర్యశాలి. అఖండదేశాభిమాని, సంపూర్ణ స్వాతంత్ర్యవాది.

**మద్దూరి అన్నపూర్ణయ్య:** వీరు తూర్పుగోదావరి జిల్లాలో 1898లో జన్మించారు. విద్యార్థిదశనుంచి జాతీయ భావాలు గల్గినవారు. సత్యాగ్రహోద్యమాలలో పాల్గొని 12 ఏండ్ల జైలుశిక్షలనుభవించిన మహాత్యాగశీలి. రాజమండ్రి, రాయవెల్లూరు, దామో, అమరావతి మొదలగు జైళ్లలో దీర్ఘకాలం గడపిన స్వాతంత్ర్య సమరయోధుడు. సంపూర్ణస్వాతంత్ర్యవాది. సోషలిస్టు, కమ్యూనిస్టు ఫార్వర్డు బ్లాక్ పార్టీలలో పాలుపంచుకున్న అతివాద జాతీయవాది.

సీతానగరం సత్యాగ్రహ ఆశ్రమవాసి 'కాంగ్రెస్' పత్రికకు సంపాదకుడు. అల్లూరి సీతారామరాజు వీరగాథను, విప్లవవీరుల చరిత్రలను ఆంధ్రప్రజలకు మొదటగా అందించిన ప్రాతికేయుడు 'నవశక్తి' పత్రికకు ప్రధాన సంపాదకుడు. సుభాస్‌బోస్ అనుచరుడు. కడుపేదగా, 1953లో పరమపదించిన పవిత్రమూర్తి అన్నపూర్ణయ్య వీరసతీమణి కూడా జైలు జీవితం గడిపిన వీరపత్ని. జైలులో వుండగా ఆయనకు సతీమణి వియోగం జరిగింది

**క్రొవ్విడి లింగరాజు:** వీరిది రాజమండ్రి. జైలులో ప్రకాశం తమ ఆత్మకథను చెప్పగా, వ్రాసిన సుప్రసిద్ధరచయిత గౌతమి సత్యాగ్రహ ఆశ్రమంలోచేరి, మద్దూరి అన్నపూర్ణయ్యతో కలసి 'కాంగ్రెస్' పత్రికకు, తదనంతరం స్వయంగా 'వేదిక' కు ప్రకాశం నిర్వహించిన 'ప్రజాపత్రి'కకు సంపాదకత్వం వహించిన ప్రముఖ పాత్రికేయుడు. స్వరాజ్య ఉద్యమాలన్నిటా పాల్గొని జైలుశిక్షలనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు. మాగ్జింగోర్కీ రచించిన 'మదర్' నవలను 'అమ్మ'గా ఆంధ్రీకరించిన, సోవియట్ బహుమతి గ్రహీత. ఆంధ్రలో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ నిర్మాతలలో లింగరాజుగారొకరు. రాజమండ్రి మునిసిపల్ ఛైర్మన్‌గా, రాష్ట్ర శాసనసభ్యునిగా, దేశ సేవ జేసిన వ్యక్తి.

**డాక్టర్ ఎ.వి నాగేశ్వరరావు:** వీరిది రాజమండ్రి. స్వాతంత్రసమరాల్లోపాల్గొని కృష్ణజన్మస్థానం అలంకరించిన స్వరాజ్యయోధుడు. రాజమండ్రి పురపాలక సంఘానికి అధ్యక్షుడు. ప్రకాశం మంత్రివర్గంలో కొన్నాళ్లు పురపాలక శాఖామాత్యుడు వైద్యవృత్తి ద్వారా, నిరంతరం ప్రజలకు సేవజేస్తూ, ఆ ప్రాంత ప్రజాభిమానాన్ని అమితంగా చూరగొన్న ప్రజాబంధువు నాగేశ్వరరావు.

**దువ్వూరి సుబ్బమ్మ :** వీరిది ద్రాక్షారామం, 1880లో జన్మించారు. 1922 అసహాయోద్యమసమయంలో, సంవత్సరం కఠిన శిక్షకు గురిఅయిన త్యాగశీలి. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, జైలు శిక్షలనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో పెద్దాపురం వద్ద తీవ్రలాఠీఛార్జీకి గురి అయినారు.

1923 కాకినాడ కాంగ్రెస్ మహాసభ సందర్భంలో, దువ్వూరి సుబ్బమ్మగారికి 'దేశబాంధవి' అనుబిరుదునిచ్చి గౌరవించారు. చాలా సంవత్సరాలు ఎ. ఐ. సి. సి సభ్యురాలు ఈమె గొప్పవక్త. కాంగ్రెస్ ప్రచారసభలలో వీరి పాటలు, ప్రసంగాలు జనాన్ని మంత్ర ముగ్ధులను గావించేవి. 1964 మే 31వ తేదీన వీరు స్వర్గస్థులైనారు.

**గుమ్మడిదల దుర్గాబాయి :** తూర్పు గోదావరి జిల్లాకు చెందిన దుర్గాబాయిగారు, బాల్యంలోనే జాతీయోద్యమంలో ప్రవేశించారు. గాంధీమహాత్ముని హిందీ ప్రసంగాలను తెలుగులోకి అనువదించి, ప్రశంస లందుకున్నారు.

మదరాసు నగరంలో, ఉప్పు సత్యాగ్రహం సందర్భంలో జైలు శిక్షలకు గురి యైన వీరనారి. 30 ఏండ్లు పైబడిన తర్వాత తదేక దీక్షతో బెనారస్ యూనివర్సిటీలో ఉన్నత విద్య నభ్యసించి న్యాయశాస్త్రంలో పట్టాపొంది, హైకోర్టులో ప్రాక్టీస్ పెట్టిన విదుషీమణి.

వీరు పార్లమెంటుకు ఎన్నికైనారు. రాజ్యాంగ నిర్మాణసభ సభ్యురాలు, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు అధ్యక్షురాలుగా, మహిళాభ్యుదయానికి, శిశు సంక్షేమానికి దేశంలో ఎనలేని కృషి చేశారు కేంద్ర ప్రణాళికా కమిషన్ సభ్యురాలుగా ప్రధాని నెహ్రూ ప్రశంసలు పొందారు.

మదరాసు, హైదరాబాదు, ఢిల్లీ నగరాల్లో వీరు నిర్మించిన ఆంధ్ర మహిళా సంస్థలు, వీరి నిర్విరామకృషికి, నిర్మాణ శక్తికి తార్కాణాలు వేలాది అనాథస్త్రీలకు విద్యగరిపి, వారికి ఉపాధి కల్పించడానికి ఈ ఆంధ్ర మహిళాసంస్థలు నేడు ఎంతగానో తోడ్పడుతున్నాయి. దుర్గాబాయి కేంద్ర ప్రభుత్వ ఆర్థికశాఖామాత్యులైన డాక్టర్ చింతామణి దేశముఖ్‌ను వివాహమాడారు ఆంధ్రులు, భారతీయులు గర్వించదగిన ఆంధ్ర మహిళామణి దుర్గాబాయి.

**ప్రతివాది వెంకట భయంకరాచారి:** వీరిది సామర్లకోట, 1930 ఉప్పు సత్యాగ్రహంలోపాల్గొని, రెండేళ్ల జైలుశిక్ష ననుభవించారు. 1933కాకినాడ బాంబుకేసులో భయంకరాచారికి 14 ఏండ్లు జైలుశిక్ష విధించి, ప్రభుత్వం అండమానుకు పంపింది. జైలులో 41 రోజులు నిరాహారదీక్ష తర్వాత, 1936లో ఈయన విడుదలైనారు. దేశ రక్షణ నిబంధనల క్రింద, 1940లో అరెస్టు అయినారు. మూడేండ్లు అజ్ఞాతవాసం గడిపిన సాహసవంతుడు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో యువకులను, విద్యార్థులను ఉత్సాహపరిచి రంగంలోకి దూకించిన విప్లవకారుడు భయంకరాచారి అండమాను జైలు జీవితం మున్నగు గ్రంథాలు రచించారు.

**రామచంద్రుని వెంకటప్ప :** సహాయ నిరాకరణోద్యమకాలంలో చదువు మాని వేసి, వీరు ఉద్యమంలోకి దూకారు. డా॥ బ్రహ్మజ్యోస్యుల సుబ్రహ్మణ్యంతో కలిసి సీతానగరం వద్ద 1925లో 'గౌతమీ ఆశ్రమ' స్థాపనకు పూనుకున్నారు. ఉప్పు సత్యాగ్రహంలో, ఆగస్టు ఉద్యమంలో పాల్గొన్నారు. మొత్తం 5 ఏండ్ల 6 మాసాలు కారాగార శిక్షననుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు, రామచంద్రుని వెంకటప్ప.

**నడింపల్లి సుబ్బరాజు :** వీరిది కోరుకూరు పాడుగ్రామం. 1888 ఫిబ్రవరి 1వ తేదీన జన్మించారు. మునసబుగిరికి రాజీనామాచేసి, స్వరాజ్య ఉద్యమానికి ఎంతో అండగా వున్నారు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో, కాంగ్రెస్ వలంటీర్లకు ఆతిథ్యం యిచ్చిన నేరానికి జైలుశిక్ష అనుభవించారు.

అమలాపురం తాలూకా బోర్డు అధ్యక్షునిగా, జిల్లాబోర్డు అధ్యక్షునిగా ఆ ప్రాంత అభివృద్ధికి సేవచేశారు. 1940 డిసెంబరు 7వ తేదీన స్వర్గస్తులైనారు.

**కళా వెంకటరావు :** వీరిది ముక్కామల గ్రామం. 1900 జూలై 7వ తేదీన జన్మించారు. బి.ఏ. చదువుతూ, విద్యార్థిగా అసహాయోద్యమంలోకి దూకి జైలుశిక్షకు గురిఅయినారు.

కాంగ్రెస్ అధ్వర్యాన జరిగిన అన్ని స్వాతంత్ర్య పోరాటాల్లో పాల్గొని, పలు మార్లు వివిధ జైళ్ళలో జైలు శిక్షలనుభవించిన స్వరాజ్య సమరయోధుడు. ఆంధ్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా, ఉపాధ్యక్షునిగా రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాలను దీర్ఘ కాలం తమ చేతిమీదుగా నడిపించారు. అఖిల భారతకాంగ్రెస్ సంస్థకు కార్యదర్శి అయి నారు. మంత్రిగా మదరాసు రాష్ట్ర రెవిన్యూ, ప్రజారోగ్య శాఖలను నిర్వహించిన వెంకటరావు, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత, ఆర్థిక మంత్రిత్వశాఖను చేపట్టారు. 1959 మార్చి 28 వతేదీన దివంగతులైనారు.

**ముళ్ళపూడి పళ్ళంరాజు :** వీరిది బాలాంత్రం గ్రామం. 1899 ఏప్రిల్ 26వ తేదీన జన్మించారు గ్రామ మునసబుగిరికి రాజీనామాచేసి, కాంగ్రెస్ కార్యక్రమాల్లో పాల్గొన్నారు 1931లో జిల్లా బోర్డు భవనంపైన కాంగ్రెస్ జెండాను ప్రతిష్ఠించినందుకు జైలుశిక్షకు గురిఅయినారు. వ్యక్తి సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళారు. క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో రెండేళ్ళకుపైగా అమ్రాతి జైలులో డెటిన్యూగా నిర్బంధింపబడినారు.

జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా రాష్ట్ర కాంగ్రెస్‌కమిటీ అధ్యక్షునిగా సేవచేశారు. సంజీవరెడ్డి, సంజీవయ్య మంత్రిత్వ కాలాల్లో పళ్ళంరాజు అటవీ, మత్స్య పరిశ్రమల శాఖలను నిర్వహించారు 1962లో కీర్తిశేషులైనారు.

**డాక్టర్ చెలికాని వెంకటరామారావు.** వీరిది తిమ్మాపురం గ్రామం.1901 జూలై 15వ తేదీన జన్మించారు. అసహాయోద్యమంలో ఉప్పుసత్యాగ్రహంలో జైలుశిక్ష లనుభ వించారు. 1935లో జిల్లా హరిజన సేవసంఘానికి కార్యదర్శిగావుండి, హరిజనాభివృద్ధికి పాటుపడ్డారు స్వాతంత్ర్యానంతరం లోక్ సభకు ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధి.

**వెన్నెలకంటి రాఘవయ్య :** వీరిది నెల్లూరు 1897లో జన్మించారు. నెల్లూరులో ప్రముఖ న్యాయవాది. 1920 సహాయనిరాకరణోద్యమం నాటి నుంచి అన్ని సత్యాగ్రహ, శాసనోల్లంఘన ఉద్యమాలలో పాల్గొని పలుసార్లు కారాగార శిక్షలననుభ వించిన త్యాగశీలి క్విట్ ఇండియా ఉద్యమకాలంలో రెండున్నర సంవత్సరాలు వీరు డెటిన్యూగా నిర్బంధింపబడినారు.

ప్రకాశంగారి మంత్రి వర్గంలో రాఘవయ్య పార్లమెంటరీ కార్యదర్శి. క్రిమినల్ ట్రైబుల్, ముఖ్యంగా యానాదుల అభివృద్ధికోసం, నిర్విరామంగా కృషిచేసిన ప్రజా

నాయకుడు. నేరస్థజాతులను భూస్వాముల వెట్టిచాకిరీనుండి విముక్తులను చేసి వీరు ఏజెన్సీ ప్రాంతగిరిజనుల స్థితిగతులను వివరిస్తూ బృహద్గ్రంథాన్ని రచించారు. 1973లో 'పద్మభూషణ్' బిరుదుతో భారతప్రభుత్వం వీరినిసత్కరించింది.

**ఓరుగంటి వెంకటసుబ్బయ్య:** వీరిది కావలి. 1882 లో జన్మించారు. న్యాయవాద వృత్తిని మానివేసి 1922 లో సహాయనిరాకరణోద్యమంలో ఒకఏడాది శిక్షకు గురిఅయినారు 1930 32 ఉప్పుసత్యాగ్రహాలలో, 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో 1942 క్విట్ఇండియా ఉద్యమంలో జైలు శిక్షను అనుభవించారు. వీరికుటుంబ సభ్యులు, సమీరణి కుమారుడు స్వరాజ్యసమరంలో దాక్షిణ్యాగశీలురను ప్రశస్తిపొందారు. 1976లో వెంకటసుబ్బయ్య దివంగతులైనారు.

**ముత్తరాజుగోపాలరావు:** వీరిది నెల్లూరు. 1922 సహాయనిరాకరణోద్యమంలో పాల్గొని ఒక సంవత్సరం కఠినశిక్ష ననుభవించారు 1930 ఉప్పుసత్యాగ్రహంలో 11 మాసాలు జైలుశిక్షకు గురిఅయినారు. 1940లో వ్యక్తి సత్యాగ్రహం చేసి నాల్గుమాసాలు శిక్షననుభవించారు 1942 క్విట్ఇండియా ఉద్యమంలో 2 ఏండ్లు డెటన్యూగా నిర్బంధితుడైనారు నెల్లూరు టౌన్ కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులుగా నుండి గోపాలరావు దేశానికి ఎనలేని సేవచేసిన స్వాతంత్ర్యయోధుడు.

**పొణకా కనకమ్మ.** వీరిది నెల్లూరు. 1896 జన్మించారు కాంగ్రెస్ నడిపిన సత్యాగ్రహాల్లో పాల్గొన్నారు 1930లో 6 మాసాలు 1932 లో 18 మాసాలు జైలు శిక్షననుభవించిన త్యాగశీలి. కాకినాడ కాంగ్రెస్ మహాసభసందర్భంలో జరిగిన, మహిళా సభకు కనకమ్మగారు అధ్యక్షత వహించారు.

నెల్లూరుజిల్లాకాంగ్రెస్ సంఘానికిఅధ్యక్షురాలుగా ఆంధ్రకాంగ్రెస్ సంఘానికి ఉపాధ్యక్షురాలుగా, ఎ ఐ.సి.సి సభ్యురాలిగా కాంగ్రెస్ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించారు. వీరుకవయిత్రికూడా. మహిళల అభ్యున్నతికి, సంఘ సంస్కరణకోసం దీక్షతోకృషి చేశారు.

**బొమ్మాశేషురెడ్డి** వీరిదినెల్లూరుజిల్లా గండవరంగ్రామం చదువుకున్వ స్తిచెప్పి, స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. ఉప్పుసత్యాగ్రహం క్విట్ ఇండియా ఉద్యమాల సందర్భంగా జైలుశిక్షననుభవించారు. నెల్లూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా, రాష్ట్ర కాంగ్రెస్ కార్యనిర్వాహక సభ్యునిగా కాంగ్రెస్ కార్యక్రమాలను దీక్షతో నిర్వహించారు.

**బెజవాడ గోపాలరెడ్డి:** వీరిది నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డి పాలెం గ్రామం. బందరు జాతీయకళాశాలలో, కలకత్తాలోని రవీంద్రుని శాంతినికేతనంలో చదివి విద్యాసముపార్జనతో పాటు, జాతీయ భావాలనుకూడా పెంపొందించుకున్నారు. విద్యార్థిదశనుండే, స్వాతంత్ర్యోద్యమంలో పాలుపంచుకున్నారు. కాంగ్రెస్ నిర్వహించిన సత్యాగ్రహాలలో పాల్గొని, పలుమార్లు జైలుశిక్షలకు గురిఅయినారు. ఆంధ్రకాంగ్రెస్ కార్యవర్గసభ్యులుగా వుండి, విస్తృతంగా కాంగ్రెస్ ప్రచారం గావించారు.

వీరు, మద్రాసు, ఆంధ్ర, ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులుగా ఎన్నికై, రాజాజీ మంత్రివర్గంలో స్థానిక స్వపరిపాలనా శాఖ మంత్రిగాను, ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగాను, కేంద్ర మంత్రిగాను పరిపాలనా పదవీబాధ్యతలు నిర్వహించారు. యు.పి. గవర్నర్‌గా వున్నారు.

గోపాలరెడ్డిగారు సాహిత్య ప్రియులు. స్వయంగా రవీంద్రకవి గ్రంధాలను, గేయాలను అనేకం ఆంధ్రీకరించారు. ఆంధ్రసాహిత్య అకాడమీకి అధ్యక్షులుగా, ఆంధ్రభాషాభివృద్ధికి గొప్ప కృషిచేశారు. గౌరవ డాక్టరేట్ బిరుదులు పొందారు. రాజకీయ వ్యవహారాలతో పాటు, వీరు సంగీత సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలలో అహర్నిశలు నిమగ్నమవుతున్నారు.

**తెన్నేటి విశ్వనాధం:** వీరిది విశాఖపట్నం. ఎం.ఎ. బిఎల్ పాసై, న్యాయవాదిగా ప్రాక్టీస్‌చేశారు. గాంధీజీ ప్రబోధంతో న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలుశిక్షలనుభవించారు. విశాఖజిల్లా కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షులు వైజాగ్ మునిసిపల్ ఛైర్మన్‌గా కొన్నాళ్ళు సేవచేశారు. రాష్ట్రశాసనసభకు, పార్లమెంటుకు ఎన్నికైన ప్రజాప్రతినిధి. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వంలో రెవిన్యూ మంత్రి ప్రకాశం పార్లమెంటరీ సెక్రటరీగా, 1953లో ప్రథమ ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంలో ఆర్థికమంత్రిగా, పరిపాలనా బాధ్యతలు నిర్వహించారు. ఆంధ్ర ప్రజాపార్టీనాయకులు. ఆంధ్రప్రదేశ్ శాసనసభలో ప్రతిపక్షనాయకులు. విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణం, రైతులపై పన్నుల హెచ్చింపు సమస్యపైన, నదీజలాల విభజన విషయంలోను తీవ్ర కాంపెయినులు నడిపిన ప్రజానాయకులు.

విశ్వనాధం గొప్ప వక్త, కవి మంచిరచయిత, ప్రశిద్ధ పార్లమెంటేరియన్, అన్నిటికీ మించి సౌజన్యమూర్తి. వేదశాస్త్ర పురాణాలు చదివిన సాహితీవేత్త. ఆధ్యాత్మిక చింతనాపరుడు. ఆంధ్రరాజకీయాల్లో నీతి నిజాయితీపరుడుగా పేరొందిన విశిష్ట వ్యక్తి విశ్వనాధం.

**తల్లాప్రగడ ప్రకాశరాయుడు:** వీరు 1893 ఏప్రిల్ 15న ఉంగుటూరులో జన్మించారు. పశ్చిమగోదావరిజిల్లా బాగల్లుగ్రామంలో ఆనందనికేతన్ స్థాపించారు. 1920 గాంధీయుగారంభంనుండీ పలుమార్లు జైళ్ళయాత్రచేసిన శుద్ధ గాంధేయవాది. స్వాతంత్ర్య సమరయోధుడు. ప్రకాశం ఫిర్కా అభివృద్ధి పథక అధికారి. గోపన్నపాలెం 'స్వరాజ్య

పీఠం' లో అధ్యాపకుడు. భగవద్గీతపై సవ్యాఖ్యానం రచించిన పుణ్యపురుషుడు 'ధర్మ జ్యోతి' పత్రికకు సంపాదకుడు. బహుగ్రంథకర్త. 96 సంవత్సరాల వయస్సుగల, వృద్ధ గాంధీవాది.

**ఆచంట రుక్మిణమ్మ :** వీరు మదరాసులో కళాశాల విద్యనభ్యసించారు. 1920లో బి.ఏ. ప్యాసైనారు. 1930, 1940 స్వాతంత్ర్యోద్యమాలలో చురుకుగా పాల్గొని, కారాగార శిక్షలనుభవించిన త్యాగశీలి కొన్నాళ్ళు తమిళనాడు ప్రాంతీయ కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షురాలుగా వున్నారు. ఉమ్మడి మదరాసురాష్ట్ర శాసనసభలో డిప్యూటీ స్పీకర్‌గా పనిచేశారు 1946 ప్రకాశం మంత్రివర్గంలో వీరు ఆరోగ్యశాఖ మంత్రిగా పదవీబాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించారు. ప్రముఖవైద్యుడైన డాక్టర్ ఆచంట లక్ష్మీపతిని వీరు వివాహమాడారు రుక్మిణమ్మగారు 1951లో స్వర్గస్థులైనారు.

**ఆత్మకూరి గోవిందాచారి :** వీరిది తాడేపల్లిగూడెం తాలూకా గోపవరం అగ్రహారం గ్రామం. 1920 నుండి అన్ని స్వరాజ్య ఉద్యమాలలో పాల్గొని, పలుమార్లు జైలుశిక్షలనుభవించారు. 1923లో 'సత్యాగ్రహి' వారపత్రికను నిర్వహించారు. 1930 ఉద్యమ సందర్భంలో ప్రభుత్వం సత్యాగ్రహిని నిషేధించి, ప్రెస్‌పై దాడిచేసి, వశపరచుకొంది. తెలుగులో 'అర్థశాస్త్రం' అను బృహద్గ్రంథాన్ని వీరు రచించారు. దేవీ ఉపాసకుడు, గోవింద రామాయణం వ్రాశారు. పశ్చిమగోదావరిలో జాతీయోద్యమ ప్రారంభం నుండి పనిచేసిన దేశసేవకుడు, కవి పండితుడు.

**రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ :** వీరు 1920 నుంచి కొవ్వూరు తాలూకా కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు. 1923 నాగపూర్ జెండాసత్యాగ్రహంలో పాల్గొని, జైలు శిక్షలకు గురిఅయినారు 1931లో రీసెటిల్మెంట్ వ్యతిరేకాందోళన సందర్భంలో జైలుకెళ్లారు

గిరిజనోద్ధరణకు గ్రామిక ధర్మసాధన సంఘాన్ని కొవ్వూరులో 'వీరసంస్మరణ మందిరాన్ని' స్థాపించారు. 200 మంది స్వాతంత్ర్యయోధుల చరిత్రలను సేకరించి 'వీరసంస్మరణకు సుమాంజలి'గా ప్రచురించారు. జమీన్ రైతు సమస్య, రాజ్యాంగ వివేకదీపిక, 1935 రాజ్యాంగ స్వరూపం, గ్రామికధర్మ రాజ్యం మున్నగు గ్రంధాలు రచించారు.

**పాలకోడేటి సూర్యప్రకాశరావు :** వీరిది రాజమండ్రి. 13 ఏండ్ల బాలుడుగా స్వాతంత్రోద్యమంలో దూకిన యోధాగ్రేసరుడు. 1923 నాగపూర్ జెండా సత్యాగ్రహంలో పాల్గొన్న ధీరుడు. 1930-32, 1940-42 స్వరాజ్య ఉద్యమాలలో, మొత్తం ఖదేండ్ల కాలంపైగా జెలుశిక్షలననుభవించిన త్యాగశీలి.

**వి.వి.గిరి ;** వీరిది బరంపురం. 1894 ఆగస్టు 10 వతేదీన జన్మించారు వీరి తండ్రి జోగయ్యగారు 1921 లో పబ్లిక్ ప్రాసిక్యూటర్ పదవికి రాజీనామా ఇచ్చి ఉప్పుసత్యాగ్రహంలో జైలుశిక్ష అనుభవించారు.

తండ్రికి తగిన కుమారునిగా, గిరిగారు, డబ్లిన్ విశ్వవిద్యాలయంలో బారిస్టర్ అయి, స్వదేశానికి తిరిగివచ్చి, గాంధీగారు ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమంలో దూకారు కాంగ్రెస్ ఉద్యమాలలో పాల్గొని పలుమార్లు కారాగార క్లేశమనుభవించిన స్వరాజ్య యోధుడు గిరిగారు కుటుంబీకులు 13 మంది స్వరాజ్యోద్యమాలలో జైలు శిక్షలను భవించారు. వీరు 1926లో, 1942లో అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు అధ్యక్షతవహించిన గొప్ప కార్మికనాయకుడు రైల్వేకార్మికుల శ్రేయస్సుకు ఆయన గావించిన సేవ నిరుపమానమైనది.

1937 రాజాజీమంత్రి వర్గంలో, 1946 ప్రకాశంమంత్రి వర్గంలో, గిరిగారు కార్మిక శాఖలను నిర్వహించారు. లోక్‌సభకు ఎన్నికై కేంద్రకార్మిక మంత్రి అయినారు. 1967 లో ఉపరాష్ట్రపతిగా, తర్వాత భారతరాష్ట్రపతిగా అత్యున్నతపదవులు అధిష్టించారు. ప్రభుత్వం వీరికి 'భారతరత్న' బిరుదునిచ్చి గౌరవించింది. 1980 జూన్ 24 వ తేదీన వీరుస్వర్గస్థులైనారు.

**పుల్లెల శ్యామసుందరరావు ;** వీరిది ఇచ్ఛాపురం. 1903 డిసెంబరు 27 వ తేదీన జన్మించారు. వీరుయూనివర్సిటి చదువుకు స్వస్థిచెప్పి 1922లో సహాయనిరాకరణోద్యమంలోకిదూకి జైలుకువెళ్ళారు. నౌపడా ఉప్పుసత్యాగ్రహానికి నాయకత్వం వహించి, జైలుశిక్షలను భవించారు. జిల్లాకాంగ్రెస్ అధ్యక్షునిగా, కార్యదర్శిగా ఆప్రాంతంలో ప్రశంసనీయమైన ప్రజా సేవజేశారు.

బర్మా ఆంధ్రమహాసభకు కార్యదర్శిగావుండి, ప్రజావాణి పత్రికను నిర్వహించారు. కిసాన్ సభకు అధ్యక్షులు ద్వితీయ యుద్ధకాలంలో గృహనిర్బంధంలో వుంటూ, 1940 జూన్ 16 వ తేదీన శ్యాంబాబు స్వర్గస్థుడైనారు.

**ప్రభాకర్‌జీ ;** వీరిది అనంతపురం జిల్లా. వీరి పేరు జోసెఫ్. కాని ప్రభాకర్‌జీగానే ప్రశస్తిపొందారు బందరు నేషనల్‌కాలేజీలో విద్యనభ్యసించి, గాంధీఉద్యమ ప్రభావంతో వార్ధా సేవాగ్రామ్ వెళ్ళారు. గాంధీగారి అడుగుజాడల్లో ఒకదశాబ్దంపైగా అక్కడ సేవా గ్రామ్‌కార్యదర్శిగా గడిపిన నిర్మాణకార్యకర్త. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో నిర్బంధింపబడి, జైలు శిక్షననుభవించారు.

రాష్ట్రసర్వోదయసంఘ అధ్యక్షునిగా, భూదాన బోర్డు చైర్మన్‌గా సర్వోదయ అనుబంధ సంస్థ లన్నిటికీ మార్గనిర్దేశకుడుగా ప్రభాకర్‌జీ గణనీయమైన సేవజేశారు. తుఫానుబాధితుల సహాయకార్యక్రమాలలో అహర్నిశలు కృషిచేసి, ఎండదెబ్బకుగురియై పరమపదించిన పవిత్రమూర్తి ప్రభాకర్‌జీ.

**గుళ్ళపల్లి ఆదినారాయణ :** వీరిది ఒంగోలు తాలూకా ఆ ప్రాంతంలో సాగి విజయరామరాజు ప్రభృతులతో కలిసి, స్వాతంత్ర్యోద్యమాన్ని వ్యాప్తిగావించిన స్వరాజ్య సమరయోధుడు తామ్రపత్ర గ్రహీత సహకారోద్యమంలో విశేషంగా కృషి చేసిన సహకారవేత్త. ఒంగోలులో ప్రకాశం కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠింపజేసిన ముఖ్య కార్యకర్త. దేవరంపాడు సత్యాగ్రహ శిబిరభవన పునరుద్ధరణకు పాటుపడుతున్న వ్యక్తి వీరి షష్టిపూర్తి సందర్భాన్ని పురస్కరించుకొని, ఆంధ్ర స్వరాజ్య చరిత్రను, ముఖ్యంగా ఒంగోలుతాలూకా స్వాతంత్ర్యోద్యమ ఘట్టాలను సవివరంగా ప్రచురించిన దేశ సేవకుడు.

**ముదిగంటి జగ్గన్నశాస్త్రి :** వీరిది తణుకు. 1921 సహాయ నిరాకరణోద్యమం నాటినుండి 1942 క్విట్ ఇండియా ఉద్యమం వరకు కాంగ్రెస్ అధ్వర్యాన నడిచిన అన్ని ఉద్యమాలలో పాల్గొని, మొత్తం నాలుగేండ్ల ఏడు మాసాలు జెలుశిక్షలననుభ వించిన సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధుడు.

వీరు 'పల్లెటూరు' గ్రంథమండలిని స్థాపించారు. గాంధీ నీతిమంజరి, ఝాన్సీ లక్ష్మీబాయి, వీరసావర్కార్, మొదలగు గ్రంథాలు రచించారు. నెహ్రూ ఆత్మకథను అనువదించారు. వీరిపై ప్రభుత్వం రాజద్రోహ నేరంమోపింది. ఆ గ్రంథాలను బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. 1937లో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత, ఆ నిషేధం తొలగించబడింది.

**పుసులూరి కోదండరామయ్య .** సుప్రసిద్ధ గాంధేయవాది. 1938-1946 మధ్య పోలవరంలో 'స్వరాజ్య ఆశ్రమం' స్థాపించి, గిరిజనాభ్యుదయానికి కృషిచేశారు. కొండప్రాంతాలన్నీ పర్యటించి, వారిలో జాగృతి కలిగిస్తూ, గిరిజనుల సంక్షేమానికి పాటుపడిన కాంగ్రెస్ సేవకుడు. గొప్పనిర్మాణ కార్యకర్త.

**వీరమాచనేని వెంకటనారాయణ .** వీరిది పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు. 17 ఏండ్ల చిన్నవయసులోనే 1930 ఉప్పుసత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. వ్యష్టి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో పనిచేసి, మొత్తం రెండున్నర సంవత్సరాలు జైలుశిక్షలకు గురిఅయిన త్యాగశీలి. ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో ప్రణాళిక, స్టేట్ ఆర్కైవ్స్‌శాఖలు నిర్వహించారు జిల్లాలో సహకార సంస్థలు, విద్యాసంస్థల అభివృద్ధికి కృషిచేశారు. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షునిగా పనిచేశారు.

**విజయ కుమారసిన్హా .** వీరు కాన్పూరులో 1909లో జన్మించారు. భగత్‌సింగ్ సహచరుడు ఉత్తర భారతంలో విప్లవోద్యమంలో తీవ్రంగా పాల్గొన్నారు. లాహోరు కుట్రకేసు ముద్దాయి. 1930లో వీరిని ప్రభుత్వం అరెస్టుచేసి, ద్వీపాంతర వాసశిక్ష విధించింది. అండమాను జైలులో రాజకీయ ఖైదీల హక్కులకోసం నిరాహారదీక్ష బూనిన తదుపరి, 1928లో ఆంధ్రదేశంలోని రాజమండ్రి, విశాఖ జైళ్ళలో నిర్బంధిం

పబడినారు. వ్యక్తి సత్యాగ్రహంలో ; క్విట్ ఇండియా ఉద్యమ సందర్భాలలో జైలు శిక్షలకు గురిఅయినారు భారత విప్లవోద్యమాన్ని గురించి, సోవియట్ రష్యాలో నూతన మానవుని గూర్చి గ్రంథాలు, వ్యాసాలు రచించారు దేశభక్తుడైన అన్నే అంజయ్యగారి కుమార్తె శ్రీరాజ్యంను వివాహమాడి, హైదరాబాదులో స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు.

**ఎ. ఆదినారాయణరెడ్డి :** వీరిని కడప జిల్లా రాయపరం 1916లో జన్మించారు వ్యక్తి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో జైలు శిక్షలనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు 1940 నుండి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా సేవచేశారు. 'ఆజాద్‌హింద్' వారపత్రికకు సంపాదకత్వం వహించారు స్వాతంత్ర్యానంతరం, రాష్ట్రశాసన సభ్యునిగాను, రాజ్యసభసభ్యునిగాను జిల్లాలో కాంగ్రెస్ ఉద్యమాభివృద్ధికి కృషిచేశారు.

**భాసాసుబ్బారావు :** వీరిది నెల్లూరుజిల్లా 1896లో జన్మించారు. వివిధజాతీయ ఆంధ్ర ఆంగ్ల పత్రికలకు సంపాదకత్వం వహించిన ప్రశిద్ధ పాత్రికేయుడు 1930-32 సంవత్సరాలో ఉప్పుసత్యాగ్రహం, శాసనోల్లంఘ నోద్యమాలతో తీవ్రలాఠీచార్జీలకు, జైలుశిక్షలకు గురియైన స్వరాజ్యయోధుడు. 'స్వరాజ్య పత్రికసంపాదకుడు. క్విట్ ఇండియా ఉద్యమతరుణంలోడెటిన్యూగా నిర్బంధితుడు. 1961లో స్వర్గస్తుడైనారు.

**చుండి జగన్నాథం :** వీరిది నెల్లూరుజిల్లా. 1914లో జన్మించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని జైలుశిక్షకు గురిఅయిన దేశభక్తుడు. మదరాసు కుట్రకేసు ముద్దాయి. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో నిర్బంధితుడు. కాంగ్రెస్, సోషలిస్టు ఉద్యమాలలో చురుకుగా పాల్గొన్న జగన్నాథం, సర్వోదయ కార్యక్రమాల వైపు ఆకర్షింపబడినారు. కొన్నాళ్లు ఖాదీ కమిషన్‌లో నిర్మాత్మక కృషిగావించారు. వివిధ పత్రికలకు అనేక సమస్యలపైన వ్యాసాలు వ్రాశారు.

**శరణు రామస్వామిచౌదరి :** వీరిది అమృతలూరు గ్రామం. 1900లో జన్మించారు. అసహాయోద్యమం కాలంనుండి దేశసేవలోనిమగ్నమైన స్వాతంత్ర్య సమరయోధుడు. కాంగ్రెస్ ఉద్యమాలన్నిటిలో పాల్గొని పలుమార్లు జైలుశిక్షలనుభవించిన త్యాగశీలి జిల్లా కాంగ్రెస్, రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి, ఏ.ఐ సి సి. సభ్యుడు కొన్నాళ్లు రాష్ట్ర శాసనసభకు ఎన్నికైన ప్రజాప్రతినిధి. గుంటూరు జిల్లా గ్రంథాలయ సంస్థకు అధ్యక్షుడు, హరిజన సేవా సంఘానికి కార్యదర్శి, జిల్లాబోర్డు సభ్యుడు.

## తెలంగాణా స్వాతంత్ర్యోద్యమ నాయకులు :

హైదరాబాదు సంస్థానంలో స్టేట్ కాంగ్రెస్ ఉద్యమానికి ప్రధానంగా నాయకత్వం వహించి నడిపిన స్వామీ రామానందతీర్థ, తెలంగాణా ప్రాంతంలోని ఉద్యమ కార్యకర్తల గుణగణాలు—వారి సేవా సమర్థతలను గురించి, తమ "అనుభవాలు-జ్ఞాపకాలు" గ్రంథంలో ఇలా పేర్కొన్నారు :

**'సర్దార్' జమలాపురం కేశవరావు :** తెలంగాణా ప్రాంతంలో యువకులు నాయకత్వం చేపట్టి ఉద్యమంలోకి వచ్చారు. ప్రజలందరు 'సర్దార్' అనే పేరుతో గౌరవించే జమలాపురం కేశవరావు అట్లాంటి నాయకుడు. వరంగల్లు, ఖమ్మం జిల్లాల్లోను, ఇతర తెలంగాణా జిల్లాల్లోను వున్న యువకులెందరో ఆయనచుట్టూ చేరారు ..

సర్దార్ కేశవరావు తెలంగాణా ప్రజలకు యదార్థమైన ప్రతినిధి. ఆయన డాబు దర్పాలు లేనివాడు; సూటిగా మాయా మర్మం లేకుండా మాట్లాడేరకం. ఆయన తన మాటలతో ప్రజల మనస్సులను లోబరచుకొనే శక్తిగలవాడు. ఆయనతో కలిసి పని చేయడం ఎంతో సంతోషంగా వుండేది. రాజకీయ సంప్రదాయ ధోరణులు, సిద్ధాంతాలను గురించిన విజ్ఞానంలో ఆయనకు పాండిత్యం లేకపోయినా, తెలంగాణాలో శ్రమ శక్తి దోపిడీకి గురియైన పేదప్రజల విముక్తికోసం ఆయన పోరాటం నడిపాడు. చివరి వరకూ స్వాతంత్ర్యోద్యమంలో ఆయన అగ్రగామిగానే వున్నాడు. భూస్వాములు, పెట్టుబడిదారీ వర్గాలవారు కలిసి ఆయన్ని ఎదిరించారనడంలో ఆశ్చర్యంలేదు. ఆయన చుట్టూ అనేకమంది యువకులను కూడగట్టుకొని 1947లో ఉద్యమానికి నాయకత్వం వహించి, దాన్ని సమర్థవంతంగా నడిపాడు.

**బొమ్మకంటి సత్యనారాయణరావు:** బొమ్మకంటి సత్యనారాయణరావు తెలంగాణాలో ఉద్యమంగురించి, ప్రజల సమస్యలగురించి లోతైన విజ్ఞానం కలవాడు. స్వాతంత్ర్య పోరాటాన్ని నడిపించడంలో ప్రముఖమైన పాత్రవహించారు.

**ఎస్. కె. రావు:** ఈ మిత్రులందరికంటే రాజకీయాల్లో ఎక్కువకాలం అనుభవం కలవాడు. తెలంగాణా కార్యకర్తలందరిలో ప్రగతి వాదులకు కూడలి. అందరికీ సలహాలిచ్చే సచివుడు.

**వి. బి. రాజు:** తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన మండల కార్యాలయం బెజవాడలో వుండాలని నిశ్చయించాము. బెజవాడ ఆఫీస్ బాధ్యత వి. బి. రాజుకు అప్పగించాము. ఆయన ఉద్యమానికి మంచి ప్రచారంచేసి, ప్రభావితమొనర్చి ముందుకు నడిచాడు. సామాజిక ఆర్థిక సమస్యల గురించిన ఆయన దృక్పథం ప్రగతిశీలం కలది. ఆయనకు ఈ విషయాలను గురించి మంచి పరిజ్ఞానం వుంది. ఎంతగొప్ప తుపాను ఎదురైనా ఆయన మెలకువతో మెలిగి ప్రవాహపువాలులో ముందుకు పోగలడు. వెల్లోడి మంత్రివర్గంలో ప్రజలకు ప్రాతినిధ్యం కలిగించినప్పుడు, ఈయన మంత్రిపదవి వహించాడు.

**మాడపాటి రామచంద్రరావు :** స్టేట్ కాంగ్రెస్ ఒకరూపం ధరించగానే, ఈ సంస్థకు కార్యదర్శిగా పనిచేయగల సమర్థులు ఎవరాఅనేది నాకు ముఖ్యమైన సమస్య అయింది. నా దృష్టి మాడపాటి రామచంద్రరావుపై పడింది. ఆయనకు పరిస్థితులను గురించి మంచి అవగాహనవుంది. మంచిద్రష్ట. నా కోరికను వెంటనే ఆయన అంగీకరించి, తన సేవలు అర్పించినత్యాగి. ఆయన నాకు అత్యంత సన్నిహితుడు. ఆయన సూచనలు, సలహాలు ఎంతోవిలువైనవి.

**కొమరగిరి నారాయణరావు :** కొమరగిరి నారాయణరావు చాలాకాలంపాటు కాంగ్రెస్‌లో అనుభవం గల కార్యకర్త. స్వాతంత్ర్య పోరాటంలో ప్రవేశించి ఎన్నో అసౌకర్యాలను, కష్టాలను ఎదుర్కొన్నవాడు. కోదాటి, కాళోజీ కొమరగిరి ఈ ముగ్గురిని 'నారాయణత్రయం' అని తెలంగాణా ప్రజా చరిత్రకారులు ఆప్యాయంగా పేర్కొంటారు.

**ఎం.ఎస్. రాజలింగం :** ముదిగొండ సిద్ధవీర రాజలింగం ఇచ్చటి ఉద్యమంలో చైతన్యవంతమైనపాత్ర నిర్వహించారు. ఆయన సూటిగా మనస్సులోకిచొచ్చుకొనిపోయే శక్తివంతమైన భాషలో జనరంజకంగా మాట్లాడగల మంచివక్త; దృఢమనస్కుడు. ముందుకు చొరవగా పోగలిగినవాడు. అతి సామాన్యమైన కుటుంబంలో పుట్టి, స్వయం శక్తితో ప్రాధాన్యం వహించిన స్థానాలు అలంకరించినవాడు.

**టి. హయగ్రీవాచారి :** టి. హయగ్రీవాచారి కార్యశూరుడు. పరిపాలనానుభవమూ, సంస్థలు నిర్మించి అభివృద్ధి,చేయడంలో అనుభవమూ కలవాడు స్వాతంత్ర్య పోరాటంలో ప్రవేశించినందువల్ల కలిగే చికాకులు, నష్టాలు, కష్టాలు అన్నీ అనుభవించిన వాడు.

**పాగా పుల్లారెడ్డి :** పి. పుల్లారెడ్డి మధురంగా మాట్లాడే స్వభావంగల యువకుడు. లా డిగ్రీ పొందినవాడు. గద్వాల వాస్తవ్యుడు. భూస్వాముల దౌర్జన్యాలను ఎదిరించి పట్టుదలతో ధర్మయుద్ధం సాగించి విజయం సాధించినవాడు. పేదరైతుల ఆశలు, ఆశయాలు తనలో మూర్తీ భవించుకొన్న యువకుడు.

**కాంచనపల్లి వెంకటరామారావు :** కాంచనపల్లి వెంకటరామారావు బాగాచదువుకున్నవాడు. సామాజిక ఆర్థిక సమస్యలపట్ల మంచి అవగాహనకల ప్రగతిశీలి. ఏ సమస్యనైనా విశ్లేషణాత్మకంగా పరిశీలనచేయగల నేర్పరి. కమ్యూనిస్టుల ప్రాబల్యం గల నల్గొండ జిల్లాలో ప్రజాస్వామిక విధానాన్ని అనుసరించే బలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించినవాడు. ఆయన ఏ ప్రమాదం ఎదురైనా లెక్కచేయకుండా, ప్రజలతోనే వున్నాడు.

**రావి నారాయణరెడ్డి** తెలంగాణాలో కార్యదక్షత వున్నవర్గం రావి నారాయణ రెడ్డి నాయకత్వంలో ఆంధ్రమహాసభలో లీనమైంది. ఆయనే స్వాతంత్ర్య పోరాటం లోకి దూకిన మొదటి యోధుడు కావడం దానికి కొంతకారణం కావచ్చు. ఆయన తెలంగాణా గ్రామీణ ప్రాంతంలో బలమైన ఆంధ్రమహాసభను నిర్మించారు తర్వాత ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరడంతో, ఆయన బలగంలో ఎక్కువమంది అటుచేరి పోయినారు.

**కోదాటి నారాయణరావు :** కోదాటి నారాయణరావు రాష్ట్రంలోని అనుభవజ్ఞు లైన కాంగ్రెస్‌వారిలో ఒకరు. ఆయన గ్రంథాలయోద్యమ అభివృద్ధికోసం కృషిచేశారు అందులోగడించిన ఉద్యమ నిర్వాహణానుభవంతో స్వాతంత్ర్యోద్యమంలో దూకారు. భవిష్యత్ సమాజాన్ని ఏరీతిగా మలుచుకోవాలో అనేవిషయాన్ని గురించి స్పష్టమైన దృశ్యచిత్రమును ఆయన మనోనేత్రంతో దర్శించిన ద్రష్ట, అందువల్ల తెలంగాణా యువకులకు నాయకుడు కాదగినవాడు.

**కాళోజీ నారాయణరావు :** కాళోజీ నారాయణరావు తెలంగాణా ప్రాంతంలో నాకు మొదటి సహచరుడు. నేనుమొదటిసారి వరంగల్లు వెళ్ళినప్పుడు ఎంతో శ్రమతీసు కొని ప్రమాదాన్ని కూడా లెక్కచేయకుండా ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారు. ఆయనలోవున్న కలుపుగోలు స్వభావమే ఆయనకు ప్రమాదాలను లక్ష్యపెట్టని సాహ సాన్నిచ్చింది.

—**స్వామి రామానందతీర్థగారి**
'హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటం
(అనుభవాలు, జ్ఞాపకాలు నుండి)

**మాడపాటి హనుమంతరావు :** వీరు నందిగామ తాలూకా పొక్కునూరులో 1885 జనవరి 22వ తేదీన జన్మించారు. 1917 నుంచి 1940 వరకు న్యాయవాద వృత్తి నవలంబించారు. హనుమంతరావు సౌజన్యుడు, శీలసంపన్నుడు. వీరు నిజా మాంధ్ర మహసభ స్థాపకులు. ఆంధ్రభాషాభివృద్ధికి, ఆంధ్రాభ్యుదయానికి ఎనలేని సేవచేసి, ఆంధ్ర పితామహుడనేయశస్సు నార్జించారు. 1951లో హైదరాబాదు నగర కార్పొరేషన్ మేయర్‌గా, 1958లో ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షులుగా, ఖాధ్య తాయుతపదవులు ప్రశంసనీయంగా నిర్వహించారు కేంద్ర ప్రభుత్వం వీరికి పద్మభూషణ బిరుదునిచ్చి సన్మానించింది. ఉస్మానియా యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది.

హనుమంతరావుగారు నిజామాంధ్రోద్యమ చరిత్రను రచించారు. గారి బాల్డి జీవితం, రోమన్‌సామ్రాజ్యం అనుగ్రంధాలు రచించారు. మల్లికాగుచ్ఛము కథాసంపు టిని వెలువరించారు తమ ఆంధ్రకుటీరంలో 1970 నవంబరు 11వ తేదీన ప్రశాంతంగా పరమపదించిన పుణ్యపురుషుడు మాడపాటి

**బూర్గుల రామకృష్ణారావు.** నిజాం ఆంధ్రోద్యమంలోను, హైదరాబాదు సంస్థాన ప్రజల విముక్తి ఉద్యమంలోనుపాల్గొన్న స్వాతంత్ర్య సమర యోధులలో బూర్గుల రామకృష్ణారావుగారు ఒకరు నిజాంఫ్యూడల్ రాచరిక పాలనకు స్వస్తి చెప్పి, ప్రజాస్వామ్య వ్యవస్థకు పునాదులు వేసిన తొలిప్రజా ముఖ్యమంత్రి. ఆంధ్ర ప్రదేశ్ అవతరణకు ముఖ్య కారకులలో వీరు ప్రధానంగా పేర్కొన దగినవారు. రామకృష్ణారావు మంత్రిత్వ హయాములోనే జాగిర్దారీ విధానంరద్దు, ప్రగతిశీల భూసంస్కరణలు అమలు జరిగాయి. స్టేట్ ప్రజా ముఖ్యమంత్రిగా, కేరళ, యు పి రాష్ట్రాల గవర్నరుగా, రాజ్యసభ సభ్యునిగా ఉన్నతపదవుల నలంకరించి, ఆయన పరి పాలనా దక్షునిగా పేరుగాంచారు. గాంధేయ నిర్మాణ కార్యక్రమాలకు ఆయన అండ గానిలిచారు.

సంస్కృతాంధ్ర, ఆంగ్ల, పారసీ, ఉర్దూ, అరబ్బీ, హిందీ. మరాఠీ మున్నగు భాషలలో పాండిత్యం సంపాదించి, ఆయాభాషల్లో పద్య గద్య రచనలు గావించిన సాహితీవేత్త. మేధావి. రాజనీతిజ్ఞత, కవితా ప్రాగల్భ్యం, ధార్మికదృష్టి, సేవానురక్తి రామకృష్ణారావుగారిలో కేంద్రీకృతమై ప్రశంసలందు కొన్నవి బూర్గులవారు సేక రించి, భద్రపరచిన 'జ్ఞానభాండాగారం', (ప్రైవేట్ లైబ్రరీ) వారికి గల జ్ఞానపిపాసకు తార్కాణంగానిలిచివుంది.

**కొండా వెంకట రంగారెడ్డి;** వీరుస్వయంగా కృషీవలులు, రైతుబాంధవుడు. న్యాయశాస్త్ర కోవిదులైన వెంకట రంగారెడ్డిగారు, సంస్థానంలో జాతీయోద్యమ మూల పురుషులలో ఒకరు. స్వాతంత్ర్యానంతరం, బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గంలో వ్యవసాయశాఖామాత్యులు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతర్వాత, కొన్నాళ్ళు రాష్ట్రఉపముఖ్య మంత్రిగా పాలనాబాధ్యతలు నిర్వహించారు వీరుహైదరాబాదు స్టేట్‌కాంగ్రెస్ వ్యవహా రాలను కొంతకాలం తమచేతిమీదుగా నడిపించారు. స్టేట్‌కాంగ్రెస్ రాజకీయాలలో తెలంగాణాలో ప్రముఖ పాత్రవహించిన నాయకుడు శ్రీ రంగారెడ్డి.

**పండిత నరేంద్రజీ;** వీరుబాల్యంనుండి ఆర్యసమాజంలో, 1931 స్వదేశీ ఉద్య మంలో చురుకుగా పాల్గొన్న మంచిశిక్షణగల కార్యకర్త. సత్యాగ్రహోద్యమంలో తీవ్రంగా పనిచేసిన నరేంద్రజీని, నిజాం ప్రభుత్వం మన్ననూరుజైలు లో 1938 నుండి1941 వరకు నిర్బంధించింది. 1945లో ఒక ఏడాది శిక్షవిధించింది. 1947-48లో స్టేట్ సత్యాగ్రహోద్యమంలో పాల్గొని 14 మాసాలు జైలుశిక్ష ననుభవించారు. మొత్తం 7 ఏండ్ల 2 నెలలు నిజాం ప్రభుత్వజైళ్ళలో మ్రగ్గిన స్వాతంత్ర్యసమర

యోధుడు నరేంద్రజీ. మంచివక్త. సుశిక్షణ గల స్వాతంత్ర్య సేనాని. నిజాంవ్యతిరేక పోరాటంలో అగ్రశ్రేణిలో నిలిచినవీరుడు.

**ఉమ్మెత్తల కేశవరావు :** రాష్ట్రంలో సర్వోదయ నాయకుడు అహింసామూర్తి నల్గొండ జిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు. నిజాం సంస్థాన ప్రజల విముక్తికి, భూసంస్కరణల అమలుకు స్టేట్‌కాంగ్రెస్ ఉద్యమంలో తీవ్రంగా కృషిచేసిన త్యాగధనుడు. తెలంగాణా ప్రాంతంలో వినోబాజీ వెంట పాదయాత్రలో పాల్గొని భూదానోద్యమ వ్యాప్తికి కృషిచేసిన దేశ సేవకుడు. హైదరాబాదులో భూసమస్య, డా॥ రామకృష్ణారావు జీవిత చరిత్ర మున్నగుపుస్తకాలు రచించిన గ్రంథకర్త. స్వరాజ్య సమరయోధుడు.

**దాశరది కృష్ణమాచార్య .** వీరిది వరంగల్‌జిల్లా చిన్నకూడూరు. 1927 లో జన్మించారు. నిజాం వ్యతిరేక పోరాటంలో 1947-48సంవత్సరాలలో జైలు శిక్షననుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు. వివిధ భాషలలో పాండిత్యం గడించిన దాశరధి కవి పుంగవుడు. ప్రజలను మేల్కొల్పులా, అనేక పద్యాలు గేయాలు రచించారు. అగ్నిధార, రుద్రవీణ గేయసంపుటాలను వెలువరించారు. తెలంగాణా రచయితల సంస్థ అధ్యక్షునిగా, సాహిత్యఅకాడమీ సభ్యులుగా దాశరధి చేసిన సాహిత్యసేవ గణనీయమైనది. కొన్నాళ్ళు రాష్ట్ర ప్రభుత్వ ఆస్థాన కవి.

**అక్కిరాజు వాసుదేవరావు:** వీరిది నల్గొండ జిల్లా మేళ్ళచెరువు గ్రామం. క్విట్ ఇండియా ఉద్యమసందర్భంలో జైలుశిక్షననుభవించారు. నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యునిగాను, పి వి. నరసింహారావు ముఖ్యమంత్రిత్వకాలంలో రాష్ట్రసమాచారశాఖ మంత్రిగాను బాధ్యతలు నిర్వహించారు.

**సంగం లక్ష్మిబాయి:** ఘటకేశ్వర్‌లో 1911లో జన్మించారు. గుంటూరు శారదా నికేతన్‌లో చదివిన లక్ష్మిబాయి, సైమన్ కమిషన్ బహిష్కరణ, ఉప్పుసత్యాగ్రహ సందర్భాలలో జైలుశిక్షలనుభవించిన త్యాగశీలి. ఆచార్య వినోబాభావే భూదాన ఉద్యమంలో చురుకుగా పాల్గొని, తెలంగాణమంతటా పర్యటించారు. సేవాసదన్ స్థాపించిన ప్రముఖ నిర్మాణ కార్యకర్త. లోక్‌సభ సభ్యురాలుగా ఎన్నికైన ప్రజా ప్రతినిధి.

**దుగ్గిరాల బలరామకృష్ణయ్య** : వీరిది గుడివాడ తాలూకా అంగలూరుగ్రామం 1905లో జన్మించారు. ఇంగ్లీష్ చదువు మానివేసి, బందరు జాతీయ కళాశాలలో చేరారు. హిందీ సంస్కృతం తెలుగు భాషలలో పాండిత్య సంపాదించారు. జాతీయ భావాలతో 1921లో వేల్సు యువరాజు నిరసన ప్రదర్శనంలో పాల్గొని, అరెస్టుఅయి నారు. ఉప్పు సత్యాగ్రహంలో, జైలుశిక్షలనుభవించారు. క్విట్ఇండియా ఉద్యమ సందర్భంలో డెటిన్యూగా నిర్బంధింపబడిన స్వరాజ్యయోధుడు.

ఆంధ్ర కాంగ్రెస్ సంఘసంయుక్త కార్యదర్శిగా, ఎ. ఐ. సి. సి. సభ్యునిగా కాంగ్రెలో ఉన్నత పదవులు నిర్వహించారు. లోక్‌సభకు ఎన్నికైనారు. 'బౌద్ధవాఙ్మయ బ్రహ్మ' బిరుదును పొందారు. యుద్ధపురాణం, 'మానవజీవితం, మున్నగు గ్రంధాలు రచించిన పండితుడు. వీరిసతీమణి కమలమ్మ కూడా శాసనోల్లంఘనచేసి, సత్యాగ్ర హిగా జైలుశిక్షలనుభవించారు.

**మరం బాలసుబ్రహ్మణ్యగుప్తా** : వీరిది బెజవాడ 1921లో వీరిపైన ప్రభుత్వం రాజద్రోహ నేరంమోపి, ఏణ్ణర్థం జైలులో బంధించింది. నాగపూర్ జెండా సత్యా గ్రహంలో పాల్గొని 6 మాసాలు శిక్షననుభవించారు. 1930-32 ఉప్పుసత్యాగ్రహో ద్యమంలో పాల్గొనిజైలు శిక్షలకు గురియైనారు.

బాలసుబ్రహ్మణ్యంగుప్తా మంచి ఉపన్యాసకుడు. ఆంధ్రలో జరిగిన అనేక కాంగ్రెస్ సభలలో ప్రసంగిస్తూ ప్రజలను ఉత్తేజితులను చేసేవారు. కాంగ్రెస్ ఎన్ని కల ప్రచార సభలలో గుప్తాగారిదే అగ్ర పీఠంగా వుండేది. తీవ్రపదజాలంతో ప్రభుత్వ వైఖరిని విమర్శిస్తూ జనాన్ని బాగా ఆకట్టుకునేవారు.

**కాకాని వెంకటరత్నం** : వీరిది గన్నవరం తాలూకా ఆకునూరుగ్రామం. 1900 సంవత్సరంలో జన్మించారు. 1923 కాకినాడ కాంగ్రెస్ సభలో వలంటీరుగా వున్న కాకాని, 1930-1932 కాంగ్రెస్ ఉద్యమాల్లో పాల్గొని, జైలు శిక్షలనుభవిం చారు. పశ్చిమ కృష్ణా కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగా, జిల్లాలో కాంగ్రెస్ సందేశాన్ని వ్యాప్తి గావించారు. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో వీరిని ప్రభుత్వం డెటిన్యూగా నిర్బంధించింది. జమీన్ రైతు ఉద్యమంలో, జాతీయ కార్మిక సంఘాలలో ప్రముఖ పాత్రవహించారు. నాల్గు పర్యాయాలు శాసనసభకు ఎన్నికైన ప్రజాప్రతినిధి. రాష్ట్ర కాంగ్రెస్‌కు కార్యదర్శిగా పనిచేశారు. బ్రహ్మానందరెడ్డి, పి.వి. నరసింహారావు మంత్రిత్వ కాలాల్లో మంత్రి పదవుల నధిష్టించారు. ఉక్కుకాకానిగా ప్రశిద్ధిచెందారు. 1972 లో పరమపదించారు.

**మాగంటి బాపినీడు :** ఏరివి చాటపర్రు గ్రామం 1895లో జన్మించారు. కాలి ఫోర్నియాలో ఎం.ఎస్‌సి (వ్యవసాయశాస్త్రం) పాసైనారు. స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాత, ఉప్పుసత్యాగ్రహం, శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని, కఠిన జైలు శిక్షల ననుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమం సదర్భంలో అమ్రోతి జైలులో 3ఏండ్లు నిర్బంధించారు. పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు యూని వర్సిటీ సెనేట్, సిండికేట్ సభ్యుడు. హరిజనోద్ధరణ గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాల్లో విశేషంగా కృషిచేశారు 'ఆంధ్ర సర్వస్వం' సంకలనంగావించారు. మదరాసు శాసనసభకు ఎన్నికైన ప్రజాప్రతినిధి, పార్లమెంటరీ కార్యదర్శి, ప్రభుత్వ ఛీఫ్‌విప్.

వీరిసతీమణి మాగంటి అన్నపూర్ణాదేవి. గాంధీజీకి తమ ఒంటిమీది ఆభరణా లన్నీ సమర్పించిన మహాత్యాగశీలి. బాపినీడుగారు 1969 జూలై 23వ తేదీన స్వర్గ స్తులైనారు.

**దంతు నారాయణరాజు ;** వీరిది నేలపోగులుగ్రామం. 1889 అక్టోబరు 15వ తేదీన జన్మించారు న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి, అసహాయోద్యమంలో పాల్గొన్నారు. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా, ఎ ఐ సి.సి. సభ్యునిగా, కాంగ్రెస్ సంస్థకు పశ్చిమగోదావరిలో బలమైన పునాదులు నిర్మించారు. ఉప్పుసత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో జైలు శిక్షలకు గురియైన స్వరాజ్యయోధుడు జిల్లాబోర్డు అధ్యక్షునిగా, మదరాసు రాష్ట్ర శాసనసభ్యునిగా పనిచేసిన ప్రజాసేవకుడు. 'సర్దార్' అని ప్రఖ్యాతి పొందారు. ఈయన డెటిన్యూగా తంజావూరు జైలులో వున్నప్పుడే గుండె జబ్బువచ్చి 1944 సంవత్సరంలో అమరుడైనారు.

**చెరుకువాడ వెంకటనరసింహం :** వీరు ఘంటసాల గ్రామంలో జన్మించారు. జాతీయోద్యమ ప్రభావంతో కొతరంలో 1911 నుంచి 1919 వరకు జాతీయ పాఠశాలలో అధ్యాపకులుగా పనిచేశారు ఫలితంగాఅసహాయోద్యమంలో ఉప్పుసత్యాగ్రహంలో కొతరం పరిసర గ్రామాలు ప్రధాన పాత్ర వహించాయి. స్వరాజ్య సమరంలో నరసింహంగారు తీవ్రంగా పాల్గొని, అనేక పర్యాయాలు జైలుశిక్షలు అనుభవించారు. చెరుకువాడ వారు 'ఉపన్యాస చక్రవర్తి'యని పేరొందారు ఆయన ఆంధ్ర దేశమంతటా పర్యటించారు. అసంఖ్యాక సభలలో ప్రసంగించారు. మంచి వాక్చాతుర్యం, ధారణా శక్తి గలవారు. గొప్ప రచయితగా కూడా ప్రశిద్ధిచెందారు. 'కృష్ణాపత్రిక' దర్బారు ఆయనలేనిదే రక్తి కట్టేదికాదు. రాజకీయాలు, ఆర్థిక విషయాలు, విద్యావిధానాలుఅన్నీ ఆయనకు కరతలామలకం. స్వాతంత్ర్యోద్యమంకాలంలో చెరుకువాడ ఉపన్యాస కేసరిగా ప్రశిద్ధిచెందారు.

**మొసలికంటి తిరుమలరావు :** వీరిది ఆదిలో కిర్లంపూడి 1921లో కాకినాడ కాలేజిలో చదువుతూ, చదువుమానివేసి, కాంగ్రెస్ ఉద్యమంలో చేరారు. తదాది,

కాంగ్రెస్ ఉద్యమాలన్నింటిలో పాల్గొని పలుమార్లు కారాగార శిక్షననుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా, ఖద్దరుభాండారు మేనేజర్‌గా కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమాలలో ప్రముఖ పాత్ర వహించారు. తిరుమలరావు మంచి వక్త, నిర్మాణదక్షుడు, పత్రికా రచయిత, వీరుకృష్ణా గోదావరి జిల్లాల నుంచి కేంద్ర శాసనసభకు ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధి. కేంద్ర డిప్యూటీ మంత్రిగా ఆహారశాఖను నిర్వహించారు. కాకినాడ నియోజకవర్గం నుంచి లోక్‌సభకు ఎన్నికైనారు. ఎస్టిమేట్సు కమిటీకి, ఇరిగేషన్ కమిటీకి చైర్మన్‌గా వుండి ప్రశంసలందుకున్నాడు వింధ్య ప్రదేశ్ గవర్నరుగా కొన్నాళ్ళు పనిచేశారు. ఐక్యరాజ్య సమితికి భారత ప్రతినిధివర్గ సభ్యుడు. 1970లో ఢిల్లీలో స్వర్గస్తుడైనారు.

**కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)** : వీరిది రాజోలు తాలూకా దొడ్డవరం 1909లో జన్మించారు. మదరాసులో ఎం ఎ. చదివారు 1931లో భీమవరంలో అరెస్టుఅయినారు కాంగ్రెస్ శాసనోల్లంఘన సమయంలో, 'రణదుందుభి'ని రహస్యంగా ప్రచురించి జైలుశిక్షకు గురియైనారు, ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో వీరిని తునిలో ప్రభుత్వం ఇంటరన్ చేసింది. తర్వాత అరెస్టుచేసి జైలు శిక్షవిధించింది

వీరి సతీమణి మాణిక్యాంబగారు, ఉప్పుసత్యాగ్రహంలో, శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని జైలు శిక్షలనుభవించిన త్యాగమూర్తి. సత్యనారాయణ ప్రముఖ జర్నలిస్టు. ప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు. ఆంధ్రుల చరిత్రను ఆంగ్లంలో రచించిన గ్రంధకర్త.

**గద్దె రంగయ్యనాయుడు:** వీరిది ముష్టికుంట్ల గ్రామం 1870లో జన్మించారు. రైల్వే ఉద్యోగానికి రాజీనామాయిచ్చి జాతీయోద్యమంలో పాల్గొన్నారు.

మదరాసు ఆంధ్ర జిల్లా కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షుడు, ఉప్పుసత్యాగ్రహంలో క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో జైలుశిక్షలనుభవించిన స్వరాజ్యయోధుడు. చాల కాలం మదరాసు నగర కార్పొరేషన్ సభ్యుడు. 1937లో శాసనసభకు ఎన్నికైన ప్రతిప్రతినిధి. పల్నాడులో జరిగిన ప్రభుత్వ ఘోర దురంతాలను విచారించి, బయటి ప్రపంచానికి చాటి చెప్పిన కాంగ్రెస్ నాయకుడు రంగయ్యనాయుడు. గొప్పవక్త, మదరాసు నగరంలో కాంగ్రెస్ పేరు నిల్పిన ఆంధ్ర నాయకుడు.

**పి. వి నరసింహారావు :** వీరిది మంథెన గ్రామం, ఉస్మానియావిశ్వవిద్యాలయంలో చదువుతూ, స్టేట్‌లో 'వందేమాతరం' ఉద్యమంలో పాల్గొన్నారు. తర్వాత నాగపూర్ వెళ్ళి చదివి న్యాయశాస్త్ర పట్టభద్రుడైనారు. కొన్నాళ్ళు న్యాయవాదిగా ప్రాక్టీస్ చేశారు. స్వామీ రామానందతీర్థ నాయకత్వాన జరిగిన సంస్థాన ప్రజల విమోచనోద్యమంలో పాల్గొని, జైలు శిక్ష ననుభవించారు. తెలుగు, ఆంగ్ల భాషల్లోనేగాక, హిందీ, మరాఠీ భాషల్లో కూడా మంచి పాండిత్యం సంపాదించిన బహుభాషాకోవిదుడు నరసింహారావు.

రాష్ట్ర శాసనసభకు, పార్లమెంటుకు ఎన్నికైన ప్రజా ప్రతినిధి. వీరు రాష్ట్ర మంత్రిగా, ముఖ్య మంత్రిగా, కేంద్ర కాబినెట్ మంత్రిగా, బాధ్యతాయుత పదవులను నిర్వహించిన ప్రతిభాశాలి, మేధావి, ప్రసిద్ధ రచయిత, రాజనీతిజ్ఞుడు.

**డాక్టర్ మర్రి చెన్నారెడ్డి :** శ్రీ చెన్నారెడ్డి విద్యార్థిదశలోనే జాతీయ భావాలు అలవరుచుకున్నారు. విద్యార్థి సంఘాల్లో పనిచేశారు. ఎం. బి. బి. ఎస్ పరీక్ష పాసైనారు. ఆంధ్ర మహాసభలో, స్టేట్ కాంగ్రెస్ ఉద్యమాల్లో పాల్గొన్నారు. స్టేట్ అలీనోద్యమంలో నిజాం ప్రభుత్వ నిర్బంధానికి గురియైనారు. 'హైదరాబాదు' అను వారపత్రికను కొన్నాళ్ళు నిర్వహించారు.

డాక్టర్ చెన్నారెడ్డి ఉర్దూ, తెలుగు, ఆంగ్ల భాషలలో అనర్గళంగా ఉపన్యసించగల వ్యక్తి. రాష్ట్ర మంత్రిగా, ముఖ్య మంత్రిగా రాష్ట్ర పరిపాలనా బాధ్యతలు నిర్వహించారు. ఉత్తరప్రదేశ్ గవర్నర్, కేంద్ర మంత్రి, మున్నగు పదవుల నధిష్టించిన రాజకీయ వేత్త.

**'వందేమాతరం' రామచంద్రరావు :** వీరు చదువుకుంటున్న రోజులలో, వందేమాతరం గీతం ఆలాపిస్తూ, విద్యార్థులకు నాయకత్వం వహించారు. నిజాం ప్రభుత్వం వీరిని అరెస్టుచేసి జైలులో నిర్బంధించింది. జైల్లో కొరడాదెబ్బలు కొడుతుంటే, స్పృహ తప్పి పడిపోయ్యేంతవరకు ఆయన 'వందేమాతరం' అంటూ నినాదాలు చేశారుతప్ప వేరు మాటాడలేదు. ఆయన అపరిమిత ధైర్య సాహసాలుగల దేశభక్తుడు. రాష్ట్ర శాసనసభకు ఎన్నికైన ప్రజా ప్రతినిధి, అధికార భాషా సంఘానికి, ప్రపంచ తెలుగు సంస్థకు కొన్నాళ్ళు అధ్యక్షులుగా పనిచేశారు. ఆర్య ప్రతినిధి సభకు అధినేత.

**పొట్టి శ్రీరాములు :** వీరి పూర్వీకులది నెల్లూరు జిల్లా జువ్వల దిన్నెగ్రామం. శ్రీరాములుగారు మదరాసులో 1901 సంవత్సరంలో జన్మించారు. శానిటరీ ఇంజనీర్ శాఖలో చేస్తున్న ఉద్యోగం మానివేసి, గాంధీగారి సబర్మతి ఆశ్రమం చేరారు. ఉప్పు సత్యాగ్రహంలో, వ్యష్టి సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలు శిక్ష లనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు.

శ్రీరాములుగారు కొన్నాళ్ళు కొమరవోలు ఆశ్రమంలో వుండి సేవ జేశారు. హరిజనోద్ధరణకు కృషి చేసిన సర్వోదయ నాయకుడు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కోసం 1952లో మదరాసులో 58 రోజులు పర్యంతం కఠోర నిరాహారదీక్ష బూని, అసువు లర్పించిన 'అమరజీవి'.

## Bibliography


1 Mana Nayakulu, Turlapati Kutumba Rao, Shri Sundararamanuja Publications, Vijayawada, May 1975, Rs 8.

2 Telangana Vytalikulu, M.L. Narsimha Rao, Kakatiya Vignana Samithi, Hyderabad, August 1976, Rs. 12.

3. Tejomurthulu, Illindala Saraswathi Devi, Sudarsana, Hyderabad, March 1976, Rs. 10.

4. Distinguished Acquantances (English), Prof N G. Ranga, Desi Book Distributors, Vijayawada-2. December 1976, Rs. 30.

5. Swami Ramananda Teertha, M.L. Narasimha Rao, Madapati Vignana Samithi, Hyderabad, 1981, Rs. 15.

6. Bankim, Tilak, Dayanand, Sri Aravindulu (Alias) Gurram Venkata Subrahmanyam, Aravindashramam, Pondichery, Rs. 2-50.

7. Desabhakta Jeevita Charitra, Madala Veerabhadra Rao, Sethajayanti Sangham, 1963, Rs. 10.

8. Sarvothama Jeevitam, Madala Veerabhadra Rao, 1962, Rs. 5.

9. Alluri Sitarama Raju, K Veeraraju (Madhurasri), State Information Department.

**Life Histories**

10. Madapati Hanumantha Rao D. Ramalingam, Centenary Celebrations Committee, Hyderabad, 1985, Rs. 10

11. Boorgula Ramakrishna Rao. Ummettala Kesava Rao, October 1983, Rs. 15.

12. Potti Sreeramulu. Chippada suryanarayana Murthy, Gandhi Sahitya Prachuranalayam, August 1980, Rs. 8.

13. Unnava Laxminarayana, Mandalaparti Upendra Sarma, Gandhi Sahitya Prachuranalayam, August 1974, Rs. 6.

14. Jayaprakash Narayan, M L. Narasimha Rao, Kakatiya Vignana Samithi, October 1977, Rs. 12.

15. Jayaprakash Rajakeeya Jeevitha Charitra, Ajit Bhattacharya (Alias) Eedula Balarami Reddy, January 1978, Rs. 15.

16. Raja Mahendra Pratap, V.L. Sundara Rao, West Godavari District Freedom Fighters Committee, 1974, Rs. 2.

17 Jhansi Laxshmi Bhai, Mudiganti Jagganna Sastry, Palleturi Grandha, Mandali.

**Autobiograpries**

18. Nenu - Na Desam. Darsi Chenchaiah, Adarsh Grandha Mandali, Vijayawada, September 1952, Rs. 6.

19. Na Divyasmritulu, Darisi Chenchaiah, Adarsha Grandha Mandali, Vijayawada, August 1961, Rs, 1. 50.

20. Gadachina Rojulu, Dr. P. Tirumala Rao, Cultural Renaissance Society, of India Hyderabad-38

21. Na Jeevitha Yaatra (3 parts), T. Prakasam, M Seshachelam & Co., July 1972, Rs. 2.50 each

22. Na Jeevitha Katha - Navyandhram, Ayyadevara Kaleswara Rao, Adarsh or Grandha Mandali, Vijayawada, March 1959, Rs. 7.50.

23. Na Jeevana Nauka, Gottipati Brahmaiah, Telugu Vidyarthi Prachuranalu, Machilipatnam, November 1976, Rs. 25.

24. Palnati Swatantrayodhula Samgraha Charitra, Nalam Mattupalli, Motamarri Venkata Nagalakshmi, 'Viswabharathi', Sattenapalli, January 1977, Rs. 3.

25. Swatantra Samaramnati Jnapakalu – Sangatanalu, Sardar Jamalapuram Kesava Rao, Congress Centenary Celebrations Committee, June 1985, Heralal Moria, Velderetimanikey Rao.

26. Simha Garjana, Sardar Jamalapuram Kesava Rao, Heralal Moria 1982, Rs 30

27. Kesava Rao, Hiralal Moria, 1978, Rs. 30

28 Eternal Transfer (English . Moria & N Ramanuja Charya, 1980, Rs. 12.

29. Konda Venkatappayya, A. P. Hindi Prachara Sangham, Vijayawada, 1952, Rs. 2–50.

30. Kolavennu Ramakoteswara Rao, by Dr. Ramapathi Rao.

31. Pandit Narendraji Atmakatha, Suramouli, Kakatiya Vignana Samithi, November 1982, Rs. 10.

32. Veera Telangana Na Anubhavalu Jnapakalu, Ravi Narayana Reddy, Visalandra Publishing House, 1972, Rs. 3.

33. Hyderabad Swatantra Poratam Na Anubhavalu Jnapakalu, Swami Ramananda Teertha, Smaraka Sangham, Prabhat Prachurana Samithi, 1984, Rs 30.

34. Makhdoom (A memoir), Raj Bahadur Gour, C P. I. Publication, August 1970, Rs. 0-40.

**Histories of Freedom Fight**

35. **Guntur District Freedom Fight 1920-30 Important Events,** Madala Veerabhadra Rao, January 1974, Rs. 10.

36. Krishna District Freedom Fight History, November 1983, Rs 20.

37. History of Freedom Fight in Guntur District (1921-1947), Dr. B. Seshagiri Rao, 1983, Rs. 40.

38. Hyderabad Swatantrodyama Charitra, Veldurti Manikya Rao, 1984, Rs. 100.

39. Swatantra Sangrama Charitra, Tummala Venkataramayya, M. S. Rajalingam, Paruchuri Koteswara Rao, Yelamanchili Venkatappayya, August 1984, Rs. 116.

40. Andhra Pradeshlo Gandhiji – Kodali Anjaneyulu, Telugu Academy, 1978, Rs. 32. 50

41. Andhra Pradesh Darshini, E. Balaramamurthi, Y.V. Krishna Rao, Visalandra Publishing House, Rs. 80.

42. Andhralo Swatantra Samaram, Dr. M. Venkatarangaiah, N. Innayya, State Cultural Department, August 1972, Rs. 2.

43. Freedom Fight In Andhra (English), Dr. Sarojini Regani, Director, State Archives, State Cultural Department, August 1972, Rs. 2-50.

44. Yabhai Samvatsarala Hyderabad, M. Narsinga Rao, Smaraka Samithi, 1971, Rs. 15.

45. Sanyasula Swatantra Samaram (1763-1775), D. Venkata Siva Rao, Navodaya Publishers, Vijayawada, 1957, Rs. 0–75.

46. Viplava Bharatam, K. Prakasa Rao, Telugu Vidyarthi Prachuranalu, 1981, Rs. 30.

**Plays**

47. Swarajya Sopanam - Gandhi Vijayam, D. Pundarikakshudu, Swarajya Sopana Prachurana, 1920, Rs. 2.

48. Congress Vijayam, J. Venkata Narasaiah, D. Venkata Subrahmanyam, 1945, Rs. 1.

49. Netaji )<br>Sardar Vallabhai Patel ) N. Adiseshu, Gandhi Sahitya<br>Champaran Satyagraham ) Prachuranalayam,<br>Badsha Khan ) Hyderabad, Rs. 2 each.

50. Eminent South Indians, Argus, 1982.

51. The Indian Nation Builders, Part III, Madras Emesh & Co. Publishers.

52. Who is Who In Legislature, Vol. I, Edited by M. Bassien, Freedom India Publishing Syndicate, 1953, Rs. 8.

**Histories of Andhra Pradesh**

53. Brief History of Andhra Pradesh (English), State Archives

54. Andhrodyama Charitra, M. Veerabhadra Rao, State Archives Publication, 1982, Rs. 50.

55. Telangana Andhrodyamam, part II, M. Hanumantha Rao, Andhra Chandrika Grandhamala, 1950, Rs. 3-50.

56 History of Andhra Movement (Andhra Region), Vol. I, compiled by G. V. Subba Rao, 1982, Rs. 15.

57. –do– Vol II, 1982, Rs. 15.

**District Gazetteers**

58. Cuddapah 1967

59. Kurnool 1974

60. Ananthapur 1970

Published by Gazetteers Office, Govt of A. P.

61. Bharata Desamlo Swatantra Samara Charitra, Vol I & II, Tarachand (Alias) Acharya Bhupati Laxminarayana Rao, Telugu Academy, Rs. 15-50. (Vol. I), Rs. 22-25 (Vol. II).

62. Bharatha Swatantrodyam Charitra, Vol. II. Acharya M. Venkata Rangaiah, Rs. 25.

63. Bharata Jateeya Congress Charitra, Dr. B. Pattabhi Sitaramayya (Alias) Kodali Anjaneyulu, Prabhat Prachurana Samithi, Khammam, 1948, Rs. 10.

64. 60 Years Congress (Sangraha Charitra), Dr. Pattabhi.

**Govt. of Andhra Pradesh Publications**

65. Freedom Struggle (in Hyderabad State), 4 volumes.

66. Freedom Struggle (In Andhra), 4 volumes.

**English Publications**

67. India's Struggle for Freedom, P. N. Chopra, Govt. of India Publication Division, 1984, Rs. 3.

68. Freedom Struggle, Bipin Chandra and 2 others, National Book Trust, Rs. 5.

69. Story of Swarajya, Part I, Children Literature, Nehru Library, 1973.

70. -do- Part I, II, Bal Pustakalaya), Rs. 2-50.

71. War of Independence, V. D. Savarkar, 1909, Rs. 15.

72. First Indian War of Independence, Moscow publication.

73. Telugu Desamlo Swatantrodyamam
P. N. Murthy – 1980 January Rs. 5/-

74. Glorious Chapters in Bharat Swatantra Samaram
(1858–19·7· B Jitendar Reddy Rs. 16/-

(All thess books are available in the private Library of the author of this book, for reference).

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాతా
పంజాబసింధు గుజరాతమరాఠా
ద్రావిడ ఉత్కళవంగా
వింధ్య హిమాచల యమునాగంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవశుభ నామే జాగే
తవశుభ ఆశిష మాంగే
గాహేతవ జయగాథా
జనగణ మంగళ దాయక జయహే
భారత భాగ్యవిధాతా
జయహే! జయహే! జయజయజయ హే!



## రచయిత

శ్రీ మాదల వీరభద్రరావు స్వగ్రామం మాదల. మాతామహుల [illegible] మత్తిలో 1919 మే నెల 19వ తేదీ జన్మించారు. వీరి తండ్రి బుచ్చిరాజు, తల్లి రాజ్యలక్ష్మమ్మగారు. హైస్కూలు విద్యార్థిగానే, 1936 నుండి రాజకీయ, ప్రజా ఉద్యమాలలో తీవ్రంగా పాల్గొన్న కార్యకర్త. స్వరాజ్య, ఆంధ్రోద్యమాలలో పాలుపంచుకున్న భాగస్వామి.

1952 నుంచి వ్యవసాయార్థిక సమస్యలు, జల విద్యుత్ ప్రాజెక్టులు, పంచాయతీరాజ్య వ్యవస్థ, సహకార, ప్రణాళికలను గురించి పెక్కు సమీక్ష వ్యాసాలు వ్రాసిన వ్యాసకర్త. 1962 నుంచి 1980 వరకు 'ఆంధ్రరత్న,' 'ప్రజాప్రభ,' 'ఆంధ్రజనత,' 'ఆంధ్రప్రభ' పత్రికల సంపాదకవర్గాలలో పనిచేసిన జర్నలిస్టు.

సర్వోత్తమ జీవితం, దేశభక్తి జీవిత చరిత్ర, గుంటూరు, కృష్ణా జిల్లాల స్వరాజ్య ఉద్యమాలు, ఆంధ్రోద్యమ చరిత్ర, జల, విద్యుత్ ప్రాజెక్టులు, భూసంస్కరణలు మున్నగు గ్రంథాలు రచించిన గ్రంథకర్త.

స్వాతంత్ర్యానంతరం, గ్రామీణ వ్యవస్థలో, ఆర్థిక సామాజిక రంగములలో వస్తున్న మార్పులను అధ్యయనం గావిస్తున్న పరిశోధకుడు.